ప్రథమ ముద్రణము 1982
దుందుభి వైశాఖము

మూల్యము : 30 రూపాయలు






వెలయువారు :

చెఱకుపల్లి జమదగ్ని శర్మ
శ్రీరామ నగరం కాలనీ
పానగల్లు
శ్రీ కాళహస్తి - చిత్తూరు జిల్లా
517 640

ముద్రణ :

క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్,
మద్రాసు - 600 001.




THIS BOOK IS

PUBLISHED WITH THE FINANCIAL ASSISTANCE OF

TIRUMALA TIRUPATI DEVASTHANAMS

UNDER THEIR SCHEME

"AID TO PUBLISH RELIGIOUS BOOKS".

# కృతజ్ఞత

ఈ గ్రంథ ముద్రణమునకు తిరుపతి తిరుమల దేవస్థానముల వారు ధర్మప్రచారక గ్రంథ రచయితల ప్రోత్సహించు పథకము ననుసరించి అయిదువేల రూపాయల భూరి విరాళము నొసంగిరి. మఱి కొంత మొత్తము ముద్రణమునకు కావలసి వచ్చినది. దానికి శ్రీ బి. వి. ఎస్. ఎస్. మణిగారు, (శ్రీ రామలింగేశ్వర ట్రస్ట్) ఔదార్యముతో సాయము చేసిరి. వారి సాయము లభింపనిచో ఈ ముద్రణము సాధ్యమయ్యెడిది కాదు. తిరుపతి తిరుమల దేవస్థానముల యాజమాన్యము వారికిని, శ్రీ రామలింగేశ్వర ట్రస్ట్ వారి ఔదార్యమునకును నే నెంతయు ఋణపడి యున్నాను.

శ్రీ క్రాంతి ప్రెస్సు యజమానులు ఈ ముద్రణమునకు నా కన్ని విధములు చేదోడు వాదోడుగా నుండి సాయము చేయుటయే కాక అనేక విధముల తోడ్పడిరి. వారికి నా కృతజ్ఞత.

చెఱుకుపల్లి జమదగ్ని శర్మ.

శివాయ విష్ణురూపాయ
శివరూపాయ విష్ణవే
శివస్య హృదయం విష్ణుః
విష్ణోశ్చ హృదయం శివః ||

# విషయ సూచిక

---

శ్రీః

# శ్రీ మద్దక్షిణ కైలాస గిరిప్రదక్షిణ మహాకావ్యము

## ప్రథమ పదము

### ఓంకార పదము

ఓంకార వాచ్యునకు, నిర
హంకార శివైకతాన హంసోన్మజ్జత్
సంకల్ప రహిత హృదయా
లంకార మహాప్రకాశ లలితేశునకున్ ॥ 1

మాయాపుర మధ్యగ రమ
ణీయ గుహావాస నిరత నిర్మల మణికిన్
వేయేల యాత్మరూపున
కై యిదె ప్రణమిల్లువాఁడ ననుపదమెపుడున్ ॥ 2

ఆత్మయం దభివ్యక్తమై యఖిల జగము
చిత్ర చిత్రమ్ముగాఁ జరించియును దిరిగి
యాత్మయందే యడంగు నియ్యదియె నిజము
స్వప్రదక్షిణ పరుఁడు విశ్వమయుఁ డెపుడు॥ 3

శ్రీకాళేభ కిరాత చిహ్నములు వాసిందాల్చి రుద్రాక్ష లిం
గాకారమ్మున స్వాత్మభూధరము నొయ్యంగూడి జ్ఞానాంబతో
శ్రీకస్వర్ణముఖీ పురోవసతిఁ గూర్మిందోఁచు నాస్వామి లో
కైకత్రాణ మహోద్యమ ప్రథితుఁడై యార్తాళి రక్షించెడిన్ ॥ 4

పేరును రూపముం దోఁగఁ బెట్టిన సర్వము నాత్మయైన యా
కారణ కారణుం డఖిల కార్యమయుండయి తోఁచు నంతియే
వారును వీరనం దగదు వ్యక్తత నందియు నందకుండు సం
సార మి దంతయున్ గనఁగఁ జాలును స్వామిని స్వాత్మరూపతన్॥ 5

ఆ సామి తా నెయగు కై
లాసముఁ బ్రతి వత్సరంబు లసదుత్సవమై
వాసిగ నిరుపర్యాయము
శ్రీసతితోఁ జుట్టివచ్చుఁ జిన్మయుఁ డగుచున్॥ 6

తనకుంగాఁగల కార్య మున్నదియె యార్ద్రస్వాంతుఁడై స్వామి భ
క్తినిఁ దానే గిరిఁ జుట్టివచ్చు నెడ రక్తింగూడు సౌభాగ్యమున్
దన భక్తాళికిఁ గూర్చు కాంక్షమెయి యాత్రం జేయుఁ దా నొచు నా
తని వెంటన్ జనుచుందు రెల్లప్రజ లత్యంత ప్రమోదాత్ములై॥ 7

దినకరుఁ డుత్తరాయణ గతింగను రెండవనాఁడు తొల్త, నిం
తిని గని మోదమంది యతిథి ప్రతతిన్ దిగఁబెట్టి వచ్చు ప్రే
మను మఱునాఁడు క్రమ్మఱయు మాన్యుఁడిటుల్ గిరిఁ జుట్టివచ్చు నే
మని యననౌను స్వామి మరియాద జగమ్ములు పట్టరానిదా॥ 8

ఆనంద నామ వత్సర
మానందన హేతువయ్యె నఖిలమ్మునకున్
గోనలు నాలుగు మూఁగిన
వానాటి మహాభిషేక మందుఁ జరింపన్॥ 9

శ్రీరామ నవమి పర్వము
రారా జగదీశ్వరుండు రాకాచంద్ర
స్ఫారామల తేజోఽతిగ
రారాజ దుదారుఁడయ్యెఁ బ్రత్నద్యుతియై॥ 10

## గురు శిష్యుల సంకల్పము

అప్పటినుండి క్షేత్రమున యందె వసించుచు మోక్షకాంక్షమై
యొప్పిన దేహముల్ గలుగు నూర్జితు లిర్వురు శిష్యదేశికుల్

తప్పక నిత్యమున్ శివునిఁ దల్లిని భక్తి భజించుచుండి నే
ర్పొప్ప నెఱుంగుచుండిరి మహోజ్జ్వలమౌ మహిమంబు సర్వమున్॥
దేశికుఁ డవ్వశిష్ఠుఁడనఁ దేకువ శిష్యుఁడు రామచంద్రుఁడౌ
దేశిక శిష్యనామములఁ దేలిన తత్త్వమహా స్వరూపు లీ
దేశమునంది దుష్కలి గతిన్ గమనింపక దేహధారణం
బీశకృపా విశేషమున స్వేచ్ఛగ సాగగ నుండి రచ్చటన్॥ 12

ఎచ్చట వసియింతు రెవ్వా రెఱుంగరు
స్వామి కోవెలఁ గనవత్తురంతె
ఎప్పుడేదియొ జపియించు చుందురెగాని
యన్యోన్య భాషణకైన దిగరు
ఆ ప్రాత మాసాయ మంతర్ముఖులె యౌచు
నానంద పారవశ్యమున నుందు
రా మహాత్ములఁ జూచి యంజలింతురెగాని
జను లడ్డుపడెడి దోషమునఁ బోరు

ఎవ్వ రే మిత్తుమన్నఁ దా మించుకైన
నాస గొనక కరద్వయి నంజలించి
స్వామికై చూపి తమలోనె వరలుచుందు
రట్టి వర్తన మిల నసాధ్యంబు గాదు॥ 13

ఎంతవలదని వారు వారించుచున్న
నెవ్వరో పెట్టి పోదురేవేవొ ఫలము
లా ఫలమ్ములఁ గొన్ని తా మాహరించి
తక్కినవి పంచి రిక్తహస్తత భజింత్రు॥ 14

ఇది దక్షిణ కైలాసం
బిది సద్యోముక్తి నొసఁగు నిచ్చట మనుచున్
మది నటు నిటు మసలింతురె
సదమల పరమార్థ మెఱుఁగు సాధకులెందున్॥ 15

కైలాసపతి తానె కదలివచ్చి యనంత
కరుణాళు వాయులింగశ భజించె
కారుణ్య ముప్పొంగ జ్ఞాన ప్రసూనాంబ
స్వామి నందించు ప్రసన్న యగుచు
విరహాసహిష్ణువై వెండి కొండ కిరీట
మానంద నిలయమ్ము నరుగుదెంచె
కర్మ బంధచ్ఛేదక స్వర్ణ ముఖరీ ప్ర
వాహమ్ము కుంభ సంభవుఁడు నిలిపె

నన్ని విధముల సంపూర్ణమైన క్షేత్ర
మిట్టి దింకెందు గలదు మహీ తలాన
పూర్ణ మహిమంబు నెఱుఁగు ప్రబుద్ధులిందు
దీక్షమై నిల్చి కనుచుంద్రు మోక్ష గరిమ॥ 16

నదియున్ గొండయు స్వామియున్ జనని నానా దేవతానీక సం
పదయున్ సేవన సిద్ధ భక్తజన సౌభాగ్యమ్ము నన్యోన్యమై
పొదలున్ శ్రేష్ఠతగూర్చు చీ భువికి నే పుణ్యంబొ తోడ్తై యిటన్
బ్రదుకం జాలినఁ జాలు వాని జని సార్థక్యంబు నందున్ దుదిన్॥ 17

కీట సరీసృప ద్విరద ఖేచర భూచర దేవ దానవా
ఖేటకమాని భూప కృతకృత్య మదాలస రాగి యోగి ని
త్యాటన నిశ్చలాదిక మహా ద్వ్యతిరేకత లెక్కసేయ కి
చ్చోటు తరింపఁ జేసినది చోద్యముగా బహుభిన్నజీవులన్॥ 18

నరుఁడై పుట్టి యిటన్ వసించు ఘనపుణ్యం బబ్బె యేకొంచెమో
యరయం జాలిన ప్రాజ్ఞుఁడిచ్చట యథేచ్ఛాచారి కానోపునే
మరలన్ వచ్చునొ రాదొ మానవత జన్మంబిద్ది కైవల్యమే
గుఱిగా సాగి తరింపగావలె మహాకూపారమా సంసృతిన్॥ 19

ఇహాచేదవేదీ దథ సత్య మస్తి
నచే దిహావేదీ న్మహతీ వినష్టిః

భూతేషు భూతేషు విచిత్య ధీరాః
ప్రేత్యా స్మాల్లోకా దమృతా భవన్తి ॥ కేన॥

ఆ గురు శిష్యులిర్వురును నా శ్రుతి విన్న మహాత్ములిందె యీ
లాగున నీ శరీరమున లావు నశింపకముందె యెట్టి యు
ద్యోగము చేసియైనను మహోన్నతమౌ పదమంది కోవలెన్
జారగ నీయరాదు నరజన్మ మిదన్న వివేకులాటచే॥ 20

నిత్య ముషోవేళ నిత్య స్తుతిన్ లేచి
స్వర్ణముఖీ జల స్నానమాడి
సంధ్యాద్యనుష్ఠాన సరణి తీర్చిన యంత
దేవళమ్మున కేగి దేవితోడ
శ్రీకాళహస్తీశ సేవలోఁ జిరముండి
క్షుద్వేళ దొరకిన కుడుపు గొనుచు
కాన నే కోన వృక్షచ్ఛాయనో యుండి
తత్త్వార్థ చింతనా తత్పరులయి
సరిగ గుడి చేరుకొని ప్రదోష సమయమున
స్వామి సేవించుకొనుచుఁ బ్రసన్న మతులు
దేహ ధారణకయిన భుక్తికిని మించి
దేనిఁ గైకొనకుండ్రు ముక్తి గన నెంచి॥ 21

దేహమె దేవళమ్మిటులు తీర్చిన జీవుఁడె దేవుఁడౌను సం
దేహము లేదు వాఁడు తన దివ్యతఁ జూపఁ దలంచు కొన్నచో
మోహము తీరుటెంతపని మోక్ష పథానుగుఁడైన వాని యు
త్సాహమె వాని కంతయు వశంబొనరించి కృతార్థుఁ జేసెడిన్ ॥ 22

కరుణా వరుణాలయు న
త్తరుణేందు జటా కలాపిఁ దత్పర మతులై
వరివస్య సేయుచుండిన
యిరువురి భాగ్యమ్ము పంట కెక్కిన దనఁగన్ ॥ 23

# శరదాగమనము

శరదృతు వేగుదెంచినది సర్వ వసుంధర సస్యలక్ష్మితో
సురుచిరమై నిజాంకగత సూన్వనురాగ సుధన్ వెలార్చు ని
ర్భర కరుణాళువౌ జనని వైఖరిఁదోఁచె సితాబ్ద శోభియై
గురుఁడు ప్రహర్షమున్ గను నొకో యనఁదోఁచె నభంబు రమ్యమై॥

అనుపదమే జగజ్జనని యర్చిత యయ్యెఁ బ్రభూత భక్తిమై
దినమున కొక్క తీరునను దీర్చి శరన్నవరాత్రులందు త
ల్లిని గని యుత్సవంబులను లీన మతుల్ కడుసంతసించి రా
జననియు నైజ వత్సలత సాకిన దెల్లర నార్ద్ర చిత్తమై॥ 25

కార్తిక పూర్ణిమా నిశను గాంచిరి సర్వులు సోమశేఖర
స్ఫూర్తి వహించు శ్వేత నగమున్ హృదయంబులు పొంగులెత్త స
ర్వార్తి హరుండు మాయ పొర యంతయు నూడ్చి యశస్సమస్త మీ
మూర్తిగఁ జేసి తోఁచినటు మోదము నందిరి ధన్యభావనన్॥ 26

వీనిని మృత్యుదంష్ట్రలని పెద్దలు చెప్పుచుఁ దత్కృతామిత
గ్లాని హతాశులై మనుట కాదని నిత్య సురార్చనా విధిన్
బూని తపస్వి జీవితము పొంది నిరామయ సౌఖ్య సంపదన్
దేనియ లానుచుండెదరు ధీరుల కియ్యవె కల్పవృక్షముల్॥ 27

అందునఁ గార్తికంబు పరమామృతదాయి శివార్చనా పరుం
డిందున నేక భక్తముల నిందుధరున్ స్మరియించుచుండి యా
నందమయాత్మతన్ గనుచు నాటికి నాటికి శుద్ధచిత్తుఁడై
పొందు పరిశ్రమానుగుణ పూర్ణ నిజస్థితిఁ దత్త్వదృష్టిమై॥ 28

అడుగు పెట్టుట కెడము లేనట్లు గాగ
దిన దినము దీప పంక్తులు తీర్చుచుందు
రైదువలు భక్తి స్వామి దేవాలయమునఁ
జూచువారిదె పుణ్యమా శోభయెల్ల॥ 29

భద్రమె చూడగావలయు భద్రమె వీనుల నింపగా వలెన్
క్షుద్ర జగత్తునన్ మనుచుఁ జూచెడి దంతయు క్షుద్రమైనచో

భద్ర మదెట్లు పొందనగు ప్రాజ్ఞులు ధీరత సర్వలోక మ
క్షుద్ర మొనర్చి భద్ర తతి గూర్చి సుఖింతురు జాగరూకులై ॥ 30

సత్యా నృత మగు జగమున
సత్యము నే చూచు వాఁడు సద్గతి నందున్
నిత్యా నిత్య వివేక మె
స్తుత్యము పరమార్థ మెంచు శుద్ధున కెపుడున్ ॥ 31

కన్నుల పండువై పొదలు కార్తిక శోభకుఁ దీఱు నాటి దీ
పోన్నయనంబె సీమయగు నుర్వి సమస్తము దీప మాలికా
సన్న మనస్కమై కలుషజాల మడంచుచు దివ్య లోకికా
భ్యున్నతి పొందుచున్నటులె యుండి కనున్ బరిశుద్ధియున్న చో॥ 32

గురు శిష్యులు శరదృతువునఁ
బరమార్థము నందఁగోరి పట్టిన దీక్షన్
బరశివ నిత్యస్మృతితోఁ
బరికించిరి శైవ మహిమ ప్రత్యణువు నెడన్ ॥ 33

## జగత్తును శివమయముగా భావించుట

పొలముల గట్లవెంబడిని పూచిన బంతులు భూ శరీర మం
దల ప్రియురాలికై ప్రభవ మందగఁ జేసిన పసుపు కుంకుముల్
కుల సతి ప్రీతికై మిపులఁ గూర్మిని పేర్చిన యంగరాగమే
తెలితెలి మేలి మబ్బులుగ తేలుచు నున్నది యాకసంబునన్ ॥ 34

వసుధయు నీరు నిప్పు నల వాయువు నాకస మర్క చంద్రులున్
మసలెడి జీవుఁడున్ శివుని మాన్యశరీరము లన్నయప్పు డీ
వసుధ శివేతరం బెదియు వర్తిలునే జగమెల్ల తానయై
యసమతఁ గానవచ్చుఁ బరమార్థమునన్ సముఁడయ్యు నిత్యమున్ ॥

ఇంద్రియ షట్కమే జగతి నిట్లు స్ఫురింపగఁ జేయుచున్న దీ
సంద్రమునన్ దరంగములె సర్వము తాము విభిన్నమూర్తులై

సాంద్రతఁ దోఁచియున్ మిగులు సారము నీరమె యానుగాన ని
స్తంద్రత నిస్తరంగతను దాల్చి శివత్వము నందఁగావలెన్॥ 36

ఈశమహత్త్వమే ప్రకృతి నెల్లెడఁ దోఁచును వింత వింతలా
కోశములొప్పి యా ప్రభువె కోటివిధంబులఁ గ్రీడలాడు చె
ట్టై శకునమ్మునై క్రిమియునై పశువై మనుజుండునై యెదే
నై శివుఁడే చెలంగు నిటులబ్బురముం గదురంగఁ జేయుచున్॥ 37

జడమైతోఁచు సమస్త వస్తువులలోఁ జైతన్య మవ్యక్తమై
పొడమన్ రాక యడంగి యున్నది స్వయంభూలింగమై కొండయై
పడియున్నన్ జడబుద్ధి పొందనగునే ప్రాణ స్వరూపుండునై
యొడయండౌ శివుఁడట్లు తోఁచుటయు నోహో మాయకా కేమగున్॥

శరవణంబును జూడు శరదిందు సంకాశ
మై వెండి వెల్గుల నారఁబోయు
చలపత్రమును జూడు చతురాననుండౌచు
శ్రుతమెల్ల విన్పించు చొప్పుతోఁచు
స్వర్ణముఖం జూడు స్వామి కారుణ్యంబు
జాలువారిన యట్లు సాగుదెంచు
పంకజాతముఁ జూడు స్వాంత మిట్లుండగా
నగు నంచుఁ దెల్పు నే మంటుకొనక

కొమ్మ నదిపైకి వంగె నా కొసనుగట్టె
గూడు చిత్రమ్ముగా గిజిగాడు పిట్ట
పట్టి మిణుగురు పుర్వు దీపమ్ము పెట్టె
పక్షియా యది శివుని రూపమ్ము కాక! 39

గాలికి నారఁబెట్టినదిగా వసుధా వనితాలలామ యీ
చేలము లన్నిటిన్ మిసిమి చిందుచు నున్నవి రత్నగర్భయై
తాలుపు చీరలిన్నియును దాపుడు చీర లవెన్నియున్నవో
మూలుగుచుండు లోపల ప్రమోదము నందిన బైట పెట్టెడిన్॥ 40

చీమయు నీగయుఁ మిగుల చిన్నవియైనను వాని తెల్వి ని
స్సీమము కట్టుబాటెసఁగి చెంది సమస్థితి సంఘదృష్టిమై
సేమము లెన్నిపూను? మహనీయుఁ డనందగు మానవుండు ల
జ్జామతి క్రుంగి పోవలయు స్వస్థితితో సరిపోల్చికొన్నచోఁ॥ 41

సైన్యమ్మువలె బారుసాగి చరించుచు
నాహార సంచయ మాచరించు
నదిగో ప్రమాదమా నను హెచ్చరిక నంది
యన్నియు స్వాశ్రయ మందికొనును
స్వ స్వ కార్యశ్రద్ధ నిస్వార్థ బుద్ధితోఁ
బూని లక్ష్యంబంది పొంగిపోవు
నొకటి చచ్చిన నన్నియుంగూడి యొకటియై
వలయు సంస్కారంబు సలుపుచుండు

చీమ కావచ్చుగాని యా శివుఁడు లేక
యిట్టి వర్తనమది నిర్వహించునెట్లు?
శివుని గుర్తించి తెలిసి యా శివుఁడె తాన
టంచుఁ దెలియక మానవుఁడైన నేమి॥ 42

జడములయందుఁ దెల్వి కనఁజాల మటందుము వాగువచ్చు న
య్యెడ నొకచోటఁ జేర్చునది యెంతయొ యొండు మరొక్కచో నహో
వడిఁ బడఁబోయు నయ్యిసుము వాఁడును వాఁడు సుఖంబుదుఃఖముల్
బడసిరి తెల్వి లేక యటు పాఱినదో జగదీశుఁడుండఁగన్॥ 43

ఊరంటుకొన్న దొకదెస
నీరమ్ములు చల్లినారు నిలిచి నలువురున్
వారిండ్లు కాలిపోయిన
పూరను లేనట్టి వాని దున్నది కుదురై॥ 44

అంతర్యామిగ నిల్చి యంతట మహాధ్యక్షుండు తత్తత్క్రియా
శాంతత్వం బెట బీఱువోక నడిపించన్ సాగు నీ సృష్టి స

ర్వాంత స్సంస్థితు భీతి సూర్యుఁ డుదయంబౌ గాలివీచున్ జగత్
స్వాంతం బాతఁడటంచుఁ దెల్పవె శ్రుతుల్ సందేహమేలాయికన్॥

మార్గ శీర్షంబు తానయై మసలుదునని
కృష్ణుఁ డన్నాఁడు స్వయముగా గీతలందు
మృగ శిరస్సున పూర్ణిమా మృగధరుండు
పొడమి యమ్మాస మాపేరుఁ బడయునంట॥ 46

వైకుంఠైకాదశి తా
నీ కాలము నందెవచ్చు నేచిన భక్తిన్
లోకులు శ్రీపతిఁ గొలిచి స
మా కలిత సుకృత నితాంత హర్షము నందన్॥ 47

భగవంతుం డురు యోగనిద్ర విడి దీవ్యద్భానుఁడై దివ్య మా
ర్గగ ముంజేయు సమస్త లోకమును విశ్రాంతిన్ గనన్ జాలుటన్
నృగణంబుల్ కమనీయ సువ్రతములున్నిద్రా మతింబూని స
ర్వగుఁడౌ దేవుని పొందఁగాంచెదరు సౌభాగ్యంబు పెంపొందగన్॥48

అహము కుఱుచయి రాత్రి దైర్ఘ్యమ్ము నందు
నీ ధనుర్మాస దినము లవెంత యోగ
కారులో చెప్పతరమె యెవ్వారికైన
కందు రవలీలఁ బరమ భాగ్యంబు నిచట॥ 49

గోమయమున్ ప్రయత్నమున గూర్చి గృహాంగణ సీమ రంగ వ
ల్లీ మహితం బొనర్చి మురళీప్రియు నాత్మపతిన్ వరించి క
న్యా మణులెల్లరున్ గిరిజ నర్మిలి గొల్తురు కూర్చుమంచు నా
భామిని గోమయాకృతిని వారి యభీష్టము తీర్చు ప్రీతిమై॥ 50

ఆర దంచిన వరిపిండి నద్భుతముగ
ముగ్గులన్ దీర్చి రమణీయ పుష్పములను
జల్లి తన్మధ్య సీమ గొబ్బిళ్ళు పెట్టు
కన్నె గోపిక కృష్ణు నా కట్టు నట్టె! 51

హే మహామాయ! కాత్యాయనీ! మహేశి!
కృష్ణపరమాత్మ నేను వరించియుంటి
భర్తగాఁ గూర్పుమమ్మ యపార కృపను
బ్రదుకు బ్రదుకున కాతఁడే భర్త యగుత! 52

అగు నగు నబ్బురం బగునె యాయమకున్ లభియించు కాంతుఁడే
నిగమవనిం జరించు నవనీత మనోహరుఁ డామె తత్ప్రియా
నుగయయి లోవెలుం గగుచు నోముల పంటగఁ గ్రీడసల్పు దే
విగఁ దలపోయనౌ విపుల విశ్వము తన్మహనీయ లీలయౌ॥ 53

## జీవితము నాటకమనుట

క్రీడాకౌతుక మున్నచోఁ దెలిసియే క్రీడన్ సమర్థమ్ముగా
నాడన్ గావలె నప్పుడే జగము సౌఖ్యం బందు నద్దాని కె
గ్గాడన్ దుఃఖమె వ్యక్తికిన్ జగతి కీ యాటేమి సయ్యాటమౌ
యాడన్ వచ్చితి మాడ కేమను వివేకానందముం బొందనౌ॥ 54

తను విదివేషమైనపుడు దానియెడన్ దగులమ్ము పొందు తె
ల్విని తెలివందురే నటుఁడు విస్మృతి నందక తాను తానయై
తనకగు పాత్రకైన వివిధస్థితులన్ వహియించి హాయి నం
దును బహురూపధారణ వినోదమునన్ విహరించు స్వేచ్ఛమై॥ 55

రాజో మంత్రియొ భృత్యుఁడో రమణియో రాజర్షియో చోరుఁడో
మోజే మున్నది వేషమెట్టి దయినన్ మోదమ్మునే కూర్చుఁ జో
నైజమ్మున్ విడ కద్ది వేషమను జ్ఞానం బొప్పి క్రీడించు వి
భ్రాజద్దీ బహురూపి కాతఁడెపుడున్ భ్రాంతుండు కాకుండెడిన్॥ 56

తెలిసి నటించు వాఁడగుట ధీయుతుఁ డాతఁడు జాగరూకుఁడై
మెలఁగి మఱింత శ్రద్ధమెయి మేలని సర్వుల మెప్పునందు మి
న్నలమెడి సౌఖ్యమందుఁ దన యంతట తానయి వేషమూనకే
నిలిచి స్వరూప సౌఖ్యమున నిశ్చలుఁడై రమియింపఁ గల్గెడిన్॥ 57

కట్టిన వేషమందు మునుఁగం జను నాతఁడు రక్తికట్ట నీఁ
డట్టి కథాగతిన్ విఱిచి యందఱకున్ రసభంగ హేతువై
గిట్టును పుట్టి ముంచు నది కేవల మోహము మానవుండుగాఁ
బుట్టుట దాని మాపి తనువున్ మఱి పొందక యుంటకే యగున్॥ 58

శివుఁడవు చిత్సుఖాత్ముఁడవు సిద్ధుఁడ వీవయి యన్యమెద్దియో
యవును సుఖంబటంచుఁ దను వందితి వా కథలోని పాత్రకా
వివిధ పరిస్థితుల్ కనుచు విస్మృతి నందుట వట్టివెఱ్ఱి నీ
శివతకు సేగి లేదెపుడు చిన్మయతన్ శివతన్ భజింపుమీ! 59

అంతయు దైవమే పురుష యత్నమునన్ ఫలియించునట్లు వి
భ్రాంతులఁ జేయు నీయది శుభప్రదమౌట నహంత వీడి ని
శ్చింతగ శాస్త్రచోదిత విశిష్ట పథమ్మున దైవభక్తి న
త్యంతము నూని యత్న పరుఁడయ్యెడి వానికి సిద్ధి నిక్కమౌ॥ 60

అంతయు దైవమంచు నొక యత్నము చేయక యుండు వాని కొ
క్కింతయుఁ గూడిరాదు జగమియ్యది దైవము నమ్మి యత్న మ
త్యంతము చేయు నాతఁడె కృతార్థుఁడు కాఁగలఁ డిందు నందు స
ర్వాంతరుఁ డెందు నిష్క్రియుఁడె యాతని నందుట చారితార్థ్యమౌ॥

బ్రహ్మము నిష్క్రియంబనుచు స్వాత్మయె బ్రహ్మమటంచుఁ బల్కుచో
జిహ్మముగా విచిత్రముగ జీవ జగం బిది తోఁపనేల? యా
బ్రహ్మ పిపీలికాంతము ప్రవర్తిలుచున్ భ్రమియింప నేల? త
ద్బ్రహ్మ పదంబు నందుటకు వర్తిలు టెట్లు సమర్థనీయమౌ॥ 62

ఒక క్షణమైన నూరకయ యుండుట సాధ్యము కాదు జీవి కా
ప్రకృతి కధీనుఁడై యెపుడు వర్తిలుచుండుట తప్ప దందుచే
వికృతుఁడు కాక ధర్మపథ వీరత నొప్పిన వాసనాక్షయం
బకలుష చిత్తవృత్తియయి యభ్యుదయంబును బొందు తప్పకన్॥ 63

ఏ పని చేయకుండ బ్రదుకే కొనసాగదు శ్రీశ్వరాజ్ఞ నీ
వే పనికై జనింతు వది యే యగు నీకు స్వధర్మ మద్ది ని

న్నరే పత నిర్వహించు ననువృత్తి మనః పరిశుద్ధి హేతువౌ
తేపకుఁ దేపకున్ గ్రమగతిన్ బరమాత్మను జెందనయ్యెడిన్॥ 64

పని యెది యైన నేమి సలుపం దగు దైవ సమర్పితంబుగా
పని వినుటొప్ప భక్తుఁడయి స్వామి యనుగ్రహమంది యంతమం
దనుపమ తత్త్వ వేత్తయయి హాయిగ నిష్క్రియ బ్రహ్మసంస్థితిన్
గని జని నందఁబోక కనగానగు జీవిత చారితార్థ్యమున్॥ 65

తనువులు తాల్చు జీవులను ధన్యుఁడు మానవుఁ డాతఁ డొక్కఁడే
కనును స్వతంత్రతన్ పెరలు కర్మ ఫలంబుల నంది తీఱెనన్
గ నెదరు నూత్న దేహములఁ గాని నరుండు వివేక మున్నచో
జని మృతిలేని ముక్తిఁగనఁజాలు తదర్థమె మానవత్వమై॥ 66

మాయికమైన యీ తనువు మర్మము శాస్త్రమెఱుంగఁ జెప్పి లే
వోయినరా! వృషీకముల యూపుల కూరక యూగి పోకు నిన్
ధ్యేయము నందు నిల్పనవి నిల్పుము నీ మనమున్ మలంచి యా
త్మీయ హృదంతరాంతర సమీక్ష్యతమౌ పరతత్త్వమందునన్॥ 67

మనుజతనందుటీవు నిజమర్మ మెఱుంగుట కయ్యె నీవు చి
ద్ఘనుఁడవు సత్స్వరూపుఁడవు కాని యెఱుంగక మోహవార్ధిలో
మునిఁగి చరింతు విట్లు విడుమోహము ధర్మపథాను యాయివై
కనుమిఁక స్వస్వరూపమని కాంక్షమెయిన్ హితబోధ చేసెడిన్॥ 68

గతజని సంస్మృతిన్ గలిగి కాయము పావన మయ్యె భక్తిమై
హితతము దేవదేవు పరమేశ్వరు గొల్చి తరించి నట్టి స
త్కృతులిట సంచరించిరి వరించితి మీ మహనీయ పుణ్యభూ
స్థితిఁ బరమేశుఁడున్ దయను జేకొనకుండునె యెట్టకేలకున్॥ 69

## ప్రత్యక్ష దైవము సూర్యుఁడు

అతఁ డస్తమింపఁగా నఖిల జీవులు సుప్తి
వివశులై సోలి పో నవుట యేమి?
తెలివెల్ల తమదన్న దేహేంద్రియాది సం
ఘాతమ్ము కట్టెయై కదల దేమి?

ప్రాణమాడుచు నుండి పై ప్రాకు భుజగమ్ము
కానంగ లేని దుర్గతి యి దేమి?
అతఁడుదయింపఁగా నఖిలమ్ము మెలఁకువ
నంది యెప్పటి వోలె నగుట యేమి?

ఎవ్వఁడీ సూర్యుఁ డిట్లు మహిం గలట్టి
సర్వ తనుధారులను స్వవశమ్ము గాగ
నిచ్చమెయి బొమ్మలట్టు లాడించువాఁడు
గోళమాత్రుం డెటుల్ జగద్గురుఁడు కాక! 70

తెఱ తీసినట్లు ప్రాగ్దిశ నుషోవేళఁ జీ
కట్లు పోఁ గెంపు చోకట్లు విరిసె
బంధూక కరవీర పారిజాత ప్రసూ
నమ్ము లొప్పారె మిన్ననలు గాగ
తెలవాఱి నిదుర మత్తులు వీడి తెలి వొంది
తమకైన పని జీవ తతి చెలంగె
నిత్య ముషస్స్నాన నియమమ్ముతో దివా
కరుఁ గొల్చు ద్విజకోటికై మొగిడ్చె

నంబరంబునఁ దోఁచెఁ బ్రత్యక్ష దైవ
మఖిల చైతన్య దాత లోకాప్తుఁ డగుచు
నాతఁ డన్యుండు కాఁడు చిదంబరస్థుఁ
డాత్మఁడే తోఁచె నటు కర్మ సాక్షిగాగ! 71

హే జగదక్షి! నీ వొకఁడ విట్లు కనంబడి తత్త్వ దీప్తి ను
త్తేజన మందఁ జేసెదవు ధీనిధు లీ నినుబట్టి విశ్వమున్
నైజ మహత్త్వమున్ దెలియనై పరమార్థము నందికొందు ర
వ్యాజ కృపాప్రసార నిగమార్థ నిరూపక తేజ! భాస్కరా! 72

ఉదయం బస్తమయంబు నున్న వియె నీ కోహో పరిభ్రాంతిచే
నెదురై మార్గ్మగమై కళాకళలఁ దా నెంచున్ జగంబిద్ది నీ

వు దయన్ నిల్తువు నిత్య ముద్యతుఁడవై వ్యోమప్రకాశా! శుభ
ప్రద! మోహాంధ్య మడంచి ప్రోవగదవే ప్రార్థించెదన్ భక్తిమై॥ 73

అవ్యక్తంబగు విశ్వమంతటిని నీవై వ్యక్తముంజేసి నా
నా వ్యాపార నిమగ్నమౌట కనుచున్ నానాత్వముం జూపుచున్
దివ్యత్వంబున సాక్షి మాత్రత వినోదింపన్ దొరంకొందు నీ
వవ్యక్తుండవు కావు వ్యక్తుఁడవు కా వాంతర్యమున్ విప్పవే! 74

హరిహర బ్రహ్మమయ మహాహంస వీవు
సర్వ ధీ చోదనక్షమ సవిత వీవు
జీవ రాజీవ బంధు రాజీవ దేవ?
హార్ద తమసం బడంచి మమ్మాదుకొనుము॥ 75

## మకర సంక్రమణము

రవి మకర ప్రవేశమున రాజిలె నాటి యుషస్సునందు ని
ర్భవత కనంగ నెంచు మతిభద్రులు నిద్రను మేలుకొంచు నా
ర్జవమున ప్రాతరాహ్నికము చక్కఁగఁ దీర్చి నిమిత్తమెంచి తీ
ర్థ విధి యథావిధిన్ సలిపి దైవ మహత్త్వము నెంచుచున్నచో॥ 76

ఇది మొదలారు మాసముల నీశ్వరుఁ డీ రవి తీవ్రభానుఁడై
పదనికిఁ దెచ్చు విశ్వమును పంక సమస్తము నింకఁజేసి మే
లొదవఁ దపింపగా వలయు నోర్పు వహించి తపింపకున్నచో
నెదియును పొందరాదు జగమియ్యది కృచ్ఛ్ర క్రియాస్వరూపమై॥

ఇపుడిటు తాప హేతువగు నీశ్వరుఁడే కరుణా సముద్రుఁడై
తపనుఁడు కాక జీవ నదతన్ వహియించు ఘనస్వరూపుఁడై
విపులయు సస్యజాతమును విస్తృత వర్షము తానె యా మహో
త్తపుఁడెది కాఁడు తాపకుఁడు తప్తుఁడు తృప్తుఁడు తాన యయ్యెడిన్

తన కల్పించిన మేఘసంతతుల నంతర్ధానముం జెంది నిం
చును లోకమ్ముల వర్షపాతముల విచ్చున్ వాని మెచ్చున్ నిరం

జనుఁడై హెచ్చును స్వస్వరూపమున శశ్వత్తేజుఁడవ్వాఁడు మా
సిన యీ కన్నులు మూసె నాతఁడని వాసింగాంచ లేవఁతియే॥ 79

తన కంటెన్ మఱి వేఱు లేకయె పదార్థం బన్య మెప్పాట వ
చ్చినదో కప్పిన యట్లగున్ వివిధ వైచిత్ర్యంబులన్ దేవి యా
డును గ్రీడించి తనంత తానుగ హరుండున్ రుద్రుఁడై సర్వమున్
దనయందే యడగించుఁ గేళి యగుచో తత్త్వస్థితిం జూచినన్॥ 80

పుష్య శుద్ధ ద్వితీయ తత్పుణ్య కాల
మొదవె, నానాఁడు గురు శిష్యు లుదిత యశులు
స్వామి యెదుటను సాయాహ్న సమయ మందు
నర్చనా మతి నుండ నత్యద్భుతముగ॥ 81

దృశ్యజాలమ్ము సర్వ మదృశ్య మయ్యె
నంతరాకాశ మతి సహస్రాంశు వగుచుఁ
దేజరిల్లంగ హర్షాబ్ధిఁ దేలియాడి
యెంత సే పుండిరో యెవ్వ రెఱుఁగరాదు॥ 82

తా మున్నట్టులె తా మెఱుంగని మహాతాదాత్మ్యముం జెంది యా
లో మోదాబ్ధి నిమగ్నులైన తఱి లోలోనాద మవ్యాహతం
బై మాత్రాస్వర వర్ణహీన నినదవ్యాహారమై సర్వమై
పోషింపన్ దమలోనఁ దామె యగుచున్ శోభిల్లి రత్యంతమున్॥

ఆత్మ సూక్ష్మాతి సూక్ష్మ మయ్యాత్మ తానె
విశ్రుతాకాశరూపమై వివృతి నందె
నణు వమూర్తము శబ్దైక గుణ మహితము
దహర మందురు దీని నధ్యాత్మమందు॥ 84

అందు మునుఁగుట కాధారమైన నాద
మంది కొన్నారు వారు ధన్యాత్ములగుచు
లీన మతులైనఁ దోఁచు హృల్లేఖయందు
లీనులై యున్నవారికి లేనిదేమి? 85

# పంచభూత మహాలింగములు

ఆది స్వయంభులై ప్రభవ మందెను వాయువె యాచు నీశ్వరుం
డేదియొ తాకి నట్లగుటయేయపు డయ్యెది దర్శనంబు, నిం
పాదిగ త్రేత స్వర్ణమయమై కనిపించెను, ద్వాపరాన నా
మోదితుఁడయ్యె వెండి యన, ముందగు నేఁడు శిలాస్వరూపుఁడై॥86

ఆ యాత్మేశుఁడు సృష్టి కున్ముఖత చే నాకాశమై వాయువై
యా యగ్నింబలెనై జలంబగుచు భూ మ్యాకారముం జెందు ని
ట్లై యాకాశము శబ్ద మొక్కటి గుణం బైయుండ స్పర్శంబు తోఁ
డై యాకాశగుణంబుతోఁ గలిసి రెండౌ వాయు భూతంబునన్॥ 87

తదుపరి దైవ వహ్నియెడ దాని గుణంబగు రూప మొప్పి ము
న్నొదవిన వానిపైన గుణయుగ్మము చేరియయుండు పిమ్మటన్
బొదలు జలంబునన్ రసము ముఖ్యము వెన్కటి మూఁడు నుండుటన్
గుదురును నాల్గు పృథ్వి యెడఁ గ్రొత్తది గంధము దాననైదునౌ॥88

రూపముగల్గు వహ్ని కొక రూపమె లేనపు డాది రెంటికిన్
రూప మదెట్లు కల్గు నవి రూప విహీనము లందుచేత నీ
రూపులె యాదు రాదిపతి ప్రోచును దాను చిదంబరేశుఁడై
యోపయి వాయులింగమయి యాకృతి లేకయ యుండు దిర్వురున్॥89

అగ్ని లింగంబు శివుఁ డరుణాచలాన
జంబుకేశ్వర శివుఁడు తా జలమయుండు
కాంచి నేకామ్ర పతి పార్థివాంచితుండు
వీరు మువ్వురు నిల రూపధారు లెపుడు॥ 90

చిద్గగన మందుఁ దోఁచు సచ్చిత్స్వరూప
శివుఁడగుఁ జిదంబరమున భవ మణంప
ప్రాణ మయుఁడయ్యె నిట శివ స్వామి కరుణ
సర్వలోకంబులన్ బ్రోవఁజాలు దనుచు॥ 91

# దక్షిణకైలాస విశేషము

తెలి మల యన్నఁజాలు తన దేహము తానె యెఱుంగఁడా శివుఁ
డలరులఁ దేలి యాడినటు హర్షమునందు యమాశ నున్న యీ
వలి మల కాని వెండి మలపై వలపెంత మహత్తరంబో క
న్నులపయి పచ్చ కప్పురపు నూగు వెరార్చుచు నుండు నిత్యమున్
తొలి పవన స్వరూపమును దోఁపగఁ జేయుచు శ్వాస మొప్పి జీ
వుల యెద నున్న దేవుఁడగు దోయి ననుంగను మంచు నిల్చి ని
శ్చల తనువైన వెల్ల శిల స్వామి సనాతనుఁ డింద యుండె హ
ద్దులు గనరాని స్వామి దయ దోగి తరింపుఁడు జీవులెల్లరున్॥ 93

ఆ పూల గుత్తికం తారాడ పడెదేల
యంచుఁదానై శిరోజాళి ముడిచి
నినుజూచి తమ కనుల్ నిశ్చల మ్మొనరించె
హరిణాక్షి యని కురంగాళిఁ జూపి
ఈ మంద పవనంబు లెంత హాయిని గొల్పు
చెలి నిల్వు మంచు నా సీనఁ జేసి
పరిపక్వ ఫలము నీ తరువు రాల్చిన దంచుఁ
దెచ్చి యందించి సంతృప్తినంది

శబర మిధునమ్ముగా స్వామి సంచరించెఁ
దత్పద స్పర్శఁగని పవిత్రమ్ముగాని
యణువు లేదిందు నేటి కీ యాకసమ్ము
స్వామి దరహాస చంద్రికా సంభృతమ్ము॥ 94

అత్తవారింటి భాగ్య మెంతైనగాని
యిల్లరికమున్న హొన్ను సంకెళ్ళఁబడుటె
పుట్టినింటను పడతి సంపూర్ణ హృదయ
మర్పణము సేయలేదు నిజాధిపునకు॥ 95

వలిమల కాని వెండిమల వాసము పర్వత రాజపుత్త్రి ని
స్తుల హృదయాబ్జ సౌరభము సోనలు వారగఁ జేసె వాని పీ

చులబడి తేలియాడె శివసుందర హంసము తన్మనోజ్ఞ కే
ళిల మధుకోశ మీనగము లోలుపమౌ శివభక్త భృంగముల్॥ 96

ఏనుఁగు లుండు కారడవి కీదశ పట్టిన దవ్వశిష్ఠు దే
వా నయన ప్రమోదకర హారి మహా సు తపః ఫలమ్ముచే
మౌని మహేంద్రుఁ డాతనికి మాన్యము కానిది యెట్టి సత్తపం
బూనెనొ పార్వతీ పతియునుండు నిటన్ ప్రియమార నిచ్చలున్॥ 97

## వశిష్ఠుని తపస్సు

కామక్రోధము లెంత చెడ్డవియొ దుఃఖం బంతకున్ మించు వి
శ్వామిత్రుండు విరోధియై మునికిఁ గోపం బేలరాదో యటం
చే మేమో పొనరించెఁ బుత్త్ర శతమున్ హింసించె నిష్కంపుఁడై
స్వామిత్వంబున నిల్చు బ్రహ్మముని నిల్వన్ లేదు దుఃఖానికిన్॥ 98

అంతటి బ్రహ్మవేత్తయు శతాత్మజనాశ మహోగ్రదుఃఖ మ
త్యంతముగాగ శీర్ణమతియై భృగుపాత మొనర్చి చావఁబో
సుంతయు నొవ్వనీక కడు చోద్యముగా మహి పట్టి నిల్పె నీ
వింతటి బేల వెట్లయితి విట్టి పనిన్ బెను దుఃఖమారు నే? 99

ఆరని దుఃఖమార్ప హృదయంబున నా శివదేవు నిల్పి నిం
డార తపంబొనర్ప మతిఁ డార్తి హరుండు కృపామయుండు నో
రారగఁ బిల్చినన్ సరి సరాసరి వచ్చి యెడంద యందుఁ బొం
గారు దయన్ వసించు మఱి యందగ నీఁ డెటువంటి దుఃఖమున్॥100

త్మా సతి చావనీక యటు సాకి హితమ్మొఱఁగింప స్వస్థుఁడై
వాసిగఁ జేరి యిచ్చట తపఃపరుఁడయ్యె మహామునీంద్రుఁ డ
భ్యాస వశమ్మునన్ స్వవశమై సకలేంద్రియ సంఘ మొప్పఁ గై
లాసపతిన్ మదిన్ నిలిపి శ్లాఘ్య తపంబొనరించె నిష్ఠమై॥ 101

యాదృశి భావన యగునో
తాదృశి యగు సిద్ధియనుట తథ్యమ యగుఁబో

యాదృతి స్థాణువు గొలువ స
మాదృతి నతఁడయ్యె స్థాణు వచలాకృతియై 102

అగ్నితప్త వ్యోమయాకృతి యన్నట్లు
మండుటెండల నిల్చు మంట యగుచు
స్రావద్ ఝరీక ప్రస్రవణాద్రి యన్నట్లు
వర్ష ధారలు జాలువార నిలుచు
మధ్యాహ్న మార్తాండు మంచు గడ్డగఁ జేయు
చలికాలమునన్ శీత శైల మగును
వ్యాఘ్రు సింహ వరాహ వారణానేకమ్ము
లొరసి చన్నను గన్నుఁ దెఱవకుండు

స్థాణు వతఁడౌనొ యితఁడౌనొ సకలజగము
సంశయం బందనగు తపశ్చరణ నిలువ
బ్రహ్మ సూ మౌని యెడఁ బరాత్పరుఁడు కరిగి
వాయువై సోకి లింగభావంబునందె॥ 103

## వాయు లింగావిర్భావము

ప్రాణప్రాణ మటుల్ ప్రసన్నమగుచో బ్రహ్మప్రసూ మౌని నె
మ్మేనన్ బుల్కలు తేర మేల్కనుచు స్వామీ! అష్టమూర్తీ! జగత్
ప్రాణాకారతఁ దోఁచి నా జనికి సార్థక్యంబు కల్పించి తిం
కైనన్ నే నను మాటలేని మహితైక్యంబిచ్చి మన్నింపవే॥ 104

సద్యోజాత ముఖాభి ముఖ్యముగఁ బంచప్రాణ వక్త్రాన్విత
ప్రోద్యద్భాగ విశిష్టమూర్తివిగ నా ముందున్న యట్లే యిటన్
విద్యోతాత్ముఁడ వౌచు నిల్వుము దయా స్వాన్తాంత రంగుండవై
పద్యానమ్రుల కార్తి మోచకముగా భక్త ప్రసన్నేక్షణా! 105

అని జగదేక రక్షణ దయామతి వేఁడు వశిష్ఠ మౌని ప్రా
ర్థనమున వాయులింగమయి తత్త్వము తెల్పుట కందునుండి ద
క్షిణ ముఖుఁడౌచుఁ దోఁచి మునికిన్ బరమార్థము నందఁ జేసి చి
ద్ఘనుఁడు శివుండు వాయుమయతన్ భజియించి కృపాబ్ధి నిల్చినన్॥

మును గజ కాననంబయిన మోహనదేశము బ్రహ్మసూ ముని
ప్రణయమునన్ స్వయంభువు శివప్రభు వెన్నిన దివ్య దేశమై
తనరిన దట్లు వచ్చి శివదైవము దక్షిణుఁడై మునీంద్రు సే
వనమునఁదావు నచ్చుటను వచ్చిన మాటయె విస్మరించినన్ ॥ 107

ఇదిగో వచ్చెదనంచు నేగి మఱిరాఁడేలా శివస్వామి నా
యెదఁ గొంపోయెను వెంటఁ గంచుకమనై యెట్లుందు నిచ్చోట నే
గెద నచ్చోటి కటంచుఁ బార్వతియు సాగెన్ సర్వకైలాస మొ
ప్పిదమై వెంబడి రాగ స్వామి స్థిరుఁడై వెల్గొందు నిచ్చోటికిన్ ॥ 108

ఇట్టు లగునని స్వామి ముందే యెఱుంగు
ననుకొనిన యట్లు వచ్చు నర్థాంగి నంది
పూర్ణుఁడై స్వామి మోదాబ్ధి మునిఁగి తేలె
దిగులువడి వెండికొండయు నెగిరి వచ్చె॥ 109

గజకాననమున నగజ కయి పూని రా
నానంద నిలయాగ్ర మందు శివుఁడు
బహురూపధారియై విహరించె స్వేచ్ఛమై
స్వస్వరూప స్థిరత్వమున మెఱసి
ఇభరాజ మిథునమై మృగరాజ యుగళమై
వనవరాహ ద్వంద్వ మనఁగఁ జెలఁగు
చెంగు చెంగున దూఁకి నింగి దూఱెడు లేళ్ళ
జంటయై వనవీథి సంచరించు

విహగ మిథునమ్ముగా మిన్న వెంటఁబోవు
నంచదోయిగ జల తరంగాళి నూగుఁ
గర్మయందు న కర్మతఁ గనుట యన్న
యోగ మార్గమ్ము చూపఁ దా నున్న యట్లు॥ 110

క్రీడించున్ బరమేశ్వరుం డనిన రక్తిం దోగునోస్వామి, యె
గ్గాడన్ బూనుటె యాన యార్ద్రమతి కాఁడన్నన్ సదా చిన్మయుం

డాడున్ బాడును సాక్షిమాత్రుఁ డగుచున్ స్వానంద నిర్మగ్నుఁడై
యాడించున్ జగమెల్ల నిష్క్రియుఁడునై యాశ్చర్యకృత్కర్ముఁడౌ

## దక్షిణామూర్తి

బీజస్థ వృక్షమై వివృతి నందును విశ్వ
మని తెల్పు మఱ్ఱి నీడను వసించి
జీవుఁడే బ్రహ్మమా భావంబు నందేక
మని తెల్పు చిన్ముద్ర నవధరించి
వాఙ్మనోఽగమ్యమా బ్రహ్మమానంద మా
నని తెల్పు మౌనముద్రను వహించి
అంతశ్చిదానంద మావిష్కృతంబైన
చందాన బ్రహ్మ తేజమునఁ బొలిచి

నిత్యయౌవన నిర్నిద్ర నిశ్చలాత్మ
దక్షిణామూర్తి యౌచు సదాశివుండు
పరమవృద్ధులు శిష్యులై వఱలుచుండ
మౌనమునఁ దెల్పుచుండు బ్రహ్మమ్ము నెపుడు॥ 1

అభిముఖుఁడైన స్వామి కడ నంజలి బద్ధుల మౌచు నిల్చుచో
నభయము నందఁ జాలుదుము హార్దతమంబది యెల్ల పోయి చి
త్ప్రభ జ్వలియింప మోదరసవార్ధి మునుంగుచు లీనమౌదు మా
విభవము నందినన్ మదికి విశ్వము బ్రహ్మమయంబుగానగున్॥ 1

పర్వదినమున బ్రహ్మాత్మ భావమునను
దేలియాడిన గురు శిష్యులోలి నిశను
నిద్ర నెఱుఁగక బ్రహ్మ సాన్నిధ్యమందు
దేహ విస్మృతి గనిరి సందీప్తమతులు॥ 1

నిద్రా సౌఖ్యమె సర్వజీవులకు శాంతింగూర్చి యక్షుద్రమౌ
భద్రంబున్నది యింద్రియోపరతిచే వైవశ్య సంప్రాప్తమౌ

నిద్రన్ శాంతి యిదం విధంబనఁగ దానిన్ స్వప్రయత్నంబునన్
చిద్రేఖాత్మత నంది కొంటయె మహాశ్రేయస్సు నాఁ దెల్పెడిన్ ॥ 115

కోరి స్వరూప సౌఖ్యమునఁ గూర్కుటయే పరమార్థ మందు రా
దారి నెఱుంగుటే ఘనము దాని బడిం బయనించు వారె ని
ర్వైరులు శాంతచిత్తులు శుభప్రదు లీ భువి కాత్మవేత్త ల
వ్వారు సమస్తలోకముల భద్రత గూర్తురు సిద్ధి నందుచున్ ॥ 116

## యాత్రాదినమున గురుశిష్యులు

నాటి గిరి ప్రదక్షిణమునన్ దమ జన్మములందు భద్రతన్
సూటిగ నందఁగోరు పరిశుద్ధులు వారలు కుంభ జన్మఁడీ
నాట స్రవింపఁజేయు నఘనాశిని స్వర్ణముఖిన్ మునింగి లా
లాట విభూతి కుంకుమములన్ ధర మెట్టిన ఫాలనేత్రులై 117

శైవమౌ మహామె భాస్వర ముఖాకృతిఁ దాల్చి
జ్వలితమై బ్రహ్మ వర్చస్సు తోఁచు
ప్రస్ఫురత్సర్వేశ భవ్యాలయద్వంద్వ
మాజొమ్ము లెంత మహౌజసములు
ద్వారతోరణ మాలికా రాజియై వ్రేలు
నవె గళస్థలిని రుద్రాక్ష సరులు
ఆజానుబాహు దీర్ఘామేయ తను వొప్పి
సస్కంద శివమూర్తి సాగుదేరె

ననుచుఁ జూచిన జనులు ప్రహ్లాన్న మతులు
పదము పదమున సాష్టాంగ పడుచునుండఁ
బ్రహ్మ భావాన శివసమర్పణ మొనర్చు
చరిగి కొల్చిరి స్వామి దేవాలయమున! 118

వారె విన్నారొ వారలే పలికినారొ
స్వీయ మహిమను స్వామి విన్పించె నొక్కొ
అది మొదలుగాగ వినవచ్చె నన్ని కథలు
కథలు వినుచును సాగిరా ప్రథితయశులు 11!

# సాలెపురుగు వృత్తాంతము

శ్రీనామ కోర్ణనాభము
దైనందిన భక్తి సలిపి తనువు దొరంగన్
లీనం బైనది స్వామిని
గానంబడు దాని చిన్నె కమనీయంబై॥ 120

పురుగని త్రోసిపుచ్చెదమె పూర్వభవస్మృతి కల్గి భక్తిమై
సురుచిర సేవచేసి మనసున్ బరికింపగ స్వామిచేయు ని
ష్ఠుర కృతి కోర్వలేక శుచిఁ జొచ్చిన పూర్ణవిరాగి దానితో
దొరయుదురే విదగ్ధ మతి తోడగు మోహవినష్ట మానవుల్॥ 121

వాఁడును పూర్వజన్మమున బాపఁడు సత్యసభాఖ్యు పుత్త్రుఁడా
పోఁడిమి నిల్వలేక పెనుమోహము క్రమ్మి కులమ్ము వీడి పే
ర్వాఁడి కువింద పాటలకు పంచను జేరి కరంబ నాముఁడై
చేడెగఁ దత్కులోద్భవను జేకొని వానికి దత్తపుత్త్రుఁడై॥ 122

అమితైశ్వర్యము నంది వస్త్రనిచయ వ్యాపార నిష్ణాతుఁడై
సములం దుత్తముఁడన్ బ్రశంసఁ గని యైశ్వర్యానుగుణ్యంబుగా
విమలౌదార్య మనస్కుఁడై విరివిగా విశ్రాణ నంబొప్పి ని
స్సముఁ డయ్యున్ దుదకేమొ జాఱిపడెఁ బాషండ ప్రభావంబునన్॥

పానరతుఁడయి సర్వసంపదలు పోయి
దుర్గతిం జెందియున్న యా దుష్టవేళ
శైవబుధునకు లింగ వస్త్రం బొసంగు
పుణ్యమునఁ బుట్టి వని సాలెపురుగుగాగ॥ 124

బ్రదుకు లివి వట్టి వైకుంఠపాళి యాట
నిచ్చెనలు తాక పై కెక్కి నిక్కుటయును
పాము తగులంగ నడుగంటఁబడుచు నుంట
స్వామి దయఁ బూని రక్షింప వలయునంతె॥ 125

గజ కాననమునఁ జెలఁదిగ
నిజ ధర్మము నూని గత జని స్మృతియుతమై

యజుఁగొల్చు కొనెడి తహతహ
గజి బిజియై కాలమెట్లొ గడుపుచునుండన్॥ 126

సుజనుం డెవ్వఁడొ వచ్చి బిల్వదళముల్ సూనంబులున్ గోయుచో
నిజ కాంక్షం బడి వాని వెంటఁ జని మున్నెన్ గుంభజన్మాపగన్
ద్విజుఁడౌ భక్తుఁడు మంత్ర యుక్తము సమర్పింపన్ శివుంజేరి త
ద్భజనంబున్ బొనరించె నిష్ఠమెయి స్వప్రాగల్భ్య యుక్తంబుగన్॥

దేహమును బట్టి కర్మ సిద్ధియు ఘటిల్లు
స్వీయ కర్మను దేవు సేవించుకొనియె
దేహధారులు సిద్ధి నందెదరు జగతి
పొరపడఁగ రాద యిది జగద్గురుని మాట॥ 128

ఎవ్వఁ డెచ్చోటఁ బుట్ట లోటేమి కలదు
స్వస్వ కర్మల నుచ్చ నీచములు లేవు
అన్ని కర్మలు స్వామి కభ్యర్హితములె
స్వామి సంతృప్తి నందింప సాధనములె॥ 129

సాలె పురుగయి శ్రీ చేయఁజాలు నెద్ది
యద్దియే స్వామి కైంకర్య మనఁగఁ జేసె
మోహమును వీడి తుదకు స్వదేహ మొసఁగ
స్వామి నైక్యమ్ము చెందె నాశ్చర్యముగను॥ 130

కులవృత్తి గూడు లల్లుట
వలవదు పరికరము పెట్టుబడియు రవంతేన్
నిలిచెను మతి శివ పూజను
ఫలియింపక యేమి చేయుఁ బ్రారంభంబుల్॥ 131

దినమున్ లేచిన దాది దేహమను తిత్తింబుట్టు స్నిగ్ధోర్ణతో
పెనుగూళ్ళల్లుచు నిద్ది దేవళము తృప్తిన్ స్వామి యుండుండు, భో
జన గేహం బిది, యాగశాల యిది, విశ్రాంత్యర్థమీ గేహ, మా
మెను శయ్యాగృహ మింకఁ గట్టెదను స్వామీ! యెన్ని యేన్
గేహముల్ 132

అని కల్యాణ గృహమ్ము కట్టినది, వేయూకాళ్ళ పెన్మంట పం
బును నిర్మించెను, పూలతోట నొకచోఁ బూనించెఁ, గేళీగిరిన్
బెనిచెన్ వాహన డోలికా తతులు కల్పించెన్ మతిన్ బుద్ధి పు
ట్టిన నానావిధ సేవలన్ జలిపెఁ గంశేకాలు ప్రీత్యర్థమై॥ 133

దేవరకున్న యల్లె మఱి దేవికి నంచును గొన్ని కట్టి నా
దేవకుమారకుల్ కలరు దివ్యులటంచును గొన్నికట్టెఁ ద
ద్దేవ సమానులం చితర దేవతలన్ భజియించెఁ గొన్నిటన్
ప్రోవులు ప్రోవులయ్యె భువి పొందగ లేదది తృప్తి యెంతకున్॥ 134

చేసిన చేతయే మరలఁ జేయుచుఁ గట్టిన కట్టడంబె య
భ్యాస వశమ్మునన్ బెరుగు పాటవ మొప్పగ దిద్ది దిద్ది ని
శ్వాసము పుచ్చుచున్ నిలిచి వాయుహతంబయి ప్రోవు ద్రెస్సినన్
మూసిక పెట్టుచున్ క్షణము మానక నిత్య సమర్చనా మతిన్॥ 135

ఊరి పొడ తెంచు క్రొంగ్రొత్త యూహలల్లి
యూహ వెంబడి నల్లును గేహములను
క్షణము విశ్రాంతి గొనక మర్కటక కీట
మెంతయో సేవచేసె నయ్యీశ్వరునకు॥ 136

భక్త పరీక్ష సేయుటకుఁ బాల్పడె స్వామి యటన్న వానిపై
రక్తి జనించులే యగును రక్తుఁడు కాని యెడన్ బరీక్ష కు
ద్యుక్తుఁడు కాఁడు తత్పరత నుండును స్వామికి లోఁదలంపుగా
భక్తుని సంస్కరించుటయు స్వామి ప్రసన్నుఁడు శ్రీ చెలందిపై॥ 137

అదితాఁ గట్టిన తంతుగేహములపై హైమాంబువుల్ నిల్చుచో
నుది తార్కాంశులు పర్వి రత్నమయ గేహోద్భ్రాంతి కల్పింప స
మ్మదితంబై చరియించుచోఁ బొడము సమ్మోహంబు మాయింపగా
నది చూడన్ హరియించె దీపశిఖ నొయ్యన్ బెంచి సర్వస్వమున్॥

ఎన్నో యేండ్లు శ్రమించి కట్టినవి యల్లే కాలుచుండంగఁ దాఁ
గన్నుల్ ద్రిప్పక చూచి చూచి యెద దగ్ధంబౌచు నుండన్ సమా

సన్న జ్వాలల కర్పితంబుగఁ దనూసర్వస్వమున్ నిల్పె స్వా
మి న్నైన్న వేద్య మిదే హరింపు మనుచున్ మిన్నందు మోదంబునన్॥

తనువుపై మోహమే లేని దాని భక్తి
కలరి పరమేశ్వరుండు నా చెలఁది పురుగు
జీవ తేజంబు తనలోనఁ జేర్చుకొనిమోఁ
జిహ్వమున్ నిల్పె లింగానఁ జెదరకుండ॥ 140

చదువేటికిఁ జదురేటికిఁ
జెదరని మన మొక్క డున్నఁ జెందగ నచ్చున్
విదితాఖిలాధ్వగాములు
కదలియు దరిఁజేరరాని కైవల్యమ్మున్॥ 141

కృతయుగ వేళ నిద్ది జరిగెన్ సుర లెల్లరు పూల వానతో
క్షితితల మెల్ల నింపఁ, బరికింపగ నప్పుడు వాయులింగ సం
స్థితి తెలియంగనైన నరజీవులు తక్కువ కానలూత యా
గతి శివసేన చేసినది గాసిలకన్ నర విఘ్న మందుచున్॥ 142

తన పేరును దన రూపముఁ
దనలో నిలుపంగఁ గోరె దైవము నదియున్
మును ముందు తాను తలఁచిన
దనివెన్ గృమి యంచు స్వామి యానందించెన్॥ 143

## ఏనుఁగు, పాము స్వామిలో లీనమగుట

పాతాళంబున నుండి కాళమను సర్పంబొండు నిత్యమ్ము ను
న్నీతానర్ఘ మణిప్రకాండములఁ గంఠేకాలు నర్చించు చో
నే తత్పూజన మర్థహీనమని మత్తేభం బొకండెంచి యా
రోతం ద్రోచి భజింప సాగినది రుద్రున్ బత్ర పుష్పంబులన్॥ 144

ప్రాతర్వేళ భజించు కాళ, మట్టుపై వచ్చున్ మదానేక పం,
బే తత్పూజలు కానరామి కవిరెం డెంతే వ్యథం జెందు ని

ర్భూతిఁ నాడు సమర్చనంబు పడ ద్రొబ్బెఁ వేఁడొ? సైరింతు నే
చూతుంగాక యటంచు రోషమున రోజున్ రెండు రెం డుగ్రమై॥ 145

తన పూజం గొని యన్యపూజఁ గొను చందంబోర్వగాలేవు రెం
డును స్వామిఁ దనవాఁడవై నిలిచి యుండుంగాక యంచెంచెదేఁ
దన వాఁడౌట నిజంబె యింకొకనికిఁ దానట్లు కాఁగూడదో
మన మం దెంచవు స్వామి యెక్కడ యగున్ మాన్యం
డనంతాళికిఁ॥ 146

ఎవనికి వాఁడు డెందమున నీశ్వరుఁ గొల్చినఁ జిక్కు లేదు వా
స్తవమున సర్వజీవులకు స్వాంతము లున్నవి వేఱు వేఱుగా
నెవనినో దేవుఁడంచు వెలి నెక్కడో నిల్పి యతండు నాకెయౌ
నవునని పోరసాగు నొకో యందఱు దేవుని గొల్వనౌ నెడన్॥ 147

మనుజుల యందె మృగ్యమగు మాన్య వివేకము జంతుజాల మం
దునఁ గననౌనె మత్సరముతో నవి రెండును స్వాన్యపూజ నో
ర్వని యవియై సహించునది స్వామిగదా యని వాని శత్రువౌ
ననుకొన నొక్కరొక్కరికినై యరిభావము నంది రేగినన్॥ 148

ఒకనాఁడు మత్తేభ ముప్పొంగు భక్తిమై
వనమెల్లఁ దిరిగి బిల్వములు కోసి
కమలాకరమ్ములు గావించి కమనీయ
కమల కల్హారముల్ కట్ట గట్టి
పరిపక్వ ఫలము లిబ్బడి గాగ సమకూర్చి
మొగలేటి తెలినీట మునిఁగి తేలి
తుండంబు నిండుగాఁ దోయంబుల న్నింపి
పూలు పండ్లును పత్రములు వహించి
భవుని తలపైని రాళ్ళు కోపమునఁ జిమ్మి
తుండ మందలి నీళ్ళు లొత్తుగను గురిసి
పత్ర పుష్పమ్ములను పూజ భక్తిఁ జేసి
పండ్లు నైవేద్యమిడి కడున్ బ్రణత మగుచు॥ 149

స్వామీ! సాంబశివా! యిదే వినతి యెవ్వాఁడో వినష్టాత్ముఁడై
నా మేల్ పూజ తొలంచి రాళ్ళు తల పైనన్ బెట్టుచున్నాఁడు నీ
వేమో యద్ది సహింపఁ గల్గుదువు నాకే మాత్రమున్ గిట్ట, దిం
కే మైనన్ సరి తేల్చికొందు నతఁడో యేనో నినుం గొల్చుటల్॥ 150

రే పే వచ్చిన సాధువేళ కివి యిట్లే యున్నవా మంచిదే
త్రోపద్దన్ సహియింపఁ జాల విను మా దుర్మార్గు సాధించెదన్
నాపై నేరము మోప నెంచకుము మాన్పన్ నీ తలంపేని వాఁ
డీ పూజన్ మఱి ముట్టనీక కనుమీ! యే నేగి వత్తున్ శివా! 151

అని యేగిన దా నాగము
వినెనో మఱి యేమొ యుదయ విధిఁ గాళము తా
నని నట్లె యన్న దిదియును
జనినవి చన్నట్లె కడు సాధింపంగన్॥ 152

ఎపు డెపు డెప్పుడంచు నుదయించుటకై క్షణ మొక్క కల్పమై
యవగత నిద్రులై రవిదళితాఖిల భోగనిరస్త కాములై
త్రప విడి యేమి చేయుటకుఁ దామె సమర్థుల మంచు నుండగా
నుపనత మయ్యెఁ గాల మది యుండదుపో యెవరెట్టులైననున్॥ 153

వచ్చి క్షణాలపై నిచట వ్రాలిన, వించుక ముందువచ్చెఁ బా,
మిచ్చక మయ్యె సర్వ, మటు కీడ్చిన దంతయు వమ్ముగాఁగ పా
ట చ్చరుఁ డాత్మపూజ వికటం బొనరించెను, నేఁడు వచ్చుగా
చచ్చును పొమ్మటం చదియు స్వల్పపు టాకృతి డాగియుండినన్॥154

ఏనుఁగు వచ్చి చూచినది యెప్పటి యట్టులు కాక పూజ తా
వానిన యట్లె యున్నయది వల్లభమై శివుఁడొప్పి నాఁడొ య
వ్వానికి బుద్ధి వచ్చినదొ ప్రస్తుత పూజ యొనర్తునంచు న
వ్యేనుఁగు కానకేగినది యే త్తెఱి పూలును పండ్లు తేరగన్॥ 155

అందిన శత్రు పందకయె యడ్డుపడెన్ బలుదైవమంచు ని
ల్వందగు నెందుకైన నని పాము మడంగియె యుండె నంతలో

నందిన పత్రపుష్పచయ మంతయు నచ్చట దించి ప్రాంత పూ
జం దొలఁగింపగాఁ గరము సాచిన దంతియ పాముజట్టునన్॥ 156

నా సారంధ్రము వెంటఁ బ్రాకి చని లోనంగుట్టి పోయన్ శిరః
ప్రాసంబై చను దాని వెల్వరుప నిష్ప్రత్యూహ నానావిధా
భ్యాసంబుల్ పొనరించి వ్యర్థమయి తీవ్రంబైన బాధోల్బణం
బేసందున్ గననీమి ఖిన్నమతియై యేనుంగు వాపోవుచున్॥ 157

స్వర్ణదీ జలము నాసానాళమునఁ బీల్చి
భిన్నమై పడునట్లు చీది చీది
కుంభంబు గిరి పార్శ్వ కుడ్యంబునకు నొత్తి
తుత్తురుమానట్లు తోమి తోమి
హస్తంబు పైకెత్తి యణగారునట్లుగా
కుంభ మధ్యంబునఁ గొట్టి కొట్టి
పెడ మర్లుగా దొర్లి కుడియెడమ్ముల గండ
భాగమ్ములన్ భూమి బాది బాది

యేమిచేసిన పోక పెల్లేచు బాధఁ
దట్టుకొన లేక పరువులు పెట్టి పెట్టి
కొండగుహలును గీపెట్టి గోలపెట్టి
నెత్తికెక్కిన శత్రువున్ నెట్టలేక॥ 158

ఇది యెట్లున్ నను చంపిగాని విడబోదిద్దాని నేఁజంపి చ
చ్చెద నీలోనిది దూటి పాఱునొకొ చచ్చెన్ జచ్చె రాలేదు పో
కదియింతున్ గుదియింతు నిట్టులనె బిగ్గంబట్టి తుండంబు గ్ర
క్కదలంగా గిరిఁదాకి లోపలనె చుక్కల్ దుళ్లఁదాడించెదన్॥ 159

అనుచున్ దూరమునుండి పర్వెమయి నూహాతీత వేగంబుతో
పెనుగొండన్ బలమార తాకినది నిర్భిన్నోరు కుంభాగ్రమై
వననాగంబు ప్రపాతమందినది సర్వంబున్ వినిష్పిష్టమై
చనిపోయెన్ మరణాంతమై పగనశించన్ రెండు దివ్యత్వమున్॥160

కని తో తెంచెను మింట వారలకు సాక్షాత్కారమై స్వామి ని
ల్చెను కోరుండనె దివ్యమౌ వరములన్ లీలామతుల్ వారు పే
రును రూపంబును దాల్పఁ దేజమునఁ జేర్పంగోరి రక్షించియటం
చును గైవల్యము నిచ్చె స్వామి పులకించున్ భక్తికెల్లప్పుడున్ ॥161

వీరును పూర్వజన్మమున విప్రకులస్థులె హా స్త్రియై మనో
జారి భజించువాఁడు నిశియంతయు జాగరణం బొనర్చి యె
వ్వారో పొనర్చినట్టి పురభంజను పూజనుజూచి వెంట దు
ష్టోరగ మొండు కాటుగొన నూర్జితుఁడై జనియించె నట్లుగన్ ॥ 162

పామయినట్టి భక్తమణి స్వామిని భక్తి భజించుచుండి వి
ప్రా మతి రత్నపూజనము శస్తమటంచును వించు నాగమై
సోముని గొల్తుగాక యని చోద్యముగా నటఁబుట్టి రెండునున్
బ్రామిన పూర్వజన్మ స్మృతి ప్రాలిన వా పెనుభక్తిదారులన్॥ 163

ఇరువురి భక్తి నెమ్మదుల కించును రాళ్ళని యేనుఁగన్నచో
నురగము ముళ్లనున్ దనువులూడ్చుటకైనను సిద్ధమౌచు దే
వరకు సుఖంబుకోరు వరభక్తులు వారలు వారి పేర నే
పరగును స్వామి గ్రామమును బర్వతమున్ మునుముందు శ్రీయుతిన్॥

శ్రీకాళహస్తి పురిలో
శ్రీకాళ కరీంద్ర నగము చెంతను విదిత
శ్రీకాళహస్తి పతియన
నేకాలమునందు శివుఁడ నేకదుఁడగుఁబో॥ 165

నామస్వీకృతి మెచ్చదైన కలదన్నా యొక్క యిచ్చోటనే
స్వామిన్ నామమె కాక రూపమును గాంచన్ గల్గుచున్నాము నా
నామేయాఖిల భక్తకోటికి మహానంద ప్రదుండైన యీ
స్వామిన్ గొల్చు పురాకృతం బొకటి పెల్చన్‌దోడు నిల్చెన్ బురే!

ధన్యోఽహం ధన్యోఽహం
ధన్యంబగు జీవితంబు తద్దయు భక్తిన్

స్వాన్యాఖిల శూన్యుండగు
మాన్యున్ గొలువంగఁజాలు మహితాత్ములకున్॥ 167

గురువుల్ శిష్యుఁడు భక్తి నెక్కొనిన చెక్కుల్ బాష్పకుల్యాస్రుతిన్
వరణీయంబులు వందనీయములుగా వందారు మందారులై
వరి వస్యల్ సిరి కాళహస్తిపతి నిల్వన్ స్వాంతముప్పొంగ స
త్వర మాత్మేశ్వరి దర్శనం బొనరుపన్ దత్సన్నిధిన్ జేరినన్॥ 168

## తల్లిని దర్శించుట

హైమవతీదేవియై తోఁచి యాత్మేశు
నేతల్లి యింద్రున కెఱుఁగఁ జెప్పె
శ్రీకాళహస్తీశు సేవింప నే తల్లి
జ్ఞాన ప్రసూనయై కదలివచ్చె
భక్తకోటికిఁ గొంగు బంగారమై నిల్చి
యే తల్లి యొసఁగు నభీష్టములను
మ్రోల నిల్చిన మాత్ర ముడులన్నియును విప్పి
సాయుజ్య మిచ్చు నే జనని నేఁడు

ఓము నుమయటంచు మువ్వంక లొదుగనిల్చి
క్రమ దక్షిణ హస్తాన జ్ఞాన కళిక
సవ్య కరమునఁ బరమ వాత్సల్య ముద్ర
దాల్చి నాతల్లి కివియె వందన శతమ్ము॥ 169

నిన్నుం జూచుచు నున్న వేళ జననీ నీ నాథుఁడే తోఁచుఁ ద
త్సాన్నిధ్యంబున నీవ నిల్చెదవు సంసారమ్ము మీ లీలయై
యున్నన్ లేనిదిగాగ నెల్లెడల మీ రున్నారు సత్యంబహో
యున్నారొక్కరె యంచు నిర్వురయి విద్యోతింతు రీ సృష్టికై॥ 170

స్వామిన్ నీవును నిన్ను స్వామియు మిథస్సందర్శనానంద రే
ఖా ముగ్ధాత్ముల మమ్ముఁ జూచు నిజభక్తశ్రేణి మీలో స్వయం
ప్రామాణ్యమ్ముగఁ దమ్ము తామె కని యద్వైతాఖ్యసత్త్వావ బో
ధా మోదమ్మునఁ దేలియాడు నిది యే తల్లీ! నిజానందమా॥ 171

అవధానంబున విన్నటంచుఁ బతి మంత్రార్థమ్ము వ్యాఖ్యాన వై
భవ మొప్పన్ వివరించుచోఁ గదలికై భక్తాళికిన్ స్వామికై
భువి జన్మల్ సవరింపనైన బ్రదుకున్ బోధించు తాత్పర్యమై
యవతారంబుగ నిల్తువంట యిట నంబా! జ్ఞానసూనాంబికా! 172

చవిలేదమ్మ తనూ నివాసమిది వాత్సల్యాబ్ధివౌ నిన్ను శై
శవ భావమ్మునఁ జేరి సొమ్మసిలు లక్ష్యమ్మున్న నేగాని పా
ర్థివుఁడైనన్ జగదీశుఁడే యయిన మాతృస్వాంత మందందు ను
త్సవమున్ జెందక వ్యర్థజీవితమెయౌ! జ్ఞానప్రసూనాంబికా! 173

భర్తకుఁ దల్లియౌట నినుబట్టి మహత్తర ధర్మమయ్యెనో
యార్తి విదారిణీ! హృదయహారిణి! చిత్తజ తాపవారిణీ!
మూర్తి మదాత్మ బోధఘన! మోహనలోచన! శాంతిసేచనా!
గర్తనిపాతి తాఖిల జగద్భయవారణ దివ్యవీక్షణా! 174

## ఆలయ విశేషము

స్వామి పశ్చిమ ముఖుఁడిందు సోమ ముఖము
ముదము నంగని చొక్కు ప్రాఙ్ముఖ సవిత్రి
తల్లి దండ్రులు వారిఁ బ్రదక్షిణించి
భక్తవరులెల్ల ధన్యతఁ బడయుచుంద్రు॥ 175

ఆలయము చేర నుత్తరాభి ముఖత
దక్షిణామూర్తిఁ గాంచి తత్పరుల మగుచు
స్వామి సేవించుకొని జగజ్జనని గొలిచి
మోదమునఁ దేలి దక్షిణా మూర్తులమయి॥ 176

వెలికి వత్తుము లోవెలిన్ వెలుఁగుల మనఁ
గట్టి రాలయ మట్టుల కృతమెకాదు
చిత్తశుద్ధికిఁ దోడ్పడు క్షేత్రమహిమ
నట్టి భాగ్యంబు నందు టే మద్భుతంబు॥ 177

తల్లిందండ్రి మహాప్రదక్షిణముగాఁ దన్మంత్ర సంస్కారణో
త్ఫుల్ల స్వాంతత దేహముల్ తెలియకే ముమ్మారులే చుట్టి భ
క్త్యుల్లాసంబున దక్షిణాముఖులె యుత్ఫుల్ల నేత్రాబ్జులై
తల్లిందండ్రిని బాయలేని సుతులై తద్దేశిక చ్ఛాత్రులున్॥ 178

గుడివెడలి వచ్చి యడుగులు తడబడంగ
విశ్వమఖిలమ్ము తానిల్వఁ బెట్టుచున్న
చందమునఁ దోఁచు వృషభధ్వజంబు ముట్టి
యనుగ మించిరి వారు విశ్వాది గురుల॥ 179

జయహో మహాదేవ! జయ దేవ దేవ!
జయజయ జగదీశ! జయ నగజేశ!
శ్రీకాళహస్తీశ! సిద్ధిప్రదేశ!
లోకాఖిలాత్మేశ! లోకలోకేశ!
జయహో మహాదేవ! జయ దేవ దేవ!
జయజయ సర్వేశ! జయపార్వతీశ!
శ్రీకాళహస్తీశ! శ్రిత రక్షకేశ!
స్వాకార కైలాస! జ్ఞానాంబికేశ! 180

## ప్రదక్షిణ యాత్రా ప్రారంభము

అప్పటికే పురప్రజ లహంయుతి నెల్లరు మేమె మేమె ముం
దొప్పగ నా నటన్న మతి నొద్దిక చేరిరి దేవళానకున్
చప్పున నుప్పెనం బలెనె సర్వమనోహర వాద్యఘోషముల్
తెప్పున మ్రోగగా బయలుదేరెను స్వామి జనుల్ నుతింపఁగన్॥

ఒక జమీందారుఁ డొక పది యూళ్ల ప్రభువు
నెన్నికలలోన గెలిచిన యెక్కిరింత
జైత్ర యాత్రాట్టహాసంబు చాలఁ జేయఁ
గలరు వారిని పట్ట పగ్గములు కనము॥ 182

అఖిల భువనేశ సర్వరాజాధిరాజ
రాజపరమేశ నిఖిల దిగ్రాజ రాజ
సార్వభౌమున కిదియొక సంబరంబె
అతనికిం దగ్గయట్లు చేయంగఁ గలమె॥ 183

అందఱకు ముందు శ్రీ వృషభాంకితంబు
స్వామి దివ్య ధ్వజం బూని సాగె నొకఁడు
వృషభ వాహనుఁడగు స్వామి వృషభమనగ
ధర్మమే యగు నది పరాత్పరు వహించు॥ 184

సర్వ భువనాధి పత్యంబు చాటి చెప్ప
భూరి భూచక్ర గొడుగులు పూని యిర్వు
రరుగు చుండిరి ధ్వజ ధారి ననుసరించి
మకర తోరణమును దాల్చి మరి యిరువురు॥ 185

శాంఖ కొమ్ములా వెన్క సాగుచుండె
నను పదమ్మున సర్వ వాద్యముల వారు
తగిలి శివమేచు భజన బృందములవారు
గాథలం జెప్పు వంది మాగధ కులంబు॥ 186

బ్రహ్మఘోషం బొనర్చు విద్వాంసు లంత
స్వామి సేవల కగు శివాచార్య గణము
వరుస తప్పిన తప్పగా వచ్చుగాని
వలయు వా రెల్ల రుండి రవ్వారి గాగ॥ 187

దక్షిణముగాగ గుడి నుండి తరలి నట్టి
స్వామి పడమర కేగి యప్పాట మలఁగి
యుత్తరాభి ముఖుండయ్యె నూర్జితుండు
కట్టడములోని కదలిక కష్టతరమె॥ 188

సోమస్కందులు ముందుగ
సోమిం చెడి జ్ఞాన సూన చొక్కుచు వెనుకన్

ప్రామినుకు లభినుతింపగఁ
దాపై గిరి చుట్టి రాగఁ దహాతహా పడుటన్॥ 189

బలయుతులైన వాహకులు వల్లభులై వహియించు పల్లకుల్
సలలిత ఫక్కి సాగ నిరుచక్కిని వీచెడు వెల్లచామరం
బులు, శశి సూర్య చిహ్నములు, ప్రోద్య దుదార సితాత పత్రముల్
వెలిగెడు దివ్వటీలు సరవిన్ జనుచుండును రమ్యదృశ్యమై॥ 190

ప్రాకార నంది నొకపరి
పైకొను వాత్సల్యమునను పరికించి జగత్
శ్లోకుఁడు పరివారముతో
నా కొస తూర్పునకుఁ దిరిగె నాలయమందున్॥ 191

అదియే ప్రాగ్దిశ నున్న గోపుర మహో యద్వారె శ్రీశంకరుల్
ముది శిష్యుల్ తము గొల్వఁ బొల్చెదరటన్ ముమ్మాటికిన్ స్వామియే
యెదురై నట్టులు తాను తాన యగుచో నే భీతియున్ లేదు లే
దిదియే సత్య మటన్న నిర్భర కృపాఽహీన స్వరూపాత్మకుల్॥ 192

మహిత భారతి వేద ధర్మం బొకింత
నేటికిన్ నిల్చెనన్న నా మేటి భిక్ష
ఆది భిక్షువె యగుచు భయార్దితులకు
భీతిఁ దొలఁగించె సుజ్ఞాన భిక్ష నొసఁగి॥ 193

తపమునకు యోగ్యమైనట్టి తా వటంచుఁ
గోరి కూర్చుండె నొక పెను గోతియందు
నేమి చేయుఁ బాతాళ విఘ్నేశ్వరుండు
ఎత్తైతల నెంత యెత్తి కప్పెరిగెనంతె॥ 194

బాల జ్ఞానాంబ కడుసిగ్గు పడినయట్లు
ప్రక్క కొదిగియ యుండి తత్పరతఁ జూచె
బాల్యమంతయు స్మృతికి రాఁ బారవశ్య
మున మునింగెను స్వామి చెంతను సవిత్రి॥ 195

ఉత్తర ద్వార మందుండియే యూరిలోని
కేగు స్వామి యెప్పుడు నట్టు లేగుటయును
రాయ గోపుర మందుండి ప్రాఙ్ముఖముగ
వెల్వడుచుఁ జేరుకొను తేరు వీధినంత॥ 196

తిరిగి వచ్చెడు నప్పుడు తేరు వీథి
ముందుగా నున్న చిన్న గోపురము నుండి
లోని కేతెంచు నిది యనూచాన మైన
యానవాయితి యయ్యె నేఁ డట్లె జరుగు॥ 197

శంకర శివా! శంకర శివా!
శంభో మహాదేవ! శంకర శివా!
దుఃఖించు బ్రహ్మర్షి బ్రోచిన శివా!
గూఁ డల్లు సాలీని కాచిన శివా!
పగబట్టు కాళమ్ము పట్టిన శివా!
దగగొన్న మదగజము తాల్చిన శివా!
శంకర శివా! శంకర శివా!
శంభో మహాదేవ! శంకర శివా! 198

## పుర ప్రవేశము

స్వామి కౌసల్య మింతయు జరుగరాదు
యాత్రలో నని యుచితార్ఘ్య పాత్రలూని
బారుగా నిల్చు నిజభక్తవరులఁ జూచి
హర్ష పులకిత గాత్రుండె యగుచు స్వామి॥ 199

ప్రతి గృహంబున మంగళారతులు గొనుచుఁ
తన్ను తాఁ జుట్టివచ్చు తత్త్వంబు తెలియఁ
దనదు పేరనె పరగు పత్తనము నాల్గు
వీథులను మెట్టి వేంచేసె బేరి వారి॥ 200

మంటపమునకు నచట సమంచితముగ
నర్చితుండయ్యె నిఖిల లోకార్చితుండు

వార్షికమ్ముగ నిట్టి సపర్యలెన్నో
స్వామికై కొను యాత్రా ప్రసంగమునను॥ 201

నీలగళా! మమ్మేలుమయా!
కాలగళా! మము కావుమయా!
జయగంగాధర! గౌరీ శంకర!
జయ శశి శేఖర! భక్తవ శంకర!
జయత్రి పురహర! సర్వపాపహర!
జయనిట లాంబక! గజచర్మాంబర!
నీలగళా! మమ్మేలుమయా!
కాలగళా! మము కావుమయా! 202

## సిద్ధులయ్య (నత్కీరుఁడు) వృత్తాంతము

ఇక్కడ నుండి కొండపయి కెక్కిన నేరుగ సిద్ధులయ్య పె
న్నిక్కను జేరవచ్చు నతఁడీ శివ శైలము చేరి సిద్ధుఁడై
యిక్కడనే వసించి జగదీశ్వరు సేవన మందె మగ్నుఁడై
యిక్కవ వారి పూజలకు నెక్కను నేటికిఁ గొల్తు రాతనిన్॥ 203

గురు శిష్యులు కొండంగను
చిరు చేతుల దోయిలించి యెదురుగ నొక చి
న్నరి కోవెల కనరా క్రొ
క్కిరి యదియే సిద్ధులయ్య కీర్తి నిలయమా॥ 204

అతఁడు తుటారికాఁడు మహితాత్ముఁడు ప్రేణిత కార్తికేయ వ
ర్ధిత కమనీయ కావ్యకళ రెండవసాటి యెఱుంగ నట్టి వాఁ
డతి తర శేముషీ విభవుఁడయ్యు నొకానొక దుష్టవేళ ద
ర్పితుఁడయి శప్తుఁడయ్యె శశిరేఖ శిరంబునఁ బూను స్వామిచే 205

ఎంత వివేక ముండియును నెంతటి యీశ్వర భక్తి యుండియున్
బంతము పూని పాపములు పైకొను వేళఁ జలించు మానసం
బంతట దుష్టబుద్ధియును నంకురితంబగు దాని వెంట భో
గింతురు దుఃఖముల్ జనులు గెల్వగ నేరరు దుష్టమా విధిన్॥ 206

అనుభవ రూపమైన జగమందున నెవ్వఁడు తానె విజ్ఞుఁడౌ
నని తలపోయరాదు తనకొ నను భూతియె జాతి కంత కా
ననియుఁ దలంపరాదు, తన కయ్యెడి దాఁక నెఱుంగ రాక యె
వ్వని యనుభూతి వాని దయి వర్తిలు నీ జగ మెల్ల యప్పుడున ॥ 207

కలయగుఁ గల్ల యౌను మఱి కన్చెదరంగను వచ్చు వానికిన్
గలిగెడు దానిఁగా దనఁగఁ గల్గుట వీనికి నెట్లు సాధ్యమౌ
వెలుఁగొకఁడయ్యు వెల్వడుట వేఱగు రూముల నుండి యౌటచేఁ
దెలివియు వేఱు వేఱనక తీరదు సృష్టి విధాన మట్టిదౌ॥ 208

అమలిన సత్యమున్ జగము నన్నవి యెప్పుడు స్వానుభూతి వే
ద్యములని ధీ నిధుల్ తెలిసి యన్యులతోఁ గలహింపఁబోక య
న్యము విని భిన్నమైన యెడ స్వానుభవమ్మునఁ బొందఁజూతు రే
కమయి వెలింగెనా సరియె కాని యెడన్ పథమన్య మయ్యెడిన్ ॥ 209

మధుర మీనాక్షి యందు రా మాట వినరొ
ఆ నగర మేలు పాండ్య భూజాని యెడల
తల్లి జగదేకమాత వాత్సల్య మూని
యనుగు నంగయ కన్యగా నవతరించె॥ 210

ఆయన కాత్మజాత యయినప్పుడు తత్పిత శీతశైల భా
గ్యాయతి గౌరవంబు గొనుటచ్చెరు వేమగు? సుందరేశ్వరుం
డాయెఁ గుమారికాపతి, మహత్త్వము నింక నుతింప శక్యమే?
మాయ తనూజయై ప్రభు నమాయికు మాయికుఁ జేసె వింతగన్ ॥ 211

మహిపతి కేమొ బిడ్డయును మాన్య జగత్పతి కేమొ యాలునై
మహిమము చూపనెంచు గరిమన్ మిహికాచల రాజపుత్త్రి యా
మహి కిఁక నేమి చేయ దణుమాత్ర మెఱుంగక యుండఁ దామయై
యహమికతోడఁ జేరినవి యన్ని జగంబుల సర్వభాగ్యముల్॥ 212

ఐహిక భోగ భాగ్యము లనంతము లౌటయె కాదు సర్వజీ
వోహలు నాఁడు దేశమున కూర్జితముల్ శుభ కారు లౌచు స

న్నాహమునన్ దివంబునిల నాట్య మొనర్పగఁ జేసె సౌఖ్య మ
వ్యాహతమయ్యె ధర్మ మభివర్ధనమై కలిగించె మోక్షమున్॥ 213

అమ్మ మహీపతి తనయమై యవతరించి
మధుర నొనరించెనా పురి? మధుర యగుట
చేత నే యామె యచట సంభూత యయ్యె
నా యటన్నఁ బ్రశ్న మెటు? లేవా యె రెండు! 214

కలశసుతుండు వింధ్యగిరి గర్వము మానిచి లోకరక్షకై
నిలిచెను దక్షిణమ్మున మనీషి వరేణ్యుఁడు ద్రావిడోక్తి ని
స్తుల మొనరించి మంచి నుడి తోయము లన్నిటి గూర్చి దాని ను
జ్జ్వలిత మొనర్పనెంచి నిజభవ్య తపఃఫల మొప్ప దక్షుఁడై॥ 215

ద్రావిడ కవితా కోవిదు
లా వాగ్దేవీ సమాను లయ్యెడి వారల్
సేవింప నుత్సహించిన
తా విచ్చెడి మహిమగలుగు దాని సృజించెన్॥ 216

అది ఫలకాకృతిన్ దనరు నయ్యది శంఖమువోలె స్వచ్ఛమై
పదమిడి తన్ను పొందగల వారి యెడందలు తమ్మి పూవులై
పొదలగఁ జేయు శంఖమునఁ బోసిన తీర్థము లౌను పల్కులున్
కుదియును విచ్చుకో నగును గోవిద సంఖ్యను బట్టి యిచ్ఛమై॥ 217

దానిని లోకమాతఁగను తండ్రికి నిచ్చి "ధరాతలేశ! యి
ద్దానిఁ దపోవ్యయంబునను దత్పరతన్ సృజియించినాఁడ నా
స్థానము నందు నిల్పి సముదారత ద్రావిడ శారదా సమ
ర్చానిహితాత్ములై మనుఁడు సాగుమహత్త్వము పత్తరంబులన్॥ 218

అని కృప చేసి యిచ్చి చన నా మహితాత్ముఁడు దాని నిల్పెఁ ద
త్తనయ కృపావిశేషమున ద్రావిడ సత్కవు లెందరెందరో
ఘనమతి నందఁజాలి ఫలకస్థితి భూజనరాజ సత్కృతుల్
గని పరమార్థమున్ గనిరి కైవసమై సుకవిత్వ యోగముల్॥ 219

తరము లవెన్నొ దాటినవి దాని మహత్త్వము తగ్గలేదు త
ద్ధరణి నృపాల శేఖరు లుదారత నంగయ కన్య తండ్రులే!
సురుచిర సుందరేశ్వరుఁడు శూరులనున్ మురిపెంపు టల్లుఁడే!
వరమది యట్లు సాగుచును వచ్చిన దీ కలి కాలమందునన్॥ 220

నాటి ధరాతలేశ్వరుఁడనన్ మహి పట్టపురాణి యన్ననున్
సూటిగ సుందరేశ్వరుఁడు చూచును మామయు నత్త యన్నటుల్
మేటి యతండు, సత్కృపను మేటి, గుణంబుల మేటి, శూరతన్
మేటియు, జ్ఞాన మందునను మేటి, సదా సరియాను బోటియున్॥ 221

ఎన్నిక గన్న కవీంద్రులు
పన్నిద్దఱు దివ్య శంఖ ఫలకాసీనుల్
సన్నుత విద్యా గోష్ఠి
సన్నాహ మొనర్చుచుండ సద్యశుఁడతఁడున్॥ 222

వారల నౌదార్యముతో
శారదలన్నట్లె కొలుచు సారసమర్చన్
వారలు మెచ్చిన సుకవుల
కేరికి వేయేసి మాడలిచ్చి భజించున్॥ 223

ఒకటియు రెండు పద్యముల నూరకవించినఁ జాలు రాజు ని
ల్వక యిడు వేయి మాడలు సభాస్థితులైన కవీశులొప్పుచో
నకట కవిత్వమున్ దెలియనైతి నిఁకెట్లని యెక్కుఁ డర్థియై
చకితుఁడు కాక నిత్యమును స్వామిని గొల్వగ సాగె భక్తితో॥ 224

ఇదియు విచిత్ర మా జనము లెప్పుడు కోర్కెలఁ దీర్చుకొంటకై
సదయుఁ డటంచు స్వామి పద సారసముల్ తలపోయుచుందు రి
య్యది చిఱుకోర్కె దీనికయి యన్యనరున్ మఱి వేడరాదొ వాఁ
డెదియును దేల్చుఁ డర్థి యెడ నించుకయున్ మరియాద యుండదున్॥

అథముని వేడి యర్థముల నందుట కంటె ఫలింప కున్ననున్
ప్రథితుని వేడికొంటయె శుభంబగుఁ బండినఁ బండు లేనిచో

వ్యథపడు నక్కఱుండదు దయామయుఁడౌ పరమేశుఁడుండగా
ప్రథితుల నన్యులన్ గొలువ వచ్చునె దేనికి నైన మానవుల్॥ 226

వాఁ డిటువంటి మానసము వాఁడయి నిత్యము సుందరేశ్వరున్
వీడక కొల్చుచో శివుఁడు వీని నిమిత్తము గాఁగఁ జేసి య
వ్వాండి కవీంద్రకోటి కొకపాటి పరీక్షగఁ దానె పద్యమున్
బోడిమిఁ గూర్చి వాని కిడి పుచ్చెను పోయి పఠింపు మంచునున్ ॥227

స్వామి ప్రసన్నుఁడై యిటులు పద్యము వ్రాసి యొసంగ వాఁడునున్
గామిత మిట్టి తీరునని గంతులు వైచుచుఁ బోయి రాట్సభా
భూమిని నిల్చి పుట్టుకవిఁ బోలి స్వయమ్ముగ వ్రాసినట్టి వా
చా మహిమంబుతోఁప సరసంబుగ దాని పఠించి నంతటన్॥ 228

పద్యము కూర్పు వేఱు నిరవద్యము వక్త వచించు తీఱహో
హృద్యము సభ్యులెల్లరును హెచ్చిన మోదముతోడ నిద్ది వీ
వాద్యము కాదు నిర్ణయము వాని పరంబగు నంచునుండ, నై
వేద్యము పెట్టఁబోవు తఱి వీనులఁబడ్డ కువార్త యన్నటుల్। 229

"ఏమిది? పద్యమిట్లు రచియింతురె? వెఱ్ఱివో? వేఁకి పట్టెనో?
చామకు నెక్కడుండు సహజంబగు గంధము గల్గుజుత్తు? పు
ష్పామల తైల సౌరభము లట్లు భ్రమింపగఁ జేయఁ జెప్పి తీ
వీ మెయి చెప్పరాదు చనుమింటికి వచ్చిన దారి వెంబడిన్॥" 230

నత్కీరుం డటు పల్కెఁ దక్కు కవి పున్నాగంబులున్ భ్రాంతులై
యుత్కంచుం డతఁడట్టు లాడుటకు నెంతో కష్టమై యేమి యీ
చీత్కారంబని యీసడించి కొనియున్ సిద్ధాంతముం జేయకే
సత్కారం బొనరింపరాదనుచు లజ్జం బొంది రంతస్సులన్॥ 231

స్వామి ముఖభూతుఁడౌ వక్త జాఱిపోయి
ధనము చేజాఱి పోక కదనముగ నిటు
వచ్చి పైబడ్డ యవమాన భారమునను
స్వామి పొరపాటు పడియెనన్ భావము నను॥ 232

''నేను కవిగాను నన్ను నిందింపవలదు
ద్రవ్య మాశించి స్వామిఁ బ్రార్థనము సేయఁ
బద్యమున్ వ్రాసియిచ్చి సభన్ పఠింపు
మనుచుఁ బంపించెఁ బోయి యాతనికె యిత్తు.'' 233

అనుచున్ వాఁడు సకంపమూర్తియయి రాజాస్థానమున్ వీడఁ జూ
చిన వారందఱు వాఁడు సత్యము వచించె న్నాగ భావించి యే
మనునో దీనికి స్వామి యం చదరిపో నారాజు లోలో వినూ
తన దుఃఖంబునఁ గ్రుంగె రా జగుచు స్వాతంత్ర్యంబు లేకున్కికిన్॥

తన కేమో ప్రియమయ్యె డెందమున కత్యంతంబు మోదంబు గూ
ర్చెను సత్కారకృతంబు గానయిన యాక్షేపంబు కాదంట కె
ట్టి నయంబున్ బాడ సూపదయ్యె నిఁకఁ గంతేకాలుఁడే వ్రాసి యి
చ్చినదైనన్ మఱి యూరకుండు నొకొ వచ్చెన్ బెద్ద కష్టంబహో!॥

రా జట్లు తలఁచుచుండ స
భాజనుఁ డటుపోయి స్వామి పాదంబులపై
రోజుచు పడి ''నీ కేమీ
పూజలు గొనుచుంటి వచట పోఁడిమి చెడియెన్॥ 236

నీ కృతమైన పద్యమును నేను పఠించితి నిర్భయంబుగా
నా కృతమెల్ల పండినది నాయన! వంచిన శీర్ష మెత్తగా
లేకయ పోయితిన్ వినుము లేమకు నెప్పుడు కేశ సంపదన్
స్వీకృత పుష్పతైలముల చెందిన గంధమె సాజ మెట్లగున్? 237

అనుచు నె వాఁడెవండో సభయందు యథేచ్ఛగ నాడి నన్నుఁబో
మ్మనియెను, పంపితీ వనుచు నాడితి, నోడితిఁ, బెండ్లి యైనదా
యని యడుగంగ లేదు, తడవాయెను నిల్వఁగ రాదు పోయెదన్
జని బదులాడి వచ్చెదనొ చాలిది తప్పని యొప్పికొందువో?'' 238

అని వాఁడు నిలువకుండఁగఁ
జనఁ బోవుచు నుండ స్వామి చయ్యన వానిన్

జనకుండ నిలిపి రా ర
మ్మని మనుజత నతని వెంట నచ్చటి కరిగెన్॥ 239

“ఏ మొక పద్యము న్నుడివి యిచ్చటి కంపగ వాఁడెవండొ యం
దే మొ ప్రమాదమున్నదని హేళనగా వచియించెనంట యా
ధీమహితుండెవండు గతధీకుఁడు వానికి శంఖపీఠిపై
స్వామిగ నిల్చు భాగ్య మది జాఱుటచే నటు లన్నవాఁడగున్॥ 240

వచ్చిన వాఁడెవం డయిన వచ్చి యటుల్ పలుకాడినంత నే
పొచ్చెము లేకయుండినను పూర్ణ భయంబగుఁగాని దుష్టమై
హెచ్చిన పాప వేళఁబడి “యేనె యటంటిని, తప్పు తప్పగున్,
వచ్చిన దెల్ల మెచ్చుటకె వచ్చితిమో యిటు శంఖ పీఠికిన్!” 241

“తోఁచిన యట్లు పల్కుటకె తూలెదవో? యొక యింతయేని యా
లోచన యుండగా వలదొ? లోకము నం దనుభూతి బట్టియే
యోచనలుండు, స్వానుభవ మున్నది మాకు, వచించి యుంటి, మా
యోచన తప్పనం జనునె?” “యున్నది మీ కన మాకు లేనిచో”॥

“అది నీ కర్మము”, “స్వానుభూతియని మిథ్యావాదముం జేయ నొ
ప్పెదరో?”, “యొప్పిన నొప్పవచ్చు, నెటు తప్పేయన్న మాటొప్పు, ద
య్యదియున్ స్వానుభవంబుగాఁ దెలియనై వ్యర్థంబు కాకుండుటన్”
“కుదిరెంబిచ్చి శిరంబు నందిపుడు మ్రాకుం జుట్టుఁడయ్యా వెసన్.”

“వేళాకోళము వెక్కిరింతలును పృథ్వీ పాల! వాదంబు లౌ
నా? లేఖర్షభ వంద్యయౌ జనని మీనారీ శిరోరత్న మౌ
హేలామాత శిరోజగంధ మెటు మీరే చెప్పుఁ” డన్నన్ సరః
పాళిన్ విచ్చిన పద్మకోశ తతియై భ్రాజల్లి రా రాట్ప్రజల్॥ 244

ఆ పాండ్య మహిషి యచ్చట
భూ పాలకు చెంతనుండెఁ బొన్గద్దియపై
శ్రీపాలి తావయవుఁడై
యే పారు మహా మనీషి యిట్లని నంతన్॥ 245

తన కురులందు నాస గొను ధాత్రిపతిన్ గమనించి క్రొత్తయే
మనుచు నె గాలి కూడినటు లానన పద్మము నించుకంత వం
చిన నది యేమి వింతయొ హృషీకము లన్నియుఁ బ్రీత మౌనటుల్
ననలు మనోజ్ఞ గంధము లనంతము లప్పుడె విచ్చినట్లుగాన్॥ 246

'గారడి గారడి యని'న
త్కీరుం డనఁబోయె శివుఁడు కినుక వహించెన్
దారుణ తరకుష్ఠరుజా
వారితుఁడవు కమ్మటంచుఁ బలికె నదయుఁడై॥ 247

నరకిన కదళిక యాచును
చరణమ్ములఁ బడియె వ్యర్థ సాహసి నత్కీ
రరు "కృప కృప" యని వంచిన
శిర మించుక యెత్తలేక సిగ్గున మునిఁగెన్॥ 248

"కైలాసముఁ గంటివ యేన్
జాలున్ రుజ యెల్ల మాసి సత్కవి వగుచున్
దేలింతు వరవ భూమిని
కైలాస గిరీశు భక్తి కల్లోల వతిన్"॥ 249

అని దయఁజూపి స్వామి మరుగయ్యెను, లేచిన సత్కవీంద్రుఁ డ
ల్లిన గతకర్మ సూత్రముల మ్లేచ్ఛత నందినవాఁడు దుఃఖ వా
ర్ధిని బడి, బిట్టు తిట్టుకొని, తేరుచుఁ దేరుచు నెంత శీఘ్రు మే
గిన నది యంత మంచి దని గేహము వీడి చరించె యాత్రకై॥ 250

అప్పుడు రాజు నీలగళునట్లు సభాస్థలి నిల్వఁ దెచ్చి క
న్గప్పిన భక్తశేఖరుని కానుక లిచ్చి భజించి కొంటయున్
గుప్పున వాసనల్ విరియు కోమల పద్యము చెప్పి వచ్చి క
న్విప్పిన సుందరేశ్వరుని వేడుకతో భజియించి కొంటయున్॥ 251

చెప్పగ వలెనే వేఱుగ
నప్పూరి నానాటి నుండి యా ప్రభు వన్నె

త్రిప్పుల నుడి పెడి తల్లికి
గొప్ప పయిన్ వెలుఁగు పుష్ప గుచ్ఛం బయ్యెన్॥ 252

భావి తరంబుల వారికి
నీ విధి నెఱుఁగంగఁ జేయు నిచ్ఛ జనింపన్
భూ విభుఁ డయ్యాకును గొని
దేవాయతనంబు నందె దివ్యత తెలియన్॥ 253

కాచ మంజూష నుంచి యాగాథ యెల్ల
నెఱుఁగఁ జెప్పెడు పంక్తి వ్రాయించి పెట్టి
భద్ర పఱచెను కొన్ని సంవత్సరములు
అయిన నేమాయె నది పత్ర మగుటఁ జెడియె॥ 254

అప్పుడే కొందఱిది కల్ల యన్నవారు
లేక పోలేదు నేఁ డట్టులే యనెదరు
స్వామియే వ్రాసె ననుటకు సాక్ష్య మేమి?
అతని దస్తూరి యతనిదే యనుట యెట్లు? 255

నమ్మిక యుండగా వలయు నమ్మిక పోవుటయున్ గుణంబె యా
నిమ్మహి మొత్తమంతయును నెట్లును కల్లయె; మూల మందునన్
నమ్మిక యుండనొ, నదియు నమ్మఁడు పో, తనుదాన నేమియౌ?
నిమ్మన నుండి లేననుట యెట్లు పొసంగును తాన సత్యమై॥ 256

ఎక్కడి మధురా పురవర
మెక్కడి కైలాస నగము నెట్టులు కనెదన్
పిక్కటిలి పాడు రోగము
స్రుక్కక మును వడిగ నేగి చూడగ వలయున్॥ 257

స్వామి దయాసముద్రుఁడయి సాకుచునుండె గ్రసింప దింతకున్
బాము, తరించినాఁడ బలు వాహినులన్ మెల మెల్ల నెన్నియో
యీ మును నిల్చి నట్టిదిది యీశ్వర మానికి మాళివాల్చు నా
ధీరు హితుండు వింధ్యమగుఁ దేకువ దాటుకొనెన్ బ్రమాదమున్॥

ప్రామిన కన్ను గప్పికొని వచ్చి యథార్థము చూడకుండు శే
షామయి కాటు వేసినది వచ్చిన వాఁడెవఁడో యెఱింగియున్
బ్రామికుల్ పఠించియును ప్రల్లదముల్ పలుకంగ నేల నే
నే మని యంటి స్వామి, నటు లేచియు ప్రాణము లుంట ధన్యుఁడన్॥

పట్టిన పట్టు వీడ కటు పట్టగనౌ నెదొ దోషమంచుఁ జూ
పెట్టి వృథా వివాదమున వీఱిడి నైతిని మత్సరాన ప్రా
ల్గిట్టె యెదో వచించితిని గీడు తొలంచెను సైచి కాని చో
నిట్టు లిటన్ జరించుటయు నెట్లొన గూడును దూరమందునన్॥ 260

గంధగుణంబు పృథ్వి దగు తొల్మొధర మందది సారభూతమౌ
బంధుర శీతశైలమునఁ బట్టగ రాదది వత్సమై పయ
స్సింధువు గ్రోలుటన్, గిరిజఁ జేరిన దయ్యది, యామె తల్లి యా
సింధుర యానకున్ గురులు చెప్పక యే గురుగంధ వల్లువౌ॥ 261

అంత సుసంగతార్థముగ నల్లిన పద్యమునందుఁ దప్పటం
చెంత వితండ వాదమును చేసితి స్వానుభవ ప్రశంసకున్
బంతము పూని ప్రేలితిని, బట్టిని దియ్యది, యెన్నినాళ్ళ లీ
చింతను గుందగా వలయుఁ జేరుదు నెప్పుడు శీతశైలమున్॥ 262

దూసిన బాణ మన్నటులె దూసుక వచ్చెను దారి వెంటఁ జే
ర్మోసిన దేవతల్ గలరు మోడ్చి కరంబులు మ్రొక్కుకొంచుఁ గై
లాసము చూచి రోగము తొలంగిన పిమ్మట వచ్చి చూచెదన్
వాసిగ సైపుఁడంచు నను వత్సలతన్ దయఁజూడుఁ డంచునున్॥ 263

అతఁడటు వచ్చి వచ్చి సదయాంబువు గంగను దాటి పిమ్మటన్
గుతలము నంటి ప్రాకి చను కూర్మము వోలెఁ జరించు చొక్కచోఁ
జతికిలఁబడ్డ వాఁడయి విశాల వటం బొకఁడుండ ముంగటన్
గుతుకముతోఁ గనుంగొనియె కొండొక వింతను దేహ విస్మృతిన్॥

ఆ పెను మఱ్ఱి యాకులవి యాని మహిన్ విహగంబులైన దూ
రాపతితంబులై జలము లందున మీనము లౌచు నుండి మే

లై పడె నొక్క యా కటు జలంబున సాము స్థలాన సాముగాఁ
జేపయుఁ బిట్టయై యెటుల చెందక కీడ్వడు చుండె నద్దియున్ ॥ 265

వింతలలోన వింతయని విస్మృతితోఁ బరికించుచుండెఁ దా
నంతటి మాని సయ్యును విహాయస మందునఁ దేలె నెవ్వఁడో
చెంత గుహాప్రదేశమునఁ జేర్చి శిలాప్రతిబంధముంచె నా
యంతిక మందు నున్న జనులందఱు గొల్లున గోలపెట్టగాన్ ॥ 266

తా నొక్కండట చేరి వంద యగుటన్ దద్రాక్షసుం డందఱున్
బోనం బాడగఁ దానమాడుటకునై పోయెన్ మరే మున్న దీ
ప్రాణంబుల్ క్షణ ముండఁబో వనుచు నాక్రందించు నవ్వారికిన్
మానం బుత్తర మిచ్చి హృత్కమల సీమన స్కందు ధ్యానింపఁగన్ ॥

క్షిప్రగతిన్ బ్రసన్నుఁడయి కీడు తొలంచెను స్వామి రాక్షసున్
విప్రియు నొక్క దెబ్బ కటు వీగి పడన్ హతమార్చి శైల మం
ద ప్రియతన్ గుమారి వెడు నందఱకున్ శుభమబ్బఁజేసె మం
దప్రభ వాడియున్న కవితా వనచారి విచార హేతువున్ ॥ 268

వివరముగా నెఱింగి యొక వీక్షణమున్ బ్రసరింపఁజేసి నీ
వవశత నంది యుంటి విది యద్భుతమా కొల నిందు భక్తితో
శివవిభు సంస్మరించుచును జేయుము స్నానము స్వామివాస మం
దవనము నందఁ జాలెదవు నార్తి దొలంగెదు వందు సౌఖ్యమున్ ॥

అని యెనో లేదో మేనగల వ్యాధి యడంగిన యట్టులై వడిం
జని మునుఁగన్ జలస్థలిని జన్మము వేఱొకఁ డంది నట్టు ల
య్యెను దల యెత్తి చూచుసరి కెట్టెదుటన్ గనుపట్టి దక్షిణా
యనగత శంభుశైల శిఖరాంచల మావిభు మారు మూర్తియై॥ 270

శంభో! మహాదేవ! స్వామీ! జగన్నాథ!
స్కంద ప్రియా! దేవ! శరణు శరణు
సర్వార్తి సంహార! దుర్వైరి భంజన!
జ్ఞాన ప్రసూనేశ! శరణు శరణు

ముక్తి ప్రదాయకా! భక్త వశంకరా!
కరుణా ప్లుతాపాంగ! శరణు శరణు
దక్షాధ్వర ధ్వంస! కుక్షిస్థ బహువిశ్వ!
గిరిజా మనోహరా! శరణు శరణు

నిన్ను శరణంటి నన్ను మన్నించు స్వామి
తప్పు చేసితిఁ జేసితిఁ దప్పుగాచి
చెప్పు మోయించి కొనినైన విప్పి ముడుల
ముప్పు తప్పించి లోనిప్పు ముట్ట నిమ్ము!! 271

అనుచునె తనువున రోగము
కనఁజాలని కవిమణి మణికర్ణిక లోనన్
మునిఁగి మునిఁగి వెలువడియెను
దినమణి శతకోటి దివ్య దీధితు లొప్పన్ ॥ 272

ఆ పగిది శివస్కందుల
ప్రాపున దురితాబ్ధి దాటి పావనమతియై
యీ పర్వతంబు విడువక
యేపున శ్రీకాళహస్తీశ్వరుఁ గొలిచెన్ ॥ 273

భారద్వాజుని యాశ్రమ
మీ రౌప్య నగంబులోని యిరుకొండలలోఁ
దీరిన లోయను గల దది
వారించు నహీన తాప వారము నెల్లన్ ॥ 274

అచట మనోహరంబగు జలాశయ మొక్కటి నిత్య పద్మినీ
ప్రచురము స్వచ్ఛమై యెసఁగు స్వామికిఁ బూర్వము తెప్పయుత్సవం
బచటనె సాగుచుండినది యయ్యది మిక్కిలి శాంతమైన చో
టచట నెవండుగాని హృదయంబున మున్గి తరింపఁ గల్గెడిన్ ॥ 275.

లో బావి యందు రిప్పుడు
జీబులు జీబులుగ పెనచు జీవన సరణిన్

బై బరువు క్రుంగఁ జేయగ
నా బరువంతయును దీరు నచ్చట నున్నన్॥ 276

నత్కీర మహాకవి కట
హృత్కోశము విచ్చినట్టి హేవాకముమై
సత్కవిత జాలు వారెఁ జ
మత్కార సుధామయూఖ మందిర మగుచున్॥ 277

నిత్యము స్వర్ణదిన్ మునిఁగి నిష్ఠను స్వామి భజించుకొంచు దా
ర్గత్యము నంది బాధపడు కష్టులకున్ శరణం బొసంగుచున్
ప్రత్యయమొప్ప వేడికొను వారలకున్ హితమున్ వచించుచున్
నిత్య సుఖంబు నెప్పటికి నేని గనన్ వలె నంచు నెంచుచున్॥ 278

ఎన్నో సిద్ధులఁ జూపి సిద్ధు లనియే యీనాట విఖ్యాతుఁడై
కన్నీ రింకఁగఁ జేసెఁ బల్వురకు సౌఖ్యం బబ్బగాఁ జేసె నా
సన్న శ్రీయుతుఁ డా మహాత్ముఁ డటులే స్వామిన్ బ్రసన్నాత్ముగా
విన్నాణంబునఁ జేసికొంచు మనియెన్ విజ్ఞాన వారాశియై॥ 279

అందికొన్న పదంబు నాది యందుంచిన
నందాది యందు రా యరవ బాస
నది ముక్త పదగ్రస్త మయ్యెడు మన బాస
నందాది శతము నానందమునను
కాళత్తి పాదంబు కైలాస పాదంబు
గాఁ గూర్చె నిరు సమఖండములుగ
దక్షిణోత్తర శైవ ధరణీధరేంద్రమ్ము
లవి రెండు సమమన్న స్వానుభవము

చాటి చెప్పిన శివకవి స్తబక మందు
ఘనత గాంచెను నత్కీర కవి వరుండు
అతని యందాది కంఠస్థమై జపించి
సిద్ధి నందిన వారె ప్రసిద్ధు లయిరి॥ 280

నూరందాదుల నొక్కటొక్కటియు నిన్నున్ స్వామి సాన్నిధ్య మం
దారం జేర్చు మహత్త్వ మొప్పినవియై యత్యంత మోదావహా
స్ఫారార్థ ప్రతి పాదకంబు లగుచున్ భద్రంబులై వెల్గు న
తీక్కరుం డా మహనీయ పద్యకృతి ముక్తింగూర్ప రాజిల్లెడున్॥ 281

కొమ్ముం బూరలు శంఖ కాహళములున్ గూహూ పిక స్వానముల్
తమ్మాటమ్ములు ఝల్లరీ పణవ మార్దంగాది వాద్యమ్ములున్
గుమ్మల్ గుమ్మలుగా ధ్వనించి లహరీ కోలాహలం బయ్యె నా
సమ్మోదమ్ము భజించుచున్ జనియె విశ్వస్వామి భక్తౌఘముల్॥ 282

జయ జయ శంకర! శంభో శంకర!
భవ భయ సంహర! భక్త శుభంకర!
జయ ప్రళయకర! జయ త్రిపుర హర!
జయగంగాధర! శంభో శంకర!
పాప తిమిర హర! తాపత్రయ హర!
శాప పాశ హర! కోప తాప హర!
హరహర! హరిహర! హరహర! హరిహర!
జయ జయ శంకర! శంభో శంకర! 283

## యాత్ర సాగి ధర్మరాజుల గుడి చేరుట

సాగినది యాత్ర జనమహా సాగరమ్ము
పూర్ణిమా చంద్రుఁ జూచి యుప్పొంగినట్లు
వారి యుత్సాహ కల్లోల వారములను
తేలియాడెడి హంసయై శూలి యేలె! 284

వెలమ పాలెమ్ములోని గవెళ్ళవారి
పందిరిని జేరి మరల సపర్య నందె
వాహకులకు విశ్రాంతి లాభంబు కలిగె
వార్షికంబగు స్వామి సపర్య చెల్లె॥
ధర్మరాజుల గుడి యదె దాని ప్రక్క
స్వామి శైలమ్ము వెన్నంటి సాగుదారి

వెంబడింబడి సాగును విశ్వపతియు
నిచటి చెరువాక శోభ యూరేగు వేళ॥ 286

ద్రౌపదియు ధర్మరాజులు
భూపతి వంశానఁ బుట్టి పుణ్య చరిత్రుల్
శ్రీపతిఁ జేరెడు తెరువున్
జూపించిరి బ్రదుకు బరువు చోక్కులఁ బడియున్॥ 287

వారిని భారతంబున నవారిత భక్తి భజించు సమ్యగా
చారము జాతి కబ్బినది సాగదు జీవిత మెట్టి వారికేన్
బారుగ నొక్కరీతి దిగువంబడి లేచుచు సాగగా వలెన్
భార మదెంత ఘోరమగు పట్టుల నైనను ధైర్య మొప్పగున్॥ 288

కలిమియు లేమియున్ బగటి కాలము రాత్రియు నన్న యట్టులే
కలుగును పోవు నేదియు నఖండితమై నిలువంగబోదు ధీ
రులు కలఁగంగఁ బోక విసురుల్ వడి పొంగుచుఁ గ్రుంగు వార్ధి పొం
గుల జలకంబులాడు బలుగుండియ లట్లు చరింతు రెప్పుడున్॥ 289

ధీరత యొండె రక్షకము ధీరుల దైవము ప్రోత్సహించు నె
వ్వారు బిభీషికల్ గని లవంబును తాళగలేని యల్పులై
భీరువు లౌచుఁ గూలెదరొ వేరును వారి సముద్ధరింపఁగా
లేరు ప్రపాతమందిన బలీయతకుం దగ బ్రుంగుటే యగున్॥ 290

నిప్పులో కాళ్ళ తిప్పలో వనీమృగ భీకర గర్జనలో మరిన్
విప్పగరాని చిక్కులో యె వేనియు నిర్భర ధైర్య శాలి ముం
దప్పడ మట్లు చప్పనయి యడ్డువు వాని పురోగతిన్, దెసల్
గుప్పు పరిమళంబువలెఁ గోరి యడంగియు విప్పు నెల్లెడన్॥ 291

ఈ పరువంబు తెల్పుటకె యిచట నాడి నెలన్ బరాత్పర
ప్రాపక వహ్ని గుండమును బారులు గట్టి సహస్ర సంఖ్యలన్
మాపున మట్టి ముట్టినటు మాన్య మతుల్ పదముంచి దాటుచున్
శ్రీపతి గుండె కాపయినఁ జెందదు చేటని చాటుటయ్యెడిన్॥ 292

# తెల్ల మంటపము - శివనాథపురము

చని చని స్వామి యచ్చట ప్రసన్నత నుండిన తెల్ల మంట పం
బునకు ముదానఁ జేరికొనెఁ బూర్తిగ నద్ది బయల్ ప్రదేశ మెం
దున గన సస్యజాతములతో వెలుఁగొందెడి భూ లంతాగియే
వెనుకను వెండికొండ నిడివిన్ బ్రభవించిన దివ్యతేజమా॥ 293

బారెడు పైకి సాగి రవి భాను సుమమ్ములు చల్లి స్వామి కిం
పారెడు పూజచేయుచు విహాయసమున్ వెలిఁగించుచుండె నూ
రూరి ప్రజా సమూహములు నోపికతోఁ దమదాక వచ్చుఁగా
మారి ననంతభక్తిమెయి నర్చితుఁ జేసె మహాతిథన్నటుల్॥ 294

కొండకు చుట్టు దూరముగ కొండిక పల్లియ లెన్నొ యున్న వా
దండకుఁ బోఁడు స్వామి మరి దారికి వెంబడి నిట్టి మంటపం
బుండ నొకింత వేచునది యూళుల వారికి స్వామిఁ గొల్చుకో
దండిగ మ్రొక్కికో నదను దత్పరులై కనుచుంద్రు వేచుచున్॥ 295

నతులు నుతుల్ విలాసముగ నవ్వుచు గైకొని స్వామి సాగి సం
తత తరురాజ రాజి శివనాథ పురంబును జేరికొన్న వ
ర్ధిత జనసంఘమున్ గనఁ బురే! పురమందున నింతమంది స
న్మతు లెట నుండి రన్న విసుమానము గల్గును మాయునంతటన్॥

అట నొక యూరు లేదు మును వచ్చట నొక్క శివాలయంబు ముం
గిట నొక బావియుం గలవు కేంద్రముగా నది చుట్టు నెన్నియో
విటపులు కొల్లలై పథిక విశ్రమ హేతువులై చెలంగు స్వామి ము
చ్చట పడు వట్టి యప్పుడును శాంతులు పోయి వసింతు రచ్చటన్॥

పది పదునైదు పల్లియల వారు సమష్టి కృషిన్ బసందుగా
నొదవగఁ జేసిరద్ది యిపుడూరును నైనది కొద్దిగా పదే
పది గడపల్ కనంగనగు స్వామి యటన్ వసించి ముందు నె
ట్టెదుటను గానవచ్చు స్వ గిరీంద్రము చూచుచుఁ దన్మయుండగున్॥

నాట్యమ్ము సేయవయ
దివ్య సుందర దేహా!

కామమ్ము నశియింప క్రోధమ్ము నడగింప
మోహమ్ము తొలఁగింప బోధమ్ము కలిగింప॥
వదనమ్ము విలసిల్ల హృదయమ్ము వికసిల్ల
మదిలోన కళలెల్ల ముదమార ప్రభవిల్ల॥
తనువెల్ల పులకెత్త పెనుభక్తి మొలకెత్త
గుణములు చిగురెత్త తెలువులు తలయెత్త॥ 299

## కైలాస గిరి వర్ణనము

నాలుగు క్రోశముల్ నిడుపు నాగమువోలెఁ బరుండి యున్నదీ
శైలము ప్రాక్ప్రతీచులకు సాగిన దివ్యమనోజ్ఞ కాయమై
మేలగు శీర్షముల్ మిఫుల మేలగు లోయలు మేలి బుగ్గలున్
మేలి గుహా ప్రదేశములు మేకొని సాధు సమర్చ నందెడిన్. 300

తను వఖిలమ్మునన్ నిఖిల దైవతముల్ ఋషులున్ దపస్వులున్
నిలిచిన భక్తిఁ జేరుకొని నిల్చుట నెవ్వరి కేని వంద్యమై
తనరిన వృక్ష సంతతుల ధాతు చయమ్ముల రమ్యదృశ్య మో
హనతను నెల్లవారలకు హాయిని గొల్పుచు నంద్యమయ్యెడిన్॥ 301

ఇపుడే యింత మనోహరంబయిన నాఁ డేన్గుల్ భుజంగమ్ములున్
దపముల్ సేయు పవిత్ర కాలమున శాంతస్వచ్ఛ కాంతార వా
సపు సౌభాగ్య మదెట్టు లుండెడిదొ? ఈ శైలంబు వేదాత్మకుం
డెపుడున్ నిల్చి తపం బొనర్చెడి స్థలంబే యందు రుర్వీసురుల్॥ 302

అది చతురోక్తి కాదు పరమాదర మొప్ప నిజంబు చెప్పుచున్
విదిత మహత్త్వ మం దనుభవించిన శాంతి నెఱింగి చెప్పుచే
యెదకట కల్గు నిబ్బరము నెంచినఁ బుల్కలు తేరు మేను వ
చ్చెదనని పోయి రాఁగలవొ చేరుచునే మది కందు తత్త్వమున్॥ 303

దేవుఁడె వేదమై యదియె దేశము సర్వము నేచునుండ నా
దైవము తానె మోజుపడు తావులు కొన్ని ప్రసిద్ధి నంది స
ద్భావమునన్ దదాప్తిఁ గనువారికి స్వీయవిశేషమెల్ల తా
నై విదితం బొనర్చు మహిమాతిశయంబునుఁ జూపుచుండెడిన్॥ 304

స్వానుభవాప్యమా జగము నందున నీ యనుభూతి యొక్కఁడే
వానికొ చెప్పి చూపుటకు వాలదు వేరికి వారు తాముగా
స్వానుభవంబునన్ దెలియ వచ్చును దానికిఁ జిత్తశుద్ధితోఁ
దానుగ తత్త్వమున్ దెలియు దారి వసించు టవశ్య మయ్యెడిన్॥ 305

ఈ గిరి నెందఱో తనువు వీగిరి ముక్తి పదంబు నంది రా
యోగులు తా మెఱుంగక యె యున్న స్థలంబులు కొన్ని కొన్ని యే
లాగున నైన నేటికిని లక్షిత మౌచు నెఱుంగ వచ్చెడిన్
త్యాగ మహత్త్వ మెంతటిదొ తానయి విప్పును సర్వమర్మముల్॥

ఒక చెట్టు నొక గుట్ట యొక చిన్ని జలయూట
యొక మరుంగగు చోటు నొక్కపడియ
యొక కొన్ని లింగంబు లొక కొన్ని చిఱుగుడుల్
యత్నించి తెలియంగ నైన గుహలు
ప్రతిపదంబున గానవచ్చు నీ గిరియందు
నెవ రెవ్వరో తరియించి రిచట
ననుచుఁ జెప్పుచు నుండు నా కథల్ వినుచుండి
యచ్చోటులను నిల్చి యవు నటంచు

స్వానుభవమునఁ దెలియగా వచ్చునిచట
తన్ను సేవించు భక్తసంతతుల యెడల
దైవమిట వాలినంత యే తావులందు
వాలి వచ్చుట యెఱుఁగ మీ భరతభూమి॥ 307

## వ్యవహారస్వరూపము

ఎంతటి స్వచ్ఛ సత్యమది యెవ్వరు చెప్పిన శుద్ధ కల్పనం
బింతయు వట్టిమాటలని హేళన సేయుట నేఁడు కందు మం
తంత జగత్ప్రసిద్ధి కల యాది కవీశ్వర కీర్తితుండె నేఁ
డెంతయు నమ్మరాక చెడిపోయెన్ జెడిపోయిన లోకమంతకున్॥ 308

వార్తయందద జగము వర్తిల్లుచుండగ
వార్త నమ్మనట్టి వాఁడెవండు

వ్యావహారికమును వద్దు వద్దని వీడి
పారమార్థికంబు పట్టువాఁడు॥ 309

వ్యవహారంబున మెలఁగుచు
నవనీగత సర్వమెప్పు డవసర మగుచున్
వ్యవహారక మెఱుఁగక వచ్చినఁ
జెవిఁబెట్టని వాఁడు చాల చిక్కులు పడెడిన్॥ 310

బహుదూరంబున పుత్త్రుఁడున్నపుడు దుర్వార్తన్ వినంగానె తం
డ్రి హఠాద్దుష్ట కథా శ్రుతిన్ మడియుటల్ డీల్వోక వాఁడుండుటల్
బహుచిత్రమ్ముగ వించునుందు మటులే వాఁడచ్చుటన్ జావ ధూ
ర్వహమై యద్ది యెఱుంగ రాక యిట నవ్వానిన్ బ్రతీక్షించుటల్॥

సత్యము సత్యమే బ్రదుకుఁ జాలున వార్తయు వార్తయే కదా
సత్య మెమైననున్ గపట సాక్ష్యముగాఁ జెడువార్త జీవలో
కాత్యయ హేతువై ప్రబలమై పనిచేయుచునున్న దట్టులే
ప్రత్యయ హేతువై ప్రియ సువార్తయు జీవుల మన్చు నెప్పుడున్॥

అగుట యథార్థమై జరిగెనా యది కల్పితమా యటన్న వా
ద గతిఁ బరిత్యజించి వినదగ్గ శుభంబిది దీని నమ్మచో
నగును శుభంబు నా కనుచు నాగతి నేగి శుభంబు లందుకో
ద్విగుణముగాగ శ్రద్ధ వినుతించుట యొప్పు శుభాస్పదంబులన్॥ 313

## పనసకోన

పశు విశసన మెప్పుడో మును
ప్రశమిత కాముండు వేదవిధి వర్తనుఁడై
విశదముగ జగతి కంతకుఁ
గుశలము కలిగింపఁజేసెఁ గోరిన వందెన్॥ 314

పశు విశసన మనుమాటయె
విశదముగాఁ బలుగ లేని విశ్రుతు లగుటన్॥
శశ సల గజ బిజ యేలని
విశదముగాఁ బనసకోన విశ్రుత పఱుపన్॥ 315

నేటి జనాళి కియ్యదియు నిక్కముగా శుభమబ్బఁ జేసె న
ప్పాట విధిప్రచోదిత సుపర్వ మనఃప్రియ యజ్ఞ కర్మముల్
మాటువడంగ నేటి కభిమానము నందియుఁ జేయఁజాల మ
ల్లాటఁ బ్రసిద్ధమౌ పనసలబ్బెడి వంచుఁ దలంచు టొప్పగున్॥ 316

పనసను బోలు పండు కనుపట్టదిఁ కొక్కఁడు తియ్య తల్లి యా
దినుసగు బిడ్డలందఱును దివ్యలు తుష్టిని పుష్టినిచ్చి క
మ్మని రుచికల్గి భోజనుల మంతురు మన్నల మాట యెత్తినన్
ఘనులు గుణాకరుల్ మణి నికాయము కంటెను మేలి వారలున్॥

తండ్రి బరబర యగుట విదగ్ధుఁడగుచు
మెత్తనయి యెల్లవారలు మొత్తకుండఁ
దన్ను తాఁగాచు కొనుట కౌతత్త్వమంతె
పండు పండన్న తద్బృహత్ఫలమె ఫలము! 318

పనసలు సారభూములనె పండును పండిన వేద పండితుల్
పనసలు తించు పుష్టిగల బంధుర కంఠము లొప్పి చక్కగా
పనసలు చెప్పికొంచు విధి వంచితు లౌచునె దాని నిల్పుటన్
మనుజత యెట్లు సార్థకమొ మానవజాతి యెఱుంగ నయ్యెడిన్॥ 319

పనసల నెన్ని భేదములు? పచ్చగ పండియు ముక్క విర్గు నా
తొనలు గలట్టి కొబ్బరి వతుల్యము, లన్నియు నట్టులుండ, వా
నిన దిగజాఱి పోవునవి, నిల్చెడివిన్ మఱి పీచుసాగు వ
ర్తనమున నిల్వరించునవి, దారికి రానివి, కూర కైనవిన్॥ 320

ప్రమానునఁ బుట్టు కాడఁబడి మానుగ కాయలు కాచుకొన్ని, నే
లానెడు నట్టి యెత్తుననె యా పని చేయును కొన్ని, వేరునన్
బూనికఁ గాయకాచి పొలుపున్ గని నేలను చీల్చి వెల్వడన్
దేనెలు కార్చుకొన్ని య విధిన్ గనఁజాలము వాని నిచ్చటన్॥ 321

పనసలతోఁ బడిపోయెను
పనసల నాగరకతయును వనసల కోనన్

గనిపించునవి ఘనమ్మగు
తినుటకు మరి పనికిరాక తీరిన బండల్॥ 322

పండులు పోయిన యందుకు
బండలు మిగిలినవి చాలు వాని పయిఁ జనుచుండన్
మెండుగ వెనుకటి పనసల
పండుల వాసనలు వచ్చు భావజ్ఞులకున్॥ 323

ఆ పనస కోన వెంబడి
లోపలికిం బోవఁ బోవ లోయల లోనన్
ప్రాపగు తీర్థము లెన్నియొ
తేఁపకుఁ దేఁపకును దగులు తెరువరి గమికిన్॥ 324

వాయు లింగంబునకుఁ దూర్పు భాగమందు
మూఁడు ఘడియ లేగిన వచ్చు ముఖ్యమైన
దర్శనీయ ప్రదేశ మీ ధరణిఖండ
మమిత శుభదంబులైన తీర్థములు కలది॥ 325

స్వామి శివనాథ పురమణి స్థగితుఁడగుచు
నిలిచి యుండంగ భక్తు లున్నిద్ర మతులు
పనస కోనను గల తీర్థమణులఁ గొలిచి
మరల నడబావి కడ స్వామి దరియఁగలరు॥ 326

## హర హర తీర్థము

హర హర తీర్థమున్న దిట హాయిని గొల్పు రహః ప్రదేశ మం
దురలెడి రమ్య వాః కణము లూడ్చును పాప కళంక మంతయున్
శిరసు పయిన్ శిలావటము చిక్కని కుచ్చుల సన్నవేళ్ళ ని
ర్ఝరముగఁ బోయగా హరహరా యని దోఁగద రెల్ల భక్తులున్॥

ఇట విద్యేశ్వర లింగ మొ
కటి యున్నది బహు విశేష కలితము దానిన్
బటు భక్తిఁ గొలిచి యింద్రుఁడు
నిటలాక్షుని కరుణ శత్రునిం బరి మార్చెన్॥ 328

అందుచే నింద్ర తీర్థమై ఖ్యాతిగాంచె
భవుని గొల్వంగ నీరమ్ముఁ బడయు పొంచె
వజ్రి వజ్రాన శైల గర్భంబు చీల్చి
ప్రకట మొనరింప వజ్ర తీర్థమ్ము నయ్యె॥ 329

ఎగువకుఁ బోయి చూడ రవి యేగిన జాడను గాన రానిచో
నిగనిగ లాడుచున్ దొరలు నీరములున్ దట మందె లింగమున్
దగగొని యున్న యట్లై గని దండవిధిన్ బ్రణమిల్లి లేచుచున్
నిగమ శిఖైక వేద్య కమనీయ దయా వనధిన్ మునుంగుచున్॥ 330

పులకలు దేరు మేనులను పొంగుచు వత్తురు భక్త లెల్లరున్
దలఁపులు స్వచ్ఛమౌను, పెను తాపము లన్నియుఁ దీరిపోయి యి
య్యల నిట నెంత కాలమును నీశ్వరు గొల్చుచు నుండి పోవఁగాఁ
తలఁపు జనించుఁ దన్మయతఁ దాల్తురు శాంత శివ స్వరూపులై॥ 331

లింగం బిదియు స్వయంభువు
పొంగెత్తెడి భక్తిసిద్ధముని పుంగవు లీ
లింగంబు గొలుచు కతన వె
లింగెన్ మరుగునను సిద్ధ లింగం బనుచున్॥ 332

ఆ పిమ్మట హర హరుఁడను
బాపఁడు పెనుభక్తిఁ గొల్చి వరివస్య మొయిన్
శ్రీ పార్వతీశుఁ గలియుట
మోపై గనె హరహరాఖ్య ముచ్చట పడుచున్॥ 333

శివభక్తి కలుగు టబ్బుర
మెవరికొ బహుజన్మ పుణ్యమే పందగ నే
చివరి జన్మ మందు నొ
భవ మూడ్వగ వచ్చునంతె భవ హరు కరుణన్॥ 334

హర హరు జీవయాత్ర కడు నద్భుత మైనది వాని జన్మకీ
శ్వర కృప ముఖ్య కారణము వాఁడు తనంతట తాను భ్రష్టుఁడై

బరి తెగి సర్వ పాపములు పంతము పూని యొనర్చి యెంత యో
పరమ నికృష్ట యోనులకుఁ బొల్పడి యిట్లగుటే విశేషమా॥ 335

తొలు దొలుతన్ విధూతమతి దుష్టుఁడు వాఁడు జనించెఁ గోసలం
బుల నొక బ్రాహ్మణుం డగుచుఁ బూజ్యత కోల్పడి జాతివారిచే
వెలివడి ముంజకుండనఁగ పేరును మార్చి శివాలయంబునన్
గొలువునఁ జేరి దొంగయయి కోవెల సొమ్ములు తస్కరించుచున్॥

త్రాగుడు జూదమున్ వెలఁది తక్కువయే యనిపించు సర్వ దు
ర్యోగము లందునన్ దగిలి రోగము లన్నియుఁ జుట్టుముట్ట నా
నాగ ఫలమ్ముగా నిచటె నారక యాతన నంది చచ్చి యెం
దేగెనొ చెప్పరాదు వచియించుటకే కడు కష్టమయ్యెడిన్॥ 337

ఒకపరి మానవుండయిన నూర్ధ్వగతిం జనుచున్న జీవుఁ డం
తకు దిగజారఁ డెంత పతితత్త్వము నందిన నంచు నేటి చిం
తకులను చుందురా పగిది తప్పు జనించు నికృష్ట యోనులన్
వికృతులు వేన వేలు కనిపింతురు సర్వ పురాణ సంతతిన్॥ 338

కాకియు గ్రద్ద యాచు గిజిగాడును గూబయు నై జలూక మై
నైక జనుస్సులన్ బడసి యిన్నియు నెట్టులొ యైన పిమ్మటన్
ప్రాకట దుష్ట కృత్యముల వారిగఁ జేయగ నైన బోయయై
యేకడ నెన్నఁడున్ వినని హేయము లెన్నియొ చేసి చచ్చినన్॥ 339

కరభుఁ డనన్ యముండనఁగఁ గ్రాలిన క్రూరుఁడు తీవ్ర ఘోర భీ
కర నరకంబులన్ బడియెఁ గాయము లెవ్వియు నిల్వలేని దు
ర్భర తర శిక్షలన్ బడయు వారలు వానిని పొందుచుండ్రు రా
పరమ దురంత యాతనలఁ బొల్పడఁ జేసెడి రౌరవాదులన్॥ 340

దురితము లెన్నియుండు తతితో నవి తెచ్చు ఫలంబు లిచ్చు నా
నరకము లన్నియున్న యవి నారకులై వెలువడ్డ వార లె
వ్వరొ యపురూప మయ్యెది శివద్రుహుఁడైన యుగంబు లెన్ని కో
ట్లరిగియుఁ దీరదా యఘము నట్లతఁడా ఫల మందుచుండఁగన్॥ 341

నరజాతి బహు విశిష్టము
దురితపరుల్ చెప్పరాని దుష్టుల యట్లే
పరమేశ్వర సమ్ములై యురు
కరుణామయు లుండు చుంద్రు కాయమ్ములతో॥ 342

సానంద యోగి చంద్రుని
స్వానంద మహస్సు పొంగి యత్యద్భుతమై
తా నందు మేలు తనతో
మైనందిన జీవతతి సమస్తము నిపుడే॥ 343

పొందుంగా కని పోయిపోయి యమునిం బూజించి ఘోరంబులై
యిందున్నట్టి దురంత నారకములందే వార లెట్లుండిరో
సందర్శింపఁ దలంచి వచ్చితిని వాత్సల్యంబునన్ జూప వే
యందుం బోయిఁక మత్కృతం బఖిల జీవానీక మస్మన్మతిన్॥ 344

అనినన్ స్వామి! భవత్కృపా జలధి యిట్లై పొర్లుటల్ వింతయే
మునుచున్ దర్శనమున్ గృతంబు బడియేయా నట్టి దెందున్ భవత్
ఘన శీలంబున లేశముం గనఁ గనంగాఁ జేయుటెట్లన్నఁ బ్రా
ర్థన మేనై పొనరించు చుంటి గద కోర్కన్ జూపరాదో యనన్॥ 345

నీకుం జూపిన నాకు దోషమగుఁ దంద్రీ! వద్దు వద్దంచు సు
శ్లోకుం డా యముఁడెంత కాదనిననున్ లోకాతి లోకోల్లసత్
ప్రాకామ్యార్ద్రి మనస్కుఁడైన ముని మ ద్భవ్యోక్తిఁ దద్భితి నీ
కే కొంచెమ్మును నుండఁబోద యిటు రమ్మా! నాకుఁ జూపింపుమీ!॥

అనుచునె వెంటఁ బెట్టుకొని యన్నియుఁ జూచుచుఁ జూచిచూచి యం
దునఁ గల జీవు లందెడి సుదుస్సహ వేదనలం గనుంగొనన్
మనసు ద్రవించి బిగ్గరగ మాటికి మాటికి శైవ మంత్రమున్
వినఁబడఁజేసె నెల్లరకు వించునె వారలు ముక్తులై చనన్॥ 347

ఆ పరమాద్భుతంబు గని యా రవి పుత్త్రుఁడు స్వామి స్వామి యీ
పాపులు సర్వులిట్లు విడువంబడుటంతయు మీ మహత్త్వమా?

మీా పతియించి నట్టి పరమేశ మహామనురాజ సత్ఫలం
బా? పలుకాడి సందియము బాపవె యంచుఁ గృపాబ్ధి వేడినన్॥ 348

నాకొక మహత్త్వ మెట్లు
య్యా కలుగును శివ మహిమమె యట్టు లొనర్చెన్
లోకులు తెలియగ లేగ్గా
కీ కిటుకు శివుని తలఁచుటయే యఘ ముడుపున్॥ 349

సరి సరి యింకనున్ గలవొ సాగుము చూత మటన్న ధర్ముఁడ
వ్వరముని నట్టె చూచి యొక పాపి కలండిట వేరువాని పే
రా రయుటె ఘోర పాపమగు నున్నది మీా కడ నొాట మంటి నా
నరకము మీారు చూచుటకు నా మన సొప్పదు వద్దు వద్దనన్॥ 350

వాఁ డొకరుండు నిందు నిలువం బడుటా! యది వీలులేదు నా
వాఁడయి యింకనున్ బరమ పాపి యనంగను చెల్లునే మరిం
బాడెద వాఁడునున్ వినఁగఁ బాపహర ప్రభు భవ్యనామ మ
వ్వాఁడును ముక్తుఁడై మనుత వాని గనుంగనఁ జేయు మంచునున్॥

చేఁగొని యాడ్చుకొంచుఁ జని చిన్మయుఁ డాతఁడు చూచె వానిఁ బె
ల్లీగలు నుక్కునోళ్ళఁ బెకలించుచు నున్నవి మాంసఖండముల్
చేఁగల బూడితన్ విసరి చెక్కుచు నుండిరి చెట్టునట్లు నా
కే గతి లేదు లేదనుచు నేడ్వక యుండెను వాఁడు మగ్నుఁడై॥ 352

కరభకు నట్లు గాంచి వినఁగా నతఁడూర్జిత కంఠ మెత్తుచున్
హర హర యంచు యోగి యఘహారి మనోహర సర్వలోక సం
హర హర నామ నిర్ఝరి హరా! హర! హేహర! హే హరా! హరా!
హరహర! హేహరా! హరహరా! హర! హేహర! హేహరా! హరా॥

అని ప్రవహింపఁ జేసి కరుణాపగ పొంగుల ముంచి తేల్చుచున్
గనుచునె యుండె నా కరభక ప్రియుఁడప్పుడు ముక్తుఁడౌచుఁ గా
చిన ముని పాద పద్మములఁ జిక్కని వెచ్చని కంటి నీటిలో
మునుఁగఁగఁ జేయుచున్ మనసు మోమును సర్వము శే మలంచుచున్॥

ఏమని విన్నవింతుఁ బరమేశ్వర! నీ దయ నాదయా దయా
వామ దృశాను షంగమున వారక నారక లోక యాతనా
స్తోమ నిరస్త చేతనుని స్రుక్కిన వీనుల గాడి పారగా
నామ జపం బొనర్చి కరుణామయతన్ స్మృతినిచ్చి లేపితో॥ 355

ఏ జనుఁడేని యోగ్యుఁడగునేని భవత్కృప కద్ది యింక ని
ర్వ్యాజము జన్మ జన్మముల వాలిన పాపము లన్నియున్ దివా
రాజ దుదస్త తారకలు ద్రావిత మైనటు లారిపోయె నే
యోజను బ్రోచెదో పద పయోజము లంటితి శీర్షముంచితిన్॥ 356

ఆ గతి శరణాగతుఁడగు
భోగిని సానంద యోగి పుంగవుఁ డంతన్
సాగిన తీవకు తలపై
నూగిన చిరుగాలి యట్లు లూచిన చేతన్॥ 357

ప్రేమను లేవఁదీసి యిఁక బిడ్డ భయంబెది లేదు నీకు స్వ
స్వామిని జేరుకొందు విల భక్తుఁడవై జనియించి మించె దీ
వేమియు బెంగ పెట్టుకొన కింతయు నెప్పుడు స్వామి నామమున్
వేమరు సంస్మరించుచును విస్మరి యింపుము సర్వభూతమున్॥ 358

సానంద యోగి యట్లని
వానిం గరుణించి చనిన వర సమయమునన్
దేనియ మనసు సుశీలుం
డీ నేలకు వానిఁ దెచ్చె నీశ్వరు కరుణన్॥ 359

ఆ సుశీలాఖ్యుఁ డీ పేటి యవని సురుఁడు
వాని భార్య ప్రియంవద వరగుణాఢ్య
జీవితంబున వారు నిశ్చింతులనఁగ
వచ్చుగాని యొక్క చిఱు లోపంబు కలదు॥ 360

అంద మున్నది వారి కన్యోన్య మున్న
దధిక సంపత్తి యారోగ్య మమరి యున్న

వాప్త వర్గంబు కలదు, నీశ్వరుని యందుఁ
బూర్ణమగు భక్తి యున్నది పుణ్యఫలము॥ 361

సంతతియె లేకపోయెను సాగి సాగి
వయసు ముదురుచునుండ బెంగయును ముదిరె
స్వామి సన్నిధి నిత్యపూజలను దినము
విన్నపము చేయసాగి రా విషయ మొకటె॥ 362

ఒక దిన మా సుశీలుఁడు మహోత్సుకతన్ శివపూజ చేసి రా
త్రికి శయనింపఁబోవు తఱి దేవుని ధ్యానము చేసి నిద్ర పోన్
సకియకు వానికిన్ సరిగ స్వప్నమునన్ గనిపించి యీశ్వరుం
డకట సుశీల! మీకుఁ దనయ ప్రతిబంధక మొక్క హేతువై 363

కలిగెను; నీవు రాజవయి కామిను లిద్దఱఁ బెండ్లియాడి నీ
వలన నొకామె తల్లియయి బాలుని గాంచగఁ గాంచలేని యా
లలన యసూయఁబూని మివులన్ నిను మోహితుఁ జేసికొన్నదై
వలపుల ముంచుచున్ సవతి బాలుని చంపిన దీవు నొప్పఁగన్॥ 364

అప్పటి మీ యఘుంబె యిపు డడ్డుచు నున్నది తీవ్రరూపమై
యిప్పుడు మీరు పుత్త్రుఁగన నెంతురు కావున పాప నిష్కృతిన్
దప్పక చేసికోవలయుఁ దత్పరులై జపియింపుఁ డొప్పుగన్
దప్పుల నన్నిటిన్ దొలఁచు తత్త్వము గల్గు మదీయ నామమున్॥

హరహరయన్ మహామనువు నాల్గుగ లిర్వురు భక్తితో నిరం
తర మొక మూఁడు వర్షములు దాని మహార్థ మెఱింగి మానసం
బారయ జపించినన్ దురితముండదు శుద్ధిని పొంది పిమ్మటన్
హరహర యంచు నామ జప మల్లె పొనర్పగఁదీరు వాంఛలున్॥

తొలి హర పాపజాల పరిధూనన దక్షము దాని వెంబడిన్
మలి హర మానసామయ సమాజ వినాశన దక్ష మా విధిన్
గలిసిన తత్పదద్వతాము కల్పతరు ప్రతిమాన మాచు మి
మిక్కిలి శుభదంబు కాఁగలదు కీర్తితు లాదురు పుత్త్ర హేతువై॥

అని వచియించి యూరుకొనకా శివదేవుఁడు తాను పల్కి మీా
రనుఁడని వారిచేత ముదమారఁగఁ దానవిపించి మాయమై
చనఁ గలలోనఁ దా మనిన చందమునన్ మలహారి నామ మ
ట్లనుచునె మేలుకాంచి రరుదా యిఁక వారికిఁ గోర్కి తీరుటల్ ॥ 368

ఎంత యదృష్టవంతులయి రిర్వురు? స్వామి మనూపదేష్టయా
కెంత యనుగ్రహంబొ వచియింపఁగ వచ్చునె? పుణ్యదంపతుల్
స్వాంతము లుజ్జ్వలంబులయి యాదిన మాదిగనట్లె దీక్షతో
నెంతయు భక్తిమై హరహరేతి మహామను జాప్య మూనినన్ ॥ 369

దొరలిచనెన్ రవంతయును దోఁచకయే యొక రెండు వర్షముల్
గురుకృప సర్వపాపములుఁ గూలిన వంతె పరక్షణంబునన్
హరహర నామ సంశ్రవణ హారిత సర్వమహాఘు సంఘుఁ డౌ
హరహరుఁడా ప్రియంవదకు నాత్మజతన్ భజియించె ముక్తికై ॥ 370

ఆ యాలు మగల మహానంద మింతింత
యనుటెట్టు లద్దాని కవధి కలదె
దాంపత్యమునను సంతాన మన్నంత నే
యగు మహానందము నవధికనము
కలుగునది యెవరొ తెలియ దెవ్వారికిఁ
దెలిసి, సుతుండని తెలిసి, యతఁడు
సుగుణాల వాలుఁడై భగవంతు భజియించు
నని తెలిసినపుడు కనము మితిని
స్ఫటికమును బోలి సర్వదోషంబు లేని
పుణ్యజీవుఁడు మోక్షేచ్ఛఁ బూని తమకు
సుతుఁడు గా నెంచి గర్భసంస్థితుఁడగుటయుఁ
దెలియ వచ్చిన హద్దులు తెలియరావు॥ 371

హరహరా యనుచుందు రన్యోన్య మరయుచు
నరసినంత యెటెంగి మురియుచుందు
రా దేవు కృపయని హస్తాంబు జమ్ములు
ముకుళించి యెదనుంచి మోడ్చి కనులు

హరహరా! శివశివా! యమిత దయానిధీ!
 యేమెంత మా పుణ్య మెంత స్వామి
నిర్వ్యాజ కారుణ్య నీ కృపావశమున
నీ వారమైతిమి నీవె మమ్ము
దిద్ది తీర్పుము తేర్పుము దేవదేవ
యచుచు మ్రొక్కుచు మ్రొక్కుచు నవధి లేని
మోదజలధిని కదలాడు మోదవీచి
కలను దేలెడి మోద హంసలె యగుదురు॥ 372

ఆనందమె మూలంబగు
నానందము నందె సర్వ మభివర్ధితమా
నానంద మందె లీనం
బౌనని శ్రుతి పలుకుచుండె నానందమునన్॥ 373

హరభక్తిం బెరుగు మోదము
పెరిగెడి మోదమ్ముతోడఁ బెరిగెడి భక్తిన్
దొరలుచుఁ బెరిగెను గర్భము
హరహరుఁ డుదయించె వారి కానందమునన్॥ 374

అన్నియుఁ గూడివచ్చిన మహామహుఁ డాతఁడు సర్వసౌఖ్య సం
పన్నతనంది సర్వవిధవైదిక సంస్కృతులంది వెల్గు లు
ద్భిన్నము లయ్యె వెల్గులయి వెల్గుల భేదమెఱుంగరాని య
ట్లన్నిటఁ బూర్ణశుద్ధుఁడయి యందఱికిన్ ముదమందఁ జేసెడిన్॥ 375

జనక సుశీలుఁ డాతనికి జాతక సంస్క్రియఁ జేసెఁ జిన్నయుం
డనుమతి జ్ఞానసాగర మహాఖ్య నొసంగెను కాళహస్తిలో
ననుపమ పుణ్య దంపతుల కాత్మజుఁడై యిటులన్ని సంస్క్రియల్
గను ఘను భాగ్య మెవ్వరికిఁ గల్గును? కల్గిన ముక్తి తప్పదున్॥ 376

మోక్షముకోరి తల్లి కడుపున్ వరియించిన ధన్య జీవుఁ డా
దీక్షనె పూని జన్మమిడు దేవర దేవియు నంచుఁ గొల్చి యా

మోక్షముఁ దల్లి దండ్రులకు మోదము గూర్చి వివాహ మాడకే
యీ క్షమ మోక్షమిచ్చునది యిందులకే యుపభోగ్యమయ్యెడిన్॥

అను దృఢనిశ్చయంబున సమస్త ధనాదిక భాగ్యమెల్ల స
ద్గుణ మహితాగమజ్ఞ జనకోటికి భక్తి నొసంగి దీవనల్
గొని తనకింకఁ దానయని కోరికతో నిట వచ్చి నిల్చెఁ బు
ట్టిన పని తీర్చుకోఁదలఁచి డెప్పరమౌ తప మొప్పఁజేయఁగన్॥ 378

స్థిర సంకల్పున కీ ప్రపంచ మట స్వాధీనంబెయై యుండు నం
టరుదే యద్ది ప్రియంవదాత్మజుఁడు తానై సర్వసంసారమున్
దరియన్ రాదని త్రోసి ముక్తిగన సిద్ధక్షేత్రముఁజేరి సు
స్థిరుఁడై సిద్ధ సుసేవితుండయిన యీ సిద్ధున్ సమర్చించుచో॥ 379

మము మము మమ్మటంచును సుమంబులు తామయి వచ్చి పూజలో
నిముడుపు మంచు వేడినవి యెక్కడి పండులు తామె వచ్చి యీ
సమయము వేచియుండినవి సాగెడి తాపమె ధూపమున్ దివం
బమరిన సూర్యుఁడప్పటికి నచ్చిన దీపము నౌచు నిల్చెడిన్॥ 380

అనుకొనినంత నన్నియు ననంతములై దరిఁజేరి రాగఁ గో
రిన విధిఁ గోరినంతకును రేపును మాపు నిరంతరార్తితో
నినిచిన భక్తిఁ గొల్చుచును నీరము మాత్రమె గ్రోలుచున్న యీ
మనుజ వరేణ్యుఁడిచ్చట నుమాపతి నేఁబది యేండ్లు నిల్చినన్॥ 381

నిలిచినవాని నిల్పుటయె నిశ్చల భక్తుఁడొనర్చు కార్య మా
నెల నన తాల్పువాని మది నిల్చుట యందు మరింత రక్తుఁడై
నెలలు సమల్ దశాబ్దులును నిండిన వెల్వడ నెంచఁ డద్దియే
ఫలమని వీఁడు తన్మయత భద్రముగా నిదురించు లో యెదన్॥ 382

ఒక్క పవిత్ర దేశమున నుండి పురస్థితి జీవదేవుల
ట్లొక్కటియైన సర్వ జగమొప్పును శాంతి సమృద్ధి వింతఁగన్
పిక్కటిలుఁ సమస్త శుభవృద్ధులు స్వర్గము భోగభూమి యే
యక్కడ కేగినన్ గనెదమా యిది యిచ్చటనే లభించెడిన్॥ 383

ఆనాటి జీవకోటి మ
హానంత సుకృత ఫలమయి యతఁడట్లచ్చో
దైనందిన శివపూజా
నూనుండయి యేఁబదేడు లుండిన యంతన్॥ 384

జ్ఞానాంబాదిక సర్వభక్త జనతా సంసేవ్యుఁడై తోఁచుచో
జ్ఞానానంద మయుండుగా వెలి నెఱుంగన్ లేని యాజ్ఞాన సా
రా నూనాఖ్యుఁడు చాలసేపటికి మేలై కన్నులఁ విచ్చె నం
తే నైవేద్యము పూర్తియైనటులు సిద్ధింబొందె లింగంబునన్॥ 385

హరహర మంత్ర జాపకత నట్టి మహత్త్వము కంట నప్పుడే
హరహర లింగమన్ననుడి యంతటఁ బర్వెను తీర్థ మిద్దియే
హరహర తీర్థమయ్యెఁ బొడి యారదు సంద్రము లింకు వేసవిన్
హరహర యన్నఁజాలుఁ దలయందు మహాజల సేచనంబగున్॥ 386

ఏమియుఁ దోఁచనప్పు డెవరేనియు నీ గిరికోన నిల్చి శ్రీ
స్వామిని సంస్మరించినను జాలు లభించు ననంత శాంతి యిం
కేమి వలెన్ మనుష్యునకు నింతకుమించి ధనాదు లెవ్వి యే
నీ మెయి సౌఖ్యదాయులగునే యెఱుఁగంగనుబోరు మానవుల్॥ 387

మనసునఁ గోర్కె యున్నపుడు మానవ దేహము నుంటమండు చుం
డును శివుఁడున్న యంతటఁ గడున్ ముదమందుచు నెంతహాయి యీ
దినుసను మాటయున్ దెలియదే తినఁ దిండిని కోరకుండ ని
ల్చును దినునప్పుడే కలుగు లోపము లెవ్వియు లేక హాయిగా॥ 388

ఊరక చెప్పుమాట యిదివో యనఁబోకుఁడు వచ్చి చూచి మి
మ్మారగ నెప్పుడున్ గనెడి యోంకృతి రూపుని పండు వెన్నెలన్
మారిన తత్త్వమైన మహిమం గుఱితించి ప్రపంచ మంతటన్
మీరు యెఱుంగఁ జెప్పుదురు మృత్యువు భీతిని పారిపోయెడిన్॥ 389

హరహర గాథా శ్రావణ
పురహర పరులైన యోగి పుంగవులగు నా

గురు శిష్యు లిర్వు లటులే
పరవశులై యుండ స్వామి పరవశుఁడగుచున్॥ 390

శివనాథ పురమునందే
శివ శివ పడియుండెనా యిసీ యిది తగునా
వ్యవహార మెఱుంగకుండునె
శివమిది తగదంచు వెలితిఁ జెప్పనుఁడయ్యా! 391

ఇది యిటు లింతసేపు వినిపించుటకైనది గాని యోగు ల
య్యది భజియించి వచ్చుటకు నైనది స్వల్పమె వారు స్వామినిన్
మది నిలుపంగ బద్ధుఁడయి మాటయు మంతియు లేని వాఁడగున్
గుది గొనియే చరించెదరు గుప్తులు గుత్తులు పూలగుత్తులై॥ 392

మరియు నిఁకొక్క విన్నపము మాన్యమహాత్ముని పూర్వ జీవితం
బరసి యిటేటి మాట యతఁడా యిటు లయ్యెను నమ్మరాదనన్
ద్వార పడవద్దు బొగ్గుగని పండి మణిన్ వెలయించు నంట ని
ష్ఠుర ఘన వర్షమందుఁ బరిశుద్ధ మణుల్ లభియించు వింతఁగా॥ 393

మణియును బొగ్గె కాలమున మాగి యటుల్ పరిణామమందె నం
చును వివరింతురే గద విశుద్ధులు శాస్త్ర విదుల్ నిజంబుగా
మణియగు జీవుఁడాతఁడు తమస్సున బొగ్గనిపించు సత్కృపా
ఘన కరుణాంబు ధారఁగడుగంబడి వెల్గును మానికంబయై॥ 394

అంటున? వాని కెయ్యదియు నంటదు వాఁడెపుడున్ విశుద్ధుఁడే
తుంటరి దొంగయున్ దొరయు దుష్టుఁడు హృష్టుఁడు రోగపీడితుం
డంట తమాస్థితిన్ గనుచు నయ్యది కప్పిన కప్పు గాక యా
యొంటరి కేమి వేఱొకటి యుండి తనంతట నంటు నెట్లగున్॥ 395

అతఁడున్నాఁడు మహానుభావుఁ డతఁడే యాత్మేశుఁడా యయ్యయే
గతి జీవాళికి వాని పేడి విడిగాఁ గన్పించు నీ సర్వమున్
మతి విభ్రాంతియె భ్రాంతిలో మనుచు నా భ్రాంతిన్ నిజంబంచు దు
ర్గతికిన్ లోనయి సంసృతిన్ బడుట మూర్ఖంబౌను ముమ్మాటికిన్॥

రండో రండని పిల్చుచుండె శివుఁడేలా రారు? ఉద్యత్కృపా
శౌండుం డాతఁడు జీవ భేదమను నైచ్యం బూహ యందైన లే
కుండుఁ సర్వమయుండు తానగుచు మేమున్నాము వేఱేయటం
చండం బొందక యుండు టేల? మదిలో నైక్యమ్ము భావింపుఁడీ! 399

భయమెప్డుఁ మరి యొక్కఁడున్న యపుడే భావస్థితంబైన ని
ర్ణయ మన్వించుచు బైట నున్న యదియైనఁ ద్వైతమే యెప్పుడుఁ
భయముం గొల్పుచు శాంతి నీయక మిముఁ భ్రాంతిఁ బడంజేయు స్సం
శయదివ్యాలయ శైవ తేజమున నైశ్చల్యంబు సంధింపుఁడీ! 398

అభయం బిచ్చుటకై పరాత్పరుఁడు తా నావిర్భ వించెఁ స్వయం
ప్రభతో లింగముగా గిరీంద్ర మిదిగాఁ బ్రాణప్రదుండై సదా
రభ సంచార నిజస్వరూప విభవ ప్రాకట్యముఁ దెల్పుచుఁ
బుభువుల్ గొల్తు రభీతి కాంక్షమెయి తంద్రీయంచు నిత్యమ్మిటఁ॥

అవనమనాహతంబయిన యచ్చట నుద్భవమౌచు నోంకృతి
ప్రవణత నిత్యమైన ప్రణవంబున మాత్రమయౌను నద్దియే
అవుమయటన్న వర్ణములు నన్నియునై వ్యవహార మొప్పి తా
నవును స్వరూప మాత్రముగ నద్దియు బ్రహ్మము నొక్కటయ్యెడిఁ॥

స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటి పల్కిన దివ్య సత్కథల్
ప్లుతమతి నన్యుఁడొక్కరుఁడు పూని వచించుట సాహసంబయఁ
ద్రుతమతి త్రోసిపుచ్చకుము తోడ్పడి నీవ వచించి తిట్లు వం
చితమతి నే నెవండ నిటు చెప్పుటకుఁ ధృతిలేని జీవుఁడఁ॥ 401

మొదటి పదంబు సాగె నన
　　ముక్తి పతీ! భవదీయ సత్కృపా
పదము ప్రసన్న మాట యగు
　　పాదము నెత్తుట పల్కు పల్కుటల్
కదిసిన నీ మహాత్మ్యమునఁ
　　గట్టియ మేనికి సాధ్యమౌనొకో
తుది పదమందు దాఁక దయ
　　తోడుగ నుండుము నిన్నుఁ జెందెదఁ॥ 402

# ద్వితీయ పదము

## నకార పదము

ననయను మాట నానుడి ననంత! నమస్సు మనస్సునా మనం
బునఁగని నీ మహత్త్వ మొక స్ఫూర్తిగఁ దోఁపఁగ మేను పుల్కలై
ననిచిన తీవయాదు మననంబున దేవ! నకార మీవ యా
దన బహుళార్థముల్ విరియు నా నెలయన్న ననక్ ధరించితే॥ 1

హరహర హరహర హరోం హరా!
శివశివ శివశివ శివోం హరా!
భవభవ భవభవ భవోం హరా!
భవభయ సంహార హరోం హరా! 2

శివనాథపురము వెలువడి
శివదేవుఁడు సాగె విభవ చిహ్నమ్ములతో
శివమరులు పొంది జనములు
శివ! భవ! హర! యనుచు భక్తి జేజేలిడఁగన్॥ 3

## ప్రదక్షిణ పథము

అప్పటి దాఁక దారి సుఖమైనది హాయిగ సాగె యాత్ర ముం
దొప్పెడి దంతయున్ విషమ మొక్కట బండలు వేలనో కొక్కచోఁ
దుప్పలు గుల్కరాళ్ళు పరితోష మెటుల్ తను మోయు బోయ లా
తిప్పలఁ దప్పఁ దూలుచుఁ నదీనతఁ దప్పక సాగుచుండఁగన్॥ 4

స్వామి గిరి ప్రదక్షిణము సాగెడి ముందటి రోజు కొందఱీ
బాటను మాన్ప సంస్కరణ పాటవ మొప్పగ బాగుచేసియే
తాము యాత్ర నుండెదరు తథ్యమమైనను తృప్తి యెట్టులా
స్వామి సుఖప్రయాణ మది సాధ్యము కా దటువంటి బాటలో॥ 5

ఎవరో భక్తులు పూని యీ పథము నెట్లే రాజ మార్గమ్ముగా
నవరింపన్ వలెఁ గొండ చుట్టు చను నాచారంబు నిర్వాహ్యమై
స్తవనీయం బగుచుండ దీనిపయి శ్రద్ధం బూన కిన్నాళ్ళు లు
త్సవముం జేయు టదెట్లు సాగినదొ యాశ్చర్యంబు ముమ్మాటికిన్ ॥ 6

విశ్వపతీ! జగద్భరణ! వీడి యుపేక్ష తలంపు మిద్ది నే
నశ్వము నెక్కువాఁడ నెదియైనను పొందెడి దశ్వమే మదీ
యాశ్వము దాని క్షేమ మది యారయఁ జాలు నటన్న తత్త్వమే
విశ్వసనీయమై తలఁపు పెట్టని దుష్ఫల మంటి వచ్చెడిన్ ॥ 7

పల్లకు లెక్కినన్ దమకుఁ బల్లము లెత్తులు నూగులాటలై
యెల్ల యొడల్ కదల్చి యొక యించుక స్వస్థతఁ గూర్పకుండు నా
వేల్లిత మూర్తులౌదు రల ప్రేయసి పుత్త్రుఁడు లేని దేమి యం
చుల్లము నందుఁ బొంగకు మహా సుఖ మెంచిన కీడె హెచ్చునా॥ 8

నీ దయ లేక బుద్ధులు జనింపవు పుట్టెడి బుద్ధులన్ని సం
పాదిత కర్మముం బడియె పాట్లు పడన్ మఱి వీరు పుట్టి నిం
పాదిగ యాత్ర చేయుటకు బాటను దిద్దు తలంపు పుట్టునే
మా దశఁ బట్టి మీకు దశ మానవ నాయక! సౌఖ్య మెంచవే? 9

అరుణా చలమున గిరికిని
తిరిగెడి మర్యాద యుండఁ దీర్చిరి బాటన్
దరుషండ మండితంబై
విరిసిన యీ బాట యిచట వెలయుట యెపుడో? 10

అచటి ప్రదక్షిణంబున శ్రమాహృతి యెప్పటి కప్పుడౌట మేల్
రుచియయి కొండ చుట్టగ నరుల్ పరభూముల నుండి వత్తు రా
ప్రచురత కీ యుపేక్షకును స్వాములు మీరె వహింత్రు బాధ్యతల్
నిచిత మహాగ్ని యాతఁడును నీవు సదాగతి వింతయే కదా! 11

పోయిన బాట మాట తలఁపుం బడి యిట్లను కొంటి గాని యా
పోయి నాట దాని మదిఁ బూనిన వా రెవరుండి రచ్చటన్

హేయ మటంచుఁ ద్రొక్కుచునె హేలగ నేగిరి స్వామి వెంట వా
లాయము గాగవచ్చు మృదు లానిల సేవన మందుఁ దేలుచున్ ॥ 12

ఎగదీయ బ్రహ్మ హత్యయు
దిగ దీయగ గోవధంబు దేహమె చెడు గా
తెగి దానిఁ బొంది మిగులగఁ
దెగి ప్రేలుట యంతకంటె దెప్పర మగుఁబో! 13

తనువుల మోసి మోసి వినుతంబగు నోపిక తోడఁ బెంచి మా
తను మరిపించి నిల్వగల దార్ఢ్య మొసంగుచుఁ గన్ను విప్పుచున్
నినుగను నేర్పు పొందఁ గరుణించి దయామయియైన తల్లిఁ ద
ప్పని సరి యాఁచు ద్రొక్కుచును భావ్యమె హేయ మటంచుఁ
బల్కుటల్ ॥ 14

క్షమ క్షమ తల్లి తల్లి మము కావుము కావుము నీవె రక్ష నీ
కమితముగా శ్రమం బవుట యాపగ నెంచియె మంచి బాటపై
మమతను పొందుటల్ కడు శ్రమంపడి యైనను గొండ చుట్టు స
క్రమ మగు బాట వేయునెడఁ గల్గు సుఖంబది యెల్ల వారికిన్ ॥ 15

## మిట్ట కంద్రిక - నడబావి

నెట్టన మిట్ట కంద్రికను నిల్చెను స్వామి సపర్య లందియున్
జుట్టును జూచుచుండె నది సుందర దేశము చూడఁ జూడ నే
తట్టునఁ బుట్టెనో యెఱుగఁ దారి యొసంగక గో సమూహముల్
చుట్టును జేరి నిల్చినవి శుద్ధ మహాస్కుఁడు నంది పిల్చెనో! 16

గోవుల గూర్చి శాస్త్రములు గొప్పగఁ జెప్పెడి మాట కేమి యీ
గోవులఁ జూచియున్ మదికి గోవు మహత్త్వము తోఁచకున్నచో
భావుకుఁ డౌనె వాఁడు పరి భావిత బుద్ధి, వినష్టశీలి, యీ
దేవుని చుట్టు చేరినవి దేవుఁడు వానికె చెంది నట్లుగన్ ॥ 17

ఇవియును కొండచుట్టు చన నెంచెనొ నెమ్మది మేతకై నచోఁ
దవులగ నేల స్వామి నిట? తత్పరులైన మానవాళిలో

మివిలి మెసంగు గోల, యిట మిన్నక యున్నవి, యాలగోల యే
చెవిఁబడ దెంత మాత్రమును చిత్రితముల్ వర శిల్పికోటి చే॥ 18

అవియును సాగిరా శివుఁడు యాత్రకుఁ బూనెను వాద్యఘోషముల్
చెవిఁ బడినంత ముందునకుఁ జేరి మహోత్సవమై చెలంగుచున్
శివునకుఁ బ్రీతియౌ ననుచుఁ జెంగున దూఁకుచుఁ దోఁక లెత్తుచున్
వివిధములైన భంగిమల వేడుక నృత్య మొనర్చె వింతఁగన్॥ 19

అభి ముఖంబై కొండ కచ్చట నచ్చట
కనిపించు నంది విగ్రహము లెన్నొ
నంది చూపును బట్టి నగమున గావింప
లభియించు శివలింగ మభయ మిచ్చు
నాలింగ మెవ్వారి యర్చన గొన్నదో
తెలిసిన వార లే తెలియుఁ బడరు
ఎవరికిఁ గాబట్టు నిక్కాలమున నవి
పార్కు కేగగ తీరుబడియె కనరు

కొండ చుట్టంగఁ బోదురా? కొండలోని
లింగముల నెల్ల వెదకి యాలింగనముల
ధన్యతం బొందఁ గాంతురా? దయ దలంచి
స్వామి కదలంగఁ గదలిరి స్వామి వెంట॥ 20

అదె నడబావి వచ్చినది యచ్చట నొక్క వినాయకాలయం
బాదవును దాని పార్శ్వమున నున్నది యే నడబావి స్వచ్ఛమా
నుదకము లుండు నందు దిగి యుత్సుకతన్ గడుపారఁ గ్రోలి స్వా
మి దయ సుధాశనం బయిన మేత్తలఁ పూని గిరీంద్రమందునన్॥ 21

దృష్టి సారించి యుండిరి దేశమెల్ల
నెముకలను వెళ్ళబెట్టి శుష్కించి యున్న
యట్టులే కొండయున్ జూపు చెట్టు బండ
లొక్క చెట్టైన కనిపించ దక్కజముగ॥ 22

మును పీ ప్రాంతము దట్టమౌ నడవి జీబుల్ గొన్న యిచ్చోట న
య్యిన రశ్మిల్ చొరరానివై పగలు రేయిం జూపె నొక్కంటఁ ద
ద్ఘన గంభీర మహావనం బెటులు దగ్ధం బయ్యెనో నేఁడు కా
నను రా దొక్క కుజంబు గూడ తల పైన న్నీడ సారించుచున్॥ 23

జనములు దప్పికల్ బలిసి సార జలంబుల గ్రోలు చెట్టు లా
యని కదలాడి పోయెదరు హాయిగ వేళకు బావిరాగ న
చ్చిన తెలి చల్ల నీళ్ళలను చిత్తము వచ్చిన యట్లు గ్రోలి జీ
వనదము దాని మెచ్చి గజ వక్త్ర భజించి చరింతు రిచ్చమై॥ 24

## స్వామి చేతిలో లేడి

స్వామి భుజంబులం దొకట స్థానము నందిన జింకపిల్ల య
ట్లే మొగమంతయున్ మురకటించుక యుండెను పూర్వమైన చో
స్వామి గవేషణామతి నభస్పృశమై చను తన్ను గానమిన్
జాములు సంచరించునటు సాగెడి దావన వాటి చూచినన్॥ 25

జననియు జన్మభూమియును స్వర్గము కంటెను మించునందు రా
జనికి నదృష్టశాలి యది జన్మము నందిన దే ప్రదేశమో
వనిఁ గనినంత మాత్రమునఁ బ్రాభవ మందిన స్వస్థలంబు గు
ర్తునఁబడి యట్ల దాటుగను దూకెడి దేమొ విచిత్ర మయ్యెడిన్॥ 26

కానన జంతు జాలములఁ గానము జింకను మించుదాని న
ద్దానికిఁ బ్రీతిపాత్రమగు తావు మనోజ్ఞత చెప్పరానిదా
కాన మునుల్ కురంగములు కానగ వచ్చెడి తావులందె ది
వ్యాను భవంబు లందనగు నంచు వసించెడి వార లెప్పుడున్॥ 27

జింకను జూచి మోహపడె సీత యటన్నను వింత యేమి యి
ట్టింకుల నింకఁజేసి తన స్త్రీని మెయిన్ సగమున్ బొనర్చియున్
బొంకక మోహముం గనని పూరుష పుంగవుఁడైన స్వామి యే
జింకను బట్టి మోహమున జింక! నమోనమ యంచు మ్రొక్కెదన్

అవి కన్నులా? తనువందు నిల్చిన పరం
జ్యోతి వెలుఁగుల ప్రస్ఫుట మొనర్చు
నా తనూ విభవంబు నందెడి జీవుఁడ
దెంత సౌందర్య మహేశ్వరుండో
చూచి నిల్వగ లేక యాచి యందగ నెంతు
వందునా' శివుఁడవై యందె దేమొ
వాయు దేవుని ప్రియవాహనం బయ్యది
పట్ట గల్గుదె గాలి పట్టకుండ

తాక నెంతువు నీచేయి సోకినంత
నైగ నిగ్యంబు మాయునో నాగ నెంచి
చాచు చేతిని వడి నుపసంహరించి
చూచుచుందువు చొక్కించు సోయగమ్ము! 29

ఇట్టి మనస్సు గుట్టెఱుఁగు నీశ్వరుఁ డౌటనె దాని బట్టి యే
వెట్టియు లేక నిండు తెలివిన్ నిలువెల్ల మనోజ్ఞ మల్లియై
కుట్టియుఁ గోడెయున్ వలపు గూడుల దూరెడి భోగి జాలముల్
వెట్టిగఁ దన్ను చుట్టికొనఁ బ్రీతి భజించును స్వామి స్వామియై॥ 30

ఈ దేశ కురంగంబునె
యా దేవుఁడు పట్టినాఁడొ యందుల కనియే
యీ దేశ మెంత మాఱియు
నా దేవున కంత యిష్టమయి యే యుండున్॥ 31

అంతియ కాక యింకొక రహస్యము నున్నది పార్వతీ ప్రియుం
డింతిని గూడి యీ వని నహీన మతిన్ దిరుగాడు చుండ నే
కాంత రహస్థలిన్ భవులు హాయి మెలంగెడి మంచి వేళ నా
పొంతఁ జరించు హాస్కు గని పొంగెడి దా చిఱు జింక యొక్కటే॥

స్వామియు దేవి దాని గొనబార స్పృశించుచునే ప్రసంగ వే
శా మహనీయ మోద సలిలంబుల నంచల యట్లు తేలుచున్

భ్రామిన కన్నులం గనుచు వాలిన ప్రేమను బుజ్జగించి ల
జ్జ మయులౌచుఁ జొక్కెదరు స్వాత్మరతిన్ దమలోనఁ దామయై॥
ఉన్నటులుండి యొక్క దిన మా యువ స్వామి సమక్షమందె లో
గన్నులఁ గన్నులుంచి కనగా నగుచుండియు మాయమయ్యె నే
మున్నది స్వామి చిత్తమపు డొందిన యుత్తల మింత యంత కా
దన్న విచిత్ర మేమి? నడయాడుచు నున్నది యిట్టి చెంత నే! 34

స్వామియు దానిఁ బిల్చి మనసారగ వెన్ను స్పృశించి ముట్టియన్
గోమున ముద్దు పెట్టుకొని కోమలి జాడ యెఱింగి రమ్ము నీ
యామెత లన్ని దీర్తు క్షణ మైనను నిల్వగ లేక యుంటి న
న్నే మెయి కాంతువో యనుచు నే మగునో యనునట్లు వేడినన్॥

స్వామి యెప్పుడో గాని చూపట్టఁ డెపుడు
తల్లి యెల్లప్పుడున్ దోఁచు నుల్లమందు
వారు భిన్ను లనియెడి భావంబె రాదు
ఇపు డిదేమియొ స్వామి యెట్టెదుట నుండె॥ 36

తల్లి కనిపింపదాయె నాత్ర పడి స్వామి
యామె కయి యింత తహ తహ లాడుచుండెఁ;
దనకుఁ గనరాక పోవచ్చుఁ దల్లి గాని
స్వామికిం గూడఁ గానంగ రామి యేమి? 37

స్వామికి మేలుచేయు తలఁపై యది కానన మంత గ్రుమ్మరెన్
హా! మతి! మృగ్యమై యది హైమవతీ మృగయార్థమేగుటో?
స్వామియ సుప్రియా విరహబాధితుఁడై యటులన్న మాత్ర తా
నే మెయి పూనుకొన్నదది యెట్లు ఫలించును దాని యత్నముల్॥ 38

ఒక చోట నిల్చునా? యున్న దేమియొ చూచి
పరమార్థ మెఱిఁగెడి ప్రౌఢి కలద?
చూపైన నిల్చునా? చూచుచుఁ జూచుచే
చుట్టి వచ్చుచుఁ బది చుట్లు తిరుగు

కాలైన నిల్చునా? కాలిన పెనముపై
నెగిరెడి గింజయై ఖగమె యగును
తలఁపైన నిల్చునా? త్రవ్విన బుగ్గయై
ముందు త్రోయుచు వెన్క పొడిచి యెగయు

ఇట్టి తానేమి తాకి భరింప లేని
మంచు మల బిడ్డ దాగు మర్మ మ్మెఱింగి
స్వామి కెఱిఁగించి తత్కృతజ్ఞతనుఁ బాత్ర
మగుదు నే ననుటేమి సాహసము కాదె! 39

ఫలముపై దృష్టి పెట్టక పనుల యందె
శ్రద్ధ వహియించి కృషి చేయ స్వామి కృపను
ఫలము నందుట కర్మ తత్త్వమ్ము గాన
స్వామికై జింక పని విని సంచరించె॥ 40

పరమ మనోజ్ఞ వృక్షముల బంధురమై యెటఁ జూడ నిత్య సుం
దర కమనీయ దృశ్య మహితంబగు నీ గిరి స్వామి జింక స
త్వరముగఁ బార్వతిన్ గనగఁ బంతము పూని ప్రతిస్థలమ్ము దు
ర్భర పరితాప మందుచునె పాఱుట యైనది దాని కర్మమై॥ 41

దిగులు దిగదీయ నాశపై కెగయఁ జేయ
నడఁగి యెగసెడి కడలి పెన్నలల వలెనె
యెగిరి పడుచునె తిరిగె నా యిట్టిటుట్టు
యెంత తిరిగిన నేమి యా యింతిఁ గనదు॥ 42

వేదలల్ గుదిగ్రుచ్చి వెట్టియై వృక్షముల్
కప్పివైచుటఁ గన్ను గానరాని
మర్మస్థలమ్ముల మమతమై తిరుగాడి
పర్వతాత్మజ జాడఁ పడయలేక
ఆకాశ మంతయు నవని యందే యున్న
దన్నట్లు విరిసిన యారు బయలు
రమణీయ దేశాల నమితమౌ కాంక్షతోఁ
జరియించి గిరిజ గుర్తెఱుఁగ రాక

గుహాలు గొందులు సందులు గుండ్ల బీట్లు
నేల బొరియలు దొరువులు నేళ్ళ చాళ్ళు
చంచలాక్షుల కెట్లొ నైశ్చల్య మబ్బ
పట్టు పట్టి పరీక్షించి పడయ దయ్యోః 43

అప్పుడు దాని గుండె బరువయ్యెను వెన్కటి గంతులన్ని యే
చొప్పునఁ బోయెనో పరమ చోద్యముగా నది కుప్ప కూలి య
య్యొప్ప పనిన్ జయంబు గొననైన యుపాయ మెఱుంగకున్నఁదన్
గప్పెడి ముప్పెఱింగి జితగర్వహతాత్మత నూరకుండినన్ ॥ 44

అమ్మల గన్న యమ్మ ముగ్గురమ్మల మూలపుటమ్మ చాల పె
ద్దమ్మ సురారులమ్మ కడుపారడి బుచ్చిన యమ్మ తన్నులో
నమ్మిన వేల్పు టమ్మల మనంబుల నుండెడి యమ్మ దేవి దు
ర్గమ్మ సమస్తమై నిలువగాఁ దన యున్కియ తోఁపకుండినన్ ॥ 45

ప్రేయసిఁ గూర్చి తోడు పడవేడిన స్వామి కరంబు చాచి నా
ధ్యేయము నందఁజేసిన సుధీ! యిటు రమ్మని పట్టి యెప్పుడున్
బాయక యుండు దానిపయి స్వామికి దేవికి నెంత మక్కువో
తీయని కూర్మి యాట వెనుదీయక యిత్తురు స్వస్వరూపతన్ ॥ 46

దేవిని స్వామికిచ్చిన దదే విడదీసిన దద్దె వింతయా
జీవి ప్రలోభ నానఁబడఁ జేయును బంధములన్ని త్రెంచి సం
జీవిగ దుర్జయున్ జలుపు స్వేచ్ఛగ గంతులు వేయుచుండియే
దేవర హస్తభూషణతఁ దేజరిలున్ బరమోజ్జ్వలంబుగన్ ॥ 47

నడబావి దాటినంతట
వడి యుడుగుకె కాదు జడను వడు జాతరయున్
వడి పెరుగు జడము లగునే
పొడమెడి మదియున్న మానవుల కలబోతల్ ॥ 48

దిక్కుల నున్నవా రొకటఁ దేలుటతో బహుభిన్న పద్ధతుల్
పిక్కటిలంగ స్పర్ధయును పెచ్చయి చిత్ర విచిత్ర వైఖరిన్

ఎక్కున చూప నెంచుచునె వీటిడు లోదురు మానవాళి యా
లెక్కయె వారి యెక్కువను లీలగఁ దెల్పు సమూహ వేళలన్ ॥ 49

మనసుకంటె మాయయేది మలహర శివా!
మనసు నిలుపు దారి చూపు మహిమల శివా!
క్షణము నిలువ దాయెయిద్ది కట్టుము శివా!
గుణ విహీనగాఁ జేసి యణచుము శివా!
గుణము గుణము కాకపోయె త్రిగుణాతీతా!
ఫణ మెత్తిన పాపతేఁడె పట్టుము త్రాతా! 50

## స్వామి విలాసములు

స్వామి విలాసముల్ వివిధ భంగులు యాత్రయనన్ జనంబు స్వ
గ్రామము వీడుటాట యిదిరా యదనంచును. కొంద తేవి యో
కామిత వస్తువుల్ ప్రియముగా సమకూరిచి సొమ్ము చేసికో
నీ మలదారి వెంట నెట నేనియు నిల్చుట పాటి యయ్యెడిన్ ॥ 51

పల్లకి నుండుటొక్క విభవంబగు యాత్రికులం దొకండుగాఁ
జెల్లు టికొక్క వైభవము చెంతను గుమ్మగు చెట్టు నీడ నే
తల్లియొ కూరుచున్నయది దగ్గర కొన్ని ఫలాలు పేర్చి "యో
తల్లి ఫలం బొకండొసగు దానవు కమ్మనె స్వామి వృద్ధుఁడై ॥ 52

ఇచ్చెను దృప్తిగా మొసలె, నేమియు నీయఁడు వృద్ధుఁ, డామె యీ
పొచ్చె మిదేమి సొమ్మొసఁగవో యను, నా కొమరుండొసంగు నే
వచ్చెదనంచుఁ బోవు; నటుపై ప్రతివారికి వృద్ధుగూర్చి యా
పిచ్చిది చెప్పువారు విని పిచ్చిది యే యను కొందు రాత్మలన్ ॥ 53

ఆ పిచ్చి యెంత మంచిది ?
ప్రాపించిన వాని నమ్మి ఫలము నొసంగెన్
సాపడె నాతఁడు చాలదొ
దోపిడి గొన్నాఁడటన్న దోషమె యగుబో॥ 54

మనమట్లు నమ్మఁజాలము
కొనవచ్చిన వాని సొమ్ము గొనియే ఫల మీ
యను దలపోసెద మపు డా
తనిఁ దనియించిన ఫలమ్ము దక్కదు గాదే! 55

ఆమెను పిచ్చిదనొక్కనుట యంతకు మించిన పెద్ద పిచ్చి యే
స్వామి స్వయమ్ముగా నడిగి పండును గైకొని యారగించెనో
యా మహితాత్ముఁడా యమకు నట్లు ధనంబు నొసంగ కింక నే
మేమి యనుగ్రహింప మదినెంచెనొ యాయన యే యెఱింగెడిన్ ॥ 56

మాయికుఁ డాతఁడొక్క నరమాత్రుఁడె యైనను నష్ట మున్నదే
పోయెను పండు నష్టమయి పోయెను సొమ్మన జీవతృప్తి యే
మాయెను దాని సత్ఫలము నాపునె యీశ్వరుఁ డందుచేత శం
కాయుత మైన జీవనము కంటె మెఱుంగగు నమ్మ నెప్పుడున్ ॥ 57

ఆతని వేషమున్ గనిన నద్భుత మయ్యెడి పెద్ద పుట్ట నే
దో తలపైని బెట్టుకొనెఁ, దోలె ధరించెను కట్టుబట్టగా;
చేతుల గోళ్ళు కృంతనము చెందక బారెడుసాగి వంపులై
చేతము చిక్కనంబడగఁ జేయుచు నున్నవి, యెల్ల వారికిన్ ॥ 58

శివుఁడన్నన్ శివుఁడంచుఁ జేరికొని వానిన్ మ్రొక్కి "స్వామీ! ననున్
భవమీఁగన్ దయఁ జూడుఁ"డం చడిగె నా పైనా శివుండాతనిన్
"సవిధంబందె మదీయ మాశ్రమము, నిస్సందేహమా సర్వమున్
వివిధార్ఘ్యంబులు గొంచు రమ్మటకుఁ దప్పింతున్ భవం"బంచనెన్ ॥

వీఁడును నమ్మియేగె నడవింబడి యొంటిగ వానివెంట నె
వ్వాఁడొ యతండు వానినట వంచన సేయఁ దలంచెనేమొ కా
పాడుట కెవ్వరుందురట పాపి యెదేఁ దలపెట్టె యున్నచో
వాఁడటు యాత్రమాని యిటు వచ్చుట వీని ననుగ్రహించుటల్ ॥ 60

ఉదరనిమిత్తమై యొసఁగు నుర్వి జనావళి సర్వ వేషముల్
మదుల మలంచు పొంటె కడుమంచివె వేయుదు రెల్ల వంచకుల్

పొదుల నడంగి యుండు విషపూరిత బాణములైన వారిఁ బ
ట్టుదురె తమంత విజ్ఞులటు టోపిపడన్ హతమాట తప్పదున్॥ 61

శివుఁడుండున్ శివుఁడుండు నెల్ల యెడలన్ జీవుండు శుద్ధుండె యై
వివశుండౌ నెడ నెట్టులో వెలువడన్ వీలిచ్చు వీఁడున్ మదో
ద్భవుఁడై తేలికగా ప్రపంచ సుఖమందంగోరు వాఁడైన చో
భవమందే నరకంబు చూపి తుది దౌర్భాగ్యంబు నందించెడిన్॥ 62

ఇరువురు లోయలం బడి యెటేగిరొ యేమొ యెఱుంగ రెవ్వరున్
కరుణ మెయిన్ శివుండు చెలగాటము లాడక చక్కఁజూచినన్
జరుగు ప్రమాద ముండదు విసర్పణ శీలము వీరిఁబట్టి త
న్నొరసిన నేత దాశ్రితునహో మఱి యాశ్రయి నే మొనర్చెనో? 63

స్వామికి నవ్వు నచ్చినది సాగెడి యాత్ర ననేకులున్న నం
దేమెయి లెక్క వేసినను నే పదిమందియుఁ దేల కుండి రే
జామున సైగ వచ్చినను జాలు సరే యని వచ్చువారు స
ర్వామర నాయకుండగుట నక్కఱ కౌ నని యెంతు రెల్లరున్॥ 64

తన వెంటబడిరా నసిద్ధులయి యాత్రన్ జేయగా నేల య
న్నను దానం దమ కౌ వినోదమది యెన్నంగా మరెందున్ లభిం
పనిదై యింతటి కష్టపాటునకు నొప్పంజేసె నవ్వారి సూ
దిని గొంపోవగ దూల మొత్తైవరువో వేహొత్తు లెల్లప్పుడున్॥ 65

స్త్రీలున్ బూరుషులున్ వయోజనులు వర్ధిష్ణుల్ వయోవృద్ధులున్
బాలప్రాయులు సుందరీమణులు సాపత్యుల్ సపత్నీకులున్
కేళీమోహను లర్థహీనులు తపఃక్లిన్నుల్ విలాసప్రియుల్
శైలూషుల్ వివిధాధ్వనీనులు యథేచ్ఛం గాన వచ్చుంగదా! 66

ఒక్కొకచో నొకొక్క గతినుందురు మానవు లింటి పట్టు లం
దొక్క విధంబుగా నయిన నూరికి నావల నొక్క రీతిఁ, దా
మొక్కరు నొక్క తీరయిన నుందురు వేఱొక రీతి గుంపులం,
దెక్కువ ప్రీతిఁ గూర్పగల రిట్టి ప్రయాణములందు చిత్రమై॥ 67

ముదుసలి కూతయాట యొక మోదము, బాలుర కార్తి దీర్చి యిం
పొదవగఁ జేయుటన్య విధ, మూరును పేరు నెఱింగి ముచ్చటల్
మొదలుట, మాన మూని తన మిక్కిలి చూపుట, చీరి చీరి యే
దెదియొ యొసంగుచుంట యిటు లెన్నో విధంబుల మోదమందనా॥

మంచికిఁ జెడ్డకున్ వివిధ మార్గము లున్నవి యాత్రలో వినో
దించుటె ముఖ్యమైనదని యెంచి చరించెడు నట్టివారి క
ట్లెంచి యిదే బలే సమయ మిప్పుడు మించిన యెప్పు డబ్బునో
యంచుఁ దలంచి వచ్చు మహితాత్ములె పెక్కురు వారి కైనన్॥

కాయముతోడఁ జుట్టి చను కార్య ఫలంబును గొండయిచ్చు న
క్కాయము డయ్యుచున్న యదిగా శ్రమజాత ఫలంబు తప్ప దిం
కే యితరమ్ము లేదన నదేనియుఁ దక్కువె పూజ్యపూజ వా
లాయము సత్ఫలం బిడును లాభమె యానిది యెల్లవారికిన్॥ 70

చక్కని యందగత్తె యొక చాన సరాసరి వచ్చి యావనుం
డొక్కఁడు పోవు చుండఁ దనయూరును పేరును జెప్పి మీకు నీ
చక్కి విశేషమున్నదట సౌరు నెఱింగినఁ జెప్పఁడన్న వాఁ
డక్కజ మంది యామె కది యంత యెఱింగిన యట్లు చెప్పెడిన్॥ 71

ఆమె కదేమి యయ్యెనో హఠాత్తుగ మైకము క్రమ్మియున్నచో
భూమిపయిన్ పరుండినది మోమున నీరము చల్లి చేలముల్
గోమున వీచి తేఱె నదిగోయని మెల్లన లేవఁదీసి సో
దామని యన్నటుల్ కనిరి దారిఁబడన్ మఱి గంట కెక్కువో॥ 72

పాతిక యేండ్ల వాఁడతఁడు బక్క పలాచగ నుండె వ్యక్తి నీ
వాతసి జూచి యాతఁడిటు లౌనని యెన్నఁడు నెంచఁబోవు వి
ఖ్యాతిగ శైవకీర్తన మొకండది యెవ్వరో పల్కుచుండ ను
ఱ్ఱూతలు గాగ నూగి యటు లూగుచునే శివమెత్తి గంతెడిన్ 73

శివమెత్తి యొకఁడు చిందులు
శివుఁడే యనఁ ద్రొక్కుచుండఁ జేరి నలువురున్

దవిలి నునువేప చివుళుల
బవురులతో వీచుచుంద్రు పరవశ ముడుపన్॥ 74

నిజమౌనో నటనంబె యౌనో జను లెన్నో రీతులన్ శైవ సం
భజనంబుం బొనరింతు రీ బ్రతుకులే పైవేషమైనప్పుడీ
భజనల్ నాటకమైన నేమి యదియున్ భవ్యంబులై జీవికిన్
నిజ మాహాత్మ్యమొసంగ మేల్సలుపవో నిక్కంబుగా సల్పెడిన్॥ 75

బూటకమైన పూజలకె పూర్ణుఁడొసంగును సత్ఫలంబనన్
గాటపు భక్తితన్మయతఁగా మరిపున్ యజియించు వారలు
ద్ఘాటిత సర్వపాపులయి కామ్యఫలంబులఁ బొందుచుండిరే
సూటిగ మోక్షమార్గమునఁ జొత్తురు దైవమహత్త్వ మింతయున్॥

పెద్ద తుమ్మముండ్ల పెనుకంపలను జేర్చి
బారెడెత్తు శయ్య పఱచినాఁడు
ముళ్ళమీఁద పుష్పపుంజమ్ము పైనట్లు
పవ్వళించె వాఁడెవండొ గట్టి! 77

అంప శయ్యనున్న యపర భీష్ముండౌన
ఘోర దీక్షపట్టు ధీరుఁడౌన
వాని చూపులెల్ల పఱచియుండిన వస్త్ర
మందె యున్న వింక సందియంబె॥ 78

ఈటె నొక్కదాని నిరుప్రక్క వెడలిరా
బుగ్గలందు దూసిపోవ దూసి
దబ్బనములతోడ దవుడలు రెండింటి
నంట గుట్టి నిల్చె నాతఁడెవఁడొ? 79

విడువకుండ చెంత నుడుక ప్రోగుచునుండ
చండకళ నొకండు చాచి చాచి
దబ్బలగుచుఁ జీలఁ దన వీపుపై తానె
కొట్టుకొనుచునుండెఁ గ్రూరుఁ డొకఁడు॥ 80

ఇందఱు భిక్షుకుల్ బ్రదుకు లీడ్చుట కింత స్వహింస. నేలకై
కొందరొ బ్రహ్మకే తెలియుఁ గొన్ని మహాఘము లీ విధంబుగా
నందఱు ముందునిల్చి తనయంతట తాను కఠోర శిక్షలన్
బొందినగాని పోనివని బొంది గలార తెఱుంగఁగావలెన్॥ 81

దేహమనంగ దాహ్యమయి తీవ్ర తరాధిక దాహహేతువౌ
టీహ నెఱింగి పాపపథ మేగుట యిట్టి కఠోర శిక్షకౌ
నూహ వహించి యయ్యదిఁక నుండఁగరా, దిట మీఁద నెట్టి దా
దేహము నందరాదనెడి దీక్ష వహించెడి వాఁడె ధన్యుఁడౌ 82

శప్తులు మాయాక్షిప్తులు
లిప్తులు వివిధాఘ దుష్ఫలీ కృతనిజ దే
హాప్త నిరంతర దాహా
తప్తులు గద దేహధరణ దగ్ధులె సర్వుల్॥ 83

దాని స్వభావ మట్టిదని తత్త్వ మెఱింగిన ధీరజీవి య
ద్దాని ధరించియున్ దనకు దానికి సంగ మొకింత లేక లో
లోన శివున్ దలంచుచునె లూన సమస్త జగత్కలాపుఁడై
తానె సమస్తమై తనకుఁ దానె సుఖంబని స్వాత్మమగ్నుఁడౌ॥ 84

## తత్త్వ ఫలము

బొండము స్థూలమైన తనువున్ మఱి లోపలి పీచు సూక్ష్మమై
యుండ ఘనీభవించి తనయుండిన చొప్ప నెఱుంగనీక య
ద్దుండెడి గట్టి టెంకెయు నహో నిజకారణ దేహమై త్రినే
త్రుండయి రెండు నేత్రములె తోఁచు నరుండగు నారికేళమున్॥

కొబ్బరి జీవుఁ డందెటులు కోరి వసించునొ చిత్ర, మెట్లు తా
నుబ్బెను లోన నీరముగ నూరి క్రమమ్మగ పేరి పేరి పె
ల్లుబ్బి దళమ్ముగా ముదిరి యుండిన మూట నెదేని దేనికై
దెబ్బ ఘటిల్లినన్ దనకు దెబ్బగునట్లు చలించు నిత్యమున్॥ 86

తత్త్వ విదుండు వాని బడి తాను చలింపఁడు తాన యత్రి యా
తత్త్వ మెఱింగి లో మెలఁగు దానికి వీలుగ నెండి యెండి స

చ్చిత్త్వ విశేషమౌ కరిడి చేయగ లోపల కొంకె విచ్చినన్
స్వత్వము నందె యుండి యిఁక జాఱఁడు దేహములంద ముక్తుఁడై
వాఁడు శివుండెయౌ తనకు వానికినైన యభిన్న తత్త్వమున్
పోడిమి తెల్పఁగాఁ బుడమి పుట్టఁగఁ జేసెడి నిట్టికాయ నే
వాఁడు శివార్థి యౌచుఁ దను వౌనిది భేద్యము నేను నీవెయౌ
వాడిమి నందఁ జేయుమని ప్రార్థన చేయుచు గుండె విచ్చునో॥ 8

వాఁడె దినమ్ము దేవరకు భళ్ళున కొబ్బరి కాయఁ గొట్టి కా
పాడుము దేవ లోనెపుడు స్వచ్ఛత నుండుదు నంచు తెల్పు చే
నాఁడతఁడాతఁడై కురుడి నాఁబురు డించునొ నాటి కత్రియై
వీడి శరీరమౌ పయిని వీఁడును సంసృతి ముక్తుఁ డౌటచేన్॥ 8

గురు శిష్యు లట్టి వారలు
కరిడియ యయిపోయినట్టి కొబ్బరి కాయల్
పురములు మూఁడును నున్నను
తరవరి నవ్వాని తగులుఁ దరిగిన వారల్॥ 9

ప్రారబ్ధ వశత నయ్యావి
యే రీతిని జన్మ నేమి యెగురును దొరలున్
పాఱును పాఱవు పోనీ
తీరిన దవ్వాని తగులు తేలిక యయ్యెన్॥ 91

## చిట్టత్తూరు - నందుల కథ

చిట్టత్తూరి వర ప్రపాస్థలము వచ్చెన్ స్వామి యచ్చోటఁ జూ
పట్టెన్ సర్వమయాత్ముఁడై జగము కన్పట్టున్ నిజం బట్టులై
చుట్టున్ ముట్టును గుట్టెఱుంగని జన స్తోమంబు తన్ బట్ట నిం
కిట్టే యుందు నటంచు వీగెడు శివుం డెల్లప్పుడున్ స్వస్థుఁడౌ॥ 92

స్వామికి నీ స్వాములకును
నామము రూపం బొనర్చు నాట్యంబులతో
నే మాత్ర మంటి యుండని
వ్యోమమ్మయి యుంట భేద ముండ దొకంటన్॥ 93

జనముల దప్పిక తీర్పగ
మనసుల వలె స్వచ్ఛమైన మజ్జిగ నీళ్ళన్
పెను బానల సమకూరిచి
తనివిగఁ గ్రోలించి నారు త ద్గ్రామస్థుల్॥ 94

ఆ యూరె కాదు కొండకుఁ
జాయల నున్నట్టి యన్ని జనపదములునున్
మాయురె మంచివి జనములు
వే యేల శివ స్వభావ విదితులె యెందున్॥ 95

అచ్చట నుండి స్వామిమల యద్భుతమై కనిపించుచుండుఁ గ
న్నిచ్చ వడంగ దాని గను చెల్ల విహాయస మీది యీది లో
పచ్చని పట్టులందు దిగి స్వైర విహార మొనర్చి హాయిగా
వచ్చును హంస మానస నివాసము స్వీయము గాన ప్రీతిమై॥ 96

దేశిక శిష్యు లిర్వురు నదే పనిగా గిరి వంకఁ జూచుచున్
రాశిగ నున్న శైల శిఖరంబున నుండి ప్రపాత మొంది వే
త్రై శివ దేవు శిల్పములహో యనిపించుచుఁ గొన్ని రాళ్ళు నా
నా శివ మూర్తు లొప్పుచుఁ గనంబడఁ దన్మయు లౌచు వానిపై॥ 97

ధ్యానము నిల్పియుండిరి బుధాగ్రణు లిర్వురు లోనవారి కెం.
తో నిపుణంబుగా నెదుట తోఁచెను దివ్యకథా విశేష మొం
డైనను వారు గాంచినది యన్యుల కెల్లెఱుఁగంగ నయ్యె వా
రైన వచించిరా యనఁగ నయ్యదియే పరమాద్భుతంబగున్॥ 98

జరిగిన దెప్పుడో, యరయఁ జాలిన వారిది వేఱుకాల, మి
ర్వురు నొక పుణ్యకాలమునఁ బూర్వ కథన్ గమనింపఁ గల్గుచుం
డిరి కద, కాలమిట్లు వికటీకృతమైనది వారు గన్న త
త్పరమ మనోజ్ఞదృశ్య మది వారికె కా దటుతోఁచు నేరికేన్॥ 99

స్థల మదియే కథా ప్రసృతి సాగిన దచ్చట దేశ మిట్టు లు
జ్జ్వల మయి సన్నిధిన్ నిలిచి స్వాంతము లందు మునుంగఁ గల్గు వా

రలకుఁ దనంతఁ దత్కథను రమ్యముగాఁ గనిపింపఁ జేసెడిన్
బలువురకైన దర్శనముఁ బట్టి కథా పరమార్థ మొక్కటా॥ 100

అవి రెండావులు భిన్న గర్భ జనులై యన్యోన్యమున్ మైత్రితో
మివ్రులంగాఁ బెనవేసికొన్న యవి యే మేల్ సేసి యట్లాయెనో
యవి యట్లై యొక చోటఁ బుట్టక విభిన్నావాసముల్గా దినం
బవిధిన్ బొందుచుఁ జేరి యిచ్చట ముదంబందున్ బవళ్ళంతయున్॥

వెల్లా వొకండైనఁ బుల్లావిఁ కొక్కటి
రెంటి యందమును వర్ణించు టెట్లు?
కాటుక కన్నులు నీటైన మూతులు
గిన్ని కొమ్ములు గల్గి గెలుచు జగతి
కుచ్చుతోఁ కల వంక గుజ్జు మూపుల వంక
శిల్పి వరుల చూపు చెదరకుండు
నొకమారుచూడ వేఱొక మారు చూడంగఁ
దహ తహ పుట్టించు తనువు లొప్పు

వాని యందమ్ము సరియె సర్వజన నయన
తర్పణాఖిల భాగ్య సంధాయకమ్ము
వాని చందమ్ము చూడ సర్వ జనకోటి
చారితార్థ్య మ్మునకును నాచార్య కమ్ము॥ 102

సాధువులన్న సాధువులు సాధు పయస్సులఁ గుండపోతగా
వ్యాధి యెఱుంగ కిచ్చు గిరి యందునఁ జిక్కని మేత మేయుచున్
వీథిని వచ్చుచోటఁ బసి పిల్లలు కాళుల సందునం బడన్
బాధ కనంగ నీయవు కృపాపరతన్ గని పెట్టి యేగెడిన్॥ 103

అటు వాని కాళ్ళ సందున
నెటులో యొక మాటు నిల్చి యీవల కిటురాఁ
బటువగు నబ్బాలుఁడు మును
పెటువంటి విచిత్ర రుజల నెదుగక యున్నన్॥ 104

బలవంతమ్ముగ వాని నాపి యటు లెవ్వారైనఁ జేయన్ ని సుం
గుల కే హానియుఁ గాదు శోభనము కల్గున్ గల్గ దశ్లేచు పె
ద్దలకే వేవిరియు తప్పకుండ నగు బాధల్ కాన నవ్వానిఁ గ
న్నులతోఁ జూచి సమర్చలన్ సలుపు చెంతో భక్తి సేవింత్రుపో॥

నడి రావి చెట్టు వానికి
నెడమున్ దోలఁగించి కలుపు నే కాంతంబా
వడి ముందు వచ్చె నేనియుఁ
దడయున్ దోడరుగు డెంచు దనుక నొకండున్॥ 106

పుల్లావు యజమాని పుణ్యాత్ముఁ డొకనాఁడు
వాని యన్యోన్యమ్ము స్వాయ మెఱుంగు
నవకాశ మబ్బిన దానాఁడు వెల్లావు
వేళకు రాలేక జాలమయ్యె
నడిరావి కడనిల్చి నలుదెసల్ పరికించు
చనుగు వచ్చెడి జాడ నరయరాక
పులు ముట్ట కున్నట్టి పుల్లావు గమనించు
చాతఁ డచ్చోటనే యాగిపోయె

నావు కదలదు, కంటె నీ రాగదింత,
చూపు మరలింప కట్టులే చూచుచుండె
హేల నదలించి మేతకుఁ దోలెద మన
దేవ గోవయ్యెఁ దప్పు కాదే యదల్ప? 107

ఎందు కేడ్చుచు నున్నదో యెఱుఁగ రాద
యేమి చేయుట యని యాతఁ డెంచుచుండఁ
బరుగు పరుగున వెల్లావు వచ్చు జాడ
దూరమునఁ దోఁచె నంత సంతోషమునను॥ 108

అంతవఱకల్లె స్తంభించి యచట నున్న
రాతి బొమ్మకుఁ బ్రాణంబు రాఁగఁ గదలి

నట్లు పుల్లావు పోయి యత్యాదరమున
నఱచుచున్ వచ్చు దాని వెల్లావుఁ గలిసె॥ 109

మూతిని మూతిఁ జేర్చి యిరు మోరలు నేకముగా పెనంగి కం
డూతి నివారణం బనఁ గడుంగడు ఘట్టన గాగ మేనులన్
స్ఫ్యాత మొనర్చి రెండు నవి నొక్కిన చొప్పు స్వయమ్ముగా ద్రవీ
భూత మనస్కుఁడై కనియె పుల్ల హృదబ్జుఁడు గంగిరెడ్డియున్॥ 110

జాగునకు హేతువేమియొ బాగునొగు
నేమి యది చెప్పెనో యిది యేమి వినెనొ
కాని యామీఁద నవి రెండు కలిసి మెలిసి
యే చరించెను పవలెల్ల రాచుకొనుచు॥ 111

గంగిరెడ్డి కానాఁడె సంకల్ప మొదవె
నింక క్షణమైన రెండావు లెడముగాఁగ
నుండగా రాద యొకచోట నుండ వలయు
దానికిం దగ్గ యత్నంబు తాను చేయు॥ 112

కలిగెను మంచి యూహ తగు కాంచనముం గొని యాతఁడేగఁ బి
క్కలు పని చేయు కాల మదికాదు శుభస్థితి నింటియావు నే
విలుతు నొసంగు మం చడుగ వేరు సహింతురు పోయెగాని యే
పలుకును బల్కలేక యట బాష్ప పరిప్లుత పద్మనేత్రుఁడై॥ 113

ఆప్త బంధువు లందొక యనుభవజ్ఞు
వృద్ధు నారసి యతనికిన్ వృత్తమెల్ల
వివరముగఁ జెప్పి "తాత! యిప్పించు మెట్లొ
యొప్పి కొనఁడేని నా యావు నురక యిత్తు॥ 114

తీసికొని రెంటి నాతఁడే పోషణమున
నుంచుకొనుగాక రెండును నొక్కచోట
నుండుటే నాకు నభిమత మొప్పఁజేసి
పుణ్యమార్జించు కొనుము నై పుణ్య మొప్ప॥ 115

అని వచియించు రెడ్డిగొని యాముది వగ్గు "శివుండె దిక్కగున్
జని కనుగొంద" మంచుఁ జనె సాధు శిరోమణి గంగిరెడ్డితోఁ
తనకడ కేగుదెంచిన వదాన్యుని చూచుచునే నృసింహుఁడున్
దన మది నెంచె నేఁ డెదియొ తప్పదు వీడుట కన్నటంచునున్॥ 116

సరసుఁడు కాఁడతండు వినసాగెను వృద్ధుని మాట లన్నియున్
విర విరలాడె, నూరకయ వేయి విధంబుల నడ్డుచెప్పె, వే
సరి యిఁక గంగిరెడ్డి కొనసాగదు కోరిక యంచు నెంచెఁ, ద
త్పరి సర మందె యున్న దరుదార సమస్తము లించు గోవునున్॥117

తన యావున్ విడి దీనితో నిలుపు నాత్రం బంది యారెడ్డి తె
ల్పిన మాటల్ విని యేగసాగినది యా వెల్లావు వారింటి గో
వనఁగా, నీతఁడిఁ కేమి చేయఁగలఁడా యర్థంబు తాఁ గైకొనెన్
గొనకున్నన్ గొనకుంటయే యగును దద్గోవుండ దంచెంచుచున్॥118

అట్లై త్రెంచుక వచ్చి గోష్ఠమునఁ దోడై నిల్చు నా తోడుతో
నెట్లుండెన్ దొలియావు? దాని కనులందే నిల్చె నానంద, మ
ట్లిట్లై పార్లిన, వింక నీ జనికి లే దే మాత్ర మాటంక, మే
మెట్లుం గట్టెద మంతరిక్షమున కెన్నేన్ మెట్టులన్నట్టులై॥ 119

అసలె గంగిగోవ యా గంగి రెడ్డన్న
వాని మైత్రి నెఱిఁగి వానిఁ జేర్చి
యతఁడు పొందినట్టి యానంద మది సంద్ర
మందు కొఱకె యాతఁడవతరించె॥ 120

తొలి యీఁతై మలియీఁతకై యపుడె యుద్యుక్తంబు లౌచున్న గో
వుల కాతత్త్వ విదుండు దిష్టికని కాపుల్ కాచె నెన్నెన్నొ కా
ళులకున్ గొమ్ములకించు వెంట్రుకల త్రాళ్ళున్ స్నిగ్ధ కంఠంబులన్
బలు మువ్వల్ గల గంట పట్టెడలు ప్రావారంబులౌ వాఱులున్॥

నెల వంక లెదురు కొనుచున్
నిలిచిన వనఁ బొలుచు పసిడి నిగ్గుల నును గొ

మ్ముల కొసల నులియు గంటల
వెలి తొడుగుల తోడ నవియు వీథిని నిలువన్॥ 122

లచ్చియుఁ జదువుల తల్లియు
వచ్చిన వవె వాని యింటి పట్టున నిలిచెన్
హెచ్చిన పంతం బొప్పగఁ
బొచ్చెము పోగొట్టు కొనెడి పూనికతోడన్॥ 123

చూచిన వారలెల్లరును వొక్కెద రంతనె మ్రొక్కుచుందు రే
వో చిరుతిండ్లు పెట్టి తలఁపుల్ మొలకెత్తగ వాని ముట్టి మ
మ్మాచిన ప్రేమ నాదుకొనుఁ డమ్మయటంచును నట్టుగోరుచున్
దోఁచిన సేవలన్ దనిపి తొట్టుల గొల్తురు తీఱు వాంఛలున్॥ 124

క్షణమున్ వీడక కూడియుండు తనివిన్ సంవర్ధితానందమై
గొనబుం జూపెడి గోద్వయం బడుగుచోఁ గొండంచు నిచ్చున్ బురే
జన సంప్రార్థిత సర్వ వాంఛలును వాత్సల్యాబ్ధు లవ్వాని సే
వనమే జీవన మన్న యట్లుగ జనుల్ పాటింతు రా గోవులన్॥ 125

దేవతలైన కర్మ పరిధిన్ జవదాటగ వీలుకాద యా
గోవులు రెండు నట్లు జనఘోషను పూజల నంది కొంచు మే
ల్తావుల నంది వర్ధన నుత ప్రసవద్వయ మొందుఁ గన్నఁ బ
స్త్రావిత మాచు నెల్దెసలఁ దత్పరతన్ సురభీకరించుచున్॥ 126

వెలుఁగుచు నుండె; నిత్యమును వెంబడి నేగును గంగిరెడ్డి మే
తలకయి వెండికొండ పలుదారుల వెంబడిపోయి లోని తా
వుల గల లేఁత పచ్చికల పుష్టి గడించి నమున్నతాత్మలై
మలఁగెడి వాని వెంటబడి మాపుల వచ్చు దిలీపుఁ డన్నటుల్॥ 127

సుతలాభార్థి గురూపదేశమున సత్శుద్రాత్ముఁడై మండలం
బతఁడా నందిని గొల్చె, నే తలఁపు లే కాత్మీయగో ప్రేమతో
నితఁడా నందిని మించు పీనిని దినం బేకాంత సేవామతిన్
మితి లేకుండగఁ గొల్చు దీని ఫలమా మిన్నందుటో మించుటో! 128

ఈంతకుఁ గాలమయ్యె నవి యెన్నఁడు మానక కొండ కేగుచో
నీతఁడు వాని వెంటఁ జని యేచిన శ్రద్ధ సమర్చ సేయుచో
బ్రాంతిగ నొక్కనాఁడు నెలవంక తలన్ ధరియించు స్వామి సం
ప్రీతిని జూడఁ జూడనగు బిడ్డను గోడెను బెట్టె దోరదిన్॥ 129

పెట్టుచునే పదింబదిగ బిడ్డను నాకెడి పుల్లయావుఁ గ
న్పెట్టుచు గంగిరెడ్డియునుఁ వెల్లదియున్ ముదమందుచుండి రా
పట్టున గుప్పుమంచుఁ గకుభంబులు విచ్చు పరిమళంబు చూ
పట్టె మరంతలో మెరసెఁ బ్రత్నమణి ద్యుతి నొప్పు సర్పమున్॥ 130

పుట్టిన దూడయున్ నిలిచె భూమిని, పామును దానిజూచె నా
పట్టునఁ దల్లికిన్ దనరు బాసటగానగు వెల్లయావుకున్
బుట్టిన భీతి యింతయని పోలదు చెప్పగ నంతలోననే
పెట్టిన భూషణంబటులు బిడ్డపయిన్ జెలిలాడె సర్పమున్॥ 131

తలపై విప్పిన భోగమొప్పిన యనంత స్వామియా విశ్వ వ
త్సలుఁడే యానన గాడెదూడయును చైతన్య స్వరూపంబయై
చెలఁగెన్ జెంగున దూఁకుచున్ మలఁగెఁ దచ్ఛీర్షంబునందద్ది య
ట్టులె యుండన్ బొదుగంటి క్రోలినది పుట్టున్ నెట్టు దుగ్ధంబులన్॥

దూడనుగూడి భోగియును దుగ్ధములానెనొ యేమొ మెల్లగా
వీడి చనెన్ శిలాత్వము వీడి యొకించుక తెల్వివచ్చి యా
దూడయుఁ దల్లియున్ సఖియుఁ దుష్టిమెయిన్ దొలుకాడఁజూచి కొం
డాడెడి భక్తి దూడఁగొని యాతఁడు సాగ గమించె గోవులున్॥

అటకడ దూడ నెత్తికొని యావులతో నతఁడూరుఁ జేర న
బ్బురపడి యెల్లవారలును మూగిరి చుట్టు; నెఱింగి రంతయున్
జరిగిన వింత విన్న జనసంఘము పూర్వమె గోద్వయంబు నే
సురవరులో యటన్న మతిఁజూచెడి దిప్పుడు దూడ నెంచుచున్॥

స్వామి భుజంగ రూపుఁడిట స్వామియె వచ్చెను దూడకోసమై
యీమెయి నబ్బురంబు నెపుడేనియు వింటిమె దూడరూపుతో

స్వామియె వచ్చినాఁ డిటకు భ క్తి భజించి తరింతమంచు నే
మేమియుచేసి రెంతకును తృ ప్తి ఘటిల్లని మానసంబులన్॥ 135

మరి మూన్నాళ్ళకుఁ గొండమీఁద నొకచో మార్యాల వెల్లావునున్
దటిమై దూడనుబెట్టఁ బెట్టుచునె రుద్రప్రేరిత వ్యాఘ్రు దీ
ర్ఘ రవాకర్ణన జాతభీతి విగత ప్రాణంబుగా నెట్టులో
పారలున్ గుండియ నిల్వరించుకొని తత్పుత్రున్ వినష్టాంబకున్॥ 136

ఒంటిగ జాతవత్సము ననూన శుచాశ్రుల ముంచిమెత్తు "చి
ట్లుంటిని దీనికై, శివుఁడహో హరియించెను వెల్లయావు, నే
నింటికి నేగ నా మొగమునింకఁ గనుంగొనునా? సహించునా?
గెంటున ముప్పు? నెట్లు బ్రదికించుట దానిని దీనినో శివా! 137

అప్పుడు పాపతేనివయి యప్పుడె పుట్టిన దూడ నెత్తిపై
విప్పితి భోగమట్లు దయవీడితి విప్పుడు నిర్దయుండవై
కుప్పగఁ గూలనేసితివి క్రూరమృగాగ్ర్భటి మాయఁజేసియే
తప్పు నెఱుంగనట్టి తెలిదానిని తోడెటు నిల్చు నొంటిగన్॥ 138

స్వామీ! కోరెదవేని నన్నుగొని వత్సన్ దాని నెట్టైన నే
బాముం బొందకయుండ సాకుము కృపావార్ధీ!" యటంచున్ శుచా
భౌమం బాకృతిగొన్న చందమునఁ బోవన్ గండిరెడ్డిన్ గనన్
గ్రామంబంతయు వచ్చిచూచి పెనుదుఃఖంబందు మగ్నంబుగాన్॥

ఇంటిపట్టున వత్సహిత మెంచి యద్దాని
　　బాల్యచేష్టలు చూచి పరవశించు
పుల్లావు నుల్లంబు పొర్లినట్లై లోన
　　నున్న దున్నటె క్షణముండలేక
పరువు పర్వున వత్స మురుపడి వెన్నంటి
　　రా నూరిబైట దుర్వార దుఃఖ
పీడితంబై చేష్టవీడి గుంపులు గాఁగ
　　గూడియున్న జనంబు గుడుసు వడగ

సంది మాతృవిహీన వత్సము వహించి
యేమి దిక్కని వాపోడి యేడ్చుచున్న
శోక మాకారమైయున్న శుద్ధుఁజూచి
యాపురని గోలపెట్టి నంభా యటంచు॥ 140

అయ్యది దుఃఖమా? వెలికి నట్టులె తోఁచును దాని విన్న యా
చియ్య గబాలునన్ దుమికి చెంతను చేరి పొదుంగు ముట్టి యా
చెయ్యి మృతాత్మ మిత్రమును బ్రీతి స్మరించుచు జాలువార్చు సం
దియ్యని పాలుద్రావి గమనించెడి దూడనుగూడి యాడినన్॥ 141

కాఱుక్రమ్మిన దుఃఖ మేఘములు విచ్చి
పూర్ణ చంద్రుండు పొడిచిన పోలుపు గాఁగ
నంద అందిన యానంద మవధి యెఱుఁగ
దమృత హృదయుఁడు గంగిరెడ్డన లెఱుఁగఁడు॥ 142

ఇరుచక్కిన్ సరిదూడ లంటిచన నా యిల్లాలు గోమాత స
త్వరమై గీమున కేగుచో వరసుతద్వంద్వంబు పాలించు త
ద్గిరిరాట్పుత్రిక యన్నభక్తి జననిన్ గీర్తించుచున్ సాగె నా
నరనారీ పరివారమంతయును స్వాంతంబుల్ ముదంబందఁగన్॥ 143

ఎఱుఁగుచునే యెఱుంగ మిహ మియ్యది యెప్పుడు ద్వంద్వఘట్టితం
బరుదుగ నిందు నెయ్యదియు నచ్ఛ సుఖంబనరాదు దుఃఖ ని
ర్భరమనరాదు రెండు నొకపట్టునఁ గూడియయుండు ధీరులీ
సరణి నెఱింగి దేనియెడ సంగము నందరు స్వాత్మరూపులై॥ 144

వెల్లా వొకింత జాగిల్లి రా నోర్వని
పుల్లావు తన్మృతి నెల్ల మఱచె
పుట్టినంతన నెత్తి భోగంబు విరిసిన
పాముతో నా బొట్టె పాలుకుడిచె
తల్లి నెఱుంగని తద్వత్స మా లోప
మొక్కింత లేక పెంపొందుచుండె
పామాచు రక్షించె వ్యాఘ్రమై భక్షించె
గంగిరెడ్డిగ వాని గాచుచుండె

ద్వంద్వమయమైన సృష్టి నెద్దానఁగూడ
పైకి కనిపించునొకటి తత్త్వము మఱొకటి
తత్త్వ మెఱుఁగక బాహ్యభేదముల గనుచు
నలల నూగుట మాని తానైన శాంతి! 145

ఎవరెల్లాదురో యేది యెందులకో యీ సృష్టిన్ విమర్శించి సం
భవమా సర్వము నిట్టులిట్టులని తాత్పర్యంబు తెల్పంగ నే
ధవుఁడుం జాలఁడు మాధవుం డొకఁడె సిద్ధంబై ప్రసన్నుండునై
భవమూపున్ గదలాడకుండుటకు మద్భావంబె మార్గంబనున్॥ 146

ఫుల్లా వెంతటి పుణ్యశాలినియొ యే పుణ్యాత్ముఁడో వెన్క సం
విల్లంభం బొనరించి గోవగుచు నా విర్భూతమైనాఁడు గా
కుల్లాసంబున నెంత స్నేహమవనీ యూధస్య మిట్లన్యనో
జెల్లా క్రోలగనిచ్చునే? తను వెదేన్ జీవుండు భిన్నుండగున్॥ 147

ఇందేమి వింతగల దా
బొందింగల జీవుఁ డఖిల పూజ్యత మగుణుం
డిందే యీ కొండచరియ
యందే పులిపిల్ల నిల్చె యాదుకొనె ననన్॥ 148

పచ్చిబాలెంత తను వారి పాటవమ్ము
కలిగి వత్సద్వయమ్ము వర్ధిలుచునుండ
నదియు గొండకు నేగు నారాటమంద
ననుగమించెను రెడ్డి సీడైన యట్లు॥ 149

మొదటి దినమునఁ బుల్లావు పోయిపోయి
తాను బిడ్డనుగనిన యా తావుచేరి
నాటి నెత్తావి తగులఁ దన్మయత నంది
పాము కనిపించునా యని పాఱఁజూడ॥ 150

ఆకు లలములు కుప్పగానైన చోట
దివ్యలింగం బొకండు తోఁతెంచుటయును

చేపు పొదుగువ పాలు వర్షించి తనిసె
నాటి మొదలట్లు చేయుట పాటియయ్యె॥ 151

మఱి దినమ్మున దాని యుమ్మలిక యెఱింగి
యీని వెల్లావు భయమున మృతిని గన్న
తావునకుఁ దోడుకొని పోయెఁ దత్పరుండు
అచటఁ గననయ్యె నొక పరమాద్భుతంబు॥ 152

పెద్దపులి యొండు ప్రాణముల్ వీడియుండెఁ
జాల కొఱకయి మృతకళేబరమునందు
పిల్ల యత్నించి కడుఁసొమ్మసిల్లి యుండె
రెడ్డియును గోవు కనిగి తద్దృశ్యమెదుట॥ 153

ఎంతసేపయ్యెనో ప్రసవించి పులియు
నెపుడు చచ్చెనో పిల్ల పాలేమి త్రావె
నో యసలు చవిచూడలేదో యెఱో వి
ధాన జీవమున్నది యదెంతవఱకకట! 154

అతఁడు పులిపిల్లఁ జేఁగొని యావు పొదుగు
కడను నిలబెట్టి నాటి యక్కఱను బట్టి
పిదికె నొక రెండుధారలు పిల్లనోట
నా దినమునుండి వత్స మయ్యాదియు నయ్యె॥ 155

ఇంటఁ దనవత్స మొకటి, మిన్నేగినట్టి
యాత్మసఖి వత్సమద్ది రెండవదికాగఁ
గొండయందలి లింగం బొకండు మూఁడు
వ్యాఘ్ర శిశువు నాల్గన సాకె వత్సములను॥ 156

అది యావో మరియేమి యానో తనువేమైనఁగా దదావాసియై ప్రిదులంగా నగు జీవుఁ డెవ్వఁడగునో! ప్రీతాత్ములై యెంచి యె య్యది యీ మానవుదేహ మబ్బుటకుఁ జేయఁగా వచ్చు నద్దానినే మదులం దుంచి పొనర్పగా నగు నదే మన్నించు నీ స్వామియుఁగా॥

ఆ తల్లి కడుపునం బడఁ
జేతంబడి తనువునందు జీవుఁ డొకండై
మాత మఱి దాని సఖిగా
నా తల్లియె తల్లియైన యన్యుఁ డొకండున్॥ 158

వా రిరువు రెట్టివారై
యీ రీతిని కోడెలయిరో యెవ రెఱుఁగఁగ నా
సారాత్ములు ప్రౌఢులు నా
వారే జనియింతు రిట్లు స్వల్పమ్ములకై॥ 159

జడభరతుఁ డెంత వాఁడయి
పుడమిని ప్రభవించె లేడి బుడుతఁడుగాఁగన్
గడువయిన తఱికి నెవ్వరి
కడుపునఁ బడవలసి వచ్చుఁ గానఁ డెవండున్॥ 160

శివనందిన్ దమ మేని యందముల మించెన్నాఁగ వర్ధిల్లు న
య్యవి రెడ్డిన్ దనపంట కాపుకులమం దైశ్వర్య సమ్రాట్టుగా
సవరించెన్ మఱి వాని తృప్తికయి తత్సమ్రాట్టు సర్వస్వమున్
శివసేవా మతిఁగొంక కింతయును వెచ్చించెన్ బ్రమోదంబునన్॥ 161

గంగిరెడ్డికిఁ బుత్రషట్కంబు కలదు
పుత్రికా త్రయముండె సంపూర్ణుఁ డతఁడు
ప్రణవమున్ వెల్వరించిన బ్రహ్మ మనఁగ
నతని కేమాత్రమును పట్ట దతని యిల్లు॥ 162

కొడుకులే చూచుకొందురా గొడవలెల్ల
నితఁడు తొడుకుల వాఁడయి యెల్ల వేళ
వాని సంరక్షణంబున వఱలుచుండు
నవియు వానిని భద్రమై యరయుచుండు॥ 163

వెన్ను దృఢమయి పాలంటు విడినయంత
వాని కా రెడ్డిచేయు సపర్య నెంచి

నేటికిని జెప్పుచుందు రెన్నన్నో కథలు
గోవు ప్రేమించు యజమాని దేవుఁజేయు॥ 164

యోగియుఁ ద్యాగి యం చతఁడె యుంచెను నామముగా నఁ బెంచు వో
భోగములెల్ల వానివనఁ బోషణముం బొనరించె, నింటి మే
లోగిర మేదియైన నవియుర్ గల వంచును వందుచుందు రా
యోగమటుండఁ దానెదియు నొప్పును వాని ప్రసాదమన్న నే! 165

తనతోపాటుగ నవ్వియుర్ దినినయంతర్ వానిచేఁ దమ్ముల
మ్మును సేవింపగఁజేయుఁ దిన్నిపయి దాంబూలంబు సేవించు కం
డ్రిని నాతండిడు నాకులందిరొను నా రెంటిర్ గనంజాలు వా
రన ధన్యాత్ములు వారికే తెలియనౌ నవ్వాని సౌభాగ్యముల్॥ 166

యోగియుఁ ద్యాగి యా యూరికే కా దుర్వి
కంతకు నాఁడు వైద్యవరు లయిరి
వాని దర్శనమును వాని సేవయుఁజాలు
నెట్టి రోగంబులనేని బాపు
దేవ గోవైన యా దేవి వత్సంబులు
నందీశ్వరులె యన్న చందమయిరి
దానికిర్ దగ్గఱై తరుణంబునర్ రెడ్డి
పూజించి తగ నచ్చుపోసి విడిచె

నడుగుపెట్టిన పంట యనంతమగును
ముట్టినంటిన బంగార ముట్టిపడును
కన్ను పడెనేని చాలు నిక్కట్లు తొలఁగు
వానిగూర్చిన తత్ప్రజాభావ మిట్లు 167

పెదనందియుఁ జిన నందియు
నెదురుగ గిరిఁ గాంచుచుండు నిచ్చట నెపుడుర్
బెదనంది రోమశార్చితు
నెదనుంచి భజించుచుండు నీశ్వరుఁ డగుచుర్॥ 168

చిననంది యగస్త్యార్చితుఁ
దనయెదఁ బదిలం బొనర్చె; దైవము గనియుక్
దను గన కేగిన వారల
కనుదినముక్ మఱపు దగులు నవసరమగుచో॥ 169

ధ్యానమునందు సర్వకథ తానయి తోఁపగఁ దన్మయత్వ ముం
బూని భజించుకొన్న బుధపూజితు లిర్వురు మెల్ల లేచి యా
లానము నేస్తు లాగినటు లాగిన నందులకై కరంబు ల
మ్లాన సరోజ యుగ్మ ముకుళంబులుగాఁ గయిసేసి యాత్రలో॥ 170

అందఱకంటె నెక్కువగ హాయిని గాంచిరి యీ ప్రదేశ మం
దెందును వాద్యఘోష వినిపింపగరాదని మౌనముద్రతో
నుందురు సర్వులెంత మహిమోన్నతులో యలనాటినందు లా
నందుల యోగశాంతి యనినన్ బరమాదర మెల్ల వారికిక్॥ 171

శివాయనమ ఓం భవాయనమ ఓం నమశ్శివాయ
హరాయనమ ఓం మృడాయనమ ఓం నమశ్శివాయ
చరాయనమ ఓం స్థిరాయనమ ఓం నమశ్శివాయ
యమాయనమ ఓం శమాయనమ ఓం నమశ్శివాయ
దమాయనమ ఓం సమాయనమ ఓం నమశ్శివాయ
ధరాయనమ ఓం జలాయనమ ఓం నమశ్శివాయ 172

పెదనంది దక్షిణాముఖ
మది కనునది దక్కనంపు టభవుని మలగాన్
విదితోత్తరాభి ముఖతను
బొదలుక్ జిననంది భైరవుని కోనకునా॥ 173

తనదైన మగస్త్యార్చితుఁ
డన నాతం డచట నుండె నాయని యన్నక్
గనవచ్చు నేమొ యచటను
గన వచ్చుక్ స్ఫుటముగాగ కైలాసమునక్॥ 174

కాశిని వీడివచ్చి కలకాలము దక్షిణ మందె నిల్చి యా
కాశిని విస్మరించుటది కాదని నిత్యము సంస్మరించుచున్
దేశికుఁ డాత్మ శిష్యుఁడుప దిష్టుఁడుగాఁగ విధేయుఁడౌటఁ ద
త్కాశిని చూచుచుండుమని కట్టడ చేసెనొ యేమొ ప్రీతిమై॥ 175

## కాళంగి మడుగు

ఇప్పటి దాఁక తూర్పు దెస కేగిన జాతర దక్షిణాన కిం
కిప్పుడు మళ్ళు నీ దెస మహేశ్వర శైలము చాల ముఖ్యమై
యొప్పును జూడఁ దగ్గ నిధులున్నవి కాని శ్రమైక సాధ్యముల్
తప్పక చూతమన్న మతి తగ్గి యనేకులు చూడఁబోరహో॥ 176

దక్షిణమునకుఁ ద్రిరిగిన దాపునందె
తగులు కాళంగి మడుగు సంతర్పణముగ
నచట సంవాహకులకు నాహార మొసఁగు
చుంద్రు; యాత్రికావళి సమాహూత ముఖ్య॥ 177

జనము లన్నట్లు పల్లెల జనము లిచ్చు
మజ్జిగలు పానకంబులు మంచినీళ్ళు
లేఁత కొబ్బరి బొండంబు లేతదాద
రాపగా వారి నోలాడి యంది కొంద్రు॥ 178

కాళంగి మడు గనంగనె
కాళింది యె స్మృతికి వచ్చుగాని యదే యీ
వేళకు నిల్లైనటు లా
కేళీమోహనుని స్మృతిని గికురింతలగున్॥ 179

కాళంగి యనెడి పెనునది
కీ లీలన్ జనుజలంబు లిచ్చుట మడుగై
వాలుట యాత్రిక జనముల
కాలో గంగేశు కరుణ యందిన యట్లై॥ 180

ఆట విడు పన్న యట్లుగా నయిన శ్రమము
సర్వమున్ మాసిపో సముత్సాహమునను

వివిధ కేళీ విలాస సంవిత్ప్రభావ
భావితాత్మత నానంద భావులగుచు॥ 181

ఉందురు కొంతసేపచట నూరని యేదియు లేదు చెంత పెం
పొందిన యేఱొకండు జల మున్నది పాఱుట సానుకూల మౌ
చందముఁ బట్టి చుట్టుగల జానపదుల్ పది మంది యొక్క చో
పందిరి గట్టి స్వామి తమ వాఁడయి నిల్చుట కింత సేయుటల్॥ 182

పవని వారగ్రహారంబు నవనివారు
కోవ నూరి వారలు నింకఁ గోరువారు
కూడి సంతర్పణమ్ము మిక్కుట మొనర్ప
నంది కొందరు కొంద ఱానందముగను॥ 183

గిరి చుట్టుట వ్రతమని యో
గిర మేదియును గొనక శివకృప శక్తి సము
త్తరమై తోడుపడగ నా
గురు శిష్యులు నామ సుధనె గ్రోలిరి యచటన్॥ 184

నామ సుధాశనంబున మనంబుల కయ్యెడి మోదమెంత యేన్
స్తోమతునిచ్చు భక్తిమెయి దూరము లెంచక శైలమందు నే
మేమి విశేషముల్ గల వవేవియు వీడక చూచి కొల్చి యా
స్వామి కృపా విశేషమునఁ బారము నందికొనం దలంచుచున్॥ 185

ఉపవాసవ్రతమూని వారి వలెనే యుత్సాహ మొప్పన్ సదా
త్రిపురేశీ కరుణా మహత్త్వమున నార్తిం బొందకే మాత్ర మ
చ్చపు భక్తిన్ గిరి చుట్టు సాధువుల కాశ్చర్యంబుగా శీత శై
లపు శృంగాగ్రము సర్వమర్మముల నుల్లాసంబుగాఁ దెల్పెడిన్॥ 186

అన్నము నీరు కావలయు నన్న మయాంగము పుష్టినందినీ
కన్ని విధాలఁ దోడుపడ నన్నది సత్యమ యయ్యు దాని యం
దున్న సుఖాత్ముఁడే సుఖము నొందును వాఁడు సుఖస్వరూపుఁడై
యన్నము లేకపోయినను హాయిగ నుండును స్వస్వరూపతన్॥ 187

మానవదేహ మిద్ది బహు మర్మయుతంబయి బుద్ధిమంతుఁడుఁ
దాని రహస్య మారసి యిదం విధమంచు నెఱుంగ కుండు న
ద్దాన మనోవిచారమునఁ దత్త్వమెఱుంగుట శాస్త్ర దృష్టిమై
పూనిన యప్పుడే పొసగు బుద్ధికి శాస్త్రమె యంకుశంబగుఁ॥ 188

ఏతచ్ఛాసన మొప్పకున్న యెడ నిన్నే దారి బుద్ధీంద్రియ
ఖ్యాత జ్ఞాన సహాయ కోపకరణగ్రామమ్ము పట్టించునో
చేతం బూరక కుప్పిగంతులిడి నీచే నేమి చేయించునో
యేతన్మాత్రుల కేరికిం దెలియ దింకే దిక్కు లేకుండెడిఁ॥ 189

మానవబుద్ధి కందని ప్రమాణము లెవ్వియు నంద లేని వి
జ్ఞాన మొసంగ దైవకృప శాస్త్రము దైవమెయౌచు వేద రూ
పాన పరంపరా శ్రుతిగ వచ్చి సముద్ధరణైక దీక్షమై
వీనులఁ జొచ్చుచుండ వినిపించుకొనన్ దలపోయకుందువే! 190

పూర్ణము భూమమైనయది పొచ్చెము లేనిది నిత్య సత్య మే
కార్ణవ మట్టు లన్య మెదియైనను దోఁపని దద్ది మూలమై
ఘూర్ణన మొప్పినట్లయి యగోచర మౌచుఁ దరంగ పంక్తి సం
కీర్ణత భిన్నభిన్నముగఁ గేళిగఁ దోఁచియు నిశ్చలాత్మయౌ॥ 191

ఆత్మానంద మహాంబుధి స్ఫురిక భిన్నాకారమాత్రుం డన
న్యాత్మ స్థైర్యమునంది యుండక విభిన్నామోద మాశించి యే
కాత్ముం డయ్యును పంచకోశములు మోపై నిల్వ నవ్వానితో
స్వాత్మన్ శుద్ధ మొనర్చి కొంటయగు నీ సంసార మూహోత్థమౌ॥

అన్నప్రాణ మయాత్మతన్ దరియుచో నాకొంట యాగాని తా
నున్నన్ జ్ఞానమయాత్మతన్ దనువహో యున్నట్టు లేయుండ దం
తన్నిల్పొందక లోనలోనఁజని స్వాస్థ్యంబందికోఁ జాలినన్
మన్నన్ మిన్నని భిన్నతాస్ఫురణమే మానున్ మహానందమై॥193

# అంజూరివారి మంటపము

గురుశిష్యుల్ తమలోన తామగుచు నాగోష్ఠిన్ నిమగ్నాత్ములై
చరణంబుల్ తమయంత సాగఁజనుచున్ స్వానంద చిన్మూర్తులై
దరియంజాలిరి సుప్రసిద్ధమగు యాత్రామంటపస్థాన మా
దర మొప్పన్ ప్రజదాని నిప్పటికి సందర్శింతు రాపేక్షతో॥ 194

ఎన్నినాళ్ళయ్యెనో కట్టి యెఱుఁగ మంతె
ఇప్పటికిఁ జూడఁదగును సేవింప నగును
స్వామి పరివారమంత యాస్థలమునందె
భోజనమ్ములుచేసి తృప్తులగుదురటె॥ 195

చోటు విస్తృతమైన యంజూరివారి
మంటపమ్మున స్వామియు నుంటఁజూచి
భక్తి సేవించుకొని యాత్ర వారికెంతో
ప్రీతి నాతిథ్యమిత్తురా వీళ్ళప్రజలు. 196

శిథిల మగుచున్నదది నాటి శిల్పివరులు
స్వామి వేంచేయుచోటు లాశ్చర్యపఱచు
చుండ వలెనని పైయంచు చుట్టు రాతి
చక్రముల గొలుసులు సరసముగ నిడిరి! 197

మూల లందునఁ ద్రుంపులు వ్రేలునిపుడు
పూర్ణతోరణమైయున్న పోలుపు తలఁచి
వారి భక్తికి శ్రద్ధకు వారి శిల్ప
చతురతకు మెత్తురెల్ల రంజలుల నొసఁగి॥ 198

చాల పొడుగైన రాతిపై చాలుగాగ
చక్ర మొక చక్రమందు ప్రసారితముగ
చక్రపంక్తిని చెక్కి ప్రశస్తముగను
మొత్తమంతయు గొలుసుగా నెత్తికట్టి॥ 199

మూల రాళ్ళను మున్ముందె చీలదీసి
వానితోపాటు గొలుసు నేర్పాటుచేసె

నింత పనిచేయు శక్తి తానెంత వలయు
శక్తి యెంతైన నింకెంత భక్తివలయు? 200

ఇచ్చటి కించుమించు సగ మేగిన యట్లగు చుట్టుదారి తా
రిచ్చట విశ్రమించి జగదీశ్వరు లీ గిరి కంచువెంటఁ బో
కచ్చట నచ్చటన్ దగులు నార్ద్రిమనస్కుల పల్లె పట్టులన్
ముచ్చట లందుచుణ్ జనుట మోద మొసంగును యాత్రికాళికిణ్॥

బండలు గుల్కరా ళ్ళిసుముపట్టులు ముళ్లు తొలంగి యింక పై
నుండెడి దారి యంతయును నూఢ్పలు సాగెడి పంటచేలుగా
నుండ సుఖావహంబగుట నొందిన క్లేశము విస్మరించి పై
నెండయుఁ దగ్గుమో మగుట నెంచుచు హాయిగ పోదురెల్లరుణ్॥

స్వామి వెంటనుండి శైలమ్ము చుట్టుట
చాలా మంచి దది ప్రశస్తమగును
వారివెంటఁ దిరిగి వచ్చుట యన్నచో
రాత్రి ప్రొద్దుపోయి రాక యగును॥ 203

స్వామి కదలుటకునె పట్టు నాలస్యంబు
దారియందుఁ జాల స్థలములందు
నాగవలసి యుంట నాలస్య మింకింత
యగుటఁ జాలమంది యట్లు చనరు॥ 204

ఆ దినాన నుదయమందు దేవళమందు
స్వామి దర్శనమ్ము చక్కఁజేసి
ప్రొద్దు పొడుపువేళ పురనిర్గమన మొప్పఁ
గొండచుట్టువారు కొందఱుంద్రు॥ 205

వారు కొండచుట్టి వత్తురంతియె కాని
చూడవలయు వానిఁ జూచిరారు
స్వామికంటె ముందు త్వరగ నిండ్లకుఁ జేరి
విశ్రమింపవచ్చు నశ్రమముగ॥ 206

చూడవలయు వానిఁజూచి రావలెనన్న
స్వామి వెంటఁబోవ సాగిరాదు
అన్ని యొక్క దినమునందె చూచుటకూడ
సాధ్యపడ దదెంత శక్తులకును॥ 267

దినము నొకటి రెండు తీర్థమ్ములకు నేగు
చెల్లవానిఁ జూతు రెల్లవారు
పరమ యోగులైన గురుశిష్యు లిర్వురు
సర్వ తీర్థసేవ సలిపిరెట్లొ॥ 208

స్నిగ్ధ హృదయ వాసి శ్రీ కాళహస్తీశుఁ
డమల హృదయ కమల మందు నుండ
సర్వ తీర్థ సేవ సలిపిన వారౌట
దేవసేవ తీర్థసేవ జరిగె॥ 209

## పంచ ముఖ దర్శనము

చిన దూరంబునఁ గ్లిష్ట మార్గమున విక్షేపంబు లేకుండ సా
గినచో శైలము నందొకా నొకట భక్తిన్ పంచవక్త్రాస్య పం
క్తిని వీక్షింపఁగ వచ్చు నైదగుచు సాగెన్ గొమ్ము లవ్వాని న
ట్లను భావమ్ము జనించునట్లు నిలఁజేయన్ జాలు వాఁడెవ్వఁడో॥ 210

శివుఁడే తానయి కొండగా నిలుచు వాసింగాక యీ యైదుఁ ద
ద్భవ పంచాస్యములై స్ఫుటంబుగను దోఁపం గారణం బేమి? సం
భవ యాదృచ్ఛికతన్ నిజం బెఱుఁగు తత్త్వావిజ్ఞ్యా హైన్యంబు కా
క వియేన్ సృష్టి యదృచ్ఛగా నగు నె విశ్వేశుండు తానుండఁగన్॥

సద్యోజాతము వామదేవము నహో సౌమ్యాతి సౌమ్యంబు సం
పద్యోగ ప్రదమౌ నఘోరమును దివ్యత్వైక తత్పూరుషం
బాద్యంబై మహిమాన్వితంబయిన యూర్ధ్వాస్యంబు నీశానమున్
విద్యోతంబయి కొండ కొమ్ములుగ విప్పెన్ శైవ మర్మమ్ములన్॥ 212

సద్యోజాత శివా! హృదంబుజభవా! స్వానంద చంద్రోజ్జ్వలా!
హృద్య ప్రోద్య దుదార సాంద్ర కరుణా! హృజ్జాత భస్మప్రియా!

సద్యో ముక్తికరా! సమస్త శుభదా! సారాచ్ఛ కర్పూర వా
స్సద్య స్స్నాన సువాసనాలహరికా సంస్ఫాలితా శాంచలా! 213

ఉన్నా విచ్చట పశ్చిమాభి ముఖ సద్యోజాత వక్త్రుండవై
కన్నారన్ గనుచుంటి వెల్ల జగతిన్ గైవల్యదాతా! శివా!
నున్నాఖిల సమస్త పాపచయు నన్నుంజేసి త్వత్పాద దీ
వ్యన్నాళీక చరిష్ణు షట్చరణ భావం బందగాఁ జేయుమీ! 214

స్వామీ! సుందర వామదేవగిరిశా! సంసార నిస్తారకా!
కౌముద్యాప్లుత పాండురాంగ విభవా! కారుణ్య రత్నాకరా!
శ్రీమన్మోహన కుంకుమాంకిత లసత్ స్నిగ్ధేందుఫాలా! జగత్
కామ వ్యాకృత సర్వ జీవ నివహా! కల్యాణ సంపత్కరా! 215

శివమయ చిద్విహార సరసీరుహ లోచన వామ దేవమై
భగవత సర్వజీవ పరిపాలన దక్షము వాసుదేవమై
యవన మొనర్చు నీ మహిమ మద్భుతమున్ జగదేక భద్రమున్
కవివర సుధ్యుపాస్యుఁడవు కామితదాతవు నేటి కోర్కివే! 216

కుటిల భ్రూయుగ భంగ సంగత ముఖాఘోరా! నిటాలేక్షణా!
పటు దంష్ట్రాయుగ దర్శనోగ్ర భుజగ భ్రాజిష్ణు కర్ణద్వయా!
చటులాంహో దళనైక దీక్షిత శిఖాజాల జ్వల ద్ధూర్జటీ!
కటురూప స్థిత శాంత తేజ! నిజభక్త శ్రేణి సంరక్షకా! 217

ఘోరంబయ్యు నఘోరమా ప్రకృతి నీకున్ నిత్యమయ్యా! మహా
ధీరా! పై పయి రూపమే భయదమా ధ్యేయాత్మ సంస్థాన మం
దారామంబె స్వభావమై విషమమై వ్యాకీర్ణమా సృష్టిలో
క్రూరాకారము తాల్చి లోకముల సంక్షోభంబు వారింతువా॥ 218

సంవర్తాగ్ని తటిత్ ప్రదీప్త కనక ప్రావాభ తేజోమయా!
సంవిన్మోహన సామవేద జనకా! సర్పావళీ భూషితా!
సంవేశారుణ పద్మ! తత్పురుష భాస్వత్పూర్ణవక్త్రా! జటా
సంవేగాద్భుత చంద్రశేఖర! కృపాసార ప్రవర్షద్గిరీ! 219

పురుషుఁ డనంగ నీ వ తలఁపుం బడి వత్తువు గాన నిన్నె త
త్పురుషుఁ డటంచుఁ బేర్కొని వధూసహితాత్మ వపు స్స్వరూప మె
ప్పురుసున దాపరానిదయి ప్రజ్వరిలన్ నినుగన్న ధన్యులో
పురుషవరేణ్య! గణ్య గుణ! ప్రోవుము మమ్మని వేడికొంటయా॥ 220

శాంతాకార శివా! పరాత్పరతరా! షట్త్రింశ తత్త్వాత్మకా!
స్వాంతస్ఫాటిక శుద్ధలింగ! పరమేశానోర్ధ్వ వక్త్రా! స్రవత్
ధ్వాంతా విష్కృత కోటి సూర్యసమభాస్వత్తేజ! శశ్వత్కృపా!
చింతాంతస్స్ఫుట తత్త్వ సుందర శివా! శీర్షస్థితేందు ప్రభా! 221

ఈశానుండు సమస్త విద్యలకు భూతేశుండు సర్వేశ్వరుం
డీశా! బ్రహ్మవు నీవె నీవె సకలం బీ విశ్వ మందంతటన్
స్వీశ ప్రాభవ మొప్ప నీ వెసగి నీ వే మాత్రమున్ గాని య
ట్లాశా పీడిత జీవలోకమును మాయన్ ముంతు వాత్మేశ్వరా! 222

## శేషాచల దర్శనము

తెఱవాయి మెకము విరివిగఁ
దెఱచెను నోరన్న యట్లు దెప్పర మగుచున్
గిరి తెఱచిన సింహాస్య
స్ఫురదంతిక మందు కూరుచుండి ధురీణుల్॥ 223

శివ పంచాస్య నుతి ప్రవీణ మతులై చిత్సాగ రోల్లోల వీ
చి వశాత్ముల్ చిరముండి శాంతిగని వాసింగొంత దూరంబు పో
నవశంబై కనవచ్చు నయ్య దదిగో యానంద ధామాఖ్యమా
భువనాలోక్య విమాన శేఖరము చూపుఁ నిల్పి చూడం దగుఁ॥

షట్చక్ర పథి సహస్రారంబు కొనఁ జేరి
యందున్న యద్వైత హంసమందు
లీనమై పోవు న ట్లానుగా నేడు కొం
డల నెక్కి శ్రీ వేంకటయ్యఁ గొలువ

నా స్వామి యీ స్వామి యాలయంబున స్వామి
యభిముఖస్థితి దేవి యలరు నట్లె
పశ్చిమ ముఖమొప్పి ప్రాఙ్ముఖంబయి యొప్పి
యన్యోన్య సందర్శనాభిలాష

నెన్నికోట్ల యుగాలయి తృప్తి నెనయ
కట్టె పరవశింతురు వారి నే మనఁగ వలయు
పీను మిగిలెను గాక శ్రీ వేంకటేశ
పదమె శ్రీకాళ హస్తీశ పదము తెలుపు॥ 225

బాలాజీ యనఁ బల్కుచున్ లలితభావంబంది హారిద్రవా
ర్మాలా ధారల శుక్రవారముల ప్రేమంబార దోగాడుచున్
లీలామోహన దృఙ్మయూఖముల కేళిన్ స్వామినాడించుచున్
దేలున్ దాను ప్రమోదసాగరమునన్ దేలించు ప్రాణప్రియున్॥226

కరుగం గాచిన స్వర్ణవాహిని యనంగాఁదోఁచునా వెల్గు బం
గరు వెల్గుల్ పెనగొన్న చిత్తములతో కైలాస గిర్యంతిక
స్థిర వెల్వడ్డ యనంతరంబు గురువున్ శిష్యుండు సమ్మోద సం
భరితస్వాంతులు దక్షిణాభిముఖులై పాంథాళి వెన్నంటిరన్॥ 227

అంతవఱకును వర దక్షిణాభిముఖము
గాగ నుండినదారి ప్రక్కకును దిరిగి
పడమర మొగంబు గానయ్యె బడలికలను
పాయఁ జేయంగ వచ్చె దివ్యస్థలంబు॥ 228

స్వామియు సహస్ర లింగేశ వర పురంబు
చేరి విశ్రాంతి గొనుచున్న వారనంగ
దూర మందుండి వినవచ్చె భూరివాద్య
ఘోషముల్ భక్త జనుల యాఘోషణములు॥ 229

శివ శివ శంభో
శంభో శివ శివ!

1. ఉన్నావని నిను నమ్మి కొలిచినా
నష్టము లేదయ యెవ్వరికీ

2. ఉన్నావని నిను నమ్మిన యప్పుడు
ఉండక తప్పవు పుణ్యాపాపములు

3. పాప ముండి పరమేశ్వరుఁ డుండిన
నరక యాతనల నందక తప్పదు

4. తెలిసి తెలిసి పాపములు చేసినా
తీవ్ర శిక్షలను బడయక తప్పదు

5. శివుఁడున్నాఁడని శిక్ష వేయునని
భయముండిన యెడ పాపము చేయఁడు

6. మానవు లెల్లరు మంచిగ నుందురు
శివకృప కలిగిన దేవత లగుదురు.

శివ శివ శంభో
శంభో శివ శివ! 230

## మార్కండేయ తీర్థము

ఉత్తరమున్ గనుంగొనుచు నుంటిమి కొండ శిరంబు నెత్తెనో
యెత్తుగ నన్నయట్టు లదె యెత్తిరి ప్రాఙ్ముఖమైన గోపురం;
బిత్తటి నొంటి గోపురము నేల శ్రమంపడి కట్టి నారలో?
చిత్తము స్వస్థమై పరవశించును చూచుచు నున్న యంతలో॥ 231

ఎడముగ రెండు తాళ్ళ పయి యెత్తున నుండి జలంబు ధారగా
పడుచు నధోమహిన్ విడిది పట్టన, విచ్చిన తల్లి గుండె నాఁ
బడియ యొకండు కట్టి ననుపారు జలంబులు జాలువారు వె
ల్వడిన కృపారసంబునఁ బాలంబులఁ దన్పుచు నున్నయట్టులై॥ 232

ప్రక్కఁగ చిన్న దేవళము ప్రాంతము లంతట పచ్చచెట్లు కై
పెక్కఁగఁ జేయు శాంతిగల యట్టి మనోహర దేశమందు నే
మక్కఁజ మొంద తెందఱో మహాత్ములు నిల్చి తపించి యుందురా
పెన్కఁవ కంటి వాని దయఁ బేర్మి వహించియ యుంద్రు ధన్యులై॥

మంగళాయన తీర్థ మీ మహిత జలము
కడిగి వైచును పాప పంకముల నెల్ల
దర్శనమున నె మదులు శాంతత వహింప
స్నాన పానమ్ము లిఁకఁ జేయఁ జాల వెద్ది? **234**

పదునా ఱేండ్లకె మృత్యువందనగు దౌర్భాగ్యంబునన్ బుట్టి యా
పదకున్ జంకక బాలుఁడయ్యును మహాప్రాగల్భ్యమున్ జూపి త
ప్పిద మయ్యెన్ సరి దిద్ది కొందుమని సంప్రీతాత్ములై దేవతల్
ముదముం గూర్పగ నిత్యజీవి యగు నా మున్యగ్రణిన్ గొల్చెదన్॥

పట్టుం బట్టిన నట్లు పట్టవలె దేవా! నిన్ను మృత్యుంజయా!
పుట్టున్ నెట్టు టదెంత ముక్తిఁగనుటొప్పౌంగాక యీ భూమి యం
దెట్లేన్ బుట్టు సమర్థతా తనువు స్వాధీనంబు నందుండగా
నిట్టే యందును నిత్యజీవి నయి యుంటే యెంతో గొప్పా గదా! 236

ఆయువు మాటన మార్కఁం
డే యాయువె స్మృతికి వచ్చు నెప్పటికిని దీ
ర్ఘాయువుఁ గోరెడి పట్టుల
నా యుష్మత్ప్రథమగణ్యుఁ డతఁడె స్మృతుండౌ॥ **237**

కేదారేశ్వరు సన్నిధానమున భక్తిన్ వ్యాస కణ్వాత్రి ము
న్యాదుల్ చేరి సమర్చలన్ జలుపుచో నందున్న మాసీంద్రు లం
దీ దీర్ఘాయువు నేరనట్టు లొక సందేహంబు వెల్వెటె వ్యా
సాదుల్ భిన్న విభిన్న రీతుల సమస్యన్ విప్పి రప్పట్టునన్॥ **238**

ఏ పాచితము నొనర్పక
పాపావళి హరణ దక్ష పరదైవ మొవం

డీ పావుల కెల్ల రకును
గాపై యభయం బొసంగు ఘనుఁడెవ్వాఁడో॥ 239

పుట్టిన ప్రశ్న మొక్కటియ పో వినువారలు భిన్న మార్గముల్
పట్టి వచించినన్ మనసు స్వాస్థ్యము నందక చిక్కు హెచ్చి చూ
పట్టిన బాధమాన్ప పెనుబాధ భరింపక తప్పనట్టులై
యెట్టు లసంశయాత్మకత యేర్పడునో యని కుందుచుండగన్॥ 240

అతఁడు యదృచ్ఛగాఁ జని మహాత్ము నగస్త్యునిగాంచి యాత్మలో
సతతము సల్పుచున్న తన సంశయమున్ వెలిఁబుచ్చ నాతఁడున్
స్మిత వదనారవిందమునఁ జిందులు ద్రొక్కెడి బ్రహ్మతేజమై
"యతివర! నీవు నిట్టి మతి నాతురతంగను టెంత మాయయో? 241

తెలియని వాఁడవే నిశితధీక! మృకండు మహర్షి పుత్రతన్
వెలసి పదారు వర్షముల వెంబడి మృత్యువు పట్టఁబోవ భీ
తిలయక దేవదేవు శుభగోదయు శంకరు లింగరూపు ని
స్తుల దృఢభక్తిఁ గొల్చి వరదుండు నినున్ దయఁ జూడ మంటివే! 242

ఎవని దయా విశేషమున నింతటి దీర్ఘతమాయు వందితో
యెవఁడు కృపా సముద్రుఁడయి యెల్ల జగమ్ముల కిమ్ముగూర్చు నా
శివుఁడె పరాత్పరుం డగును శ్రీ శివదేవుని మించుదైవ మీ
భువనము లందు లేఁడు పరిపూర్ణమతిన్ శివభక్తి నిల్పుమీ! 243

గోత్రకులాబ్ధి సోముఁ డడుగో జము దిక్కున వెండి కొండ స
ర్వత్ర నిలింప వాసమయి రమ్మని పిల్చెడు మంగళాయన
క్షేత్ర మొకండు రమ్యమును సిద్ధిదమై వెలుఁగొందు నందు నీ
వాత్రము తోడఁ జేరి సకలాత్ము శివున్ భజియింపు మూర్తిమై॥ 244

జ్ఞానదాత శివుండు విజ్ఞాన మూర్తి
జ్ఞాన సూనాంబ తోడ సాక్షాత్కరించి
ఆశ్రితాళికి జ్ఞాన సాధ్యాభయమ్ము
నొసఁగగా స్వయం భువగుచు నుండు నచట॥" 245

అనుచు హితంబు చెప్పి కరుణాళుత దారిని జూపఁ జేరి యా
ఘనుఁడు మనోహరం బయిన కానన తీర్థము మంగళాయనం
బను పదమే శివుఁ నిలిపి యర్చన సేయుచుఁ జేయుటందె తాఁ
దనువు మనంబు సర్వమును దన్మయమై లయమంద నిల్చినన్॥ 246

శివుఁడు చిదంబరంబునను జిన్మయుఁడై స్ఫురియించె మానికిన్
శివ కృప సర్వసంశయ విశీర్ణత నంది జగంబు సర్వమున్
శివమయ మాచుఁదోఁపఁ బరి శిష్ట మొకింతయు లేమి సర్వదా
శివుఁడయి సంచరించెను వశిప్రకరాగ్రణి స్వాత్మనిష్ఠతన్॥ 247

మార్కండేయ సమర్చితుండగు నుమాంబా నాథుఁడీ నాటికిన్
మార్కండేయ శివుం డనం బఱగు సమ్మాన్యాగ్ర యా తీర్థమున్
మార్కండేయ జలాశయంబయిన దీ మాంగళ్యదక్షేత్ర మా
యర్కేందు గ్రహతారకావధిగ సేవ్యంబౌను భక్తాళికిన్॥ 248

శివ శివ యంచు నొక్కపరి చిత్తము నిల్పి జలాన మున్గుచో
నవశతనంది నీ వచటె యార్ద్రి జలాశయ రూప శైవహృత్
ప్రవిమల పుండరీకమున వాలిన భృంగము చందమాచు లే
వవు నిను నెవ్వరుఁ బిలువ వచ్చెడు వారలు లేక యున్నచో॥ 249

అట్టులె యుండిపోవు పరమాద్భుత పుణ్యము కోటి కొక్కఁడే
దట్టునకో తటస్థపడు తక్కిన వారలు శుద్ధ చిత్తులై
గట్టున కెక్కి శైవమగు గట్టును చూచుచుఁ జొక్కి పోదు రా
మిట్టను నెక్కి గోపురము మిన్నును దాఁకఁ దదంతరంబునన్॥ 250

## వేయి లింగాల కోన

తామును నిల్చి లోయబడి తాకెడి మంద సుగంధ శీతల
స్వామి ముఖోద్గిరన్మధుర వాయువు లల్లన ప్రేమమీర రా
రా మనుజార్భకా యనుచుఁ ప్రాణ మయాత్మత గాగిలించి న
ట్లై మహి యెల్ల విస్మృతి పడన్ నిలుచుందురు గ్రావ జీవులై॥ 251

గోపుర మెందుకున్నది యోగో యనుకొంటిమి కాని యిప్పుడా
గోపుర మున్నయందున నె గో జగతీ సుఖ మబ్బె నంచు సం
తాపము లన్నిటిన్ మఱచి తద్ఘన శిల్పికి ధన్యవాదముల్
దాపక యందఁజేయుటకె తాపము నందెద మజ్ఞతా మిషన్॥ 252

పెద్దలు చేయు కార్యములఁ బెక్కు ప్రయోజనముల్ కనందగున్
దద్దయుఁ బెద్దగోపురము దారిని బోవు సమస్త భూ ప్రజన్
నిద్దుర మేలుకొల్పి యిట నిల్చి నిరీక్షణ సల్పుదైన, మీా
ప్రొద్దున నీవు వచ్చితివ! పొమ్ము, సరాసరి రమ్ము! రావొ? పో॥ 253

ఉన్నా నిక్కడ నుంటి నంచు నిను నూకోఁ జెప్పుచుంటిన్ మఱిన్
సన్నాహంబున పెద్దగోపురముతో సంసార మందీవు నే
కన్నం బందునఁ జిక్కినన్ దెలియగాఁ గైలాస మైయుంటినూ
యన్నట్లింతయు ముచ్చటించుచు నిజాంతర్యమ్ము చాటించెడిన్॥

ఇంతటి పెద్దకొండ కల దెచ్చట గోపుర మున్న యట్లుగా
నింతయుఁ దోఁప దిచ్చటొక చోఁ గడుచోద్యముగాగ నున్న, దే
మంతటి ముఖ్యమైన విషయం బొకఁడిక్కడ నున్నదో? యదే
స్వాంతము విచ్చుకొన్న యటు స్వామి నివాసము కానవచ్చెడిన్॥

ఓహో యెంతటి రమ్యమైన వన మీా వ్యూహాచల క్షేత్ర మం
దాహా పుట్టగఁజేయు! బాహ్యమున గ్రామానీక మాత్రంబె యై
యీా హార్ద స్థల మందు స్వామి దయతో నెన్నెన్ని భూజంబులో
యూహాతీత మనోజ్ఞమై తనరు నీ వున్నావయా దేవరా! 256

ఈ గండ శిలలలో నే గతిం బ్రభవించి
పాఱుచున్నవి కొండవాగు లిన్ని
మందు ధట్టించి మర్మచ్ఛిద్రాగ్ని రగిల్చి
ననుగాని బీటివ్వ ననెడి శిలలు
పరమ కోమల పుష్ప ఫల సమన్విత వృక్ష
పంక్తుల నెట్లు వెల్వడగఁ జేసె
శాంత గంభీర నిస్స్వనమైన యీా కోన
యీా కొండ కడుపులో నెట్లుదాగె

‘వంచతే పరివంచతే’ యంచు శ్రుతి వ
చించు మాట తప్పగునె ప్రపంచ మందు
సర్వమున్ నీవు చేయు వంచనమె యగును
స్వామి కరుణించి మాకు నిజంబు తెలుపు॥ 257

మంచి పట్టు కంటె మాయ పట్టున కెప్పు
డెక్కు వయిన మిసిమి యెక్కు కలుగు
జగతి మోహ వశత జాటిపోవును మాయ
మంచి పట్టునందు మసలలేక॥ 258

మంచి నిరస్త భేదమయి మానుగ నిర్మల మాచునుండి ని
ర్వంచితులైన వారి యెడ వాలి శుభప్రద వైఖరిం జనన్
మించి సహాయ మాచుఁ దన మేలిమి చూపుచు మెల్లమెల్లగా
సంచిత పుణ్య మంతయును సత్ఫల మీయఁ దరింపఁ జేసెడిన్॥ 259

మంచి లభించు నిచ్చటని మర్మము నర్మిలిఁ దెల్పు పొంటె ని
ర్మించి శిల్పు లా గిరిని మేలిమి గోపుర మద్దియే కదా
వంచితు లౌచుఁ బోవు బుధవర్గము నాపి యిదేమి యంచుఁ బ్ర
శ్నించు కొనంగఁ జేసి గమనించిన మీఁదట లోనికిం జనన్॥ 260

ప్రేరణ కల్గఁ జేసినది; ప్రేరకుఁ డెవ్వఁడు? గోపురంబ? యా
దారిని బోవనీక యిట దర్శన యోగ్య మహత్త్వ మున్నదే
వారును పీ రనన్ వలదు వచ్చి పరాత్పరు గొల్చి సర్వులున్
ధీరత మంచిదారి బడి తేరి కొనుండని తెల్పుచున్న దే! 261

జడ మది దాని కట్టి గురు శక్తి యెటుల్ లభియించె వాయి లే
కడుగుల నాపి నన్ను గనుఁడంచును నిల్పి హితోక్తి పల్కె, నే
ర్పడిసది బుద్ధి, లోనికిని వచ్చితి, వందితి వాత్మబోధ, తో
డ్పడినది మంచి కంచు బుధ వర్గము దానిని గొల్తు రిచ్చమై॥ 262

జడమైనన్ గల యున్కి చేత నది ప్రోత్సాహంబు కల్గించె న
ప్పుడు తత్త్వజ్ఞులు ఉన్కియున్ దెలివియున్ బూర్ణంబెయా

బ్రహ్మతో

బడి రానైన నిరస్తమాయిక మహాభావ స్వరూపంబె యర్థ
నుడి వెంటన్ గుఱుతింతు రంతయును మనో్ష మినో్న బ్రహ్మంబెయా

దీనినే వేయి లింగాల కోన యందు
రిందె సర్వాత్ములైన ఋషీశ్వరాళి
కాప్తులై పరమాత్మ యత్యంత కరుణ
కేన మను శ్రుతి వినిపించు కేళి జరిపె॥ 264

కానగరాని బ్రహ్మమును గానగ వచ్చును కేనమందు న
ద్దానికి మించు జ్ఞాపకము తత్త్వనిరూపక శాస్త్ర పంక్తి నొం
డేని కనంగ రాదనుచు నెంతురు పెద్దలు నేఁడు గూడ నీ
కోన వినంగఁ జాలుదు మకుంఠిత భక్తిని నిల్చి యాశ్రుతిన్॥ 265

ఇచట కల దిప్పటికిని యక్షేశ లింగ
మది గుహాస్థితం బయి యుండు నద్భుతముగ
దాని గని కేన మను శ్రుతి వీనుదోయి
వినుచును సహస్ర లింగేశు వినుతభక్తి॥ 266

నిత్య మర్చించు కొనుచు నున్నిద్రమతులు
తత్త్వ వేత్తృత పరమార్థ తత్పరులయి
చీకు చింతలు లేక వసించి యుండి
చారి తార్థ్యంబు ఘటియింత్రు జన్మములకు॥ 267

పూర్వ మీ స్వామి నిత్య సంపూజితుండు
కాళహస్తీశ్వరునకు నగ్రజుఁడగుటను
వేయి లింగాల స్వామికే వినికి పెద్ద
వృద్ధతా దోషమున నేఁడు వెనుకఁ బడియె॥ 268

కేనము విశ్రుతంబయిన కేళి మనోజ్ఞము, కేన మంతకున్
వీనుల విందు రెండు నిట విందును గన్న మహాత్ములున్నచో
లేనిది యేమి వారి కిఁక? లీలఁగ బ్రహ్మమె యయ్యు బొందులన్
బూనియ యుందు రేమియు నపూర్వత లేనటు లాత్మనిష్ఠులై॥ 269

ఇంద్రుఁ డొకప్డు దానవుల నెల్లర కీటడగించి మించుచో
సాంద్ర ముదంబు నంది తన శక్తిని దాను జయంబు గొంట ని
స్తంద్రతఁబల్కుచున్ దివిజ సంఘము వెంబడి గొల్చిరా వనీ
సాంద్రత కచ్చి యిందు దివిజద్విపమున్ విడియించి నిల్చినన్॥ 270

యక్షు గుహా యున్నచో మహాద్యక్షు మొకఁడు
దివ్య తేజానఁ దోఁచి సందిగ్ధ మతిని
ఇంద్రుతో పాటు దేవత లెల్ల వారు
భ్రాంతి పడఁజేసె స్వీయవైభవము తెలుప॥ 271

ఇంద్రుఁ డద్దాని జూచి యిదేమి వింత
యెన్నఁడున్ జూడఁజాల మిదేమి వెలుఁగు
ఎవ్వరింతకు హేతు వం చెఱుఁగ రాక
తనకుఁ దెలియంగ రాకపోఁ దగునె యనుచు॥ 272

అగ్ని దేవుని పిలిచి "మహానుభావ!
చూచితే దివ్య తేజంబు చూపులందు
చొచ్చుకొని పోవు చున్నది చూచి చూచి
చొక్క నందెద నంతె యే చొప్పు తెలియ॥ 273

నీవు తేజస్వి వేగి తన్నికట మందు
నిలిచి తత్త్వమ్ము నెఱిఁగి మన్నించి రమ్ము
ప్రథముఁడవు నీవె సర్వదేవతల" కంచుఁ
బంపె; నతఁడు వెంబడిఁ జనెఁ బగలఁ బడుచు॥ 274

వహ్ని సామాన్యుఁ డగునె దేవతల యందు
సర్వదేవతా వక్త్ర భాస్వంతుఁడతఁడు
అతఁడె వెలుఁగుల కాకర మైనవాఁడు
అస్తమయ వేళ రవి వహ్ని యందె చొచ్చు॥ 275

సురపతి తన్ను బిల్చి తను సూటిగ మెచ్చి సగౌరవమ్ముగాఁ
బరుని రహస్యమున్ దెలిసి వచ్చుటకున్ నియమించి నప్పు డె

పురుషునఁ బోవఁగా వలయు? వహ్నియటుల్ చనె సప్తజిహ్వలున్
సరసర రేఁగు ప్రాంచులన సర్వ దిశావలయంబు దూయఁగన్॥ 276

వచ్చుచునే సమస్తమును భస్మ మొనర్చును తప్పదన్న య
ట్లెచ్చు శిఖల్ జ్వలింపఁ దన యెట్టెదుటన్ నిలుచున్న వహ్నితో
ముచ్చట గాఁగ యక్షమనె "మోహనమూర్తి! యెవండ నీవు? నీ
వెచ్చటి వాఁడ? వేమిపని? వృత్తము చెప్పు" మటన్న యంతలో॥

అహమికతోడ వహ్నియనె "నగ్నిని, దేవత, జాత వేదుఁడన్,
దహనుఁడ, ధాత్రి సర్వమును దగ్ధ మొనర్పగఁ జాలుదేను" నాన్
"వహావ! బలే! తృణంబిదిగొ వహ్ని! దహింపుము దీని నిప్డు" నాన్
దహనుఁడు సర్వశక్తి నిడి దాని నొకించుక కాల్పలేక; యె 278

త్తిన తల రేఁగు నాల్కలును దించుక పోవఁ గుదించుకొంచు వ
చ్చిన శుచిఁ గాంచి కాంచుచు శచీపతి సర్వ మెఱింగి వాయువున్
గనుగొని "మాతరిశ్వ! చనగా నగు నీవు, నదే వెలుంగొ, క
న్గొని మరి రమ్ము నీకు మరుగుల్ గల వే చొరఁబాఱు దెల్లెడల్॥

సురపతి మాట నోరువిడి సుంత బయల్పడు నంతలోనె భా
సురగతి నేగె వాయు వట చొచ్చి గుహన్ గల యక్షుఁ డెక్కడో
గిరగిర తిర్గుచున్ బడును కేళియె యిద్ది ప్రభంజనుండు తా
నరుగుట యేమి యక్షుఁడిఁక నాగుట యెక్కడ యన్న యట్లుగాన్॥

దురుసున దూసి కొం చనతి దూరము నందున నిల్చి యున్న యు
ద్ధురగతి వాయువున్ గనుచు "ధూర్వహ! యెవ్వఁడ వీవు? కార్యమున్
త్వరగ వచింపు" మన్నను "ప్రభంజనుఁ డేను, బలాధికుండనై
విఱుతు, నిగుర్తు, నేదయిన వీచి విధూత మొనర్తు" నన్నచో॥ 281

"సరి సరి యీతృణం బొకటి చాలు కదల్పుము కొంచె" మన్న; పో
టరికి సహింపరాని పొడుపై గురుగుట్టను చున్న శక్తి ని
ర్భరముగఁ జూపి దాని నొక పట్టున నెట్టగ లేక బేలయై
శిర మెఱుఁగంగ రాని యటు సిగ్గున వాంచి తొలంగి క్రమ్మఱన్॥ 282

బలరిపుఁ డందు నచ్చెరువు పట్టగరానిది వహ్ని వాయువుల్
తలపడి డీలువోయి మెడఁదల్ వడ వచ్చిరి, యేమి యీ వెలుం
గులు? కనుగోక యుండుటది కూడునె? పెద్దలె యాదు రెవ్వరో
తెలియఁగఁ బోలునంచు వినతిం జనెఁ గొద్ది వివేక మొప్పఁగన్ ॥283

ఇతఁ డట కేగఁగా వెలుఁగు లెచ్చటి కేగెనొ గాని శైల సం
తతి తన సోయగమ్ము నొక తన్వి నొనర్చుచు హైమభూషణ
ప్రతతి నమర్చి కన్నులకు భ్రాంతిని గొల్పుచు నిల్పినట్లుగా
నతివ యొకామె తోఁప వినయంబున మ్రొక్కి సబాష్ప నేత్రుఁడై॥

''ఎంతటి దివ్య విగ్రహము నెట్టెదుటన్ గనుచుంటి నమ్మరో
స్వాంత మిదెల్లఁ జిన్మయత సర్వము నీవయినట్లు తోఁచు నీ
వింత నిజొప్పు మున్నెఱుఁగ వ్యక్త సమస్త జగత్స్వరూప మి
ట్లెంతయుఁ గూడి వచ్చెనని యెంచెడి చిత్తము బుజ్జగింపవే! 285

నీ తనూద్యుతి వాహినిం దోగి జగములు
చెన్నొందు రాగ రంజితము లగుచు
నీ వక్త్ర శోభా పరీవాహ సంచల
న్నీ నంబు లైతోఁచు నేత్రయుగము
సూర్యేందు బింబ వైడూర్య తాటంకంబు
లుద్యన్మయూఖాళి నొప్పుచుండె
నష్టమీ చంద్రాభ మళిక స్థలంబుపై
నుదయించు రవి యన నొప్పు బొట్టు

నిత్య మాంగళ్యవతివి నిర్నిద్రమతివి
పంచ తన్మాత్ర బాణ ప్రపంచ జేతృ
మధుర మధురేక్షు చాప సంబంధకముగ
పాశ మంకుశమును చతుర్బాహువులను
దాల్చి యున్నావు నాత్రమోలఁ దల్లినీవు! 286

చూపులు నీ పదాబ్జముల సోనలు వాటెడి తేనెలాని దు
ష్ప్రాపము ప్రాప్తమైనటులె వాలిన వట్లె చలింప కున్న వీ

క్తై పిదియేమి నన్నదియొ కట్టుచు నున్నటు తోఁచు నిందులో
తీసి యెదో స్ఫురించి సుమతిన్ వివశం బొనరించు నమ్మరో॥ 287

జననీ! యెవ్వతె నీవు? పెన్వెలుఁగు పెల్చన్ దోఁచె నిందాఁక, కా
నను రాదేమి యెఱుంగఁ జెప్పుము మనోనైశ్చల్యముం గూర్పు మీ
వనికిన్ వచ్చి గుహాప్రదేశమున నిల్వన్ హేతువే మమ్మ? నీ
కను నీ ముందటి దివ్య తేజమునకున్ గోప్యం బదే మున్నదో? 288

నీవున్ దన్మహనీయ తేజమును మన్నింపన్ జగంబున్న దం,
చే వేళన్ మిము నిర్వ రన్కొనుట తప్పేయంచు నే వేవియో
భావంబుల్ ప్రభవించు చున్న యవి విశ్వాసంబునన్ జూచి నన్
దేవీ! తత్త్వవిదున్ బొనర్చి మతి శాంతిన్ నిల్వఁగాఁ జేయుమీ!॥ 289

అని వేడన్ గరుణించి తెల్పినది "బిడ్డా! అద్దియే బ్రహ్మమౌ
తనకుం దానె సమస్తమై జగ మనంతంబున్ స్వకీయ ప్రభా
జనితోత్సాహ వశాత్మతన్ నడపుఁ దత్సంకల్పమే లేక నీ
వును నీవారును గెల్పు గొందురటె సర్వుల్ బ్రహ్మచేఁ జేతనుల్॥

ఈ సత్యమ్ము నెఱుంగ కీరు మదిలో నే మే జయంబంది నా
మీ సామర్థ్య మనన్య సాధ్యమని యేమేమో ప్రగల్భోక్తులన్
దోసం బెంచక పల్కుచుండ విని శుద్ధుండౌ పరబ్రహ్మ తా
నై సత్యమ్మెఱిఁగింప నెంచి యిట వెల్గై తోఁచె లీలామతిన్॥ 291

సర్వ వ్యాపకమైన బ్రహ్మమిట విస్పష్ట ప్రభా పుంజమై
పర్వెన్ గావున నీ ప్రదేశమును సర్వశ్రేష్ఠ పుణ్యస్థలా
ఖర్వఖ్యాతి గడించి సాధకులకున్ గైవల్యమిచ్చున్ విశా
లోర్విన్ దీనిని మించు క్షేత్ర మొకఁ డెట్లుండున్ శివాభిన్నమై॥ 292

నీవున్ వహ్నియు వాయువున్ సురగణానీకంబులన్ గూర్చి యీ
దేవక్షేత్ర మహిన్ బ్రశస్తమతులై దేవాధి దేవున్ మహా
దేవున్ శంకరు లింగరూపమున భక్తిన్ గొల్వఁ డాత్మజ్ఞులై
దేవానీక సమర్చలన్ గొనుఁడు వృద్ధింగాంచు చెల్లప్పుడున్॥ 293

సురపతి కళ్లై బ్రహ్మమును చూపిన యా యుమ హైమ తల్లియై
గిరిశ మనోజ్ఞయై విబుధకీర్తితయై వెలుఁగొందు నిందుఁ ద
త్పరమ కృపా విశేషమున భక్తుల కీ భువి వాసమే తప
శ్చరణము సిద్ధిదాయకము సంశయ మందు టనర్థ హేతువౌ॥ 294

తల్లి హితోక్తి నూని విబుధ ప్రకరం బిట గుంపు కట్టి సం
ఫుల్ల మనోజ్ఞులై శివు నపూర్వ విధంబున నిల్పి కొల్వ నా
భిల్లుఁడు లింగరూపుఁడయి పిల్చినఁ బల్కుచు నున్నవాఁడు సం
ధిల్లిన సర్వలింగములు తేలె మనోజ్ఞ సహస్ర లింగమై॥ 295

## కేనోపనిషత్తు

కేనశ్రుతి గత కథ యీ
కోనను జరిగినది యిందె కూర్మి మహేంద్రున్
కేనమ్ము వినిచి తల్లియు
జ్ఞానిని బొనరించె నదియు జ్ఞానఘనంబౌ॥ 296

ఎవనిచేఁ బ్రేషితంబయి యీ మనంబు
మననముం జేయుఁ బ్రాణము ల్లనవరతము
ప్రాణన క్రియఁ బఱగు నీ వాక్కు లెవని
ప్రేరణంబునఁ బల్కును వినును చెవులు॥ 297

కనుట వినుటయు మనుట చేతనత యెల్ల
నెవనిచేఁ గల్గు చున్నది? వివిధ గతుల
విదిత మగుచున్న తత్సమా భ్యుదిత విశ్వ
మంతయున్ జడంబే జగం బయ్యె నెట్లు? 298

ఇచటఁ బేర్కొన్న వాన నే యెదియు గూడఁ
దానుగాఁ బ్రవర్తించు స్వాతంత్ర్య మెందు
లేని యట్టిది యనుటలో లేశమైన
సందియము లేదు కనవచ్చు స్వానుభవము॥ 299

యంత్ర వర్తైన జగము సంయమముతోడ
క్రమము తప్పక యన్యోన్య ఘాత లేక

యెంత వైవిధ్య ముండియు నెట్టి ఘర్ష
ణమ్ము పొందక కోట్ల యుగమ్ము లెట్లు॥ 300

చేతనుఁడు లేకసాగు నా చేత నుండు
నొకఁడు కాకున్న నన్యోన్య ముండు నెట్లు?
వాఁడు సర్వజ్ఞుఁ డగుట తప్పని సరియగు
బుద్ధి తర్కమ్ము దీనితో ముగిసిపోవు॥ 301

అట్టివాఁ డంట యేమి మహాధికుండు
ఉన్నవాఁడని యవ్వాఁడె యునికి, తెలివి
కేవలానందమై సర్వ శక్తి త వహించి
యేక మేవాద్వయ బ్రహ్మ మీశ్వరుఁడని॥ 302

పరమ వాత్సల్య మూని ప్రపంచ పాల
నమ్ము సవ్యమై సాగు శుభమ్ము నెంచి
యీశ్వరా భిన్న శ్రుతి మాత యెఱుఁగఁ జెప్పఁ
దెలియు వారలు తెలిసి ముక్తిని భజింత్రు॥ 303

శ్రోత్రమునకు శ్రోత్రము మనస్సునకు మనసు
వాక్కునకు వాక్కు ప్రాణమ్ము ప్రాణ మగుచు
నేత్రమునకును నేత్రమై నెగడు బ్రహ్మ
మున్నదని ధీరు లెఱిఁగి తా ముందు రందు॥ 304

నేత్రమును వాఙ్మనస్సులు నాత్ర పడియు
దాని దరిఁ జేర లేవ యవ్వాని చలన
మంతయును దాని వలననే యగుటవలనఁ
జెప్పి చూపింప రాని యీ శ్రీవిశేష
మగును స్వానుభవైక వేద్యము నిజమ్ము॥ 305

విదితమున కవిదితమున కెదిగి మిగిలి
స్వాత్మ రూపమై యున్న తత్త్వ మిది యగుట
ఉరుదయాగురు గదిత వాక్యోపదేశ
జనిత చరమ వృత్తిపయి వాస్తవము తెలియు॥ 306

దేశిక ప్రోక్త వాక్యోప దేశ జనిత
తత్త్వ మథనాప్త విస్పష్ట దర్శనమున
స్వానుభవమునఁ దెలియగా వలయు దానిఁ
దెలియు నెట్లగుఁ దెలివిదై తేలవలయు॥ 307

తర్క మేధా బహుశ్రుత దాన యజ్ఞ
ముఖ్యముల నేదియున్ బ్రహ్మమును తెలుపదు
గురువు కరుణించి యోగ్యత నెఱిఁగి తఱిని
తత్త్వవాక్యోప దేశ వాత్సల్య మూన॥ 308

తీవ్ర మోక్షేచ్ఛ గలుగు సందీప్త మతులు
శ్రద్ధమెయి నిది ధ్యాసన సరణి సాగ
నీశ్వరాను గ్రహంబున్న నెఱుఁగ వచ్చు
నెవని వరియించు వానికే వివృత మగును॥ 309

వాక్కుచే నేది తెలియగా వశము కాక
వాక్కు నెద్దాని మహిమ వెల్వడుచునుండు
నద్దియే బ్రహ్మ మోయి యీయది నిజంబు
ఈ వుపాసించునది బ్రహ్మమెపుడు కాదు॥ 310

మనసుచే నేది మనన సంభవముకాక
మనసు నెద్దాని మహిమ మనన మొనర్చు
నద్దియే బ్రహ్మమోయి యీయది నిజంబు
ఈ వుపాసించునది బ్రహ్మ మెపుడుకాదు॥ 311

కన్నులకు నేది సుంతయుఁ గానరాక
కన్ను లెద్దాని మహిమచేఁ గాన నగునో
యద్దియే బ్రహ్మమోయి యీయది నిజంబు
ఈ వుపాసించునది బ్రహ్మ మెపుడు కాదు॥ 312

చెవులచే నేది వినఁగ సంభవముకాక
చెవులు వినఁగల్గుటకు నేది యవసరంబొ

యద్దియే బ్రహ్మమోయి యీాయది నిజంబు
ఈ వుపాసించునది బ్రహ్మమెపుడు కాదు॥ 313

ఏది ఘ్రాణాన మూఁజూచి యెఱుఁగరాక
ఘ్రాణమెద్దాన మూఁజూడ గలుగుచుండు
నద్దియే బ్రహ్మమోయి యీాయది నిజంబు
ఈ వుపాసించునది బ్రహ్మమెపుడు కాదు॥ 314

బ్రహ్మ మెఱిఁగితి నేనని పలికె దేని
తెలిసినది నీకు స్వల్పమే తెలియవలయు
నాధి దైవికాధ్యాత్మికోపాధి ఘటిత
మందిన నదియె బ్రహ్మమే యగుటకాదు॥ 315

బ్రహ్మవిదుఁడగు శిష్యుఁడా బ్రహ్మ గురువు
పాదపద్మంబు లంటి తాఁబలికె నిట్లు
బ్రహ్మ తత్త్వంబు తెలిసిన బంధురుండు
పలుకు పలుకులు నిట్టులే తెలియకుండు॥ 316

నేను బ్రహ్మ మ్మెఱిఁగితనుకోను గాని
బ్రహ్మ మెఱుఁగుదు నెఱుఁగను; బ్రహ్మగూర్చి
యెవ్వఁడీ రీతి నను నాతఁడే యెఱుంగుఁ
దెలియుఁ దెలియదు దాని సంస్థితియె యట్లు॥ 317

తెలియు ననువారికా బ్రహ్మ తెలియఁబడదు
తెలియ దనువాఁడె తద్బ్రహ్మఁ దెలిసియుండు
నెవని కమతంబొ యతనికే యవు మతంబు
నెవనికో మతంబో యతనికే యవునమతము॥ 318

సర్వబోధాళి బ్రహ్మమే పర్వియుండి
విదితమగుచుండి బ్రహ్మగా విదిత మవక
తెలియుచున్నది తెలియదు తెలివియెల్ల
నదియ యగుటను ప్రతిబోధ విదిత మదియు॥ 319

ఆత్మమూలాన వీర్యమ్ము నందికొన్న
విద్యమూలాన నమృతత్వ వేత్తయగును
బ్రహ్మవిదుఁడన్న బ్రహ్మమే బ్రహ్మ మెపుడు
నమృతమే యద్వయైన కృతార్థుఁ డతఁడు॥ **320**

బ్రహ్మానుభవ యోగ్యభవ్య మానవజన్మ
　　మంది యీ జన్మమ్ము నందె బ్రహ్మ
మందికో యత్నింప నట్టి వారలకెల్ల
　　నయ్యెడి నష్టాని కవధిలేదు
మరల మానవజన్మ మరుదందు రయ్యది
　　యెపుడు కల్గునొ యెవ్వరెఱుఁగఁ గలరు
కాన ధీరులు బ్రహ్మకై నిత్యయత్నాన
　　నిలిచి యుండే యాత్మనొలసి తెలిసి

జీవతో ముక్తులయి దేహమేవిధాన
నున్న నద్దాని నంటికోకుండ నుండి
పతనమైనంత నమృతత్వ పదవినంది
మరల జన్మింప రెచట నా నరులె నరులు! **321**

అని యిట్లమ్మయు బ్రహ్మతత్త్వమును వ్యాఖ్యానించి యంతర్ధియై
చనె నా హైమవతీ మహేశ్వరియె యీ జ్ఞానప్రసూనాంబ కా
వున నే నేటికి హారమ్ము పావడయు నేవో భూషణాదుల్ ధరిం
చును నాఁడీ వనిఁ దోఁచి నట్లుగనె తోఁచున్ నేఁడు హేమాఢ్యయై॥

ఆమెకు సుమాంబ కట్లు శతాష్టనామ
పూజలొనరింత్రు దినము; సంపూజితాంబ
యాత్మభక్తుల హృదయ లతాంతములకు
జ్ఞాన కిరణాల పూర్ణ వికాస మొసఁగు॥ **323**
కాన దక్షిణ హస్తాన జ్ఞాన సూన
మొసరఁ దాలిచి నైజలక్షణము తెలుపు

నదియు కాకిందు వేఱు రహస్యమున్న
దయ్య నెఱిఁగించు నధికార మమ్మకె తగు॥ 324

అమ్మ యనుగ్రహంబున నె యయ్య నెఱుంగుదు మెల్లలోక మం
దిమ్ముగ సర్వలోకముల కీశ్వరుఁడైన పరాత్మ తత్త్వ మా
యమ్మ దయం దలంచి తనయా యని పిల్చి వచించి నప్పుడే
గమ్మున విచ్చుకో వలయు జ్ఞానము సూనమువంటి దెప్పుడున్॥ 325

వహ్ని వాయువు లెంత గర్వమున వీగి
యేగినను యక్ష పరమాత్మ కెదుట నిలిచి
యతనిచే పృష్టులైనభాగ్యమునఁ జనిరి
కాన వారలు సురలలో ఘనతఁగనిరి॥ 326

అయిన దనమాన మగుట తథ్యమ్మయయ్యు
నదియుఁ గడుగొప్ప వారిచే నైనదగుట
నింతమాత్రము నోచని యితరుల బడి
వారు ఘనులౌట యందు సంభ్రమ్మ లేదు॥ 327

ఆతఁ డెవ్వఁడో తనకు రాజాదరంబు
నంది నట్లుగ చెప్పి తక్కుందఱకును
మించు వాఁడన్న టెక్కు చూపించుచుండ
నొక్కఁ డాతని హద్దులో నుంచఁ దలఁచి॥ 328

ఏమి జరిగెనో యన్న! యొక్కింత తెలుపు
మన్న వాఁడు "నే మున్నదే నడ్డు నిలిచి
దారి కడ్డమ్ముగా పరధ్యాన వశతఁ
గదలకుంటిని రాజు కింకరులఁ బంపి॥ 329

నన్ను వెన్వెంట బాటపై నున్నవానిఁ
బట్టి ప్రక్కగా నున్నట్టి చెట్టుక్రింద
కూరుచుండఁగఁ జేసి తా దారిఁబోయె
నేను నిటువచ్చినాఁడ నే హాని లేక"॥ 330

అనెనట యట్టులే జరిగె నగ్నియు వాయువు యక్షమందు నే
ఘనతను చూడ కుద్ధురత గర్వముతోఁ దమ గొప్ప చెప్పికో
ననుగతి యక్షమున్ తృణము లన్నటు గడ్డిని ముందుఁబెట్టి చు
ల్కనగ పరాభవించి యణగార్చెను స్వీయమహస్సు చూపుచున్॥

ఆదిని గర్వితుండయిన య య్యమరాధిపుఁ డట్లు కా
కేదో మహత్త్వ మున్నదని యేచినభక్తి వినీతుఁడై చనెన్
వాదన చేయకుండ నిరుపాధిక తేజము మాయమౌచు స
ర్వాదిమ శక్తిరూపమున వాని యెడన్ దయఁజూపె పెల్లుగన్॥ 332

అమర నాయకుఁ డింద్రుఁడు నాదిశక్తి
వలన బ్రహ్మోపదేశమ్ము వడసి ధన్యుఁ
డయ్యె నాతఁడే వాయ్వగ్నులాది యయిన
దేవతా తతికిచ్చె 'బ్రహ్మైన' మతిని॥ 333

కేనమిటుల్ నిజంబెఱుఁగు కీలును దెల్పు వినీతి యున్న చో
నేనము లన్నియున్ దొలఁగి యీశ్వరుఁడున్ మనయందు సత్కృపన్
బూని యనుగ్రహించుఁ జెడిపోవుటకే దురహం క్రియోద్ధతుల్
కాన వినీతి భక్తియుత కాల సముంచిత వృత్తి మేలగున్॥ 334

## ప్రకృతి సంపద

ప్రకృతి సమస్తజీవులకు బంగరుతల్లి తనున్ స్వమాతృతా
ప్రకటిత వైభవాకృతిగ భక్తి భజించెడివారి కెట్టిదా
ని కృతియుఁ జేయఁబోదు జననింబలె సర్వము నిచ్చిప్రోచుఁ ద
త్ప్రకృతిని గెల్తు మే మనినఁ బట్టిన పట్టున మాయముంచెడిన్॥ 335

ప్రకృతి వశమ్ముకా, దెవరి వల్లభతన్ సహియింపఁ బోదహో
వికృతులఁజేసి పట్టువడె వీగెను లొంగె నటన్న బుద్ధి మై
స కలుషవృత్తి నుండ వివశాత్ముల భ్రష్టులఁజేసి స్వీయమౌ
ప్రకృతి మహేశ్వరాకృతిగ వల్లభతన్ బ్రకటించు నెప్పుడున్॥ 336

వేయిలింగాలకోనలో పీను మిగులు
ప్రకృతి సంపదయున్నది భక్తి పరులు

తల్లి దయ నెంతయేని సౌందర్య మెఱిఁగి
నిర్మలానంద వార్ధి మునింగి యుండ్రు॥ 337

గురుశిష్యుల్ పరిపూర్ణ భక్తిపరులై కొండన్ విదారించి తన్
గురుభక్తిన్ వరివస్యసేయ నను గుల్ క్రోలంగ జాల్వార్చు ని
ర్భరకారుణ్య పయఃప్రపూరములు నా వాఃపూరముల్వారఁ ద
త్పరులై తల్లి యెడంద మున్గినటు లవ్వానన్ నిమగ్నాత్ములై॥ 338

చరియింపన్ జగదేకమాత సకలాశ్చర్య ప్రభావంబు లు
ద్ధురమై చూపె; నిరీశ్వరుల్ ప్రకృతినెందున్ స్వీయసంవర్ధనా
ర్థ రసాలంబ పదార్థమాత్రముగ నాత్రంబంది తద్దానికిన్
వెరవంబోక చరించి భ్రమందెదరు నిర్వీర్యాత్ములై తల్లి చే॥ 339

అది మరుగైన చోటచట నన్నియు నెత్తగు వృక్షముల్ శుభా
స్పదమగు దానిఁజేర నట పచ్చని నున్నని చట్టుబండ లం
దెదను సుఖంబు గూర్చుచు మహేశ్వరుఁడుంచిన నీటితొట్టెనాఁ
గుదురగు పట్టు కన్పడును గుండియ పొంగయి నీళ్ళపాఱఁగన్॥ 340

మొలలోఁతుండునో యుండదో
జలజల మని నీరుపాఱు చప్పుడు వినుచున్
జలరూప శివుని దలఁచుచుఁ
గలరుతములు వినుచు నొడల గగురుపు పొడమన్॥ 341

చని యచ్చోటను నిలబడి
కనుచుందువు కదలుచున్న క్రమజలములన్
నిను నీవు నిలువరించు కొ
నను జాలక యవశతఁజని ననవలె నగుచున్॥ 342

ఆ తొట్టియ జలములలో
నే తొలి మీనంబువలెనో యెగిరి మునుఁగుచున్
మూతలువడ నీ కన్నులు
లోఁతులలో మునిఁగి జగము లోఁతుల వెల్లన్॥ 343

తెలిసిన యటు తేలెదువట
తెలియదు కాలమ్ము తనువు తెలియదు చుట్టం
గల వెవియును దెలియవు
తెలియుదు నిను నీవె తెలిసి తేలెదుప్రాపై॥ 344

అవి జలమ్ముల యమృత రసాయనములు
అవిదితాదిక భవరోగహరణ దక్ష
పటు మహౌషధసార జీవనములగును
క్రోలు మవ్వాని నిఁక నీవు తుత్తెఱుఁగవు॥ 345

సిద్ధతీర్థంబు లోషధీసిద్ధి కలవి
సిద్ధులయ్యు తీర్థముగఁ బ్రసిద్ధి కాంచె
నెందఱో సిద్ధు లిటనుండి యివియ క్రోలి
సిద్ధినందిరి నేటికిన్ సిద్ధినొసఁగు॥ 346

ఆకలి దప్పి యెఱుంగని
యా కోవిదులందు మునిఁగి యమృతాశనులై
యాకోనయందె తిరిగిరి
యాకులు పూవులు ఫలములు సన్ని యెఱుఁగుచున్॥ 347

అది భూమికి భూషణముగ
విదితాత్ముఁడు కాలుఁ డొసఁగు వెలగల నగయా
పదిగజముల మేర కలదు
పొదలున్ బదివేల రత్నములు పూవులుగాన్॥ 348

చిన్నిచిన్ని పూలు పొన్నారి పూవులు
రకరకాల రంగు రైక తొడిగి
కన్నెపిల్ల వలెను కలకల లాడుచు
చూచుచున్న కోలఁది సొగసు చిమ్ము॥ 349

దానిఁ ద్రొక్కిగాని దాటిపోవగరాని
క్లిష్టమైనగతిని ఖిన్నులగుచు

తాఁకకుండ నేగఁ దలపోసి తలపోసి
వెనుక కేగి దారి వెదకి వెదకి॥ 350

## అఖండ బిల్వము

చాల సేపైన తర్వాత సాంద్రవనిని
జొచ్చి యచ్చోటి వృక్షముల్ చూచుచుండ
నొక్క యద్భుతంబైన యనోకహంబు
కాంచి శ్రీసూక్త కథితాగమంచు నెంచి॥ 351

నీడ నిలుచుండి దాని మన్నించి రెంతో
అది వనస్పతి సూర్య వర్ణాంచితంబు
సర్వ సంధాత్రి జనని వృక్షంబుగాగ
జన్మ మందిన దనుచు విస్పష్టమయ్యె॥ 352

తత్ఫలమ్ములు తపసుచేఁ దరిమివైచు
మాయచేఁ గల్గు లక్ష్మ్యంతరాయములను
భక్తి సేవించు వారి కే పట్టునందు
లే వభూతియు నసమృద్ధి రావురావు॥ 353

అట్టి వృక్షంబు బిల్వమా నట్టి యిదియు
బిల్వమే యగు ఫల మట్లె పిల్వ నగును
పత్రములు చూడ వింత కనిపట్టు చుండె
సర్వ సాధారణంబైన జాతికాదు॥ 354

అంద చెలఁగిన జాతి బిల్వాగమందు
మూడు పత్రమ్ము లొక దళమ్ముగను నుండు
నే దళమ్మున కదియె యట్లే త్రిపత్ర
సంయుతమ్మయి యుండు వృక్షమ్మునందు॥ 355

ఇందు నట్లుండి యొక్కొక్క యీనె నుండి
చిన్ని పత్రాలు మూఁడు కూర్చిన దళమ్ము
మీఁద నింకొక దళము నా మీఁద నొకటి
యిట్లనుసూత్యమగుచు నెన్నెన్నొ కలవు॥ 356

ఇట్టు లఖండ వృత్తి నొక యీనెను పెక్కు దళంబు లుంటచే
చెట్టు నఖండ బిల్వమని చెప్పి జగజ్జననీ స్వరూప మ
న్నట్టులె భక్తి గొల్చెదరు హైమవతీ మహనీయ మూర్తియై
చెట్టె సమస్తముం దెలుపు శ్రేయము లన్నియు నిచ్చు తానయై॥

ఈశ్వరుండు నాత్మ గురువని యిట్లు భిన్న
మూర్తు లున్నను మూఁడు నా మూఁడు నొకటె
యని వచించును బిల్వాగ మదియె దళము
దళముపై దళమ్ముల గల తత్త్వమేమి? 258

త్రితయ సంయుత దళము లదేక్రమాన
సాగి వచ్చుట తెల్పును సంప్రదాయ
మొప్పు డవిచ్ఛిన్న వైఖరి నిల్చెసాగు
నరుగ వచ్చు యుగాలు సృష్ట్యాది నుండి॥ 259

అమ్మ మనువున ఖండత్రయం బఖండ
మై యనుస్యూత వైఖరి హ్రీం మనంగ
తెలియ వచ్చును త్రితయమున్ దెలిసి వచ్చి
తెలియ రానట్టి దేమి దుర్ధీ తొలంగి॥ 360

అమ్మయే యమ్మయే యీ మహాగ మమ్మ
యే యఖండ బిల్వదళము నీయగా శి
వాంగ మాలింగితం బగజాంబ చేత
నన్న యానంద మగునట యభవునకును॥ 361

కల దిచట విధి నిత్య సంకల్పమం ద
ఖండ బిల్వకాననము విజ్ఞాన వినుత
క్షేత్రమని చెప్పచుంట విశిష్టమగును
పూర్వ మీ చెట్టు లంతగాఁ బర్వెనేమొ॥ 362

ఇప్పుడీ వేయిలింగ మహీస్థలాన
నచ్చు టచ్చుట కనిపించు నంతె మరల

భైరవుని కోన యందు లభ్యంబు లగును
పెంచుచుందురు గుర్తుగా నెంచి గుడిని॥ 363

కరువు దీరంగ శ్రీమదఖండ బిల్వ
కాననావాసి యయిన శ్రీకాళహస్తి
శివుని నీ బిల్వదళములఁ దవిలిగొలుచు
వార లెల్లరు శివులౌట సారమగును॥ 364

కల వచట నొక్కచోట నఖండ బిల్వ
వృక్షములు కొన్ని యొకచోట పెంచినట్టు
లందు నడిమి వృక్షము మూల మందు వార
లధి వసించి ధ్యాన వశత హాయి గనుచు॥ 365

చాల సేపుండ రమ్య దృశ్యంబు లెన్నొ
మనసునం దోఁప వారు నిమగ్ను లైరి
అదియె కైలాస మెంత భాగ్యమ్ము చూడఁ
గలిగె రవ్వారు బొందితో మెలఁగినట్లు॥ 366

తాము ప్రమథులై శివరూప ధారులగుచుఁ
దిరుగు చుండిరి స్వామి సిదేశములను
పార్వతీ పరమేశ్వరుల్ స్వస్వదేహ
ధారణమ్మున నిర్వురై చేరియుండి॥ 367

శివుఁడు శ్రీదక్షిణామూర్తి శిష్యయగుచు
పార్వతీదేవి శుశ్రూష పరతనుండె
నన్న యట్లుగ తోఁచె మహాత్మ్ముఁడపుడు
శైవ మంత్రార్థ వివరణ సలుపుచుండె॥ 368

ఓమని యోంకార ముచ్చరించుటలోన
నాద మం దైక్యమై భేదమడఁగ
శంఖమ్ము పట్టినో స్వామి యన్నట్లు త
న్నాద మయత భువనములు తేల

పార్వతీదేవితోఁ బరివార మంతయుఁ
బరమమహా శ్రద్ధఁ దత్పరత వినఁగ
ప్రణవ సహితమ్ముగాఁ బంచాక్షరిన్ విప్పి
స్వామి వ్యాఖ్యానించు సమయమందు
దేవి చెలికత్తెతో నేదియో వచించె
నంతియే స్వామి దేవి నర్ధాంగిఁ గనుచు
పుడమి మానుషవై పుట్టి విడువ కెపుడు
దీని జపియించి ననుజేరి దేవి వగుము॥ 369

అచట దక్షిణ కైలాస మందు నీదు
మూర్తియె యఖండ బిల్వమై పొడమి యున్న
దది శుభప్రద వృక్షమయ్యాది ప్రియమ్ము
దాని ఛదముల మంత్ర యుక్తముగ నొసఁగి॥ 370

వాయు లింగంబు గొల్వ శాపంబు తీఱు
ననియెనో లేదొ శివుఁడు తా మనుజ దేహ
మంది పార్వతి శ్రీకాళహస్తి పతిని
సొరిది నర్చించి జ్ఞానప్రసూన యయ్యె॥ 371

తల్లి చేసిన పూజ తత్పరతఁ గనుచు
గురువు శిష్యుండు వెలికి రాకుండ నట్టి
ప్రియతమాఖండ బిల్వ పత్రిని మునింగి
ప్రీతి నందెడి శివులహో వెలుఁగుదు రదె॥ 372

అన్న యట్లుగ నుండి సహస్ర లింగ
వర పురస్థిత స్వామి కైవారములను
గొంతులను కల్పఁజాలి వికుంఠమతులు
సర్వగతులైన యట్టి విస్పష్టమయిరి॥ 373

బొంది ప్రతిబంధ మగునె విభుఁడు శివుఁడు
హృద్గుహావాసి యజ్ఞాన వృతి నడంచి

కోటి సూర్య ప్రభాపుంజ గురు మయూఖ
జాలము విశ్వమున వెదజల్లునపుడు॥ 374

శివుఁడు శివుండన్న శివుఁడెవ్వఁడో యన్న
ఈ దేహమున నున్న జీవుఁడే నయ్యా!
హృద్గుహావాసియై యే మెఱుంగని యట్టు
లన్నింటి నడపునది యాతఁడే నయ్యా!
దేహేంద్రియాది సంఘాతమంతయు జడము
శివుఁడు లేకున్నచో శవమె యగునయ్యా!
శివుఁడె మోహంబంది జీవుఁడై నట్లుగా
చెంది దేహాలలో చిక్కుకొనునయ్యా!
తాను శివుండన్న తత్త్వమ్మునే మాని
జీవభావాన సంసారియగు నయ్యా!
జీవత్వ మిది భ్రాంతి శివుఁడె నే నని తెలిసి
శివుఁడై విముక్తుఁడై చిమ్మ వెలుఁగయ్యా! 375

## మయూర తీర్థము

వేయి లింగాల కోనలో వెలికి రాక
వాయు లింగంబు దెసకుఁ బోవలయునపుడు
స్వామి కైలాస శైల గర్భంబునందు
దాచి యుంచిన విభవ సందర్శన మగు॥ 376

ఇప్పుడటు పోవు నెడల యోగీంద్రులైన
స్వామి వెన్నంటి చను టసంభవమె యగును
స్వామితో యాత్ర స్వామి వైభవము గనుట
రెండునున్ స్వామి నర్చించు రీతులె యగు॥ 377

అయిన నొక రీతి నుండి రీత్యంతరమున
మనసు విభువాట సంచరింపంగఁ గలదు

పాంచ భౌతిక తనువట్లు పలు స్థలముల
నొక్క కాలాన సమకూడి యుండ లేదు॥ 378

వారి కాయమ్ము లేమొ యాత్రారిరంస
నతనితో నుండి యేడేన కరుగుచుండె
మానసము లేమొ కోన మర్మమ్మెఱుంగు
దారిలో బడి పర్వతాంతరము చొచ్చె॥ 379

జీవుఁ డెవండుగాని నిజ జీవిత మందున ధర్మ వర్తనుం
డై విహరించుచో విధి వశాగత రమ్య శుభంబు లబ్బుచో
నే విధి హర్ష మందు నన నెంత విరాగియు వర్ష వేళఁ గే
కీ విహగంబు పింఛము నొకే పరి విచ్చిన చందమయ్యెడిన్॥ 380

లౌకిక లబ్ధికే యెడద లాస్య మొనర్చును మోదనామక
ప్రాకట నీల కంఠము చరన్మధు సేవన చంచరీకమై
శోక విహీనమై చెలఁగు శుద్ధ హృదంబుజ మన్న యప్పుడీ
లోకము నందె దివ్యమగు లోక సుఖంబు లభింప నెట్లగున్॥ 381

వే శివలింగ కోనబడి వేదగిరీంద్రము కేంద్ర మట్లుగా
వాసిగడించు పుణ్యజల వర్ధన నిత్యమనోహరార్థ సం
వాసిత దివ్య తీర్థమును వారక చేరి మయూర తీర్థమే
చేసిన పుణ్య మంతయును చెంది లభించిన దంచు డెందముల్॥ 382

పిండులు గట్టి పింఛములు విప్పి యొకించుక యేని సిగ్గుతో
నుండక యెవ్వరే మనిన నుండుము మే మకలంక మోదమై
మెండగు హర్షమున్ ముడిచి మెప్పును దెల్పక యుంట మేలొకో
నిండు ముదంబు తెల్పెద మనేకము నేకమునైన గుండియన్॥ 383

అని తమ తత్త్వమున్ దెలుపు హారి మయూరము లట్లె కానలోఁ
గన నగు రాసలీల యనగా ముదమంది విలాసలాస్యమై
యను పద మంచలై నటు విహాయస వీధి చరించి మించుచున్
దన కొక యున్కి లేక విదితంబగు లోకము తానె యయ్యెడిన్॥

శైల శృంగాగ్ర సంచాలకం బొకటైన
కడిమి పూచెట్టుపై కదలు నొకటి
పున్నాగ శిఖరంబు పూని యొక్కండైన
మాకంద తరుశాఖ మలయు నొకటి
శూలమ్ముపై నిల్చి శూరుఁడా యన్నట్లు
తాళద్రుమాగ్ర చిత్ర స్థలంబు
భూచారి కా దిద్ది ఖేచరుం డెవ్వఁడో
వచ్చె నన్నట్లు దివ్య స్థలంబు
నెన్ని కొని యెన్ని యెన్ని గిరీంద్ర మందు
నున్నవో యున్న యన్ని మయూరములును
నొక్క పరి తోఁచె నన దెంత యుబ్బిపోవు
కాననము కాననగు నీల కంఠ మయత॥ 385

ఈ కొండ గుండెలో లేకుండు నే వర్ష
మెల్లప్పు డుండు మహీ వినోది
నిండైన సెలయేళ్ళు నిర్మలాంబువులతో
నిత్య స్రవంతులై నెగడు నిచట
పృథ్వీగ తాఖిల వృక్ష సంతతి యిందె
గుది గట్టి మొలిచె నిక్కువ మెఱింగి
సీతావిహీనమై చెలఁగు నీ దేశానఁ
జూపట్టు నెట్లే యశోక రాముఁ
డొక్క పరి దీనిఁ జూచి యిందుండి కొంత
సేపు తల్లి యెదపయి నిశ్చింత నున్న
శాంతి గని చన్న వాఁడు నిరంతరంబు
దాని యందే రమించు సిద్ధ వరుఁడగుచు॥ 386

మిథ్యాగానైన గగనాన మిళితమయి యె
నీల వర్ణంబు తోఁచు వనీ వనస్థ

నైల్య మిది యెల్ల గగన జన్మకును మూల
మైన నీల కంఠుని కంఠ మందె పాడము॥ 387

చిక్కన పల్చనై యదియె చిత్ర విచిత్ర విశేష వర్ణస
మ్యక్కమనీయ మోహన విహంగము గాగ సమాన నామమై
నిక్కి చరించు నయ్యది వసి విహాగంబుల మేలు బంతి యౌ
టుక్కవ యేమి స్వామి యగునేమొ యనన్ బనిలేదు స్వామియౌ॥

ఆకాశమ్మె శిఖాంభరమ్ముగ భుజంగానీకముల్ మించి రా
నె కొంచె మ్మెడ మీఁక వాసుకి భుజంగేంద్రున్ గలాపమ్ముగాన్
జేకొంటై ప్రణవోపదేశమనగాన్ శ్రీంకారమున్ బూని సు
శ్రీకంఠైన మహాద్రి సంభవ ఘన స్నిగ్ధేక్షణా ప్రీతిమై
నైక ప్రక్రియ నాట్యముల్ జలుపు దివ్యస్నీల కంఠంబహా! 389

శుభ్ర దేహుండు మల్లికార్జునశివుఁడు
కంఠమణి గాగ లోక రక్షణకుఁ బూని
కప్పుఁ గొని తెచ్చుకొనియె నజ్ఞాన మదియె
సయ్యదే సృష్టి కంతకు నాది యయ్యె॥ 390

ఆదిలేని యవిద్యయే యఖిల విశ్వ
సంభవంబున కాదియౌ; సంభవించె
నాకసమె యాత్మనుండి యనంతరంబు
వాయువున్ వహ్ని జలభువుల్ వరుసఁ బొడమె॥ 391

స్వామి కంఠ ప్రదేశ భాస్వన్మయూఖ
మాలికాజాలయౌ పెను మచ్చ నుండి
పాడముటం బట్టి గగనమ్ము పుడమి వారి
కెప్పుడుఁ గప్పుగాగ మోహింపఁజేయు॥, 392

లేని లోకాల రక్షణకైన హాల
హాల గరళ పాన పరమ సాహసము మూల
మౌ మహామహు నజ్ఞాన మగును కాదె
యయ్యదే మూల మయ్యె సమస్తమునకు॥ 393

దాని కంఠెను ప్రియము నీకైన లేదు
కంఠ కాళిమయే కాళికా సతియొకో
హే మహాకాల! కాళహస్తీశ! దేవ!
పరమ గహనంబు నీదు నిర్భర చరిత్ర॥ 394

తెల్ల తెల్లని స్వామి వై నల్ల పిల్ల
ప్రేమ వలలోన బడిన మృద్వీక మతివి
సంహరింతువు జగతి వాత్సల్య మూని
రుద్రుండవునీవె! కరుణా సముద్రుం డీవె! 395

కాలకూటమ్ము నమృతమ్ముగాగఁ జేయు
మహిమ నీ యదియే సర్వ మంగళ యగు
నమ్మ మాంగళ్య మహిమగా నవధరించి
సర్వ లోకమ్ము లూర్జితో త్సవమునందు॥ 396

ఇర్వురేకాత్మ్మలా మహేశ్వరాఖ్య
ప్రథమ దాంపత్య జాత విశ్వమ్మునందు
సర్వమున్ మాయ సత్య మీశ్వరులు మీరె
ద్వంద్వ మనరాదు మిమ్ము నద్వైత మగుట॥ 397

మాట లోటమి చెంది సంభవము కావు
మనసునన్ సిగ్గు పడుచు నమస్కరించి
యడఁగి యే పోవు నప్పుడా యంతరంగ
మందు జ్యోతిషాం జ్యోతివై యుండె దీవు! 398

నత సుజనావనా! భుజగనాయక భూషణ! వ్యాఘ్రచర్మశో
భిత! గజ చర్మధారి! కర వీర మృగగ్రహ! కామితార్థదా!
నుతకృతి! సత్కవీంద్రనుత! నూతన మా గిరి చుట్టి వచ్చు స
త్కృతిని ద్వితీయమా పదము తీర్చితి విట్టులు నే కృతజ్ఞుండన్॥ 399

నమనము నాకమున్ నగవు న్యాయము న్యకృతి నారకంబు నా
మము నవనీతరూపము నుమాపతి నీవును నేను నాది యా

నమమ విశాల భావమును నాట్యము నాటకమున్ నవీన భా
వమును నగంబు నైజము నవంనవ మానస మీవెయో శివా! 400

నీవు సముద్ధరింపఁ గరుణించి సహాయము చేయనెంతు వీ
జీవులు నిన్నులాగి తమ చేటునకున్ బలివెట్టఁ జూతురో
దేవ! మదీయమౌ మనసు దేహము సర్వము వెల్గుమాత్రమై
నీ వగు వెల్గులోన గమనింపగ నీయక జేర్చి వేయవే! 401

# తృతీయ పదము

## మకార పదము

మహనీయా! మహనీయ దివ్యచరితా! మాహాత్మ్యమే నీవయై
మహమున్ గూర్చెద వెల్ల లోకములకున్ మంత్ర స్వరూపా! శివా!
అహమున్ వీడి రహస్యమున్ దెలిసి యెవ్వారైనన్ ప్రభామాన్యులై
మహితుల్ కాగల రీశ్వరున్ నిను భజింపం గల్గు ధన్యాత్ములై॥

మమత విసర్గమం దగుట మంచిది యంచు నెఱుంగఁ జెప్ప నీ
మమతకు నంతమున్నదె నమశ్శివ సుందర మూర్తినే! మదీ
య మని రవంతయున్ గన నిదంతయు స్వామి! త్వదీయమే యగున్
మమయను త్రోవయే నమమ మార్గముగా సవరించి పెట్టవే! 2

ఎంత చిత్రము దేవ! ఈ బ్రదుకు
అంతయును నీ మహిమ ఓ దేవా!

1. నా దన్న మొద్దన్న నరకానికే యేగు
   కాదన్న విజ్ఞాని కైవల్యమున్ గాంచు॥
2. నీదైన యీ జగతి నాకేమి హక్కుండు
   నేను నీ వైనచో నంతయున్ నాదెయగా॥
3. నీ నుండి నే వచ్చి నీవు కా దన్నట్లు
   నేను వేఱంటయే నీ మాయ యగు కదా!
4. అల వియత్తున నొక్క యర్కబింబం బుండి
   జల ఘటంబుల పెక్కు చందాలుగాఁ దోఁచు॥
5. ఉన్న దొక్కండయ్యు నుర్వి ననేకమై
   భిన్న భిన్నంబుగా విహరించుచు నే మాయ! 3

మానవుఁడైన హేతువున మానదు దోష మటంచు నెంతు రీ
మానవుఁడే యెఱుంగ నగు మంచియుఁ జెడ్డయుఁగాన దోషముల్

మానవివయ్యుఁ దాఁ దెలిసి మంచి నెఱింగి తదర్థ మెంత యేన్
మానక యత్నమున్ సలుపు మానవుఁడే నిజ జన్మ ధన్యుఁడౌ॥ 4

కాక నరత్వ మందియును కానక మంచి యఘాత్ముఁడౌచుఁ దా
పీక వివేకమున్ దఱిమి పీడక నే నరుఁడౌట చేత నే
పోకలఁ బోవుచుంటి నిది పోలును నా కని తప్పులన్నిటిన్
ప్రాకట వైఖరిన్ సలుపు వాఁడు నరుండగు దేహమాత్రతన్॥ 5

ఆకృతి యందు మానవత యైన ప్రయోజన మేమి తత్తనూ
స్వీకృతి నున్న జీవుఁ డెది చేసి జనించెనొ యెట్టి సంస్కృతిన్
జేకొనెనో మఱిప్పు డెది చేయునొ దానిని బట్టి కాదె చీ
కాకు తొలంగుటో మఱియు కష్టములన్ బడఁబోవుటో యగున్॥ 6

అన్నిటికంటె వింతయగు నాకృతి మానవుఁడైన వ్యక్తికె
న్నెన్నొ నిషేధముల్ విధులు నేర్పడి యున్నవి మానవత్వ మా
యన్నిటి శ్రద్ధతో సలిపి నప్పుడె పండును దేహమాత్రుఁడై
యున్న యెడన్ నృశంసుఁడగు నొప్పునె? పేరునకైన చాలునో? 7

సారమునందు మానవత సాధ్యము, సిద్ధము కాదు; నిత్య సం
స్కార పర్వత మొప్పి విధిశాస్త్ర మెఱింగి తనంత తాను త
చ్ఛ్రీ రమణీయ శాసనము శీర్షమునన్ వహియించి సంస్కృతుం
డై ఋభులోక మందని పరాత్మత నందెడివాఁడు కావలెన్॥ 8

వాఁడగు మానవుండు నిలబడ్డ విధంబున కద్దిదీటు, కాక యే
వాఁడు యథేచ్ఛ నేగి నరభవ్య శరీరము భుక్తి మాత్రకై
వాడునొ వాని కడ్డమగు పడ్డకు నేమి విభేదముండు? కా
పాడి నరత్వమున్ బెనిచి పట్టిన పట్టున ముక్తిఁ గాంచనౌ॥ 9

మానవ దేహ మన్యముల మాదిరి కాదు, విశిష్టమైన, ద
ద్దానికి సంస్కృతంబగుట తప్పదు, స్థూలము కాక సూక్ష్మమున్
దానను కారణాఖ్యమును దాగి వివేకముతోడ మూఁడునున్
మానక నిత్య సంస్కరణ మాన్యతఁ గోరుచు నున్న వందుచే॥ 10

పుట్టిన దాది మానవుఁడు బుద్ధిని కల్గి నరుండ నేను నా
పుట్టువు నాకు దేహమును బూని భవాబ్ధిని దాటి సంసృతిఁ
ముట్టని బ్రహ్మమై నిలువఁ బుట్టిన, దా పరమార్థ సిద్ధికై
గిట్టెద నంతెగాని యడఁగింతునె యూరకయంచు నిల్వనా॥ 11

ముక్తి యొకండె లక్ష్యమగు మోహన శీలి మహాత్ముఁడమ్మహా
వ్యక్తి జగద్గురుత్వ పద మంది నతుల్ గొను సర్వజాతిచే
రక్తి స్వకర్మలఁ నిలిచి శ్రద్ధ మెయిఁ బరమేశు భక్తితో
భుక్తికి ముక్తికిఁ గొలుచు పుణ్యుఁడు పూజ్యుఁడె యెల్ల వారికిఁ॥ 12

అటు నిటు కాని మానవుఁడె హీని కరుండగు జాతికెప్డు లం
పటత పశుప్రవృత్తికిని బాల్పడు టొక్కటె కాక మానవో
ద్భట మతి స్వార్థ లబ్ధికయి వక్రపథంబున బెట్టి దానవుం
డటులె తెగించి క్రూరుఁడయి హీనిగనుఁ మతి హీనిగూర్చెడిఁ॥ 13

చెడియును మంచికిఁ దిరుగు చిత్తము లుండక పోవు నీశ్వరుం
డెడపక సాయమైన యెడ నెంతటి దుష్టులొ మున్న నంతకుఁ
గడచిన శిష్టు లౌట యును గద్దు స్వబుద్ధిని పాపచింతలఁ
బెడసర మొప్ప నిల్పి మను వీఁటెడికిఁ గతి యెట్లు కల్గెడిఁ॥ 14

## మయూర వృత్తాంతము

శ్రీ సుహంసుండు కేరళ దేశవాసి
యుత్తమ ఖ్యాతి గన్న విప్రోత్తముండు
పూర్వ పుణ్యమ్ముతోడయి సర్వభాగ్య
ములు వరింపంగఁ బంచలక్షులు గడించె॥ 15

అతని కొకండె పుత్త్రుడభియాతి మయూరుఁడు గాగ పుట్టె జీ
వితమిది విత్తవంటిదయి వృక్షము వృద్ధినిబొంది పిందె గ
ట్టె తన నిజస్థితిన్ దెలుపుశేగతియాను శిశుత్వమందు స
న్నుతి గనునంత మాత్రమున నోరుద్రవించిన నెండమావియా॥ 16

ఒకఁడె కుమారుఁడైన పిత కున్న యొకండును సర్వలోకమై
సకలము వాఁడ యన్నయిలు సాగుట సాజము వానికై సుహం
సకుఁడు పొనర్పకున్నది విశాల జగత్తున లేనెలేదు కో
రకయె సమస్తమున్ దొరక రక్తుఁడు పొందని దెట్టులుండెడిన్ ॥ 17

జనని గతింపఁ దండ్రి తను జాతుఁడె సర్వముగాగ నెంచి హె
చ్చిన ధనసంపదన్ వెనుకచేయి యొకించుక చూపకేది మె
చ్చిన నది తెచ్చి యిచ్చి తన చిత్తవినోదము సాకుచుండ నా
తనికిఁ గొఱంత యేమి వినుతంబగు మానవతన్ మనందగున్ ॥ 18

అగునగు నైనగాని బ్రదుకట్లుగ సాగదు యౌవనంబులో
నగణిత సంపదన్ మునిఁగి యాడిన దాటగ సాగుచుంట వాఁ
డగపడె సర్వదుర్వ్యసన హారుల మైత్రికి వారితోడి దే
జగమయి మానవత్వమునె చంపికొనెన్ బులిఁ బాము మించుచున్ ॥

జనకుఁ డొసంగు చుండినను సంపద సర్వము చేతికందినన్
దనకిఁక స్వేచ్ఛయా జనకతన్ వహియించిన యంతమాత్ర నా
తనికి విశేషమేమి? తన తన్వినిగూడి సుఖంబునందె నే
జననము నందితిన్ దను వొసంగెను నాకని సేవకుండనే? 20

ముదుసలి యయ్యు ద్రవ్యమన మోహము పెద్దయి తాళపుంజెవిన్
వదలఁడు దేనికైన నిలువంబడి నోర్విడి చెప్పికోవలెన్
గదుమని మాట నిక్కమె కాని యిటుల్ కొనసాగుటెట్లు? నా
కదనున పెద్దమొత్తముల యక్కఱ పట్టిన నీయగల్గునే? 21

ఎప్పటికైన చచ్చుటది యెట్లును తప్పదు ప్రాణ మెట్లునున్
దప్పెడిదే తనంతఁ జనుదాఁక నెటుల్ సహియించియుందు? నేఁ
దప్పుగఁ జేసి నట్లయినఁ దాళము చేతికివచ్చి తోఁచి న
ట్లప్పటమైన స్వేచ్ఛ నడయాడగ వచ్చును, చేయుటెట్లొకో? 22

రాతిరి పాలు త్రావుగదరా విషముంచుము కొంచె మంతియే
రేతిరి రేతిరే తనువు ప్రేతమగున్ దెలవారి నంతటన్

ప్రాతిగ పాము కాటుగొనెఁ బ్రాణము పోయిన దంచు నేడ్చుచో
నా తెలివిన్ జగమ్ము నను నమ్మను నమ్మక యేమిచేసెడిన్॥ 23

తలఁచి మయూరుఁ డిట్లు తన తండ్రిని జంపెను పాము కాటుచే
విలవిల తన్నుకొంటయును వెజ్జును మంత్రము వ్యర్థమౌటయున్
వలవల నేడ్చుచున్ దెలిపి బంధుజనమ్ముల నమ్మఁజేసి యె
ట్టులొ దహనం బొనర్చెను కడుంగడు దుష్టతదైత్యు మీరుచై 24

జగతి నెదేనియుం జరుగఁ జాలదు వ్యర్థముగాగ దేనికిం
దగినది దానికుండు విదితంబగు కాదు మఱొక్కవేళ న
న్లైగబడి దుష్టుఁడైన మతిహీన మయూరుఁడు కన్నతండ్రి ప్రా
ణ గతికి హేతువౌ నతఁడు న్యాయముగా నెవఁడౌను పుత్త్రుఁడా!25

పుత్త్రుఁడు పుట్టి పున్నరకమున్ దరియింపఁగఁ జేయునంచుఁ దా
పత్రయ పీడితుండయిన వాఁడు తలంచు కెకాని వేఁడు తాఁ
బుత్త్రుఁడుగాఁగఁ బుట్టునొ స్వబుద్ధి నెఱుంగుట సాధ్యమౌనె యే
శత్రువు పుట్టెనో సుతుమిషన్ గడతేర్చ విషమ్ము పెట్టుచున్॥ 26

కోమలి కూఁతురున్ గొడుకు కోటి విధంబుల బంధుజాల మం
దే మెయి వారు నెల్లరును నేదొ ఋణమ్మును బట్టియే యటుల్
ప్రామి సమీపవర్తులయి వారి ఋణంబులు తీర్చికొందు రా
బాముని కంతె బంధమగు వారికి నైపడి చచ్చుటేలొకో॥ 27

అదియే మాయ మహారి పుత్త్రుఁడయి మోహాబ్ధిన్ సుహంసున్ బదే
పది ముంచెత్తి సుతుండె యౌననుచు దుర్భ్రాంతిన్ మునుంగన్ మహా
పదరున్ బొల్పడఁజేసె వార్ధకమునన్ బ్రాణ ప్రయాణంబు త
ప్పదుగానీ యిటులౌట కేమియననౌ ప్రారబ్ధ మట్లెంచనౌ॥ 28

అతఁడు సుహంసుఁ డౌటయును నాతనిబిడ్డ మయూరుఁ డౌటయున్
కతకని కల్పితంబయిన కట్టుడుపేరు లటంచు నెంచ రా
దతనిని పుత్త్రునిన్ జతకునైన సహస్థితిఁ దద్విరోధమున్
జతపడఁ జెప్పఁజాలు సరసప్రియ ముఖ్యవిహంగ నామములే॥ 29

హంస విహంగజాతి కడు స్వచ్ఛము తెల్లనిపిట్ట క్షీర నీ
రాంశ విభాగదక్షము దివాకరు నాత్మనుబోలి తెల్పు త
త్త్వాంశ సమేతనామము సుహంసుఁడు సార్థకనామధేయుఁడై
శంసితుఁడయ్యె లక్షులకు శాసకుఁడౌటయె చిత్రమయ్యెడిన్ ॥ 30

అంత విశుద్ధునుండి పరమాద్భుత వైఖరి సర్వమోహ వి
భ్రాంతుల కాకరం బయినవాఁడు మయూరుఁడు పుట్టెవింతయా
వింత పరాత్మనుండి ప్రభవించును లోకము రెంటికెంత త
త్త్వాంతర మట్టులే యిచట స్వచ్ఛత వర్ణత గోచరంబగున్ ॥ 31

ఎంతటి మంచివాఁడయిన నేమి ధనమ్మునుగూర్చి పెట్టినన్
స్వాంతము భీతికిన్ నిలయమౌటది యెట్లును తప్పదా భయ
భ్రాంతులు పుత్త్రునింబడియె వచ్చుటయున్ సహజంబె స్వీయ పి
త్రంతికుఁ డంత నెట్టిఁడగు నాతఁడె దేనియుఁ జేయఁగల్గెడిన్ ॥ 32

బహుధన మబ్బె ప్రాయము నవంనవమయ్యె స్వతంత్రుఁడింక వాఁ
డిహమునఁ జేయలేనిదని యెక్కడనుండును శుద్ధహంసయై
గృహమున నున్ననున్ నిలువనీయదు లోకము చిత్రవర్ణుఁడై
విహరణ శీలియైన సదవీయసియా నరకంబు వానికిన్ ॥ 33

నటవిట గాయక గణికా
పటల మ్మొకటతని వెంటఁ బాయక యుండున్ ॥
పటు రంధ్రయుత ఘటమ్మయి
జోటజోట ధనమెల్ల జాఱుఁ జూచునె వెనుకన్ ॥ 34

ధనమొక హద్దు దాటునెడ దానికదే తెగ హెచ్చు మూట క
ట్టినయది యట్టులుండగ గడించిగ పిల్లలబెట్టి వృద్ధియా
దినదిన మెంత ఖర్చయినఁ దీఱదు తద్వ్యవహార వేత్తయా
ధని కది యక్షయంబగును దానికినై యతఁడన్ని చేసెడిన్ ॥ 35

జనకుని జంపి సంపదకు స్వామిగనైన మయూరుఁ డద్ది త
గ్గని సిసలైన యూటయగు గట్టి పరిశ్రమచేసి దానికై

వెనుకకుఁ బోక యెందఱనో వెన్నెల బాకులదూసి చంపి కూ
ర్చినది మరెంతో యాట నట చేటును బొందక విప్పె తూములన్॥
జూదము పానమున్ వెలఁది శూన్య మొనర్పఁగఁ జాలు సంద్రమున్
కాదని వాఁడు మాటికిని కంకణ దీక్షితుఁడయ్యె నైననున్
జూదము వానికిన్ గెలుపుచూపి సముద్రపుపోటు పెంచె మ
ర్యాదలు దాటి కామినుల నందె క్షణక్షణ నూత్న కాంతగా॥ 37

ఆలును బిడ్డయుంచుఁ గనఁడాయె నిరంతర భోగమూర్తియై
రేలుఁబవళ్ళు నిర్ఝరిణి రీతిఁ గడున్ వడి దూఁకి పోవ దు
శ్శీలున కేఁబదేండ్లయిన సిగ్గునువీడి యతండు ప్రేయసిన్
గాలిని దేల్చుచున్ జనియెఁ గాశికి గంగను మున్గి తేలఁగన్॥ 38

మోహ మదెంతచేయుఁ బెనుమాటను వెంబడిఁ గొంచుఁబోయె ని
ర్వాహిత వానిస్వారి గొనివచ్చి పవిత్ర సురాంబు వాహినీ
గాహనమైన పిమ్మట నెగాదిగ వారుణిపోసి మత్తుఁడై
దేహ మెఱుంగనట్టి యెడఁదీసి ముడిన్ దన దారిఁ బోయినన్॥ 39

ఒడ లెఱిఁగెన్ మయూరుఁ డెట నున్నది కన్నులు విచ్చిచూచెఁ బ్రే
ముడి ముడి జాఱిపోవుటలు మోహము వీడి యెఱింగె నెట్టులో
యొడలి నగల్ కృపాపరుల యొద్దనుబెట్టి ధనంబుకై కొనెన్
బడలుచు నిల్లు చేరికొనెఁ బట్టిన మైకము తీరఁ జింతిలెన్॥ 40

కటకట కామినీ వశతఁ గాశికినేగెను గంగ మున్గెను
త్కటమగు దుఃఖముంబడసెఁ గాంతయుఁ గాంచన మొక్కమాటుగా
చటుల తటిత్తులై విడిచి చన్న నిరాశ్రయ దుష్టవేళ నా
కటకట కాశియందగుట కారణమేమొ విశిష్టచిత్తుఁడై॥ 41

ఇంతకుఁ బూర్వ మెప్పుడు నిదేమని యెంచని వాఁడు తా జరా
క్రాంతుఁడు నాట గుర్తెఱిఁగి కాయము భోగము మానవత్వమున్
వింతలు వింతలై మదికి విస్మయమున్ గలిగింప "మృత్యు వ
త్యంతము మీఁదికిన్ దుమికి నంతటఁ జేసెడిదేమి? తప్పునే॥ 42

చావకముందె యేమయిన సాధ్యము కాఁగలదేమొ చూడనా
జీవిత ముఖ్యభాగ మిది చిన్నముగూడ నరత్వ మెంచకే
సేవితమయ్యెఁ బాశవము చేటగునే యదియెట్లు పుట్టినో
యావిధి నెల్లకాలమును హాయిగ నుండును చచ్చునంతకున్॥ 43

మానవుఁడైన నేను విసుమానముగా జనకున్ వధించి బా
మానని పాముకాటు కథ నల్లితి లక్షపతిత్వ మందితిన్
మానని దుష్టకామమున మాఁగితిఁ ద్రాగితిఁ దోఁచినట్లె దు
ర్మానమునన్ జరించితిని మానవతన్ విడనాడి పూర్తిగాన్॥ 44

ఇటులె చరింపగా నయిన నీ తనువందుట యేల పోతునై
పెటపెట పెంటె మందలను ప్రీతిఁగనందగు నెల్గుబంటినై
లొటలొట త్రావవచ్చు మసలున్ మన సంచును మంచిచెడ్డలన్
గటకట కానవచ్చునను గాడియె వీడితి దేహ విస్మృతిన్॥ 45

వ్యసనము మూడి పంచకమునందు బలంబయి వ్యర్థజీవిగా
మసనము జేర్చు కాయమును మానవుఁడన్ స్మృతియున్న నద్దియే
వ్యసనము దైవధర్మదయలందు బలంబు గడింప ముక్తికై
వసమగు జీవదృష్టి పరివర్తన మందునె ముఖ్యమియ్యెడన్॥ 46

ఇంతటి భ్రష్టు నన్ను నిపు డెవ్వఁడు కాచును చంద్రకుం డొకం
డింతినిఁ బెండ్లియాడుమని యెప్పుడు చెప్పుచు నుండె వాని నే
నుంతయు లెక్కసేయక విశుద్ధుని దూరము చేసికొంటి నన్
భ్రాంతుని జేరఁదీయు నొకొ పాదములన్ బడి వేడికొన్నచో॥ 47

చేసిన తప్పులన్నిటిని చెప్పెద నిష్కృతి చెప్పు మంచు ని
ర్వ్యాసితు పాదపద్మములు పట్టి విడన్ బతిమాలి కొందు పే
ర్మోసిన వేదవేత్తయుఁ బురోహితుఁడుం గదా దారి చూపకే
ర్మోసి పాకాలు మంచను నె రోయి సమృద్ధిగ నున్న దిప్పుడున్॥ 48

మనుజులె తప్పు చేయుదురు మానవతా మహిమంబు చేతనే
కనుగొని తప్పు దిద్దికొను జ్ఞానము నూనుదు రిద్ది నైజమా

మనసునఁ బుట్టు సర్వమును మాన్య మటంచుఁ దలంచుచుండు నే
మనుజుఁడు వాఁడు తాఁదిరిగి మానవతన్ గనలేఁడు పాపియై॥ 49

పశ్చాత్తాపము దివ్యమౌ దినుసు పాపం బెంతదైయున్న ప్రా
యశ్చిత్తమ్మునఁ బాపికోఁ దగును ధ్యేయం బూర్జితంబైన వై
పశ్చిత్యమ్మది లేకపోయినను తీవ్రమ్మైన తాపమ్ముతో
నైశ్చల్యమ్మున సాధుమార్గమున నున్నంజాలు ముక్తుండగున్॥ 50

ఉన్నటు లుండి మేల్కనుచు మయూరుఁడు చంద్రకు నింటికేగి హం
సన్న కుమారకుం డిటు గృహంబునకుం జనుదెంచు టబ్రమై
యన్న! యిదేటి రాకయని యాదర మొప్పగ నాతఁడెంతయో
మన్నన చేయ భక్తిని నమస్క్రియ పేరఁ బదమ్ము లటుంచున్॥ 51

"స్వామి! కృపాపరత్వమున సాకుడు నన్ను భవద్గృహంబు నా
యీ మెయి గాలి సోకి యఘు మేచునో యేమొ క్షమింపుఁ డింతకున్
మీ మును నిల్చు యోగ్యతయు మృగ్యము నా యెడఁ బాపకేలి కే
లా మహితానుతాప బహుళశ్లథ చిత్తుఁడఁగానఁ బూనరే! 52

ఎప్పటి కప్పుడీరు హితమెంచి వచించిన బోధలన్నిటిన్
దప్పని త్రోసి పుచ్చితిని ధర్మమెఱుంగక దానవాత్మతన్
గప్పిన మోహమై నుడువఁగాని యఘుంబులఁ గోరి చేసితిన్
ముప్పున వచ్చి దిక్కనుచు మ్రొక్కెద నెట్లు సముద్ధరింతురో! 53

బాపన జన్మమెత్తితిని పాపపు మూటలు కట్టికొంటి నా
వీపును గోకి కొంటకయి పేనిన త్రాడుగ జందె మెంచితిన్
చేపిన కామధేనువయి సేగి యొకింతయు సోకకుండ పాల్
ద్రాపెడి తల్లి కూడనగు తండ్రికి నేనె విషమ్ము పెట్టితిన్॥ 54

పామని బొంకి పామునయి పట్టి వధించితిన్ గన్నతండ్రి నీ
బామున నేను చేయనిది పాపమొకం డెటనైన నుండు నే
ప్రేముడి మీరు చెప్పినను పెండిలి యాడను స్త్రీసుఖార్థినై
నేమము లన్నిటిన్ విడచి నిష్ఠుర వైఖరి సంచరించితిన్॥ 55

ధన గర్వమ్మున దానవుండనయి నిందా క్రోధ శాపాదికం
బును లెక్కింపక యెందరో మగలు నా ముందేడ్వ నవ్వారి స్త్రీ
లను భోగించితిఁ ద్రోవ కడ్డుపడఁ గ్రోలం జాలితిన్ బ్రాణముల్
కనకుంటిన్ మిను మన్ను నేటికిటు మ్రొక్కన్ వచ్చితిన్ గావరే! 56

ఏబది యేండ్లు పైబడిన విప్పటిదాఁక నెఱుంగ ధర్మమున్
గూబయు గ్రుడ్డినై తనువు గూడున నింద్రియ తృప్తి నెంచి యా
లాబు శలాటు వం దొదుగు లాహిరి పట్టిన పుర్వునై దురా
శా బల వర్ధితాఘ చయ సౌధమునం బడి యుంటినయ్యరో! 57

ఎంతటి పాపికిన్ నుడువునే కద శాస్త్రము నిష్కృతిన్ ధనం
బంతయు గ్రుమ్మరించెద మహాత్మదయన్ బడియున్న దింతకున్
స్వాంతము పట్టి పీకు బలు పాపము లన్నిటి నెట్టివైచు మా
ర్గాంతర మేదియైన కలదా యని వేడగ వచ్చితిట్లుగన్ ॥ 58

మీ ఋణ ముంచుకోను నను మీ సుతునట్లుగ నెంచి మీకు నే
స్తై రమణీయ వర్తనుఁడునై కృప సాకిన తండ్రిఁజంపు నీ
దారుణ వర్తనున్ దెలచు దారి మహాఘ మటంచు నెంచ కే
దారిని నైనఁగావ దయఁ దాల్పుఁడు నాపయి పాపమూర్తిపై ॥ 59

చేసిన పాపమున్ దెలియఁ జెప్పిన పోవు నటన్న బుద్ధియై
గాసిలి యున్న వాఁడటులు కంపము నందక ఘోరపాప వా
రాశిని గ్రుమ్మరించు నెడ ప్రాణము లన్నియుఁబోయినట్లై మ్రో
డై శిలయై వినన్ వినఁగ హోవళినంది వడంకు దేహమై॥ 60

చంద్రకుఁడా పురోహితుఁడు శాస్త్ర విదాంవరుఁ డంతరంగ ని
స్తంద్రత చాలసేపెదొ విచారము సల్పి మయూరపాప వా
ర్ధీంద్ర విశోషణ క్రియ లవేవియుఁ దోఁపగ యెట్టకేలకున్
మంద్రగళ స్వరానఁ గరుణా మయుఁడిట్లని పల్కె వానితోన్ ॥ 61

“శివ శివ! యెంత చేసితి విసీ హరుఁ డెంతటి పాపహారియై
దవ శిఖి కాలకూటములఁ ద్రావెడి వాఁడయినన్ దనూజుఁడే

తవిలి సమస్తమై మనుచు తండ్రిని చంపిన కావఁజాలునే?
వివరము గాఁగఁ జూచితిని విస్తృతశాస్త్రము నిష్కృతింగనన్॥ 62

అయినను ద్రవ్యమున్నదని యంటివి వెంబడి కొంచుఁబోవఁగా
నయిన విధాన మార్చికొని యాస్తుల నన్నిటి నేమి చేసెదో
పయనము చేయ సిద్ధపడి వచ్చినఁ బోదము కర్మభూమిలో
నయిన సమస్త తీర్థముల నార్తిహరున్ భజియించి వత్తమున్॥ 63

చేసిన పాపముల్ తెలియఁ జెప్పుమటె వానిని త్రోచుమార్గ మా
గాసిలి యైనఁ జెప్పితివి గాన తరింపఁగఁ జాలు దీవు నా
శ్రీశుఁడొ పార్వతీశ్వరుఁడొ చేకొనకుండురె దానధర్మముల్
వాసిగ క్షేత్రరాజముల వారక చేయుదుగాక యిచ్చమై॥ 64

పాపము చేసి చేసినది పాపముగాఁ దలపోసి పాపికో
తాపము నందు వాఁడు పరితాపము చేతనె శుద్ధుడౌను నీ
వా పథమందు దైవకృప వాలితి విద్ధి శుభార్థమే యగున్
రేపె ప్రయాణ మన్న సవరించు కొనంగల వేమొ చూడు'' నాన్॥

పుట్టంధుని కన్నొక్కటి
చట్టున విచ్చిన దనంగఁ జంద్రకుఁ డట్టుల్
నెట్టన తీర్థాటనమున
నెట్టగ నా పాపమన్న నియతి వచింపన్॥ 66

ఆ మయూరునకపు డెంతయో ముదంబు
కలిగెఁ దనతోడ నాతఁడున్ గలిసి వచ్చు
నన్న సూచనతో నేన్గు గున్న నెక్కి
నంత యూరటన్ బొందె ప్రయాణమునకు॥ 67

సర్వ సన్నాహములు నాఁడె సలిపె నతఁడు
చరము లన్నింటి నెంతయేన్ ధరకు నొప్పి
ధనముగా మార్చికొని యున్న ధనము నంత
వెంటఁ గొని పోవఁదగునట్లు పెట్టెబెడ॥ 68

పదిలముగ సర్ది యాన సంభారములను
సత్వరము కూర్చికొని సుప్రసన్న మతిని
స్థిరము లన్నింటి బాధ్యత స్నేహితునకు
నప్పగించి రాబడి కూర్చి యప్పుడపుడు॥ 69

తాను తెలిపెడి తావున కేనినైన
పంపి యందించు నట్టు లేర్పాటు చేసి
కొని మయూరుండు చంద్రకాఖ్యునకుఁ దెలిపి
యనుకొనిన యట్లు మర్నాడె చనియె యాత్ర॥ 70

నెమలి పురి నుండు కనులు నేత్రములు కావు
నేత్రముల వోలెఁదోఁచు నంతియ యట్లైన
చంద్రకునితో మయూరుండు సాగె యాత్ర
కానఁ జేయునె కనుగాని కన్ను నతని॥ 71

కనునో కానదొ వెంట తోడుగ నెదో కాష్ఠంబుగానైన నొ
క్కని సాహాయ్యము పుట్టుగ్రుడ్డి కన నిక్కంబెంత ప్రోత్సాహ మ
బ్బునొ తా నంతటి మోదముంగని పరిప్లుష్టాత్ముఁ డవ్వాఁడు కా
లిన దేహంబున వెన్నపూత యిడినట్లే సౌఖ్యముంగాంచుచున్॥ 72

తన వెంటన్ సు పురోధ చంద్రకుఁడు రాన్ ద్రాక్తీర్థ యాత్రా రిరం
సను దివ్యస్థలు లెన్నియో కొలిచి విశ్వాసంబుతో నన్నిటన్
ధన దానంబులు పాత్రులౌ జనుల కత్యంతంబు పొంగారు భ
క్తిని బ్రహ్మార్పణ బుద్ధి నిచ్చుచు నెటన్ దృప్తిన్ గనం జాలకన్॥

చని చని చంద్రశైల మునఁ జల్లగ నుండుట నాగి దాపునం
గన నగు నాగలా పురముఁ గాంచె మహేశ్వరు భక్తి నెంచుచున్
వినుతులు కంబళాశ్వతర విశ్రుతనాగులు తత్ప్రదేశ మం
దనితర సాధ్య దివ్య తపమంది శివ ప్రియులైరి సత్కృపన్॥ 74

అచ్చటఁ గూడ నాతనికి స్వాంతము స్వస్థత నందదయ్యె న
భ్యుచ్చయ పాప మించుకయు నూరట గాంచగ నీదు లోనలో

నుచ్చలి తుండుగా నగుచు నూరక దిక్కులు చూచుచుండ సం
పచ్చయ మొక్క మాటుగ నమజ్జను మాళిని నిల్చునట్లుగన్ 75

కనిపించెన్ మరిపించె దక్షిణ దిశాకైలాస మా కొండయే
యని యాతం డెఱుఁగండు లోన నెదియో యత్యద్భుతంబైన మా
ర్పును దా నందిన యట్లుగానయి యితఃపూర్వంబు తా నెప్పు డొం
దని యానందము నంది మో మదియు నద్దంబట్లు చూపింపఁగన్॥ 76

కలకలలాడుచున్ నిలువఁ గాంచిన చంద్రకుఁ డేగుదెంచి వె
న్నెల వెలుఁగుల్ పవిత్రములు నీ ముఖమందునఁ దోఁచునన్న నీ
కలుషము లెల్ల జాఱెనవి కామిత మిట్లు ఫలించె నంచు నే
తలఁచెద నీవు నిచ్చట నదాటున వింతయెదేని గాంచితో॥ 77

తెలుపుము నాకనన్ వికసదిందు సమానతఁ జల్లె వెన్నెలల్
నలు దెస జల్లు మోము నయ నమ్ములకున్ గడు విందుఁ జేయఁగా
పులకిత గాత్రుఁడై యతఁడు "పుణ్యాతమా! యిదియెల్ల త్వత్కృపా
కలిత నవార వింద సమ కమ్ర హృదంతర మీను చల్వయా॥ 78

నారకి నన్ను తీర్థ భజనమ్మని పేరిడి నాకి నౌ మహో
దారతఁ జూపినాఁడవు కృతజ్ఞుఁడ నీ ఋణమెట్లు తీర్తు? నే
నారయనైతి నింతటి మహత్త్వము కద్దని తీర్థ సేవలో
నూరక సంచరించుటని యుంటిని నేఁడె గ్రహించి తిక్కవన్॥ 79

ఎన్నో ప్రదేశముల్ తిరిగి యిక్కడకున్ జనుదెంచి నార మో
యన్న! రవంతయున్ శుభము లబ్బిన యట్లుగఁ దోఁప లేదు నా
చన్న మహౌఘమంత యని స్వామిఁ దలంచుచుఁ దూర్పు దిక్కుగా
కన్నుల నుంచి బాష్పములు కాల్వలు గట్టగ నుంటి నంతలో॥ 80

చూడుము చూడు మద్దె బహుశోభనమై కనవచ్చు మద్ది తా
నోడునె మింటి కన్నటులహో మినుమీఱెడి దాని చాయగా
నీడకు క్రోశ పంచకమొ యింకను నెక్కువొ పెద్ద పర్వతం
బోడకు మోడ కన్నటుల నుల్ల మదెల్ల తరంగి తమ్ముగాన్॥ 81

దానినె కాంచు చుంటి నిట దాని గనన్ మది మార్పు చెందెనో
పూనిక నిన్ని నాళ్ళలను పుణ్యజలంబుల దోఁగి దోఁగి రా
రా నది యెల్ల పండి మధురంబయి యీగిరి దర్శనంబుగా
తేనియ గ్రుమ్మరించినదొ తేకువ నీ వచనంబు పండెనో॥ **82**

నే నిను నమ్మినాఁడ నవీన సుర! నీవె గురుండు దైవమున్
గానని వాఁడ నూతయయి కానఁగఁ జేయుము తద్గిరీంద్రమున్
దాని విశిష్ట శైలమగు దాని సుదూరము నుండియే యెదం
బూని ప్రభావము న్నెఱపు పుణ్య గిరీంద్రముఁ గొల్చితీరనా''॥ **83**

కని మది యెల్ల మాఱి యనఘస్థితి నున్న మయూరుఁ డిట్లుగాఁ
దన యనుభూతి నంతయును దన్మయుఁడై వచించుచుండ వా
నిని గని చంద్రకుండును వనీమయమైన గిరీంద్రమట్లుగా
ననుకొని తానుగూడ హృదయంబున మార్పదొ పొందినట్లులై॥ **84**

పేరును దూరముం దెలియ వేడి కనుంగొనె చంద్రకుం డ దే
తారకరాష్ట్ర భూధరము దక్షిణ దిగ్గత మం చెఱింగె మా
యూరున కా శుభం బెఱుఁగ నొప్పగఁ జెప్పెను తద్గిరీంద్రమున్
జేరగ నేగి రిద్దరును శ్రీ శివమూర్తిని జూచు నిచ్ఛమై॥ **85**

జీవితముల్ విచిత్రములు చేటును మంచిగ మంచిఁ జేటుగా
భావన చేసి మోహముల పాల్పడుచుండును జీవకోటి మా
యావి నెఱుంగలేక యది యాతనికిన్ బరమాయుధంబు కా
దే విధి దేహధారణము నేడ్తెఱ నొప్పెద రాత్మమూర్తులై ॥ **86**

కోరి వరించి దేహములఁ గోర్కెలకై కృషి చేయుటెల్లఁగా
మారి పటిష్ఠ శక్తియగు మాయనుగాక మ రెట్లు సాధ్య మ
వ్వారి మనః ప్రవృత్తి యెటువంటిదొ తేలుటకైన నద్దియే
దారి మయూర చంద్రకులు దారిని బోవుచు మాయ గ్రమ్మినన్ ॥ **87**

పోను పోను వనంబు ముదిరి సందియ్యదు
పదమెత్తి పదముంపఁ గదలనీదు
వ్రేలాడుచున్న వవేవియో పాములా
యల్లైన వృక్ష శాఖాంతరముల?
కానన మే యెడ్డు కానవచ్చున్న చో
గిరి వచ్చెనో లేదొ యెఱుఁగ రెట్లు
బయ లేదొ భువి యేదొ వియదుద్భవంబైన
వృక్షముల్ తలక్రిందు వ్రేలు నివియె

దిగ్భ్రమం జేచి తలలు దిద్దిరను దిరుగ
నేదిరా దారి యని యెలుంగెత్తి దేవ
నాపదుద్ధారకా! కావు మనుచు నోరు
నొవ్వ బిలుచుచుఁ గ్రూర జంతువులు తోఁప॥ 88

గుండియలు జాఱ స్మృతి తప్పి కూలిపోయి
యెట్టులో లేచి యెగ్గెత్తి యేడ్చి యేడ్చి
వీడిపోకుంటకై వెనవేసి కొన్న
చేతులును తిమ్మిరెక్కి నిశ్చేష్టనంద॥ 89

ఇంకేమున్నది? మీఁదికిన్ దుమికె మత్తేభంబి దే దీర్ఘదం
డాంక ప్రోద్యత హస్త భీకర యముండై యార్భటిన్ వచ్చె నే
నింకన్ జీవముతోడ నుంటిన యెదీ యే మాత్రమున్ నొవ్వ లే
దింకేన్ బ్రాణము లింకె వెంకలను తండ్రీ! యిట్లు భక్షింతువే? 90

అది యేనుం గనుకొంట మాయ నడగొండై మోయుచుండెన్ శుభా
స్పద వృక్షావళి, తీవ్ర వేగహృత వృక్షంబొండు దండంబుగా
కదనోర్వీ పరిపంథి వర్గమును నిష్కంపంబుగాఁ జేయు దు
ర్మద వీరుండనఁ గూల్చు చున్న దదె దుర్వారంబుగా శాఖ్మజముల్॥
అజయాఖ్యంబగు మాయ యేనుఁగయిరా నవ్వారు తద్భీతిచే
నిజరక్షార్థము వీడిపోయి కరముల్ నిర్ఘాత మేఘాభులై

యజ కోల్పోయి విభిన్న దేశముల నన్యోన్య ప్రబోధంబులున్
ప్రజవోగ్రానిల ముర్మ్మురంబు లటు తోఁపన్ రాని దుష్టస్థితిన్॥ 92

ఒంటరులై కుమారిలిరి యున్నది చంద్రకుఁ డొంటి తాడి నె
ట్లంటె పెనంగియుండె, నెపుడట్లు పెనంగొనెనో యెఱుంగ, మె
ట్లుంటివి భద్రమా యనుచు నూర్జితు లెవ్వరొ పల్కరించి న
ట్లంటిన తాడి కౌగిలి విడంగని యచ్చటె కుప్పకూలుచున్॥ 93

చేతులు రెండు నెత్తిపయి చేర్చి యొకంతకు దుఃఖమార క
త్యాతత వృత్తి నేడ్చి యిటులాటకుఁ దండ్రిని చంపినట్టి యా
పాతకి నుద్ధరింతునని వానికిఁ దోడుగ నిల్చు టొక్కటే
హేతువు కాక మంచికిటు లెక్కడనైనను చేటు మూడునే? 94

నా కిట్లైనది దైవ సత్కృపను మేనన్ బ్రాణముల్తోఁచు వాఁ
డీ కల్లోలము దాటి బైటపడునే యీ పాటికే యర్క పు
త్త్రాకారంబున దుష్టనారక బిరాధ్యస్తుండె యైయుండు నా
కౌ కర్తవ్య మిఁకేమి యానువనినే మయ్యోన్ గనుంగొందునా? 95

సాయము గాగ వచ్చుటకె చచ్చిన చావయి యిట్టులుంటి న
మ్మాయికి దుష్టపాపి కిఁక నై మయి తోడ్పడుచో మఱేమియా
నో యెటు చూచినన్ దగులకుండుట వానిని విస్మరించి నే
నై యిలు చేరుటే తగు గృహస్థుని ధర్మమటంచు నెంచుచున్॥ 96

బరువగుటన్ దనంతగనె పంచియిడన్ దన యొద్దనున్న త
త్పరమ దురంత పాపిదగు భాగ్యము భాగ్యవశాన దైవమే
వరకృప నిచ్చినట్టి వసువంచుఁ దలంచి విచార మేది తాఁ
దిరుగు ప్రయాణమై చనియె దీన మయూరుఁడు కానప్రమ్గగన్॥ 97

ఆ సంక్షోభమునన్ మయూరుఁడొక బిల్వాగంబు సచ్ఛాయలో
వాసంబందెను మూర్ఛ తేఱికొని నల్వంకల్ పరీక్షించి తో
డై సంగాతకుఁడై గురూత్తముఁడునై యాధారమై యున్న ని
ర్వాంసుడైన మహీసుర ప్రథితు నెప్పాటన్ గనం జాలకన్॥ 98

ఒకటియు రెండునాళ్ళు లోక యూరట లేక వనంబులోనఁ ద
త్ప్రకటిత నామఘోషణ విరావము దిక్కులనిండ వానికై
చకిత మనస్కతన్ వెదకి సర్వ గవేషణ వ్యర్థమైన మా
నక మదిలోనఁ జింతిలుచు "నన్నిటు నట్టడవిన్ మిగిల్చితే? 99

దైవమ! యెంత చేసితివి దారి యెఱుంగను, తోడుపీడె, నీ
వే విధిఁ బ్రోచెదో యెఱుఁగ, నెల్లెడ నుండెడి నీవు నా స్థితిన్
దేవ యెఱుంగవో వినవొ దీనుని కూయి, యిదే సమంజసం
బీవని వీఁడు చచ్చుటయె యెంచెదొ శిక్షగ పాపరాశికిన్॥ 100

చచ్చుటకే భయం పడను స్వామి! జనించిన చావకుండు రే?
హెచ్చిన పాపముల్ సలిపి యేడ్చెడి నా కెది దిక్కు? చంద్రకున్
మెచ్చి తదీయ బోధనిటు మేలగు తీర్థములన్ని గొల్చి యీ
విచ్చిన కానకోనఁ దెలివిం గనఁ జాలక దిక్కు మాలితిన్॥ 101

నీవె కృపాపరుండవయి నిక్కముగా నను దేర్పకున్న నే
దైవము నన్నుగాచు గురుతల్పగు దోషము నెంచకీవు మే
ల్తావి సుమంబుగాఁ దలను దాల్చిన వాఁడవు నాదు పాప మెం
తై వివశుండనై నిను నవశ్య గతిన్ శరణంబు వేడితిన్॥ 102

కావుము కావుమో దనుజ గర్వ విభంజన! భక్తరంజనా!
సేవక పాపమోచన! నిషేవిత వహ్ని రవీందులోచనా!
పావక మూర్ధజా! నరసుపర్వ సమర్చిత పాదపంకజా!
పావననామ! మాని జన భావిత కామిత కల్పక ద్రుమా! 103

పనవి యిటుల్ మయూరకుఁడు ప్రాణము శోషిల మూర్ఛనంది చ
ల్లని పెను బిల్వ భూజ మిడు లాలన మెల్లగ సేదదేరి మే
ల్కనుచునె గాంచె వృద్ధకృకలాసము వోలిక తద్వనాంతరం
బున మరుగై తనంతట నపూర్వత తోఁచిన వృద్ధునొక్కనిన్॥ 104

తల కందగించు రుద్రాక్ష మేరువు ఫాల
మధ్యస్థమై నేత్ర మహిమ వెలుఁగ
నంగనా సహిత విఖ్యాత పూరుషుఁడు నా
ముదుసలియై మోహమునను ముంప
భసిత త్రిపుండ్రంబు వెసఁగెడి ముదిమేను
తెల్ల పట్టెల మద్ది తీరుగాగ
కర ముపాంశువు గాగ వరజప మ్మొనరించు
పెదవులు పూరేకు పగిది కదల

నెవ్వరో గాని దేహ సంస్కృతిని గూర్చి
తాను మెలఁకువఁ గన్నంతఁ దలఁగి పోయి
యేమి యెఱుఁగనిరీతి శుష్కేంధనములు
బిల్వదళములకై వచ్చు వృద్ధు పగిది॥ 105

అనతి దూరానఁ దిరుగు నా యయ్య గాంచి
కన్నులన్ నుల్మికొని చూచి కల్ల గాదు
కలయునుం గాదు ప్రత్యక్షకాయుఁ డితఁడు
స్థేయుఁ డాశ్రయణీయుండు సేవ్యుఁడనుచు॥ 106

స్వామీ! యంచు సమీపవర్తుడయి పెల్చన్ దండ మన్నట్లుగా
నా మున్ రాలుచుఁ బాద పద్మములు డాయన్ శీర్షమై మ్రొక్కి-యో
హో! మునీశ్వర! సత్తపో మహిత! ఆర్యుల్ పూజ్యు లెవ్వారికిన్
నామై పుల్కలు తీరు మిమ్ము కనినన్ నానాథ! రక్షింపవే! 107

నేనీ ఘోరవనానఁ జిక్కికొని కంటిన్ మిమ్ము మూన్నాళ్ళ కే
నై నిల్పోపక వీడిచన్న ద్విజుఁగానన్ లేక గాలించితిన్
గానన్ సర్వము నెందు గానను మిముల్ గన్పించి రీవేళ మీ
రే నా కూతలు త్రాతలున్ భయము వారింపన్ దయంబూనరే?

మీ రెవ్వా రిటకేల వచ్చితిరి నా మీఁదింత కారుణ్య మా
కారిసుండు వహించి మిమ్మిటకుఁ జక్కం జేర్చెఁగాఁబోలు నే

దారిన్ గానక తోఁడు వీడి చనగా ధాత్రీ ధరం బేదొ ప్రో
ద్ధారం బౌనని దానికై యిటకురాన్ బ్రారబ్ధముత్కృష్టమో॥ 109

మూన్నాళ్ళిచ్చట త్రిప్పలంబడుటయున్ ముప్పెంతయైనన్ సమా
సన్నంబౌ శుభమట్లు మీరిట కవశ్యంభావులై రాకయున్
గన్నన్ సర్వము చిత్రమై యెడఁద నిక్కంబౌ ప్రమోదాబ్ధిలో
మన్నట్లయ్యెడి ఘోర పాపిని ననున్ మన్నించి కాపాడవే! 110

అని యిట్లెంతయు దీనతఁ
గొనకొని రక్షింపుఁ డనుచుఁ గోరెడి వానిన్
గనుగొని యా వృద్ధుఁడు చూ
చిన చూపులనె దురిత తతి చిట్లి నశింపన్॥ 111

బాబూ! నే నిట నెప్పుడున్ నిలుతు నా వారంచు నా కేరునున్
గాబో రిచ్చటి వాయులింగ మగు శ్రీకాళీశ చిన్మూర్తికై
జీబుల్ కట్టిన కానలోఁ దిరిగి మేల్పొందించు పత్రాదులన్
ప్రాబల్క్యాల్ పఠియించుచున్ బుణికి తీవ్రాకాంక్ష సేవించెదన్॥112

దినము న్నేనిట సంచరించుటది వింతే నీవు కాన్పించి తీ
దినమం దేనిట కేగుదెంచిన తఱిన్ దేహస్మృతిన్ వీడి భ్రమం
దిన యట్లే పడియుంటి వీవిచట బొందిన్ బ్రాణముంటన్ మహే
శుని మంత్రంబు పఠించుచున్ మసలవిచ్చున్ గన్నులయ్యేన్ వెసన్ః

నీ వెవ్వాఁడవు? నీదు దేశమెది? యొంటిన్ భీకరో గ్రాటవిన్
నీ వై యేల చరింపఁగా వలసె? దానిం దెల్పు మీ కానలో
నావిఖ్యాత సమస్త మాత్మవిదితంబై యుంట ని న్నేను నీ
కావంతైన శ్రమంబు లేకెచటికే నాప్తుండనై చేర్చెదన్॥ 114

అనుటయుఁ దనువున నమృతపుఁ
జినుకులు నిలువెల్ల కురిసి చిన్మయ చేతో
వనజము విచ్చిన యటులై
యెనలేని సుఖానుభూతి యేచి యతండున్॥ 115

తన కథ నే యొకింతయును దాపక తాపముతో వచించి హే
మునివర! సాంద్రకారుణిక! మోహనరూప! విచారహీనుఁడన్
చెనటిని, దుష్టచిత్తుఁడను చేసిన పాపము లన్ని చెప్పితిన్
నినుగనుటే యదృష్టమగు నీవె శరణ్యుఁడ వార్తరక్షకా! 116

నాగక్షేత్రమునుండి చూడ నయనానందంబుగా దివ్యమా
శ్రీగంధాగ మనంగఁ జాలిన వనీశ్లిష్టోన్న తాగం బొకం
డా గో నాశకమాచుఁ దోఁచినది మే మద్దానికై వచ్చి నా
నాగ క్లిష్ట భయంకరాటవిని మార్గాన్వేషముం జేయుచో॥ 117

అది గజమా? మ దాచరితమైన మహాఘములన్ని యట్టి భీ
ప్రదమద సింధురాకృతిని వచ్చి విధూతమనస్కుఁ జేసి నా
కొదవిన తోడు నన్నువిడ నొంటరి చేసినవంచు నెంచెదన్
ప్రిదిలిన గుండియున్ గుమిలి పెట్టితిఁగూయి దెసల్ ధ్వనింపఁగన్॥

ఎంతసే పేడ్చి నాఁడనో యెఱుక లేదు
నా యొడలు నాకుఁ దెలియని చాయ మత్తు
క్రమ్మి సొమ్మసిలి తనువు కట్టెగాగ
నేలఁ బడియుంటి మీ దయక్ మేలుకొంటి! 119

అప్పుడు కానిపించిన మహత్తర శైలము తోఁప దేమి? నన్
గప్పిన కారుచీకటుల ఘుర్మ నభోమణిపోలెఁ జెండి యిం
కిప్పుడు దగ్గరైన తటి నేమియుఁ దోఁపక దాగు టేమి? నే
నెప్పగిదిన్ గిరీంద్రమున కేగఁగలాఁడ ననుగ్రహింపవే! 120

అటు మయూరుఁడు విన్నవించుటయు వృద్ధుఁ
డతని హృత్తాప ఋజుతా మహత్త్వమెఱిఁగి
తోడుపడి కావ నెంచి సంతుష్టమతిని
నక్కటిక మొప్ప ద్విజమాత్రుఁ డన్నయటులె॥ 121

పశుపతి యంద్రము నన్ను నెఱపాఱు కొలంబునఁ దోఁచి యొంటినై
పశుపతి యిష్టదైవముగ భక్తి భజింతును వాయులింగమున్

ప్రశమితకాముఁడా ర్తజన వత్సలుఁడా శివ దేవుఁడింతకున్
వశుఁడయి నిన్నుతానె తన వాసము చేర్చికొనెన్ ద్విజోత్తమా!

కొట్టిన పిండి యీస్థలము కొండల మందకు మీవు నిన్ను నే
నిట్టె తరింపఁ జేయుదు వనీచయమంతయుఁ గొండకూఁతుఁ జే
పట్టిన స్వామియుండు గిరి పార్శ్వము చేర్చెదు నయ్యగస్త్యుఁడీ
పట్టునఁ బాఱఁజేసిన సువర్ణముఖిన్ గొనియాడఁ జేయుదున్॥ 123

హితుఁడని చంద్రకున్ దలఁచితీవు నిజమ్ముగ వృత్తిచేఁ బురో
హితుఁడగు నాతఁడర్థము గ్రహించుటకై నినుయాత్ర పేరుతో
జతయయి వెంబడించె ధనసంచయ మందిన వెంట నీవు నీ
బ్రతుకును గానపాలుగ సరాసరి స్వీయగృహస్థితింగనెన్॥ 124

అతనికి ధర్మమైన శివుఁడైన ధనార్జన సాధనంబె యం
చితమతి కాఁడు వంచనకు సిద్ధపడున్ ధనలోభదూషితుం
డతి తర భోగలాలసుఁ డహంకృతి మత్తుఁడు త్వన్నిమిత్తమై
యతఁడును గొంత బాగుపడె నయ్యదియే పరమాద్భుతంబగున్॥

నీదగు సొమ్ము దొంగిలి వనిన్ గనరాక స్వదేశమేగి ని
న్నాది యనేక తీర్థముల నోలి చరించిన పుణ్యమాదుకో
వేదననంది స్వార్థమదివీడ వివేకమునంది కుంది నా
ల్గైదు భఁబులైన కడకంది కొనెన్ బరమార్థ మెట్టులో! 126

వాఁడు నిమిత్తమై నినుఁ బ్రవర్తిలఁ జేసెను దీర్ఘయాత్రలో
పోడిమి నీవునున్ హృదయపూర్వక భక్తిని సంచరించి వెం
టాడిన సర్వపాపము లహస్కరుగాంచిన యాంధ్యమట్లుగా
నూడని ఖాడ శుద్ధమతి యొప్పఁగఁ జేరితి వీ గిరీంద్రమున్॥ 127

శివవిభు చేఁతలన్నియును చిత్రము లప్పుడు కొండయైన వాఁ
డవని సురుండగున్ గజమునౌను వనంబగు నేదియైన తా
నవును పరీక్షచేయుఁ దనకౌననిపించిన దారిచూపి నీ
కవన మొసంగు నాతని దయావనధిన్ గొనియాడుటొప్పదే! 128

అని కరుణామతిన్ హృతసహాయు మయూరు సమంచితోక్తులన్
దనపయి భక్తి నెక్కొనగ ధైర్యముచెప్పి యతండు నమ్మి వెం
టనె చన స్వర్ణదీజలమునందు మునుంగఁగఁ జేసి వేగమే
కొనుమని శైవమంత్ర మనుకూలత వించినవాఁడు తద్యుతిన్ ॥ 129

ఇనబింబం బటు తేజరిల్లుటయెకా కిందాక దుర్భేద్యమై
ఘనశైలంబును గప్పియుండిన మహోగ్రారణ్య మావంతయున్
గనరాకూర్జిత శైల మొక్కటియె చక్కన్ నిల్వ స్వామీ! యిదే
మనుచున్ జాగిలి మ్రొక్కి వేడికొన వ్యాఖ్యానించె సర్వస్వమున్ ॥

శైవాష్టాక్షర మంత్రరాజమునః విశ్వాసమ్మునన్ దెల్పితిన్
నీ వద్దాని మహత్త్వ మందికొని కంతేకాలు సంవాసమౌ
శైవాంగంబును గాంచఁగల్గితివి ధ్వస్తంబయ్యె మాయావనం
బీ వింకన్ జరితార్థుఁ డయ్యెదవు రావే యంచుఁ గొంపోవుచున్ ॥131

గిరి పార్శ్వంబున నేటియొడ్డున మహాకేళీ శిలామూర్తియై
సురగంధర్వ నరాసురాదిక గణాస్తోకార్తి విద్రావణ
స్ఫురదానందన హేతువై తనరు శంభున్ జూపి మ్రొక్కించి స
త్వరుఁడై దేవినిగొల్వఁజేసి గిరిలో భవ్యప్రదేశంబునన్ ॥ 132

దండం బొక్కటి చేతగైకొని తనంతన్ శైలమున్ మీట వే
దండంబొండు కరాగ్ర పీతజల ముద్దండంబుగాఁజిమ్మిన
ట్లుండన్ గాలుచునున్న బండవిడి యెంతే రమ్యమౌ తీర్థమూ
ర్ధ్వాండంబంటగ నుద్భవంబయిన "విప్రా! నీకిదే సేవ్యమౌ॥ 133

శివుఁడే నీయెడ సుప్రసన్నుఁడయి యీ క్షేత్రాన నీ తీర్థము
ద్భవమందన్ గరుణించె నీ విచట భక్తత్రాణు లింగంబు ను
త్సవ మొప్పన్ భజియించుచున్ నిలుము వర్షంబొండు పూర్ణమ్ముగాన్
భవునింగాంచి తరింతు వద్భుతముగా భద్రంబు నీకయ్యెడున్ ॥ 134

అనుచున్ జే శివలింగముంచి కనరాఁడయ్యెన్ మయూరుండు దా
నిని భక్తిన్ నెలకొల్పి తత్పరత నెంతే శ్రద్ధ నర్చింప సా

గెను వృద్ధద్విజరూపుఁడై శివుఁడె రక్షించెఁ మరెవ్వాఁడు న
న్నను కంపఁ గనఁజాలు? మూఢమతి మాయఁ మున్ని వర్తించితిఁ॥

పశుపతి నంచుఁ జెప్పికొనెఁ బల్కిన పల్కులు సర్వ మా శివుఁ
విశద మొనర్చుచుండినవి విశ్వగురుండటు చెంత నిల్చుచో
పశుత వహించి తత్త్వము రవంతయుగానక యిప్పుడేడ్చెదన్
వశుఁడయి కాఁడు దైవమిటు పక్వమొనర్చు నపక్వ బుద్ధులఁ॥ 136

నాయెడ సుప్రసన్నుఁడయి నాఁడనుమాట యథార్థమట్లు కా
కాయన కేమి పట్టినది ప్రాణముఁబాసిన చందమైన న
న్నాయన యూర్చు నిల్పి కరుణామతి నన్నియుఁ దెల్పి వెంటగొం
పోయి స్వయంభువుఁ గనెడి పోడిమిగూర్చి యనుగ్రహించెఁగా॥137

అదియనుగాక కట్టె యొకఁడంది శిలఁ స్పృశియించు మాత్రలో
నుదయము నందఁ జేసె నిట నుజ్జ్వల తీర్థము చేతనుంచె నా
సదయుఁడు దివ్యలింగమును స్వామియె స్వామియెకాన నైతి నా
కెదియిఁక దారి దైవమిటులే కనవచ్చినఁ గాన లేనిచో॥ 138

అని యొకవంక స్వామినుడి నా శివలింగ సమర్చ చేయుచుఁ
దినదినమిట్లు దుఃఖితమతిఁ వెతగుందెడి వానిఁ దేర్చ మి
న్నునబడి దివ్య వాణియనె'' నొవ్వకుమోయి మయూర! దైవమే
కనబడి దారిఁజూపి నినుగానగఁ జేసెను వాయులింగముఁ॥ 139

స్వయముగ మంత్రముఁ నుడివె శ్రద్ధమెయిఁ జపమాచరింపు మెం
తయు దయఁజూచె ధన్యుఁడవు తప్పక తా ననినట్లు వత్సరం
బయిన ననుగ్రహించు విడుమాత్రి కృపామయుఁ డుజ్జగింపఁ డ
వ్యయ పరమార్థమిచ్చు నిను నవ్యయ తేజములోనఁ జేర్చుచుఁ॥140

భాద్రపద పూర్ణిమా నిశి భవ్యదీక్ష
నొసఁగి దయఁజూచె నీవు మహోత్సుకతను
నిండు మనమునఁ బూజించు చుండు దేని
భద్రపద మందికొందు వా పర్వముననె॥ 141

విన్న మయూరుఁ డాక్షణమె వీడెను చింతను నిశ్చయాత్ముఁడై
క్రొన్నెల తాల్పు దేవరను గుండియనిల్పి యనన్య సాధ్యమౌ
ప్రపన్నని భక్తిలింగ శివభవ్య సమర్చనమందు మున్నె నా
తెన్నున వత్సరంబు కడతేరగ స్వామిప్రియాసమేతుఁడై ॥ 142

కొడుకులు కేకి వాహనుఁడు కొక్కు వజీరును సర్వదేవతల్
తడబడి వెంబడిన్ నిలువ దర్శనమిచ్చి వరంబు లన్నిటిన్
గడువడిఁ దీర్చి వాని కిఁకఁ గాయమురానటు దివ్యతేజ మం
దుడుగగఁ జేసె నద్భుతమహో శివదేవు దయాప్రభావముల్ ॥ 143

పాపము లాచరించినను భక్తమయూరుని యట్టు లెవ్వరేన్
దాపమునంది పాచితము తత్పరులై పొనరించి భక్తితో
రేపును మాపు శంభుని వరిష్ఠమతిన్ భజియింతురేని సం
తాప మొకింతయున్ గనక ధన్యతగాంతురు నిశ్చయమ్ముగన్ ॥ 144

లలిత కలాపముల్ విరియ లాస్యమొనర్చెడి నెమ్మిదోయి నాఁ
బులకిత గాత్రులైన మునిపుంగవులా గురుశిష్యులిర్వురున్
గళిత మహాఘులై శివతగాంచు మయూరు పవిత్ర గాథలో
నిలిచిన మానసంబులను నీలగళున్ ముదమార గొల్చుచున్ ॥ 145

శంభో మహాదేవ హే నీలకంఠా!
అంబా మనోనాథ హే కాలకంఠా!

1. మా పాపములఁ బాపి మన్నించు తండ్రీ!
   నీ పాదములె నమ్మి నిల్తుమో తండ్రీ!

2. లోకాల పాపాలు కాకోల మై తేల
   చీకాకు తొలఁగించు శ్రీకంఠ దేవా!

3. త్రిపురార్తి సంహార దీక్షా మహావీర!
   త్రిపురాంబికానాథ! దేవాధిదేవా!

4. అక్షౌహులను గెల్చు నహితుండికేశా!
   దక్షాధ్వర ధ్వంస! రక్షింపుమయ్యా! 146

# ఏడెవము - స్వర్ణముఖీ వృత్తాంతము

ఏడెము చిన్నపల్లె కడు నింపగు గ్రామము స్వామివచ్చి యు
న్నాఁడన వారి మోదమునకంతును పొంతు కనంగరాదు వె
న్నాడి చరించు సర్వులకు నాప్తులె యాచు నవేవియో కరం
బోడక యిచ్చి తృప్తి గనుచుందురు పెద్దగృహస్థు లట్లుగన్॥ 147

అచ్చట స్వామియున్ దడయు టబ్బురమే జనమెల్ల తృప్తులై
ముచ్చట గొల్పుస్తోత్రముల ముంతురు, వింతవినోద చర్యలన్
హెచ్చిన మోదమై పరవశింతురు స్వామియుఁ దన్మయుండగున్
మెచ్చిన మెప్పునాఁ గురియుమేళ్ళు పురప్రజలెల్ల వారికిన్॥ 148

కొద్దిగ పశ్చిమంబునకుఁ గోయని సాగెను యాత్ర స్వామి చూ
పొద్దిక యేటివైపునకు నొగ్గిన యట్లనిపించె నెవ్వఁడో
తద్దయు భక్తిగొల్చిన సుధామయ మానసుఁ డుండెనేమొ వాఁ
డద్దరి నుండఁజూడక ప్రయాణముసేయునె స్వామి స్వామియై॥ 149

స్వామి యభీష్టమున్ సలుపు వారలె సర్వులు భారవాహకుల్
క్షేమము నెంచి దూరమని కించు వహింపక యట్లుసాగ లి
ప్సామయ లోచనంబులను సాంద్రముదంబది ప్రస్ఫుటంబుగా
స్వామియు యాత్రికుల్ పరవశస్థితి సాగిరి యేటి చెంతకున్॥ 150

మున్నిట వాగులేదు మునిపుంగవుఁ డా మహనీయ కుంభజుం
డన్నియు నున్న క్షేత్రమున కద్ది యదవశ్యమటంచు నెంచి పై
మిన్నున నుండి గంగ యిట మేదినికిన్ దిగి రాఁగఁజేయఁ దా
నున్న నగంబె తానఁగ నూర్జితుఁడై తపమాచరింపఁగన్॥ 151

పరశివుఁబోలు తాపసి తపస్సునకున్ సురలెల్ల భీతులై
గిరిశుని వేడికో నతఁడు గీటున బుచ్చి యగస్త్యువాంఛ తా
నెఱిఁగిన వాఁడుగానఁ బరమేష్ఠిని బిల్చి మునీంద్రు కోర్కి స
త్వరముగఁ దీర్చి రమ్మనఁగ వచ్చి యొసంగెను దివ్యవాహినిన్॥152

బ్రహ్మ కమండలూదకము వాహినియై ముని వెంట నంటిరా
జిహ్మగ మట్లు సిద్ధ మునిసేవిత శైలమునందు జన్మమై

బ్రహ్మ విదుల్ నుతుల్ సలుపఁ బాతినదీ గిరిచెంత కిచ్చటన్
జిహ్మగ మౌచు నుత్తరము చెంది ప్రశస్తి వహించె భూస్థలిన్॥ 153

ముఖమున స్వర్ణముండుటను మ్రోత సువర్ణయుతంబు నౌటచే
నఖిల మహర్షులీ నదిని స్వర్ణముఖీ ప్రథితం బొనర్చి రు
న్ముఖులయి దీనదాఁగు నరపుంగవు లెల్లరు ముక్తులౌచుఁ జి
త్సుఖమున సద్వయాత్ములగుచుందురు స్వామియనుగ్రహంబునన్॥

గిరిదరి మెల్లగా సడి యొకింతయు చేయక స్వామికోసమై
గరితయనంగఁ బాఱునది గట్టున కావల నీవలైనచో
సురవడి మ్రోతవెట్టు వినుచుందురు స్వర్ణము లచ్చభక్తులా
ర్మి రవములందు స్వర్ణముఖరీ శ్రుతి కల్గిన దట్టిహేతువై॥ 155

అరుదుగ సైకతమ్ములను స్వర్ణము దాచి పరిశ్రమోచితం
బరసి యొసంగె స్వర్ణముఖియంటయు సార్థకమీ మహత్త్వమై
వర సదు లన్నిటిన్ మిగిలి వర్షము వర్షము పుష్కరంబుగా
సరి యెటులుండు దీనికిఁక సాగరగామిని సర్వసేవ్యయా॥ 156

గిరి నుదయించు పుణ్య మునికీర్తిత తీర్థములన్ని యిందు ని
ర్భర కృపసాగి చేరికొను వాహిని వాహిని మాత్రమానొకో
పరశివుఁ డీ ప్రవాహమునఁ బార్వతితో సమసించియుండు త
న్నొరసిన వారి కెల్లరకు నూర్జితుఁడై తెగఁద్రెంచు బంధముల్॥

చులికిత సర్వసాగరుఁడు చోద్యతపం బొనరింపఁ గుంభజా
చలమునఁ బార్వతీ పతి ప్రసన్న మనస్కతఁజెప్పి పంపఁగా
నొలికిన బ్రహ్మతీర్థమయి యుద్భవమందిన దందులోననే
కలిసిన వెల్ల తీర్థములు కల్మషహారిణి కామితం బిడున్॥ 158

రాజత శైలరాజమిటు రాగ గిరీశ్వరు నెంచి మేరు వు
త్తేజితమై సఖత్వమునఁ దేర్చెను శృంగ మొకండు చెంతకున్
భ్రాజిలు రెండు కొండలను రాచి స్రవించు నగస్త్యవాహినిన్
యోజిత శైలజా ప్రతిమయొప్పు మహత్తరమౌచు పూజ్యమా॥ 159

నిస్తులయౌ శిలాప్రహారిణీ నది, శోణ, యసిక్నియున్ సుర
ప్రస్తుత లీ నదిఁ గలియఁబాఱి గిరీంద్రము చెంతస్వామికై
ప్రస్తుత వైఖరిఁ మలఁగి వాహిని సాగెడు నుత్తరంబుగా
ధ్వస్త మొనర్చు పాపముల ధన్యత గూర్చును జ్ఞాన మిచ్చుచుఁ॥

మేరు కైలాసగిరుల సమీపమందు
స్వర్ణముఖరీ నదిఁ దోఁచు నట్టి యంబి
కా ప్రతీక లే సర్వలోక ప్రశస్త
ములని విజ్ఞులందురు లబ్ధిపుణ్యుల కగు॥ 161

శోణయందు గణపతి, విష్ణుప్రతీక
లా యసిక్నిని, వినుత శిలాప్రహారణి
బాణ లింగంబు లిపుడు లభ్యమ్ము లగును
స్వామి పరివార దేవతా సహితుఁడనఁగ॥ 162

రజత శైలమ్ము పడమటి ప్రక్క నుండి
సాగున దసిక్ని, వేంకటాచలము నుండి
శోణ యరుదెంచు, రాళ్ళ వాగైన దే శి
లా ప్రహారిణి కలియు నీ జలమ్ములందు॥ 163

సమ్మిళితమైన యిచ్చోటి స్వర్ణముఖకి
నా ప్రయాగకు నున్న ప్రఖ్యాతి కలదు
ఘోర రోగమ్ము లడచు నత్కీరుఁడిందు
మునిఁగి యే కుష్ఠరుజ నుండి ముక్తుఁడయ్యె॥ 164

## మహాకేశ్వరోపాఖ్యానము

పుట్టెఁ గుంభోద్భవు గుట్ట యందున గాని
యచ్చోటు తెలియ నేఁడనువు గాదు
మొగలి వేంకటగిరిన్ మొదలాట తోఁతెంచు
నది సప్త యోజ నాంతర్యమున గలదు

ఏటి జన్మస్థాన మేడామడల దూర
మేడామడల గ్రామ మేడె మయ్యె
నేడెమ్మ చెంత మూకేశ్వరాలయమున్న
దచ్చోటు నేడందు రల్లి మడుగు

వాయులింగంబు దక్షిణ భాగమందు
సార్థక్రోశాధి కమ్మగు స్థలము నందు
రోమశ ప్రేరితుండయి స్వామి నిల్పి
మూకుం డర్చించి తుదకు విముక్తుఁడయ్యె॥ 165

సంసృతి చింతలన్ విడచి శాంతియు సౌఖ్యము నందఁగోరుచో
హంసను సంస్మరించుచు విహాయస మందునఁ దేలి క్షీర నీ
రాంశ విభాగ దక్షత జనాన్వితమా నగరమ్ము వీడి దై
వాంశము వ్యక్తమయ్యెడి రహస్థ్సలి నొంటరివై రమింపుమా!॥ 166

మోమున మౌన మూనుటన మూకత నందుట మానసంబు లు
ద్దామ శుచాగ్నిఁ గ్రాగి పరితప్తము లౌ నెడ లాభ మేమి? బో
ధామల శాంతి లేనియెడ హాయిగ నోర్విడి యేడ్చివైచు చే
క్షేమము గూర్ జనస్థుఁడయి స్వేచ్ఛగ నేడ్చుట సాగ దెన్నఁడున్॥ 167

ఆరని దుఃఖమైన మనసారగ నేడ్చిన తగ్గిపోవు నో
రార శివాఖ్యలన్ బలుకు చార్తి సమస్తము వెళ్ళగక్కుచున్
నీరవమైనచోట నవనిన్ నభమున్ జలసంచ యాదులన్
దీరిక చూచుచుండు నెడ తేరుకొనున్ మనసెల్ల స్వచ్ఛమై॥ 168

పుట్టుక చేత మూగయయి పొక్కుట యొక్కటి యెట్టి పాపమై
యట్టి ఫలంబు వచ్చినదొ యాతఁడెఱుంగఁడు చూచుచుండగా
దట్టుఁడెవండొ శాపమిడఁ దక్షణ మందున మాటపోయి యి
క్కట్టున దుఃఖ మందుటనఁ గష్టము దుర్భర కష్టమయ్యెడిన్॥ 169

చేసిన తప్పెఱుంగు నది చేయుట నీ ఫల మం చెఱుంగు లో
గాసిలు సైచి కావు మనఁగా నుడి వెల్వడఁ జాల దెంతకున్

మూసిన మోముగా మనసు మూతయిడన్ జల మిట్టె తెర్లు న
ట్లై సెగ కోర్కెఁజాలనటులై యుడుకెత్తును మూగ ఘోషమై॥ 170

అయ్యది దుర్భరంబన యథార్థము చెప్పిన యట్లుకాదు లో
ప్రయ్యలు గాఁగఁ జీలినను పైకవి తోఁపవు మోము దీనమై
కుయ్యిడు ప్రాణు లేరికిని కూయి వినంబడ దెంత ఘోరమో
ప్రొయ్యి జ్వలించు చుండఁ దలంపుల్ వడి తెర్లును మూత యడ్డగన్॥

ఆవిరి తీవ్రశక్తికల దయ్యది మూతను దాకి తాకి న
స్నీ విధి పట్టియుంటువె యిదే గతి నీకని నెట్టివైచు న
ట్లే విధి వంచితుం డయిన యీశ్వర భక్తుఁడు తీవ్రవేదనన్
వావిడి మూకతన్ దతిమి వాగ్మియుఁ గాఁగలఁ డాత్మవంతుఁడై॥172

మూకేశ్వరుఁ డున్నాడ కయి
యేకాకిగ నేగియున్న దీ వే యగుటన్
సాకిరి యా శివ దేవుఁడు
మూకుఁడె దైవై యుంట జంకు పొందక యఘముల్॥ 173

దాపక యన్నిటి చెప్పుము
వాపోవుము నోరు విడిచి పాపము నీకపై
నే పట్టున రానీనని
కాపాడు మటంచు వేడు కాచు నతండున్॥ 174

మాట రొసంగు మాతనికి మాటయ కా యని మాట జాఱ కా
మాటయె నిన్ను మానవుని మాన్యునిగా నొనరించె నోటి మా
టె టక టొంకులన్ మనుట దైనఁ బరాత్పరుఁ డేల కాచు నీ
నాటకమున్ బయల్వఱచి పుట్టెడు దుఃఖమునందు ముంచెడిన్॥

నీవు నిజాయితి పరుఁడయి
దేవుని పయి భారముంచి దివ్యత దరియన్
భావ విశుద్ధిగ వర్తిలఁ
గైవల్యమె పెరటి కల్పకంబయి నిలుచున్॥ 176

ఈ వంక స్వర్ణముఖియును
నా వంకను రజత గిరియు నద్భుతముగ నా
దేవియు దేవర యన్నటు
లై వర్తిల నీవు వారి యంకము నందున్॥ 177

ఆనంద మందు సూనుఁడ
వో నా విలసిల్లు దుభయులును వరదులై
నీ నైర్మల్యము మెచ్చుచు
నేనః పుంజమ్ము దరియ నీయరు నిన్నున్॥ 178

భీముఁడు గాడ విప్రుఁ డరి వీరభయంకరుఁ డార్య ముఖ్య వి
శ్వామర పుత్త్రుఁడా హరిహరాఖ్యుని పౌత్రుఁడు వాగ్విదాం వరుం
డే మొయి నెట్టి పండితుల నేని విలాసముగా జయించు ప్ర
జ్ఞామయుఁ డాతనిం గనినఁజాలు జితోఽస్మియనున్ గురుండు నేన్॥

ఆతని జ్ఞానతృష్ణ కొక హద్దని లేదు నిరంతరంబు ల
తా తిగ కోశజాతమున షట్పది వోలిక సంచరించుచున్
జ్ఞాత విశేష విస్తృతిని స్వాతిశయార్థము పెంచుచుండు న
బ్జాత భవుండు నీ సుగొనఁ బండితుఁ డాతఁడనన్ ప్రసిద్ధుఁడై॥ 180

నాటిన స్తంభమై విబుధనాయకుఁడైన యతండు తీర్థ యా
త్రాటన బుద్ధిపుట్టి యొక యప్పుడు పుణ్యనదీ నదంబులున్
వాటులు క్షేత్రముల్ గిరులు పాయక కొల్చుచు వచ్చి వచ్చి క
ర్ణాట ధరం గలట్టి యొక రమ్య ప్రదేశము నందు నుండగన్॥ 181

అచట నుస్నట్టి నాథ శర్మాఖ్యుఁడైన
ద్విజవరుని తోడ గాఢ మైత్రియును గలుగ
నతనికడ నెన్నియో యలభ్యమ్ము లయిన
గ్రంథములు నుంట సహజ జిజ్ఞాస బలిమి॥ 182

ఆస్థమెయి నందె బహుకాల మధి వసించె
నేర్పడిన మైత్రి నయ్యోఁ దద్గృహము స్వీయ

మనుదినంబును కోశంబు లనుగ్రహించి
మించు నా సక్తి ఘానిఁ బఠించుచుండు॥ 183

నాథ శర్మ పాండిత్య మండనుఁడె కాక
నిత్య శైవార్చనా సమున్నిద్ర శైవ
సంవిదానంద హృదయ కంజాతుఁడగుట
నంతరుద్బోధ నరిగెఁ జిదంబరమ్ము! 184

పోవు నప్పుడు భీముఁ డప్పుడమి వేల్పు
ననుమతిం జాల గ్రంథమ్ము లాత్మవసతిఁ
జేర్చికొని నిత్య మవ్వాని శీలనమునఁ
గాలముం బుచ్చు సాగె జిజ్ఞాసు వగుచు॥ 185

అనుభవ సారవేదియగు నా శివ విప్రుఁడు నాథశర్మ చి
ద్ఘనుఁడు చిదంబర స్థలిని కాంచనమంటప మందొనర్చు న
ర్తనమునఁ దన్మయుం డగుచుఁ దద్దయు కాలముఁ బుచ్చి యెట్టులో
తన దగు గ్రామముం దరిసెఁ దానెట నున్నఁ జిదంబరంబెకాఁ॥ 186

వచ్చిన వానిఁ జూచుటకు వచ్చెను భీముఁడు నాథ శర్మ యౌ
వచ్చిన దీ మహాత్ముఁడను భావసమేతుఁడు, పార్థి వార్థ సం
పచ్చయ మందు వీని కెది పట్టెడు నట్టులె లేదు, ధన్యుఁడౌ,
మెచ్చె శివుండు, సంసృతిని మెట్టఁడు, ముక్తుఁడెయౌ నిజంబుగాఁ॥

అని మది నెంచె, నంతటను నాగక వీనికి గ్రంథరాశితోఁ
బని యింక నేమియుండు? తన వద్దను లేని యలభ్యకోశముల్
ప్రణుతము లెన్నియో కలవు ప్రస్తుత మన్నియు నాతఁడీ యఁగా
తనకడనే స్వకీయమను దానికి వీలుగ నున్న, వంచుచే॥ 188

ఇతనికి వీని సంస్మృతి యొకింతయు నుండదు, కల్గి కోరునే
నతనికె యిచ్చి వైచినటు లాడిన నేమగు? శైవసంవి దూ
ర్జిత మతియౌట సత్యమని చింతిల కంతట నూరకుండు, ని
శ్చితముగ నన్నియుఁ దనకుఁ జేరును భాండము పూర్ణమయ్యెడిఁ॥

ఇట్లు భీముఁడు మది నిశ్చయించు కొనియె!
నే మనక వలె వాని యహీన మతిని!
జ్ఞానతృష్ణను బూని యసత్యమాడి
యైన నెంచెఁ గోశములఁ దానపహరింప॥ 190

అనృత మొక్కటి గ్రంథాపహరణ మొకటి
తెలియఁడా పాపములు కావె? తెలిసి తెలిసి
యట్టి నిశ్చయమునకు రానయ్యెననిన
నెఱుఁగనగు కర్మఫలము దుస్తరమటంచు॥ 191

అతఁడు తలంచినట్లె పని యాయెనె శివుండు మఱొక్క రీతిగా
మతి కలుగంగఁ జేసె బుధమాన్యుఁడు విజ్ఞుఁడు నాథశర్మ వం
చిత మతినింట నుండియును చెంతకు రాక చరించు భీము సు
స్మిత వదనారవిందుఁడయి చీరి "బుధాగ్రణి! విస్మరించితే! 192

వెనుకటి వోలె మా యెడలఁ బ్రేమను జూపవు మా గృహంబు త్రో
వను గలదన్న సంస్మృతిని బాసి చరింతువు నేనెదైన, హా
నిని బొనరించి నాఁడనొ గణింపకు మన్న వివేక హీనుఁడన్
నను గృపఁ జూచి పూర్వమటు నా యెడ నెయ్యము నెంచ వేడెదన్॥

అదియును గాక కోశకోశము లనంతముగాఁ గొనిపోయి యుంటి వె
య్యది స్మృతి నందకున్న నొకటైనను పాత్రము చెంత లేక నే
నద నద నందుచుంటిఁ దడవయ్యెను తెచ్చి యొసంగు" మంచనన్
మది గుబుసుబ్బ వోయియును మానక భీముఁడు దుష్టబుద్ధియై॥

ఎదుటను నున్న వాఁడెదుటనే కనిపించుచు నుండె వాడి బా
కదనున వెన్నునం బొడిచె నో యనఁగా నతఁ "డేమియంటివి? వి
య్యది తగునే, యథార్థముగ నందువొ? యెప్పుడొ యిచ్చి వైచితిన్
మదికిని దెచ్చుకో, మొక్కటి మాకడ లే"దని పల్కెఁ గ్రుద్ధుఁడై॥

"ఇంతటి బొంకు బొంకి జగదీశ్వరుఁ డిచ్చిన మాట గౌరవం
బంతయు నింకఁ జేసితివి, యయ్యది నీ కడ నుండరాదు, గ్రం

ఘాంతర వర్ణపంక్తు లటులై నుడులన్నియు నీరవంబులై
స్వాంతము నందె యుండ ముఖవాయువె వెల్వడఁగాల
మిాఢ్వమా!''

అని శపియించె నంతె దురితా హత చిత్తుఁడు భీరువౌచు నే
మనుటను నోరురాక తనువంతయుఁ గంపిల గుడ్డపిండి స
ల్లైనసిన స్వేదబిందువుల నెల్ల వెలార్చుచు గుప్ప గూలుచున్
వినుతు పదంబులన్ బడుచు వెక్కుట యే గతి యాచునుండినన్॥

ఘూసాగ్రస్థిత కంకణంబువలె నా కంఠోగ్ర కోపంబు ని
క్లేశంబై నశియింప భీమునెడ జాలిం బొంది యన్నా! వృథా
యాసంబై పొనరించి తీ వకట ద్రోహం బద్ది నా మాటచే
వీసంబున్ నిను జెందదైన విను నీ వెన్నంటు చౌర్యంబహో॥ 198

దానికిఁ బ్రాచితం బెఱుఁగఁ దప్పు నెఱింగితి గాన నార్తిమై
జ్ఞానుల నాశ్రయించి తగు సాధనమున్ గొని పాపి కొమ్ము నీ
మానమె నీ కుపాయమయి మాన్పునుగాక సమస్తదోషముల్
జ్ఞాన మొసంగి ముక్తినిడి సాకునుగాక జగత్పవిత్రియుః॥ 199

అని నాథశర్మ దయతోఁ
బనిచినఁ ధ్వర పడుచు భీమ పండితుఁడపుడే
తన దాచు గ్రంథ జాలము
ననలంబన నాథశర్మ కప్పన యిడుచున్॥ 200

సెలవంది మూఁగతనమునఁ
దలఁపులు వడి నుడుకు లెత్తఁ దపియించుచుఁ జు
మ్మలు చుట్టు దుఃఖ వివశతఁ
జలనము లేనట్టు లగుచు సాగి యెటెట్లో! 201

శ్రీశైలమ్మును జేరికోఁగలిగె వార్ధింగూలు నవ్వాని కా
యాసం బించుక తీర్ప ద్వీపమెదో దాపై వచ్చె నన్నట్లు ని
శ్వాసం బూడ్చుచు భీముఁ డచ్చట గిరీశా! కాలకూటాశనా!
దోసంబున్ హరియించి కావు మనుచున్ భూతాఖిలస్వాంతుఁడై॥

పదముల్ తొట్రిల మల్లికార్జున సమీపంబందె కూలంగఁ ద
త్పద మందుండిన రోమశుండు కని యవ్వానిన్ స్మృతిం గూర్చి యా
పదలం దీ పగిదిన్ గుమారిలుట భావ్యంబౌనె ధైర్యంబుతో
మది సర్వేశ్వరు నిల్పి దాటవలె లెమ్మాయంచు నోదార్చుచున్॥203

నోటన్ వెల్వడు మాటలేక తన కన్నుల్ ద్రిప్పుచున్ భావ ము
ద్ఘాటింపన్ గడు ద్రిప్పలంబడుచు హస్తాటోప భ్రూభంగ ము
ఖ్యాటీకంబుల నెట్టులో తెలియు నట్లాంతర్యమున్ గ్రక్కి య
ప్పాటన్ బాదము లంటి వేడికొనెఁ గాల్వల్ గట్టు కన్నీళ్ళతో॥ 204

రోమశుఁ డాతనిన్ నిమిరి రూక్ష మనస్కుతఁ గొంత సేపు ప్ర
జ్ఞామయ దృష్టి నుండి గిరిశా యని యీశ్వరు సంస్మరించి "నీ
న్నోమును తల్లి పుత్త్ర! భయ మొందకు నానుడి నమ్ము మమ్మనీ
శామెత గూర్చు మార్గమును హాయిగ తెల్పెద రమ్ము వెంబడిన్॥"

అని భీమున్ దన వెంటబెట్టికొని యా యవ్యాజ కారుణ్యుఁడౌ
ముని వానిన్ గొని తెచ్చి యీ స్థలము నొప్పన్ జూపిమాహాత్మ్యమున్
వినిపించెన్ మునుఁగంగఁ జేసె నదిలో విన్పించెఁ దన్మంత్రమున్
"నిను నా తల్లి దయంగనున్ విడువకిం దేయుండి యర్చింపుమా!206

శివలింగంబును నిల్పి నిత్యమిట నర్చింపన్ దగు న్నీవు నీ
భవ మద్దేవు దయావిశేషమున సాఫల్యమ్మునందున్ ఘటో
ద్భవ ముఖ్యాశ్రిత మంత్రరాజ మిది నీ వాగ్బంధమున్ ద్రెంచి నీ
భవ బంధంబులఁ ద్రుంచివైచు నిఁక విశ్వాసంబునన్ నిల్వుమా!"

రోమశ మౌని మూకుని పురోహితుఁ డన్నటు లార్తలోక ర
క్షా మహనీయ దక్షత యుగంబుల నుండియు నిందె యున్న శ్రీ
స్వామిని దేవినిన్ గని యచంచల భక్తిని మ్రొక్కఁ జేసి స్వ
ర్ణామల వాహినీ తటమునందు శివార్చన యందు నిల్పగన్॥ 208

దీక్ష యొసఁగి తా నేగె యథేచ్ఛముగను
మూకుఁ డా నాటి నుండి యపూర్వభక్తి

శివుని గొలుచుచు జపమును చేయుచుండెఁ
గాలమును వాహినిం బలెఁ గడచుచుండె॥ 209

మూకుఁ డాతఁడు స్వామి మూకాతి మూకుండు
ప్రకృతి మూకత దాని ప్రకృతియె యగు
శాంత నిస్స్వనమైన స్వర్ణముఖిం జూచు
చే వృక్షమున్ లేక యిసుము తిన్నె
లే యున్న యిచ్చోటి కే విహంగము రాక
నీరవత్వమె యేలు నేల యందు
తనకు లింగము లింగమునకుఁ దాఁ దోడౌచు
జపనిష్ఠ మూకుఁ డాశ్చర్యముగను
నిలిచె నెంతయొ నిర్జితేంద్రియత నెగడి
దేవుఁ డున్నాఁడొ లేఁడొ సందేహ మందు
నట్టి వారలుఁ బ్రకృతి లే దనఁగ లేరు
శాంతమైన యీ ప్రకృతి మోక్షమ్ము నిచ్చు॥ 210

ఇచ్చట కూరుచుండి కను మీ నది యచ్చర మచ్చెకంటి యే
మచ్చయు లేని మిన్ను బడి మాటుగ వచ్చి యొయార మొప్పగా
విచ్చిన కేశజాలములు వీచెడి గాలులఁ దేలియాడు పై
పచ్చడ మొప్ప నీ యెదుట వర్తిలు నట్లగుపించు హాయిగన్॥ 211

పెదవు లుపాంశు వైఖరిని విచ్చక విచ్చు సుమచ్ఛదంబులై
కదలుచు మంత్ర వర్ణముల కంపిలుచుండును కన్నులానదిన్
మెదలక చూచుచుండు మెల మెల్లగ నీ చెవి యాలకించు నా
సుదతి రహస్యపుం బలుకు చోద్యముగా నది నీదు మంత్రమా॥ 212

నీ వన లేనిదాని నది నీ కయి పల్కుచు నీకుఁ దోడుగా
శ్రావణ మాచరించి నిను సాకుచు నున్నది నీవు నా మెయున్
భావమునందు నేకమయి భావమయాకృతులౌచు దేహముల్
లేవన నాదమాత్రమున లీనత నందెద రాత్మరూపులై॥ 213

ఇంతకు మించి ముక్తి యన నింకొకఁ డున్నదె? యెంతసేపు నీ
వంతయు విస్మరించి యటు లాశ్రుత మయ్యెడి నాదమందె వి
శ్రాంతిని పొందుచుండెదవొ చల్లగ నీ యెద యంతసేపు నే
చింతయుఁ జీకులేని వివశీకృత సంస్థితి హాయి నందెడిన్॥ 214

ఆ రుచి పట్టెనేని యిఁక నాగవు ధీరత సర్వలోకముల్
దూర మొనర్చి మాటికిని దోఁగఁ దలంతువు తత్సుఖాబ్ధి నీ
వ్వారక దాని కోసమయి యుత్సుకతన్ దపియించుచుండ దు
ర్వారము పూనినట్టులె యవాంతరముల్ ఘటి యిల్లు పెల్లుగన్ 215

లెక్క యొనర్ప కీవు పచలీకృత సుస్థిర మానసుండవై
చిక్కఁగఁబట్టి నాదమున సీధువు గ్రోలిన చందమూచు నా
చొక్కున నిల్చి భేదములు శూన్యముగాఁ దొలి యూకసంబవై
నిక్క తదీయ మూలమగు నిశ్చల తత్త్వమె యూచు నుందువున్॥

అప్పుడు నాదమున్ వినవు నద్భుతమైన సమాధి యద్ది నీ
కప్పుడు వీను లుండునొకొ యయ్యవి దేహగతంబు లయ్యెఁగా
లొప్పతి వోలె సర్వగతమైన పరాత్మత నీవు నీవు గా
కొప్పరికింతు వెల్ల జగ మున్కని దాని జగంబు చేయుచున్॥ 217

ఈ యనుభూతి పొందెడి యదృష్టమె యెప్పటికైన నున్నచో
నే యెడ నున్న నేమి యొనరించిన నీ యనుభూతి నీదియై
హాయిగ నుండు వాత్మమయమౌ జగమందున నన్యమేదియున్
ధ్యేయము కాదు లేని దయి ధ్యేయమెటుల్ మఱితానె ధ్యాతగాన్॥

కాయము రాలినన్ మరలఁ గాయము కల్గదు తాల్చి యున్న త
త్కాయములోఁ స్వతంత్రముగ ధ్యానము ధ్యేయము ధ్యాతలేని యే
మాయయు నంటనట్టి పరమ ప్రభువై తివిగాన స్వేచ్ఛమై
కాయము నంటి విశ్వమును గాంచియుఁ జెందవు బంధమెన్నఁడున్॥

మూఁడు పొందె నా స్థితిని పూర్ణత నందెను కాయమున్నదే
కైక తపఃఫలంబు కననయ్యె శరీరము రాలలేదు త

త్ప్రాకట దేహమ్ముఁ నిలిపి తల్లి యెదేనిరయుఁ జేయ నెంచెనో
మూక నిమిత్తమై జనని ముగ్ధ మొనర్చెను లోక మంతటన్॥ 220

సిద్ధిని బొంది మూఁకుడిట చేసిన దొక్కటి కాదు తాను సం
సిద్ధిని బొందినట్టి యెడ శ్రీ శివలింగము సుస్థిరంబుగా
బుద్ధిని గూర్చి దేవళము పుట్టఁగఁ జేసెను మూకసేవితుం
డిద్ధ గుణాఢ్యుఁ డీశ్వరుఁడు నిప్పటికిన్ దయఁజూచు నెల్లరన్॥ 221

మూక ప్రార్థితుఁడైన హేతువుననే మూకేశ్వరుండయ్యె నా
మూకత్వం బది శాంతి సూచకము సంపూర్ణార్ద్ర సుస్వాంతుఁడా
లోకేశుండు మొఱల్ వినంగలఁడు పొర్లున్ ప్రేమ నూగాడుచున్
చీకాకుల్ తొలఁగించు నీ హృదయ రాజీవంబు నుత్ఫుల్లమౌ॥ 222

పంచదశాక్షరీ మనువు భక్తిమెయిన్ జపియించె మూకుఁ డా
వంచిత వాక్కు వాచిక జపం బొనరింపఁగ శక్తిమాలి ధై
ర్యాంచితుఁడౌచు మానసిక మత్యధికంబని యట్టి లక్షలున్
మించగ పూర్ణ దీక్షమెయి మేలిజపం బొనరించెఁ దల్లికై॥ 223

జ్ఞాన ప్రసూన జననీ
ధ్యానంబున మాన్యుఁ డతడు ధన్యుండయ్యెన్
వాని జపంబున కాసతి
యానందము నంది వాని కన్నియు నొసఁగెన్॥ 224

రక్తిని వాగ్మి నొనర్చియు
శక్తులు వివిధమ్ము లిచ్చి సదయత జీవ
న్ముక్తుడ వయి జనహితముగ
ప్రాక్తన ఋషివోలె నిందె వసియింపుమనెన్॥ 225

ఆతఁడు సిద్ధుఁడై యిచట హాయి మెయిన్ శివపూజ చేయుచున్
ప్రీతిగ మాతృ మంత్రమును పేర్మి జపించుచు నీ ప్రశాంత వి
ఖ్యాత శుభప్రదేశమున జ్ఞానిగఁ జేసిన బోధలన్నియున్
జేతము శుద్ధమైన యెడఁ జెందును నేటికి భక్త కోటికిన్॥ 226

స్వామికి మూకభక్తులనఁ జాల ప్రియంబగు పండితుండునై
యే మెయి నోరు విప్పని యహీనుని పట్ల మఱెంత ప్రేమయా
ప్రామిన గర్వమై నుడిని వ్యర్థ మొనర్చుచుఁ బ్రాజ్ఞతామిషన్
క్షేమము మట్టు పెట్టెడి యశిక్షిత పండితుఁ జూడఁ డెన్నఁడున్॥227

మూకుఁడు పండితుండు ఘనబోధము కల్గియు జ్ఞానలుబ్ధుఁడై
పైకొను పూర్వజన్మ కృత పాపమునన్ బుధనాథ శర్మకున్
వాకొనరాని ద్రోహము నవశ్యమతిన్ బొనరించి వాయిపై
మూకుఁడు పెట్టినట్లయిన మూకత నాంతరమందు దగ్ధుఁడై॥ 228

తాపము చేతనే యఘ వితాన మడంగగ తప్తకాంచనం
బౌ పగిదిన్ విశుద్ధుఁడయి యమ్మ యనుజ్ఞను పొందియుండియున్
ప్రాపుగ స్వామి యుండినను వైఖరినిన్ గను వాక్కులన్నిటిన్
దేపకుఁ దేపకున్ దఱచి తేలిన నిగ్గ వెలార్చె హానియై॥ 229

ఆతని మాటలన్ వినఁగనైనవి కొన్ని యిటుల్ కవిత్వమై
ప్రాతిగఁ దోఁచె వీని విను భక్తులు ధన్యులు తల్లి వారి వి
ఖ్యాతులఁ జేయు నైహిక మఖండిత భాగ్యయుతంబుగాక వి
ద్యాతిత మైన జ్ఞానమున నుజ్వలి తాత్మలె యాదు రిమ్మగన్॥

జ్ఞానముతో సమానముగ సంస్కృతి మాపు పవిత్ర మెద్దియున్
గానము నిర్విశేషమును జ్ఞప్తియొకండె యగున్ స్వరూపమే
యైనది గాన దానిబడి యన్నియుఁ దోఁచును వేదశాస్త్ర వి
జ్ఞానము దానినిన్ దెలుపఁ జాలదు తత్త్వము తెల్పు నంతియే॥ 231

సాధన చేసి చేసి యఘసంక్షయమైన విశుద్ధబుద్ధి యం
దే ధవుఁడైన సాధకు నహీన కృపన్ దరియింపఁ జేయగా
సాధితుఁ డౌచు నిల్చి వివశత్వము నందగఁ జేసి యెప్పుడో
బోధము మాత్రమైన నదె పూర్ణతయున్ బరమార్థమయ్యెడున్॥

జ్ఞానము బోధమంచుఁ దనసాక్షితఁ గప్పి ప్రపంచ భోగముల్
మానక పెంచుచున్ వినుత మానవు దానవుఁ జేయుచుండు న

జ్ఞానమె జ్ఞానమంచిపుడు జల్పమొనర్చెడి వారు పెక్కురై
జ్ఞాన మెఱుంగరాక నరజాతి యధఃపతనంబునందెడిన్॥ 233

మనుజుండై జనియించు టెప్పుడును బ్రహ్మజ్ఞానముం బొందనై
తనువున్ దానికిఁ గాక భోగమునకే దౌర్భాగ్యమై పూన్చువాఁ
డనఁ గర్పూరము నిచ్చి యుప్పుగొను మూర్ఖాగ్రేసరుం డౌను ము
క్తిని బొందన్ దనువెత్తి వెట్టియయి రక్తిన్ మున్గుటల్ ధర్మమే?

అయయో ధర్మ మెఱుంగ రీ జనులు వ్యర్థాయాసులై నిత్య మ
వ్యయ భోగంబులకై వ్యయించెదరు దేహ ప్రాణ దీర్ఘాయుష
ప్రియ ధీశక్తులఁ బొందఁ గల్గునది నిర్ణీతంబె యైయుండ దు
ర్ణయ మేలా నిజధర్మమూను నెడ దానన్ సర్వముల్ గల్గెడిన్॥235

ధర్మమునందు నిల్చునెడఁ దప్పక రాదగు నర్థ మబ్బు నీ
మర్మ మెఱింగి లబ్ధమగు మానిత సంపద దేహధారణం
బర్మిలిఁ జేయ నెంతతగు నంతయు హాయిగ వాడికొంచు స
త్కర్మములందె జీవితము తప్పక నిల్పిన మోక్షమబ్బెడిన్॥ 236

"ధర్మా దర్థశ్చ" యనెను
మర్మజ్ఞుఁడు వ్యాసమౌని మనుజత కలిగెన్
ధర్మ మెఱుంగుచు నిలిచిన
కర్మము లన్నియును ధర్మ కర్మములయినన్॥ 239

రాఁదగు నర్థముల్ కలుగుఁ బ్రాప్తముతోఁ బరితృప్తి నందినీ
వేదిగడింపఁ బుట్టితివొ యెప్పుడు దానిని విస్మరింప కో
వేదమయా! దయావనధి! వేగమునన్ దరియింపఁ జేయు మం
చాదట ధర్మమూనుటకె యంగము నిల్పుట మానవత్వమో॥ 238

మానవదేహ మందె పరమార్థము నందవలెన్ లభింప దీ
మానవదేహ మూరకయె మాధవుఁ డిచ్చిన మానితాంగముల్
మానక ముక్తికై నిలుపు మానవుఁడే పరమార్థ వేత్తయౌ
కానక వ్యర్థభోగములకై వ్యయపెట్టెడు వాఁడు మూర్ఖుఁడౌ॥ 239

భారతదేశ మీ మహిత భావము తెల్పుచు లక్ష్యసిద్ధి కే
దారియొ దానిజూపి మను ధన్యుల నుద్భవ మందఁజేయఁగా
భారతమాచు నీశ్వరుకృపన్ మహియందున నిల్చు నేటికిన్
భారతులైన మానవులె భవ్యులు వెల్గుననుండుఁ డందఱున్॥ 240

దైనము వెల్గునం దునుప దానిని కాదని గబ్బిలంబులై
భావి వరంబొకింతయును పట్టని యజ్ఞుల యంధకార మం
దావలితాత్ములై తిరుగు టచ్చెరు వయ్యెడు ధీ వివేక మే
త్రోవను బోవుచున్నదియొ తూలకనిల్చి తలంపగావలెన్॥ 241

ఊరక మోహమందుటయయో యొక తెల్వియె వేదధర్మ మీ
దారి నెఱుంగఁ జేసినది దానిని పూనిన భారతంబు ము
న్నెరికి నైన పూజ్యమయి యెంతయొ భాగ్యమునంది వెల్గెనేఁ
డూరక ధర్మమున్ విడిచి యుర్వి దరిద్రత తానె తాల్చెడిన్॥ 242

అభ్యుదయంబు నందుటకునైన వివేకము నూనకుండ దే
శాభ్యుదయార్థులేమె యని యన్యుల ధర్మమునందు మోహితుల్
సభ్యతవీడి ప్రాజ్ఞజన సంఘమతంబు నొకింత యెంచకే
మభ్యముపెట్టు చజ్ఞజన మాన్యతనంది యడంతురయ్యయో॥ 243

ఏది త్యజించు హేతువున నీ పతనంబును పొందియుంటివో
యాదిని దాని మానునెడ నభ్యుదయంబది కల్గుగాని యే
దేదియొ గొప్పదంచు మతిహీనత నూన వివేకమానె నీ
వాదిజుఁడైన బ్రహ్మ యుదయంబున కాస్పదమైన వాఁడవై! 244

భారత! భారతా! మహిత భాస్కర! నీవు నిజంబుగా మహో
దార పరాత్పరుం డవుదు దాని నెఱుంగక మోహితుండవై
భీరుత నన్యదేశ నయభిక్షుకుఁడైతివి నేటికైన ప్రా
గ్ధీరత నూని స్వీయనయ దివ్య మహత్త్వముచూపి వెల్గుమీ! 245

మూకేశ్వ రాలయము కడ
లోకేశ్వరుఁ డఖిల సుజన లోక నుతుండై

మూాకైక్య మోాద మందుచుఁ
బ్రాకటముగ నుండి యాత్ర పారమునందన్ ॥ 246

కదలుటతో గురుశిష్యులు
మొదలిటి నుండియును మౌన ముద్రితులగు వా
రెదలందు మూక చరితము
విదితముగా సహజమూక విశ్రుతులగుచున్ ॥ 247

స్వామి సమానులై యెదల సర్వ సమత్వము నూని సాగి రా
స్వాముల లోకులెల్లరును పారమెఱుంగని భక్తితో శివ
స్వామిని కొల్చినట్లుగనె సాంద్ర ముదంబున గొల్చుచున్ నుతి
స్తోమము లందునన్ నిలిపి చొక్కిరి జన్మలు ధన్యమైనటుల్ ॥ 248

శ్రీకాళహస్తీశ్వరా!
నీకాలు మ్రొక్కేమయా!

చీకాకులను కారు చీకట్లఁబడి యున్న
మాకు మార్గముఁజూపు మహనీయు లీ స్వాము
లేకాలమున నిల్వనీక్షింపుమా!

మానవాకృతిఁబూని మమ్ము సరిదిద్దంగ
దైనందిన జ్ఞాన తత్పరత్వమ్మెట్లొ
ఒజ్జబంతిగఁ జూపుచున్నారయా!

కనులలో నిన శశులు కదలాడుచుండంగ
తనువెల్ల శుచులౌచు తనరారుచున్నారు
నీ రూపులే యౌచునున్నారయా!

ఇట్టి జన్మంబైన నింకేమి కావలయు
పుట్టు విట్టిది యిచ్చి పుణ్యంబునం బొమ్ము
మా సేవ ఫలము నే మాకిమ్మయా!

# శుకతపస్స్థలము

చినదూరంబునఁ గొండవంకఁ గనుచోఁ జిన్నారి దేవాలయం
బనుపై నొక్కటి కానిపించుఁ బెనుచెట్లైయున్న యాకొండపై
మనసై వ్రాలిన దేదియో శుకమనన్ మాహాత్మ్యమున్ విన్న వ్యా
సుని సూనుండు శుకాఖ్య మౌనివరుఁడచ్చో నిల్చె శైవార్చనన్॥

అరణిం బుట్టి సమస్తవేదములు తామైవచ్చి సేవింప సం
సరణం బంటని తెంపు బాల్యముననే సాజంబుగానబ్బి యొం
టరియై పోయెడి పుత్రునిం గురిచి బిడ్డా యంచు మోహంబుతోఁ
బరువుల్ వెట్టిన తండ్రియంతట ప్రతిధ్వానంబు విన్నాఁడటే! 251

శుకయోగీంద్రుని సర్వభూతమయమౌ శుద్ధాంతరంగంబు మ
చ్చిక నట్లుత్తర మిచ్చెఁ దండ్రికయి, తత్సిద్ధుండు హెచ్చైన పూ
నికతో నిందు తపంబొనర్చి కనియెన్ నిర్ణీత శైవాద్వయ
ప్రకటీభూత మహత్త్వమన్న గిరి దైవంబౌను ముమ్మాటికిన్॥ 252

ననగా మౌళిని చంద్రుఁ దాల్చు శివుఁ డెన్నండేని యద్వైత వా
సనయుం గల్గదు, పూర్వపుణ్య మది పెల్చన్ దోడు కాకున్నఁ ద
ద్ఘను మ్రొక్కన్ దలఁపైన పుట్ట, దిఁకఁ జుక్కల్ డుల్లినన్ దోఁచిన
ట్లనయం బేగెడి మానవుల్ కనరు మాయామోహ విచ్ఛేదమున్॥

అగుటన్ మానవదేహమున్ గనిన పుణ్యాత్ముండు తద్దేహ ముం
డఁగ సద్ధాని వివేక యుక్తుఁడయి యుంటన్ ధర్మమందే సదా
నిగుడం జేసిన పుణ్యమబ్బు, నదివానిన్ దైవ భక్తుండుగా
మిగులం జేయును, స్వామి సత్కృపను పేర్మిన్ వాఁడె యద్వైతియౌ॥

అనగా ధర్మమె మానవాళికి ముఖ్యంబైన సూత్రంబు దా
నిని గుర్తించుట చాల తేలికగు దేనిన్ నీవు ద్వేషింతు వా
పని నెవ్వారికిఁ జేయఁబోకు మిదియే భవ్యాత్మునిన్ జేయు నీ
మనికిన్ సర్వులు సౌఖ్యమందెదరు మర్మంబింతియే మానవా! 255

తానెంతో జగమంత యానసుట తథ్యంబీవు ధర్మంబు నే
మైనన్ దాటక నిల్చుచో జగము నీయం దట్టులేయుండు ధ
ర్మానక్ దైవము తోషమంది సుఖసంపద్వృద్ధి గావించు న
ద్దానన్ శాంతి సమృద్ధమాట బ్రదుకుల్ ధన్యంబులై మించెడిన్॥

శుకయోగీంద్రుఁ డనేక జన్మముల సంశుద్ధాత్ముఁడై ధర్మమే
సకలమ్మై మనినట్టి భవ్యుఁడగుటన్ సర్వాత్మతా భావనం
బకలంకంబుగ నూని వ్యాస సుతుఁడై యావిర్భవంబందె వే
ఱొక జన్మంబిఁక లేని వాఁడగుట ధన్యుండయ్యె నీ భూమిలో॥ 257

అద్వైతానుభవాప్తిఁ బొందఁదగు సౌఖ్యం బవ్యయంబౌట దై
వాద్యా మానవులైన ధన్యులకుఁ తత్ప్రాప్త్యర్థమై జీవితం
బద్వంద్వంబగు నిష్ఠ ధర్మముననే యత్యంతమౌ శ్రద్ధ నే
యుద్వేగంబును లేక నిల్పవలె నాయుర్దాయ మున్నంతకున్॥ 258

మానవులే మటంచు మను మార్గములన్నియు ధర్మదూరమై
దానవతక్ భజించునెడ ధారుణి నేరికి సౌఖ్యముండు? తా
నైన సుఖింప కన్యులకు నైన సుఖంబును గూర్పలేని యా
మానవతన్ బ్రయోజనము మాలి పశుత్వమె మిన్నయయ్యెడిన్॥

పశువుల జీవితంబులవి భవ్యము లయ్యవి స్వీయధర్మ మే
దశనయినన్ విడంజనవు తప్పెడి శక్తియులేక కాల దు
ర్దశ మరణించినన్ మరల దైవమొసంగెడి మేనులందు స్వా
వశతను పుట్టి గిట్టుటయె పాపము పుణ్యములేని జీవులౌ॥ 260

మనుజతయందునున్ బశుతమానదు పాశవబంధ మూడ్చునై
పుణి కలదాట మానవత పూజ్యత నందుచు సర్వజీవ రా
శిని తన చెప్పుచేతలను శిక్షితముక్ బొనరింపఁ గల్గుఁ గా
వున నె మనుష్యుఁబట్టి జగమొందును నిత్యము దుఃఖసౌఖ్యముల్॥261

ఆతఁడు నిర్జితేంద్రియత నాత్మ విదుండయి మానవత్వ వి
ఖ్యాతికిఁ దగ్గయట్లు తన యందునఁ దానయి జీవకోటికిన్

ప్రీతిని గూర్పఁజాలుఁ దన పెక్కువ నిగ్రహమేది దానవుం
డై తనకున్ జగంబునకు నార్తినెగూర్చు వినష్ట బుద్ధియై॥ 262

బుద్ధియొకండు పెక్కువయి పూజ్యుఁడు మానవుఁ డద్దియే నరుః
బద్ధునిజేయు సక్రమత బంధవిముక్తుని జేయు స్వేచ్ఛగా
నిద్ధగుణుండు ధర్మపథి కెక్కిన దేవతవోలె మాన్యుఁడౌ
విద్ధ మనస్కుఁడః జెడిన వెఱ్ఱిగ నాశమొనర్చు లోకమున్॥ 263

గురుశిష్యుల్ కడు బుద్ధిమంతులయి కోర్కుల్ తీర్చికోగల్గు మేల్
పరువంబుండి మనుష్యదేహమును దైవంబౌటకై పూన్చి న
శ్వరభోగంబుల నుజ్జగించిన మహాసత్త్వుల్ వివేకాన్వితుల్
నరలోకంబున గొజ్జ బంతులగు చెన్నన్ వింత లేదింతయున్॥ 264

శుకుఁ డర్చించిన లింగ మా గిరిని జూచున్ వీరిఁ దానన్న య,
ట్లకలంకాత్ములు వీరు తచ్ఛుకుని మహాత్మ్యంబునే యెంచుచుః
సకల మ్మాత్మ మయంబుగాఁ గనుచు స్వేచ్ఛః స్వామి యాత్రన్ మహా
త్మకులై పాల్గొనుచుండ నెల్లెడల తోఁచున్ దచ్ఛుక బ్రహ్మమే॥

కొండకు నేటికిన్ నడుమఁ గోమల దేశము కొంతయున్న దం
దుండెడి వెన్నియో మునుపు నూర్జితమౌ ఫలవృక్ష సంతతుల్
పండెడి వెల్లవారి వయి స్వామి సమర్చను నిల్చువారి కె
న్నండును భుక్తి లేదనక నందనమై పరితృప్తిఁ గూర్చుచున్॥ 266

ఇప్పుడు భూమియే కలదు వృక్షము లన్నియుఁ బోయి వారు వా
రప్పటి కప్పు డాక్రమణ మాచరణంబునఁ బెట్టి స్వాంతమౌ
చొప్పునఁ జుట్టు కంచెలను జూపగ నమ్మడి భావమేది నేఁ
డిప్పటి వోలెఁ జెట్లమరునైనను ముట్టగ రాదు వానినిన్॥ 267

ఏడెము వద్ద కొండ కెడ మెక్కువ దూరము గాగ నేఱు పా
రాడి క్రమమ్ముగా గిరిని రాయున యన్నటు పాఱుస్వామి యు
న్నాఁడని యాలయమ్ము కడనాతనికై యెడమిచ్చె నంతియే
పాడి సమృద్ధమైన యెడఁ బాఱును స్వామిని కౌగలించుచుః॥ 268

శుకముని యున్న చోటునకు సూటిగ శుద్ధజలంబు లొప్పు వా
పిక యొకఁడున్న దద్ది పృథివీపతి యెవ్వఁడో రాయనామకుం
డకలుష చిత్తుఁడై నిలిపె నచ్చటనే యొక మంటపంబునుక్
ప్రకటిత భక్తిఁ గట్టెఁ గనరాదిపు డద్ది సుఖోపయోగ్యమై॥ 269

## ఎదురు సేవ

బయలగు నా ప్రదేశమున స్వామి యొకింతగ విశ్రమించు నీ
బయలు గిరి ప్రదక్షిణము భారమె యౌనను బాలవృద్ధు, లా
శయము లెసంగియుక్ వ్యవధి చాలక చేయని వారు స్వామి ని
ష్ఠయి నను గొల్చు గొందమను నా శను గూడెడి మంచిచోటగున్॥

కోనేరును మంటపమును
జానుగ విలసిల్లి యధిక సంఖ్యను జనముల్
తేనెకయి యీగ లట్లుగ
వేనకు వేల్ చేరుటకును వీలగు చోటై॥ 271

కోనేటి రాయ మంటప
మీ నాడును గిరిని చుట్టి యెంతయు శ్రమమై
మేనించు కంత వాల్చెడి
సేనానీ గురుని యెదురు సేవకు నొప్పున్॥ 272

ఎప్పటి నుండియో నిలిచి యెప్పుడు వచ్చును స్వామి యంచు మా
తప్పును సైచి కావుము యథార్థముగా గిరి చుట్ట నెంచియుక్
దప్పక యాగి పోవలసె దర్శన మిమ్మని వేడికొంచు నీ
చొప్పున గాక మాఱు తడేఁ జుట్టెద మంచు జనంబు లెందఱో॥ 273

ఇసుము చల్లిన రాల నట్లే యనంత
సంఖ్యలక్ జేరి కొందు రచ్చట క్రమాన
నాల్గు గంటల వేళ జనంబు బలియ
స్వామి యచ్చోటి కరుదేర సాయమగును॥ 274

)డెము చేరెఁ గండ్రికకు నేగెను మూలని యాలయంబు గొం
వాడె నటంచుఁ ద్రోవఁ జను వ్యక్తుల నారసి స్వామి రాకకై

కూడిన వార లుత్సుకతఁ గోటి విధంబుల నూహసేయుచున్
వాడిన మోములై విధురభావము నందుదు రాలసింపఁగన్॥ 275

వేలకొలంది మానవులు బృందముగా నొకచోటఁ గూడుచోఁ
జాల విచిత్రముల్ జరుగు సంఘ మనస్స్థితి సంద్రమట్టులై
వేలము వెఱ్ఱి యేచుటది వింతయె వ్యక్తిగ మానవుండు వా
చాలుఁడు కాఁడు నిగ్రహము సాగదు మందిని జేరియుండినన్॥ 276

పలువురు చేరఁబోదు రొక పట్టున నుందురటన్న వార్తయే
తెలిసినఁ దత్పరిస్థితిని దెల్విగ వాడికొనందలంచు వా
రలయక యెన్నియోగతుల నార్జన సేయగ నెంచి యత్నముల్
సలుపుదు రందు వింతలును సాజము లౌచు నెసంగు నెప్పుడున్॥ 277

కాలక్షేప వినోద యంత్రములు వేడ్కం ద్రిప్పి యాడింతు రా
బాలానంద విలాస వస్తువులు విల్వం దెచ్చి చూపింతు రె
న్నో లీలా నటనంబులన్ నిలుతు రన్నిల్ మెచ్చఁబూల్ పండులున్
హేలాపాన విలాస ఖాద్యము ల వెన్నేన్ దెత్తు రచ్చోటికిన్॥ 278

కొందఱు బృందగానములఁ గొందఱు నాట్యములన్ గథారసా
నందకర ప్రసంగముల నవ్వగఁ జేయు వినోద వేషముల్
కొందఱు నూని విద్యలివి కోటియుఁ గూటికె యన్నయట్టు లం
దందున సంచరించు చిటు లందఱకున్ ముదమందఁ జేయుటన్॥ 279

ఎంతటి కాలమైన నొక యించుక వేసట నందఁబోక కా
లాంతకు రాకకై యచట నట్టులె వేతురు కొండ చుట్టుచో
నెంతటి పుణ్యమో యదియె యిచ్చట స్వామిని గొల్చికొన్న నా
వంతయుఁ దగ్గ కందునను నాశయె నిల్పును వారి నట్లుగన్॥ 280

అందఱు స్వామి కోసమయి యచ్చట చేరిర? వచ్చువారికై
కొందఱు వత్తు రార్జనము కోసము కొంద ఱదో వినోదమై
కొందఱు ప్రొద్దు పుత్తమని కొందఱు నిట్టు లనేక లక్ష్యముల్
మంది యనంగ నిట్లగుట మానవ నైజ మదెంత చిత్రమో! 281

వచ్చెను స్వామి వచ్చెనను వార్తయు వచ్చును పొంగులెత్తి తా
నుచ్చలితంబయా జన మహోదధి యీశ్వరు వెంబడించుచై
యచ్చపు భక్తిఁ జుట్టుటయి యామర వాహిని యన్నయట్లుగా
వచ్చి జనంబు చేరుకొను వారును వీరు నభిన్నులౌదురున్॥ 282

పూర్వపు జాతి మంటపము పోయిన దెన్నఁడొ తత్ప్రదేశమం
దుర్విని మొల్చె నూత్నమన నొప్పు వితానము తోడి పందిటన్
పార్వతితోఁ బ్రభుండు దిగి పర్వతమున్ బ్రియమారఁ జూచు సా
పర్వుల పోలె సర్వులును స్వామిని గొల్తు రపూర్వ భక్తిమై॥ 283

సంజయు దాటి పోయినది సన్నగ చీకటి హెచ్చి ముద్దయై
యంజన శైల మీశ్వరున కర్చన సేయ శ్రమించి వచ్చుచై
నంజన మట్టులే నిలిచి నమ్రత నుందురు కొండచుట్టి వ
చ్చెం జన దించుకైన శ్రమ సేవను దేజిన పోదమన్నటుల్॥ 284

కాగడాలును దివిటీలు క్రాలవచ్చు
మిన్ను నందెన్నొ చుక్కలున్ మిణుక వచ్చు
శుక్లపక్ష తృతీయ హెచ్చునె వెలుంగు
చీకటైనను జనము రసింతురందె॥ 285

చుట్టు చీకటి బలిసి, యే చొప్పుఁ దెలియ
నట్టు లుండిన వేళ, రవంతయైన
తైలదీపాల వెల్గులో, దైవదర్శ
నంబు తత్త్వజ్ఞులకు మహానంద మొసఁగు॥ 286

కాన వచ్చును స్వామియే, కానరా దిఁ
కేమియున్, స్వామి నల్లెంత యేని కాల
మట్టె చూచుచు నానంద మందవచ్చు!
నింత కంటెను భక్తాళి కేమి వలయు? 287

అర్కు వేడిమిఁ బుట్టు కాలాంబుదములు
వానిఁ గన నీక తామె కన్పట్టు రీతి

స్వామి నుండియె సృష్టి సర్వంబు వచ్చి
తానె కనవచ్చు స్వామి నింగాన నీదు॥ 288

హృద్గుహావాసియై యుండి, యెల్ల వెలుఁగు
తానె యా స్వామి, సర్వ స్వతంత్రుఁడయ్యు,
నతనికై కాక జగతికై యటమటించు
వారి కతఁడేల కనిపింప వలయుఁ జెపుమ॥ 289

స్వామి సందర్శనంబె కావలయు వారు
కాఱు చీకటి వంటి జగంబు విడిచి
స్వామికై జీవితంబును సాగఁజేయ
నాతఁడే తమోహారి హృజ్జ్యోతి యగును॥ 290

ఈ మహార్థంబు తెలుపుట కీశ్వరాల
యంబు లం దెల్లచోట్ల మహాప్రకాశ
మాన దీపాళి నుంచు వారైనగాని
గర్భగుడి యందు విరియు చీకట్ల నడుమ
స్వామి నుండంగఁ జేయు నాచార మయ్యె॥ 291

స్వామినే చూపు నల్ప దీపాల వెలుఁగు
లన్య మెద్దియుఁ జూడకున్నట్టి వేళ
స్వామి కనిపించు, నిదియ నిజంబు కాన
నన్యములఁ జూపు వెల్తురు లచట తగవు॥ 292

అగును తనువులు స్వామి దేవాలయములు
హృదయ గుహ యందె స్వామి వసించి యుండు
వాని గనిపింపఁజేయు దీపంబు కొఱకు
యత్న మొనరించి వెల్గుల నందవలయు॥ 293

స్వప్రకాశుండు స్వామి, దీపమ్ము చూడ
నన్య దీపమ్ము వలయునే? యడ్డ మున్న
దేదియో, దాని తొలఁగించి తేని, స్వామి
తానె కనవచ్చు దేదీప్య మానముగను॥ 294

సిద్ధ వస్తువు స్వామి, క్రొత్తగా చేరుటన్న
దెన్నడును లేదు, కప్పికొంటివె ముసుఁగు,
దాని తొలఁగించు కొన్న నతండు తోఁచు
నతఁ డొకండును నీవు వేఱగుట నిజము? 295

నేను నేనని యనుటయే నిన్ను గప్పు
ముసుఁగు, నేను నేగాదు, సముజ్జ్వలాత్మ
నౌదు, శివుఁడ నచ్యుతుఁడ నే నగుదు, నంట
యే ముసుఁగు తొలఁగించు, టింకేమి లేదు॥ 296

ఉన్నదాత్మయె, తదితర మున్న దొక్కొ?
ఉన్న దున్నట్లు చూడ నీకున్న దానిఁ
గప్పి, లేనట్టి దున్నట్లు కనబడంగఁ
జేయు పరమ శక్తియె యగు మాయ యనఁగః 297

ఏకత్వ శ్రుతి భావ మందికొనగా నే కాంత మే సేవ్య, మ
ట్లేకాంతమ్మున నుండి సిద్ధి గను వాఁ డెచ్చోటఁ దానున్నన్
నైకా సంఖ్య జనాళి మధ్య గతుఁడై, యద్వైత దివ్యాను భా
వైకాత్మ్య స్థితివీడ, కంతట శివాద్వైత్య తమ్మునే కాంచెడిన్॥ 298

వేలకు వేల శీర్షములు వేనకు వేలు పదోరు బాహువుల్
వేల ముఖంబులున్ గనులు వీనులు నొప్పు విరాట్స్వరూపమున్
బ్రోలను జూచుచున్నటులె మోదము నందిరి శిష్య దేశికుల్
కాలము దేశ మన్నియును గల్పితముల్ పరమాత్మ యందునన్॥

చీకటిలో సమత్వమును జెందుట సేగియె, యున్న భేదమున్
పోకగ నీదు చీకటి, విశుద్ధ మనస్కుఁడు భేదమున్ననున్
నైకతఁ జూచుచుండియును నేకత భావము నందుఁగాంచు, నా
త్మైకత యుండుగాని తనువందు విభిన్నత తప్ప దెన్నఁడున్॥ 300

భావాద్వైతము సేయగా వలయు, సర్వం బ్రహ్మమహానంచు దే
హావష్టంభము వీడు నందనుక బ్రహ్మాత్మైక్య భావంబు నం

దా ద్వైవిధ్యము కానకుండియు క్రియా ద్వైతంబు చేయంగ రా
దీపై దేహ మెఱుంగుచట్లు చనఁ దప్పియౌను ముమ్మాటికిన్॥

దేహము ద్వైత భానమున దీప్తమగున్, స్మృతియున్న యప్పు డా
దేహము వెంట భేదమును దృష్టికి వచ్చును, దానిఁ గాదనం
గా హతమౌను, నీవు కనగాఁ దగు నేకత భావమందుఁ, ద
ద్దేహము రాలిపోయిన విదేహత ద్వైతము మాసిపోయెడిన్॥ 302

సిద్ధునకైన సంస్థితిని జెందిన యట్లుగ సాధకుండు తా
విద్ధ మనస్కుఁడై తలఁచి వీగుట వెఱ్ఱియె, సిద్ధుఁడయ్యునున్
బద్ధుని బోలె సర్వమును ప్రాజ్ఞుఁడు లోకహితార్థమాని, తా
బద్ధుఁడు కాఁడటంచు భగవానుఁడు తెల్పె హితంబు గీతలో॥ 303

తనువే తోఁచని సిద్ధి నీకయినఁ గర్తవ్యంబు నీకుండ, దే
మనవున్ నీవు, గుహాస్థితుండవయి, దేహంబున్న దున్నట్లుగా
మనునో మానునొ, నీవు నీ వనుటయే మానన్. జగద్వ్యాపివై
చన వెచ్చోటికి, నంతటన్ బరగు నైశ్వర్యంబు సిద్ధించుటన్॥ 304

చీకటి కంటె మోహనము సృష్టి మరేదియు లేదు, విశ్వయా
లోకము లన్ని యా యిరులలో జనియించును, నైగనిగ్య మా
చీకటి సొత్తు, లోవెలుఁగు చేరియె చీకటి యుండుగానఁ, బెం
జీకటి యందునున్ వెలుఁగు చెందక యుండదు మోహకంబుగా॥

అచ్చపు వెల్గు కన్నులకు నందదు, తోఁచెడి వెల్గులన్నియున్
విచ్చిన కాఱు చీకటికి వెన్నునఁ బుట్టెడి మాయవెల్గులే;
పొచ్చెము లేని వెల్గయినఁ బుట్టదునో జగ, మందమైన క
న్నిచ్చకు వచ్చు నీ జగతి కెప్పుడు మూలము కాఱు చీకటే॥ 306

కప్పిన చీకటుల్ విరియగా ప్రభవించెడి సూర్యదేవుఁ, డం
దొప్పియు యుండి, వానినె యహోయున రంగులు గాగమార్చి, క
న్గప్పి, జగంబుగాగ తన కాంతులఁ జూపి మరంతలోనె చూ
పొప్పక మాయమౌను, తన యునికియు నిత్యము వాని వృద్ధికా॥

చీకటి కిఁక వెలుంగునకు స్నేహమె పెల్లగు, వైర మున్నటుల్
లోకము లెంచు భ్రాంతమతి, లోనగునే నిజమైన వైరమై,
తాకిన విచ్చుచై పోరియఁ దాకక, దాగుడు మూతలాచు, నా
చీకటి వెల్గులే కలిసి సృష్టి నొనర్చు సమస్తలోకముల్॥ 308

శివుఁడును గాళ రాత్రియును స్నిగ్ధులు, సృష్టికి నాది దంపతుల్,
తవిలిన కాయముల్ కలిగి, ద్వైతము నందక కూడియుందు, రీ
భవము సమస్తమా భవుల పంటయె, వద్దనుకొన్నచో సదా
శివత, నిరస్తమాయికత, చెందగనా జగదీశ్వరీ కృపన్॥ 309

నిద్దపు నైగ నిగ్యమున నిగ్గులు దేలెడి రాత్రివేళఁ, గ
న్నద్దెడి కాంతులై పొగల నంతటఁ జిమ్మెడి కాగడాల వె
ల్గొద్దిక దారిఁ జూపఁ బ్రభువొప్పె మనోహరుఁ డౌచు యాత్రలో
ముద్దులు గారు మోహనత మున్గి చరించిరి భక్తులెల్లరున్॥ 310

భజరే మానస పరమ శివం
నిజ హృదయస్థం నిఖిలేశం।

సంధ్యా తాండవ గిరిజానాథం
ఆనందాంబుధి మథనోన్మాదం 1

సృష్టి స్థితి లయ కేళీలోలం
మాయా మోహిత జగతీ జాలం 2

సర్వ ప్రియకర సన్నుత చరితం
సర్వోత్తారక కరుణా భరితం 3

భక్తజనావన భావావిష్టం
త్యక్తాఖిల ముని హాదయ నివిష్టం 4 311

## ముక్తి వినాయ కేతివృత్తము

ఇంత వఱకును కొండ కెంతే నెఱమ్ము
నేటికిని సమీపమ్ముగా నేగుచున్న

దారి క్రమముగ కొండను దరియఁ జొచ్చె
నది గదిగొ కొండ దారికి నడ్డ మగున? 312

కొండఁ జూచుచు నెవ్వరో కూరుచున్న
యట్లుగా నున్న దా మూల నాలయమ్ము
దాని దరియంగ స్వామి కుత్సాహమయ్యె
సన్న యట్లుగ వేగమ్ము నందె నడక॥ 313

చూపులకుఁ జిన్నగుడి యది దాపుఁ జేర
స్వామి యద్దాని చుట్టుగా వచ్చి కొంత
సేపు తృప్తిమై విశ్రమించినది చూడ
నదియు స్వామికి నెంత ముఖ్యమ్మొ తెలిసె॥ 314

అచట నున్నట్టి దా స్వామి యగ్రసుతుఁడె
యయిన నేమాయెఁ జతురాననాది సురల
కగ్ర పూజ్యుండు గానఁ దానైన భక్తిఁ
జుట్టి వచ్చెను స్వామి లోసుంగు పడక॥ 315

అదియు గాకెంత యుపకారి యయ్యెఁ దనకు
నుమకు మార్గమ్ము చూపి యా యమ సుఖానఁ
దనకు దక్కెడు నట్లు చేసిన దతండె
తాను గనకున్న నుమకు సందనుఁడె మిన్న! 316

ఆమెకై కాక తనకునై యతని గొలిచెఁ
దండ్రి గార్హస్థ్య మందుండఁ దనయుఁడేమొ
యతియుగానైన జనకుఁడా యతనిజూచి
మ్రొక్కఁడేఁ? యట్టులే యిది ముఖ్యకృతియె॥ 317

అగ్రపూజ్యుం డితండని యపుడు పలికి
తా ననిన దానిఁ దానె కాదనగరాదు
ధర్మమును జెప్పి స్వామి యధఃకరింప
నెవరు పాటింతు రింక శాసించు నెట్లు? 318

ఇప్పటిమాట కాదిది మహేశ్వరుఁ డెప్పుడో స్వీయవాస మం
దొప్పుగ నున్న యప్పుడు మహోత్సుకతన్ దన చెంతనుండి మై
గప్పిన పార్వతీసతి యొకానొక వేళఁ దన్నుఁ జూడ నా
ఛొప్పది యెందుకో గనక చూపులలోఁ గనుచూపు లుంచఁగన్ ॥319

పరమాదరమును వినయముఁ
గరమరుదగు భక్తి విరియఁగాఁ దనుగనుచున్
పరమేశా! పదదాసిని
కరుణింపవె మనికి మీదుకట్టిన దానన్ ॥ 320

పెరవారి కేరి కేరిణో
గురుతను వహియించి పరమగూఢము నైనన్
స రహస్యమ్మునఁ దెలుపుచు
గరితను ననుబిల్చి నుడువఁగా నరు మేలే? 321

మనసయి మాటిమాటికిని మన్ననసేయుదు రీరెయంచు నే
మనకయ యుంటి నేటికటు లాగక డెందము వేడుచుంటి నా
మనవి తిరస్కరింప కణుమాత్రము దాపక శైవమంత్ర దీ
క్షను నను నిల్పఁగాఁ దలఁపుగాంచుఁడు పాదములంటి వేడెదన్ ॥ 322

గలితకు భర్తయే గురువుగాన నవశ్యము నాకు దీక్ష ని
ర్భర కరుణాపరత్వమునఁ గాంతులు మీరె యొసంగఁగా వలెన్
వరమిది పొంది త్వత్కరుణఁ బారమునందెద జ్ఞానవార్ధికిన్
గురుల యెడందరుక్ ప్రియము గొల్పుదు ముందటికంటె మిన్నగన్ ॥

అటులు ప్రియాంగనామణియె ప్రార్థన సల్పగ దేవుఁడైన నిం
కెటులు తిరస్కరింపఁగలఁ డీశ్వరుఁ డప్పుడు పార్వతీ సతిన్
గటకట నందనీయక మొగంబును గోముగఁ జూచి నవ్వి చె
క్కిటని కనిష్ఠికన్ బుణికి కేలిని కేల స్పృశించు చిట్లనెన్ ॥ 324

అడుగక మంత్ర మెవ్వరికి నైన వచింపగరాదు నేటి కి
ట్లడిగితి వింకఁ జెప్పదగు నైన మహామనువౌట నీమమున్

బడయగ నౌను నేటి కుపవాసము నూని సఖీజనంబు లే
మడిగిన మౌనమూని బదులాడక యుండుము రేపు తెల్పెదన్॥ 325

పార్వతి స్వామిపల్కులకుఁ బట్టగరాని ముదంబునందె నా
శర్వుఁడు చెప్పినట్లుగనె శ్రద్ధవహించెను నీమమందు సా
పర్వ జగంబు సర్వమును పార్వతి పూనిన మౌనదీక్ష త
త్పూర్వ మెఱుంగమంచుఁ దలపోయగ వేగి పరాహ్ణమైనచో॥ 326

గిరిజను బిల్చి మంత్ర మెఱిఁగించెను ముందుగఁ దన్మహార్థ మీ
వెఱుఁగగఁ బోలు దాని వివరించెడు పట్టునఁ జెల్మికత్తె లం
దఱును వినంగవచ్చు నరుడా వివరంబగు శ్రద్ధ సుంతయున్
దఱుగగరాదు నీకెవరు దగ్గర యౌదురొ వారిఁబిల్వుమా! 327

అనుటయుఁ గొందఱన్ బిలిచి యందఱు చేరినయంత స్వామినిం
గనగ నతండు తెల్పదొడగన్ గడుగాఢములైన యర్థముల్
వినిచెడు వేళ శ్రద్ధమెయి వించునెయున్న భవాని ప్రక్కనుం
డిన చెలి తన్నుఁజూడఁగని స్నిగ్ధునిజూచె మరంతలోననే॥ 328

విను గిరిజా! మహార్థమును విప్పుచునుంటిఁ గనుల్ చెవుల్ మద
ర్పణ మొనరింపకున్న నెటు పట్టును భావము? చెల్మికత్తె నుం
గనుగొన నిందు వచ్చితివ? కల్గదు శ్రద్ధ, వృథాప్రయాస మ
య్యెనుగద, నిష్కృతిం గనుట కేగుము భూమికి మానుషత్వమై॥ 329

మానుష వైనఁగాని నిను మానిని! శ్రద్ధ వరింపఁబోదు, నీ
దైన సురాంగనా తనువు దక్షిణ దగ్గత శైవశైల మం
దేను వసించుచోటను మదీప్సితముం బడి పుట్టు చెట్టుగా
దాని నఖండ బిల్వమును దద్దయు భక్తి నొసంగు చచ్చుటన్॥ 330

మత్ప్రియ పూజలో నిలుము మానుషవౌటను సేగిలేదహో
త్వత్ప్రియ మచ్చుటన్ గలుగుదానికినై పరితాపమంద క
స్మత్ప్రియ మాచరించుటగు మానిని నీ చరితంబుబట్టి య
స్మత్ప్రియు లౌదు రెల్లరును మానవలోకము ధన్యమయ్యెడిన్॥ 331

విరహమగుంగదా యనుచు వెఱ్ఱివి కాకుము నీకు నాకు న
వ్విరహ మసంభవంబు నిను వీడుట కాదిది నాదుకోర్కెపై
నరుగుట నీదు దేహమగమై యటనుండి తదీయ పత్రముల్
పరిమళవంతముల్ దినము వచ్చుట నాకును మోదమయ్యెడిన్ ॥ 332

అని వచియించి యచ్చటకు నామె చనందగు మార్గమంతయున్
దనకయి తానె సూటిగను తావును చేరువిధానఁ జెప్పి ప్రేము
క్కిన ప్రియమాలినీ ముఖ సఖీజనముంగొని పొమ్ము వెంట నం
చనుమతి యీయ నామె తన యామర దేహము వీడెనంతలో॥ 333

మనుజ తనూత్తమంబెసఁగె మానిని కామె సఖీజనంబుతో
జని చని భారతావనికి జన్మమొసంగిన పుణ్యభూమికిన్
మనమున మోద మందుచునె మానక వచ్చి గుహాత్తమోత్తముం
డెనయగ రాని దివ్య మహిమేశ్వరుఁడౌ హిమవంతునిం గనన్ ॥ 334

తనయ తనంతరాఁ గడు ముదంబును గాంచిన తండ్రి యెన్నియేన్
జనవులు వేడుకల్ జరిపె స్వామి యనుజ్ఞను జెప్పె వెంబడిన్
జనియె నవాచికిన్ గిరిజ చక్కఁగ దారిఁ జూచికొంచు నం
తను మనుజత్వమైన కతనన్ బధి విస్మృతమౌట నెంచుచున్॥

మును జను కెట్లో నేరకయె మోహితయై శివదేవు నెంచుచోఁ
దనకు సహాయమౌటకని తత్ప్రభుఁడంపిన నారదర్షి రా
ముని నతిభక్తి గొల్చి "మునిముఖ్య! తపోధన! నేను దక్షిణం
బున గల వెండి కొండకును బోవలె దారిని జూపు" మన్నచో॥ 336

నవ్వుచు మౌని "దేవి! శివనాథుఁడు తెల్పిన మార్గ బోధ మీ
దవ్వున విస్మృతం బగుట దారి నెఱుంగగఁ గోరుచుంటి వీ
వవ్వర వర్ణినీ మణివి పార్వతి వయ్యును దారి తప్పితే
రవ్వయు గవ్వ యయ్యెఁ గనరాదె శరీర మహాత్త్వ మింతయున్॥

మనుజ శరీరముం గనిన మాయ మునుంగుట తప్పదమ్మ, చెం
తను గల దాని నే మఱచి దానికి నై భువనంబు లన్నిటిన్

బనివడి చుట్టిరా ననుపు పాటవ మన్నది దాని కందుచేఁ
దనయునిగాఁ దలంపక కృతార్థతకై గణనాథుఁ గొల్వుమీ!  338

నినుగొని పోవు నీ సుతుఁడె నీరజ సంభవ ముఖ్య దేవతా
గణములు కార్యసిద్ధికి నఖండిత భక్తిని నీ కుమారునే
మునుకొని కొల్తు రీవునటు పుత్త్రుని ముందు భజింపు మమ్మరో!
యని హితమున్ వచించి చన నాయమ యెంచె గణేశు నెమ్మదిన్॥

జనని తలంచి నంతటనె సంబర మందుచు వచ్చి ప్రోల నుం
డిన గణనాథుఁ "డమ్మ! యవనింగన వచ్చిన నీకు దండముల్
ననుఁ బ్రియమూర నెంచితివి నందనుఁడన్ ముదమూర ముందు నీ
పనిని ముగించి నీ దయకుఁ బాత్రుఁడ నయ్యెదఁ జెప్పు మమ్మరో"॥

అని మనవి చేసి నంతటఁ
దనయుని గడుసుం దనమును దత్పరతయు మె
చ్చిన మతిఁ బనిని దెలిపి యా
తని దా గురు మార్గ దర్శితం జనె వెనుకన్॥  341

ఘన మతి గణపతియును దన
జననిన్ బహుపుణ్య నదుల స్నానమ్ములతోఁ
దనుపుచుగొని పోయెను ద
క్షిణ కైలాసము గలట్టి క్షేత్రమ్మునకున్॥  342

తల్లి గిరీంద్రమున్ దరియు దారిని వచ్చుచుఁ గొండ గాలికే
యుల్లమ్ము పల్లవింపఁ దనయున్ గనుగొంచునె దానిఁ జూచుచున్
దల్లి రయోడిన్ వసింపఁ జను తత్తఱ నందుచు భిల్ల కాంత లు
త్ఫుల్ల హృదబ్జలై తిరిగి పొల్పుగఁ దెచ్చు ఫలాళి నెన్నుచున్॥ 343

గిరి దరియుం గనుంగొనియెఁ గిల్బిష హారి తపోధనాఢ్యులన్
వరమునులన్ జరిష్ణు శివసై భవులన్ బహుభిన్న మార్గులన్
బరముల వారిఁ జూచి తన భావ మదెల్లఁ దపోమయంబుగాన్
గిరి నికటమ్ము నం దిచటఁ గేవల మా గిరిఁగాంచు పుత్త్రుతో॥  344

"తనయ! గిరీంద్రమున్ గనుచుఁ దన్మయతన్ భజియించుచుంటి వీ
ఘనగిరి చూడఁజూడ ననుగా! నను నమ్మెదొ నమ్మవో శివుం
గనుగొను చున్న యట్లె మదికై పు వహించెడు నీకు నట్టులే
యనుభవ మయ్యెనేమొ హృదయమ్మును దెల్పు" మటంచుఁ
బల్కినన్ ॥

గణపతి మాతృమూర్తి పదకంజము లందున శీర్షముంచి "మ
జ్జనని! నిజంబె చెప్పితిని శైలము శైలము కాదు తండ్రి యే
మనుజుల నుద్ధరింపఁ దన మాయనిటుల్ పొడకట్టి నిల్చె నీ
మనుజత పూర్తి మాయను నిమగ్నను జేయగలేదు పుణ్యమై॥ 346

నర తనువందియున్ గిరిని నా జనకుండని యెంచఁ గల్గు నీ
కెఱుకకు లోపమేమి జగదీశ్వరివై శివదేవు కీర్తివై
సురుచిర సుప్రకాశ ఘనసుందర మూర్తివహించి లోకు లె
ల్లరకును జ్ఞాన దాత్రివయి లక్ష్యము లందెద విట్టె తల్లిరో॥ 347

ఎవరి తపంబు వారిదగు నెంతటి ప్రేమకుఁ బాత్రుఁడయ్యు శ్రీ
శివమతిఁ దన్మయత్వమును జెంది తపంబును జేయు తల్లికిన్
సవిధమునందు పుత్రుఁడును సంచరి యించుట పాడిగాదు నీ
వవమతి నెంచఁబోక సరియన్న నిటన్ నిలువంగ నెంచెదన్॥ 348

వాయుభావాన తండ్రి వెల్వడిన తావు
దీని కుత్తరముగ క్రోశమైన లేదు
కొండ నంటియె యున్నదా యండనంది
యిందు నెందేఁ దపోదీక్ష నందు మమ్మ!" 349

అని యెను గూర్చుండెను గిరి
కనుగొనుచున్ గుండ బొజ్జ కదలక యుండన్
జననియె కావచ్చును త
త్తనయుని గదలింపఁ దల్లి తరమగునె యిఁకన్॥ 350

"తనయా! నీ వనినట్టులే యగుత యాత్రన్ నాకుఁ దోడైన నీ
మనమున్ మెచ్చితి నీ విటన్ నిలిచి సంభావించు భక్తాళి పు

ష్టిని దుష్టిఁ మరి ముక్తి నందగఁ గృపా సేకంబు గావింపుచున్
మను" మంచాతని సుప్రతిష్ఠితునిగా మన్నించె నా తల్లియున్॥ 351

అది మొదలీ వినాయకుఁడు హ్లాదమయున్ గిరిదేవ్యఁ దండ్రినిన్
మది మొద లెవ్వరుం గనని ధూర్వహు నిశ్చల దృక్ప్రసూనపు
ష్టిద మధుభావనా ఫల విశేషములన్ దనియింపఁ జేయుచున్
సదమల భక్తపాళికి రసప్రదుఁ డౌచు వెలుంగు నిచ్చటన్॥ 352

తులలేని ప్రత్యూహ తూల వాతూలుండు
నెనలేని కారుణ్య ఘనమనీషి
సరిలేని సర్వజ్ఞ శాంతస్వభావుండు
కొదలేని విజ్ఞాన కోవిదుండు
తుదిలేని స్మృతి మాత్ర తోషితామిత కీర్తి
వెలలేని విద్యా పవిత్ర మూర్తి
కొఱలేని సద్భక్త కోటి రక్షణ శీలి
యరలేని యానంద నిరతిశయుఁడు

గరిక పోచలు కొని యగున్ గల్ప నగము
ప్రేలు బొజ్జయి పిలువ వేవేగ వచ్చు
నేక దంతుండె యయ్యు ననేక దుండు
గణపతింబోలు దైవంబు కాన నగునె॥ 353

తదుపరి తల్లి క్షేత్రమునఁ దత్పరయై నది యందు స్నానమున్
ముదమునఁ జేసి, యైన యెడమున్ సహియింపగ లేని యట్లు మో
క్షద మగు వాయులింగమును గన్నులతో నిలువెల్ల గప్పి శ్రీ
ప్రద ఘనసార సౌరభ సువాసితమై తనువెల్ల పొందగన్॥ 354

స్వామి కభిన్నయై మనుట వాంఛిత మౌట నభీష్ట సిద్ధికై
యీ మహి నెందు నిల్తునని యేగిన చోటున కేగి యేగి స
ర్వామల శాంతిదాయి యగునన్న వినిశ్చయ మెందుగాన లే
కా మెయిక్షేత్ర మెల్లఁ దిరుగాడుచు నొక్కెడ నొక్క వృద్ధునిన్॥

ద్విజ వరుగాంచి డగ్గరుచు దేవుఁడె యానన భక్తి మ్రొక్కి "యో
సుజనవరేణ్య! క్షేత్రమున సువ్రత నిష్ఠను బూని స్వామి సం
భజనమునన్ దరింతునని వచ్చితి శీఘ్ర ఫలప్రదంబు నై
నిడయ మొసంగు తా వెదియొ వేఁడెదఁ దెల్పవె స్థానికుండవై!"

అను జననీ మతల్లి నుడికా ముది వగ్గు తనంత వీనులన్
వినినది సత్యమా యనెడి విస్మయ మందెడి వానిబోలెఁ బొ
ల్చిన నగవెల్ల నాస్యమున లీన మొనర్చుచు నామెఁ జూచి "నీ
వని నటు స్థానికుండనె యథార్థముగా మహిమం బెఱుంగుదున్ ॥ 357

అయినను బాల నీ వికటికా చెలికత్తెల తోడ వచ్చి యే
దయినను జాఱిపోవ వెదకాడుచు నుంటి వటంచు నెంచితిన్
వ్యయమయి పోవ లే వయసు వా లెద వే తపమందు? జీవితం
బయయొ వృథా యగుం గద! ప్రయాస మదేల నిరర్థకంబుగన్ ॥

అనినన్ నివ్వెఱవోయి తల్లి "మహనీయా! మీరు నా మానసం
బును తుణ్ణంబుగఁ జూడఁ గల్గిన మహాత్మ్మల్ సత్యమేయాను పో
యిన దానిం బడయంగ సత్తపమె యందించున్ బునఃప్రాప్తి యం
దిన ధన్యంబగు జీవితం బనుచు నాత్త్రింగూరి యల్లాడెదన్ ॥ 359

పూర్ణదయ నన్ను జూచి సంపుల్ల మతిని
నా యభీష్టము తీర్చి పుణ్యమునఁ బొందు
వయసు పేరెత్తి నా మనః ప్రబల దీక్ష
నరయఁ గోరెడి యీ ప్రశ్న మనవసరము" 360

తల్లి యట్లని నంత వృద్ధ ద్విజుండు
చకితుఁడైనట్లు తోఁచె నిస్సంశయముగ
"మూల లింగంబు వాయవ్య మూల బాల!
చాల శ్రేష్ఠంబు పరమ విజ్ఞానదాయి॥ 361

రమ్ము నా వెంట నిన్ను స్థిరం బొనర్తు
సత్తపో యోగ్య విజయద స్థలమునందు"

ననుచు గొని పోయి నిలిపె నా యమ్మనపుడు
ఇపుడు జ్ఞాన ప్రసూనాంబ యెసఁగు చోట॥ 362

ఆమె నిలిచిన వృద్ధుఁ డంతర్ధి నందె
జనని తోడుతఁ జెలులు నాశ్చర్య మంద
నీశ్వరుఁడె యట్లు చేయు నహీన కరుణ
నతఁడె యతఁడని తెలియరాఁ డంతె కాని॥ 363

అపుడు తల్లియు నిపుడు మాయా ద్విజత్వ
మమరఁ దోఁచిన శివుఁడు వయస్సు మాట
యెత్తి నీ కేల తపమని యెంత యనిన
నా యుమాదేవి మాన లే దగుటనె యుమ॥ 364

దక్ష పుత్త్రిక యోగ విదగ్ధ దేహ
యై జనించెను హిమవంతు నాత్మజాత
గాగ నుమయు నపర్ణ యన్ ఖ్యాతిగాంచి
యయ్యెఁ బార్వతి భవుని వామార్ధ దేహ! 365

ఆమె మానుషి యై కాళహస్తి పురిని
మూల లింగంబు వాయవ్య మూలనున్న
పరమ విజ్ఞాన దాయి నా వరలు నట్టి
క్షేత్ర మందున నిల్చి యక్షీణ తపము 366

చేసి యచిరాన స్వామినిం జేరి కొనిన
నాఁడె జ్ఞానప్రసూనాంబ నామమందె
నేటి కాయమ్మ నిల్చి యుండిన స్థలంబు
పరిసరం బెల్ల విజ్ఞాన ఫలద మగును॥ 367

ఓ జగన్మాత! నీవు మమ్మోమ నెంచి
మనుజ తనువెత్తి శివుమాట మహికి నెల్ల
నుత్తమంబైన క్షేత్ర మనుత్తమంబు
నైన శ్రీకాళహస్తి నత్యంత నిష్ఠ! 368

తపమునన్ నిల్చి దేవివై యిపుడు గూడ
స్త్రీలు పురుషులు మనుజతం జెందినట్టి
ధన్యు లేవిధి మన జీవితములు ధన్య
మగునో తెల్పుదు వమ్మ యనంత కరుణ! 369

కోటి జన్మాల కెప్పుడో కూడివచ్చు
మనుజ జన్మమ్ము వ్యర్థమై చనగరాదు
దేవ యోనులఁ బుట్టుటాధిక్య మేమి
యవియు భోగార్థమైనవే యయిన యపుడు॥ 370

వట్టి పుణ్యానకైన దేవతలు కూడ
క్రిందఁ బడుదురు పుణ్యమ్ము క్షీణమైన
పాప ఫలమునకైనవి పశుతనువులు
రెండు నొకరీతి శిక్షకౌ గృహము లగును॥ 371

కేవలాఘాన నినుప సంకెళ్ళొకంట
ఘన మహా పుణ్య కనక శృంఖల లొకంట
రెంటి యందు స్వాతంత్ర్య మదృశ్యమె యగు
మనుజతయె మించు స్వాతంత్ర్య మహిమచేత! 372

చేయుటకుఁ జేయకుంటకుఁ జేసికూడ
ఫలము నందక మోక్షమే పడయుటకును
స్వేచ్ఛ యున్నది మానవ జీవితముల
నరతనువు దుర్లభమని శంకరులె యనిరి! 373

అట్టి దబ్బియు వితగా వ్యయంబు చేయు
వాఁడు బుద్ధియుండియు లేనివాఁడె యగును
బాల్య మెవ్వారికైనను వ్యర్థమె యగు
వృద్ధతయు నట్లె వశము తప్పెడును గనుక॥ 374

బుద్ధి హాయిగ పనిచేయు పూర్ణయౌవ
నమున ముక్తికే దేహ మనంగ నిలుచు

బుద్ధి మంతుఁడు నరుఁడు ప్రబోధ మంది
మరల జనియింపఁ డిందుకే నరుఁడధికుఁడు॥ 375

తల్లి తప మెప్పు డొనరించెఁ? దల్లి కేమి
చెప్పెను ద్విజుఁడు? తల్లి వచించె నెద్ది?
మనకు హితమైన దేదియో యనిన దదియె
ప్రాయమందె తపం బొనర్పంగవలయు॥ 376

తనువు నిలిచెడి భోగముల్ తఱుగకుండ
ధర్మమున నిల్చువాని కర్థంబు లబ్బు
నబ్బు నర్థంబు ధర్మార్థమై వ్యయించు
బ్రదుకె తపమన ముక్తి తప్పదు నిజంబు! 377

బాలగా నుండి తపియించి ప్రౌఢయై శి
వప్రభూత్తమైక్య భావంబు నంది
యిందు జ్ఞానప్రసూనాంబ యీ రహస్య
మే యెఱింగించు చున్నది యెల్ల వేళ! 378

పూజారూప తపం బొనర్చినది యే పూర్వాంగ మా దేవి దే
భూజంబై యిట నున్నదో మృదు దళంబుల్ దాని వెన్నెన్నియో
రోజం దెచ్చి శివా! శివా! యనుచు నయ్యోగీశ్వరుం గప్పుచో
మోజై ప్రేయసి కౌగిలింతగనె యింపుంబొంది నాఁడంటహో! 379

ఇది యఖండ బిల్వ మహీజమే తనంత
నన్ని యెడలను ప్రభవించు నవని యగును
అది మహాదేవి దివ్య దేహంబె యగును
తద్దళం బొక్కటో శివా! దయను గొనుము॥ 380

ఈ వనుచు భక్తి నీయ నీ యీశ్వరుండు
నిప్పటికి మెచ్చు నట్టిచో నే దినంబు
వేయి దళముల నిచ్చి తన్వీలలాము
స్వామి భజియించి దేహార్థ భావ మందె॥ 381

శివుఁ డపుడు పొందిన ప్రియాశ్లేష సుఖము
చేత మేనెల్లఁ బులకింపఁ జెందెనిట్టి
గగ్గు గగ్గుల రుద్రాక్ష కాయ మందు
రాకు మఱుగున గన్నులై యాలినె కనె॥ 382

దేవి హిమవత్తనూజ తద్దేవి దేహ
మెల్ల దివ్య గంధంబు లువ్వెత్తుగాఁగ
నేచునట్టిది సామి కా దెల్ల దేహ
మామె యే యయ్యె నిత్య బిల్వార్పణమున॥ 383

పురము పురమెల్ల పచ్చ కప్పురమె నిండ
త్రిపుర హరుఁడైన స్వామి యా దేవి మహిమ
మరల పురమంది యిచటఁ గాపుర మొనర్చ
నీ పురంబును నాతఁడే యెంత వింత! 384

పుర మనంగను తనువు తత్తనువు నంది
పురుషుఁడైనాఁడు మూఁడవు పురము లొప్పఁ
గా పురంబుండి వానినే కాల్చివైచు
త్రిపుర సుందరి యైన యీ దేవి మహిమ॥ 385

అతుకు కొని యున్న దేహార్ధ యుతులు బళిరె
అంగజుం గాల్చి వాని ననంగుఁ జేసి
యెట్టి కామంబు లేని కామేశులయిరి
ప్రతి పదాశ్చర్య హేతు వద్భుత చరిత్ర! 386

విడిచి యుండియు విడువక వేరు కాక
కలిసి యుండియుఁ గలియక కలిసి నట్లె
కానవత్తు రిర్వురయి యేకంబె యగుదు
రింత వింతైన దాంపత్య మెందు గలదు? 387

ఈ మహాభోగ మెల్ల తా మెల్ల వేళ
నీ పురంబునఁ బొంది సుఖింపఁ గలుగు

టంతయున్ దేవిచే నట్టు లర్చితుఁడయి
యామె నిటకుఁ దెచ్చిన వినాయకుని కరుణ! 388

తనయుఁ డిటు తల్లి దండ్రులఁ దనియఁ జేసి
వారి యభినందనములకుఁ బాత్రుఁడయ్యెఁ
దాను వానికి స్వామి ప్రదక్షిణించె
నన్న నవ్వాని మహిమ నే మనఁగ వలయు॥ 389

గురు శిష్యులు ము క్తిదుఁడగు
కరి వదనుని గాంచి భ క్తిఁ గ్రై మోడ్పులతో
మరి మరియుఁ జుట్టి తిరుగుచు
గిరిజా ప్రియ కేళి మదుల గిరగిర తిరుగన్॥ 390

తమ యొడళులు తా మెఱుఁగక
యమలిన హృదయముల నమృత మబ్బిన యట్లై
సమమైన బ్రహ్మ మందున
సములై వైషమ్య మైన జగతిఁ జరింపన్॥ 391

కనుచున్న వారి కెల్లర
కనిపించిరి శివుఁడె యిట్టి యంగములం దెన్
మన కెల్లరకును మనుజత
ఘనతను దెలుపంగ నంచుఁ గదలిరి వెంటన్॥ 392

పాహి ప్రభో మాం పాహి విభో!
పాహి ప్రభో మాం పాహి విభో!

అర్చిత పుత్త్రా! అద్భుత చరితా!
పృక్త కళత్రా! త్రిభువన వినుతా! 1

పర్వతరూపా! పాప వినాశా!
ప్రశమిత తాపా! ప్రణత మహేశా! 2

కైలాసాద్భుత కల్పన కేళీ!
దర్శన ఖండిత కల్మష పాళీ! 3

స్మరణ వినాశిత మాయామోహా!
నిత్య నిరంజన నిఖిల జనోహా 4 393

పది యడుగులో పదునైదో
కదలెను మఱి యంతలోనె కదలక యుండెన్
కదలని గిరియును గదలుచు
నెదగల మృదుభావ మెఱిఁగి యించుక జరుగన్॥ 394

కొండకు దారికిన్ నడుమఁ గూర్మి సుతుం డటనుండె నిచ్చటన్
మెండగు పెద్దచెట్లుగల మేలివనం బొకడుండి యెవ్వరో
నిండు మనంబునన్ శివుని నిల్పగఁగోరిన యట్టులయ్యె నా
దండనె రమ్యగోపురము దర్శనమిచ్చెఁ దమం బడంచుచున్॥ 395

గోపుర మొక్కటేమి యటఁ గోవెల యున్నది తోటయడ్డమై
చూపుల కందలే దది విశుద్ధ మనస్కుఁ డెవండో మున్ను కా
శీపతి తోడి మేళనము లీలగడించిన వాఁడె యాను మా
ర్గా పతితోత్తమున్ గనక సాంబశివుం డెటు లేగఁజాలెడిన్॥ 396

అపుడెపుడో శివైక్య మహితార్థమునంది సమర్చితాత్మ లిం
గపుఁ దనువుండుటన్ గుడిని కట్టిన ధన్యుఁడితం డెవండొ ని
ద్దపు టెద స్వామినిన్ నిలిపెఁ దప్పక చూడవలెన్ మహాత్మునిన్
వపువులు తాల్చియిట్టి శివభావులఁ జూడక యుండుటొప్పునే? 397

మహిత మకారమన్ పదము, మానిత సర్వ మనోమహత్త్వము
ద్వహన మొనర్చి చూపునది, వచ్చినదిట్లు భవత్కృపన్, విభూ
ద్వహ! మనమెల్ల నీవయయి వర్తిలునట్లుగ దిద్దికొమ్ము, లే
దహ మిసుమంతయున్, మిగులుటన్నది నీదయ చంద్రశేఖరా! 398

మదగజ చర్మధారి! కుసుమప్రహరాంతక! శైలజాప్రియా!
సదయ! రిపుప్రహాణచణ శంకర శంభు హరాదినామ! త్వ

త్పద సరసీజ యుగ్మచర బంభరమీామది, సంభ్రమింప నీ,
కుదిత కృపాపరుండవయి యుంపుము, నీ పదమందె నిష్ఠమై॥ 399

మూఁడవు మెట్లనెక్కితిని ముక్తి వసించెడి మేలిసౌధ మం
దోడగనీక నీ కరము నూతగనిమ్మిఁక మూఁడుమెట్లు నీ
తోడుగ నెక్కి నీ వెసఁగు తోయమునందె వసింతుహాయిగా
వీడకు నీవె దిక్కయిన వీనిని గింకరు భక్తరక్షకా! 400

---

# చతుర్థ పదము

## శికార పదము

శివశివ యన్నమాటకును శీర్షము[ద్రిప్పి వశీవశీ! సదా
శివ! వశిగా మనంగనగు సిద్ధునొనర్పుము నన్నటంచు నే
నవశత వేడికొందు నను నర్భకుఁబట్టి పదంబు లన్నియున్
స్వవశములౌచు నిన్నుబడి సాగగనిమ్ము శివుండనయ్యెదన్॥ 1

నీమహనీయ మం[త్రమున నిల్చు శికారము సర్వజీవ పా
పామయ శిక్షణక్షమము నయ్యు శివంకర మాచుఁ[బోచు ని
న్నీమది నెల్ల వేళలను నింపు వహింపగఁ జేయుచుండి న
న్నోము మహార్ణమేయగు నహో శివదేవ! మహేశ! నీవెయా॥ 2

## నీలకంఠోపాఖ్యానము

ఇరుల మొత్తములైన కురులలో విరిసిన
చిక్కపూల్ తుటిమి యుద్రిక్తయగుచు
నాకాశ మను నీలి మావకుంఠనమును
నా నఖశిఖముగా నమరగప్పి
తదియ చంద్రుని నవ్వు వదనము నొకయింత
కనఁజేసి యంతలో మునుగఁజేసి
సంకేతకాలమ్ము చను నేమొ యనుభీతి
నడల తొందరతోడఁ దడబడుచును

మాటు మణగని యూరి సమ్మర్దమందె
మెగసిపడు నెడందను నిల్వరింపలేని
నీలనిశి చనె నీలకంఠాలయమ్ము
స్వామికొఱకు తమి[స్రాభిసారికయన! 3

స్వామియు యాత్రలో మునిఁగి, సంజనొనర్చెడి తాండవంబు జా
గ్గై, మునులెల్ల వేతురని యాత్రమునందెను; జాగు జాగె, యా
త్రామిష మానివేయుటనఁ దానె సహింపఁడు, నీలకంఠుఁడున్
స్వామిని వీడఁడించుకయు, స్వామికి నాతఁడనం బ్రియంబగున్॥ 4

అదియునుంగాక యచటఁ జిదంబరాన
వాయువగు తాను యాత్రా నిబద్ధుఁ డగుట
వేళమించియు నెట్లొ వేవేగ వచ్చు
నని తలంచుచు నాగె సభాధిపతియు॥ 5

అందును నిందు నొక్కపరి అద్భుతనాట్యముసాగె బ్రహ్మ తా
నందెను తాళ, ముత్సుకత నంది మృదంగమునూనె నంది, మి
న్నందిన వేడుకై హరియు నందికొనెన్ బటహంబు, లక్ష్మి ప
ట్టెం దగుభర్త్రికన్, గటి తటంగొని కచ్ఛపి వాణిమీటగన్॥ 6

పరమచిదంబరంబున సభాపతి తాండవమాడు చెప్పుడున్
జరుగును, గాళహస్తి నటు సల్పుట భక్తుఁడు నీలకంఠుఁడన్
నరవరుకోసమై, యతఁడసన్ శివుఁ డెంతటి మోదమందునో
గిరికిఁ బ్రదక్షిణం బరిగి కీడ్వడియున్ శ్రమమెంచ కాడెడిన్॥ 7

స్వామి సనాముఁ డాతఁడు విపశ్చితుఁ, డుత్తమ వేదవేత్తయౌ
సోమకు పుత్రుఁడై, తన విశుద్ధత వేత్తృతఁ దండ్రిమించి వి
శ్వామర సంస్తుతుండగుచు, నాత్మవిదుండయి, వారణాసిలో
సోమకళాధరున్ గొలిచి చొక్కియుఁ దృప్తివహింప కెంతకున్॥ 8

జనకుని యాజ్ఞకైకొని, ప్రశస్త పవిత్ర సమస్త తీర్థముల్
మునుకొని కొల్చి వత్తునని మోదముతోఁ బయనించి నారదుం
డనుపగ వచ్చి చేరెనిట, కన్నిటనియ్యది క్షేత్రరాజమా
ననియెడి నిశ్చయంబున, మహామతి యాతఁడు చిత్తశుద్ధితో॥ 9

తెలియరుగాక మానవులు, దీనిని మించిన క్షేత్రరాజ మీ
ములపయి లేదు, దేవతలు నిచ్చట ముక్తిగనన్ దపంబునన్

నిలిచిరనఁ బవిత్రతను నిస్తులమౌనను మాట సత్యమౌ
తెలిసినవారి కీ స్థలము దివ్యతఁగూర్చు నసంశయంబుగన్॥ 10

నారదుఁడు చెప్ప, దీని యనంతమహిమ
తెలిసి, తనకాశి వీడు సుధీవరుండు
వచ్చి యిచ్చోటి ఘనతఁ దా స్వయముగఁగనె,
నిచట కైలాసమున్నది యచట లేదు॥ 11

గంగ త్రిలోక పావనియె, గంగయనన్ నశియించు పాపముల్
గంగ పవిత్రతన్ గనియెకా శశిమౌళి తలన్ ధరించుటల్,
గంగను మున్గి వచ్చుటనఁగా నిఁక జన్మము లేకపోవుటా,
నంగజవైరి యామెకొఱకై జగదంబ మొఱంగు నెప్పుడున్॥ 12

సందియమిందు సుంతయు నెసంగదు, సత్యమె, యైన పుష్కరం
బందుట తక్కువాహినుల యట్లు సరాసరి పుష్కరానికే,
యిందలి స్వర్ణవాహినికి నీశ్వరు సత్కృప వర్ష వర్ష మౌ
నందముతోడ నౌనుగద నాకులు నౌనన మాఘపూర్ణిమన్॥ 13

అగమును, నిత్యపుష్కరము నందెడి స్వర్ణముఖి స్రవంతియున్
పొగిలి ప్రవేశమాత్రమున ముక్తినొసంగెడి క్షేత్రరాజమై
మిగులును కాళహస్తి పుడమింగల తక్కినవాని నన్నిటిన్;
నగజయు నాథుఁడున్ దమ గనన్ దగఁబ్రోతురు సర్వజీవులన్॥ 14

నీలకంఠ మనీషి యీ నెలవుగూర్చి
యిట్లు తలపోసి తానిందె యెట్టి తపము
చేసి యైనను బొంది సజీవముగను
నుండగా నెంచెఁగన నీశతాండవంబు॥ 15

స్వామి చిదంబరానఁ గడుసంబర మొప్పగ తాండవించు, నా
స్వామినిజూచి ముక్తిఁ గనఁ జాలిరి ధన్యులు మాను లెందరో
యీ మహినిల్చి వేడికొన, నిచ్చట నీశుఁడు తాండవార్భటిన్
గోమునఁజూపఁడా? కన నగున్ శివదేవుఁడు వత్సలుండగున్॥ 16

అనుకొని యిట్లు భక్తవరుఁడైన మహామతి నీలకంఠుఁ, డా
దినమె నదిన్ మునింగి చని దేవళమందున స్వామి నమ్మనుం
గని ముదమారఁ గొల్చి తన కాంక్షనుదీర్చు తపంబుసేయగా
ననువగు తా న దేది యని యంతయుఁ ద్రొక్కిచరించి పిమ్మటన్॥

వాయులింగంబు దక్షిణ భాగమందు
క్రోశమాత్రంబు దూరానఁ గొండనంటి
కన్ను విచ్చిన నదియు నాకసముచాల
సుందరంబుగఁ గనవచ్చు చోటునందు॥ 18

కామితార్థద శైవలింగంబు నిలిపి
తనకుఁ బ్రత్యేకముగను తీర్థమ్ముఁగూర్చి
కొని, యొనర్పగ సాగె నకుంఠదీక్ష
పరమ తపమును స్వామికై భక్తిగరిమ॥ 19

వాని తపమట్లె యైదు సంవత్సరములు
నిర్విరామమ్ముగా సాగె, నిఖిల జగము
సంతసంబంద, నతని కాంక్షయె విశిష్ట,
మెంతటి విశేషమో మఱి యంత సుఖము॥ 20

పండితుండైన కతన నతఁడు ముక్తి
నందగా నెంచి తపము చేయంగ లేదు,
అది సుసిద్ధమె, లభ్యమౌ నడుగకుండ,
ప్రార్థనంబేల దానికి వ్యర్థముగను॥ 21

నీలకంఠుడు స్వామియౌ నీలకంఠు
తాండవంబును చూడగాఁ దలఁచెఁ గనుల
నతఁ డెఱుంగును స్వామి చిదంబరాన
నాట్యమొనరించు నాట్య మున్నిద్రమతిని॥ 22

తాను కనవలె దాని ప్రత్యక్షముగను
స్వామియే చూపఁగల్గు నపార కరణ

నదియొ వలయును వాని కన్యంబుగాదు
ఇట్టి కోరిక కల్గునే యెరికైన॥ 23

కలిగిన దన్న వాని యెద గాఢకళామయ మన్నమాట, నీ
తలఁపుల బట్టి నీ యెడఁద తత్త్వము స్పష్టమె యౌచునుండు, స
త్కళలను తాండవంబనఁగ గానము నాట్యము సత్కవిత్వముఁ
గలిసి యగున్, మఱింతటను కాదును, గానము రెండురీతులౌ॥ 24

గాత్రముతోడ వాద్యము లోకండును రెండున? దక్షు లెందఱో
పాత్రతనంది, యేకమతి వచ్చి, పరస్పర సామరస్యమై,
ఛాత్రులుగాగ స్వామికడ సాగినగాని ఫలింపఁబోదు, వాఁ
డాత్రమునందె దానిఁగన, నన్నిట దక్షుఁడెయౌను తప్పకన్॥ 25

స్వామియె సర్వవిద్యలకు స్వామియునౌట యెఱింగి, యన్నిటన్
స్వామిపరీక్ష కాగిననె పల్గొనుటౌనని యెంచి, తాండవం
బౌమెయి స్వామియాడగ మహాముదమౌనని, యట్టి కోర్కితో
స్వామినిగొల్చె, వానియెద సర్వకళామయమౌట వింతయే! 26

సౌందర్యావధి యార్య, యీ ప్రకృతి తత్సౌందర్యమే చూపు, నా
నందంబందు కళావిదుండెపుడు దానన్ మేలిమింగూర్చి, త
త్సౌందర్యంబును మించు సోయగము హార్దాకాశ మందంది యా
నందించున్ వెలయించు సత్కళగ కానన్ వాఁడె మిన్నందెడిన్॥ 27

తల్లి దయావిశేషమునఁ దల్లినిమించు కళావిదుండె, యా
తల్లి విభుండుస్వామి, యరుదార మహోత్తమ దివ్యసత్కళా
వేల్లితుఁ డౌట సాజమగు, విద్యల కీశ్వరుఁడాతఁడే యగున్
దల్లిని గూడియాడు శివతాండవ మెంతటి గొప్పవిద్యయా॥ 28

ఇంతగభీర వాంఛయది, యెంతటి సుందరమౌ నెడందయో
యంతటి సుందరుండు నతఁడౌననియే తలపోయవచ్చుఁ, ద
త్స్వాంతము సుందరంబగుట తప్పదు, వాని తపస్సు పండుచో
స్వాంతము బట్టియే యదియు సుందరమౌచుఁ బొల్చెడిన్॥ 29

తొలియేఁడే యతఁడున్న యీ స్థలము పూఁదోటయ్యె, నెన్నెన్నొరం
గులు తావుల్ మరియాకృతుల్ గలిగి పెక్కుల్ బారులై, యెవ్వరో
తెలివిం జూపుచుఁ బెంచినా రనఁగఁదో తెంచెన్ మహానందమై
యొలసెంబో దివినుండి యీ భువికిఁ బుష్పోద్యాన మన్నట్లుగన్॥ 30

మలియే డయ్యది యట్టులే నిలువఁ దామై మొల్చె సర్వర్తు స
త్ఫల వృక్షమ్ములు పంట యీడెసఁగి దివ్యంబౌ రుచుల్ పేర్చుచున్
దోలి సౌందర్యము సుంతయున్ జెడక క్షుత్తున్ దీర్పఁగాఁ జూలు మేల్
ఫలసంతాన మొసంగుటన్ సకల పర్వంబయ్యె ముమ్మాటికిన్॥ 31

మూఁడవయేట నా వనము మోహనమయ్యె మఱొక్కరీతిఁ, బా
రాడ దొడంగెనందు విహగావళి, చిల్కలు గోరువంకలున్
బాడెడి కోయిలల్ మరియుఁ బాడుచు నాడు మయూరసంతతుల్;
వాడినపూవు నెండువిటపంబును రాలిన యాకు లేకయే॥ 32

నాలవ వత్సరాన నట నవ్యసరోవర మొందుపాల్చె, జం
బాల మొకింత యంట నటు ప్రక్కల రత్నమయంపు గట్టులున్,
వేలికగా దిగంగఁగడు తీర్చిన మెట్లును, లోన నందమౌ
పూలలతల్ విహంగములు, పుష్కలమైన జలంబు లొప్పగన్॥ 33

వానితపమేమొ వానిదే, పరిసరంబు
నిట్లు తీర్చిన దెవ్వరో యెఱుఁగరాదు
సిద్ధ సంకల్పుఁ డతఁడు వాంఛించె నంద
మే? యెటుల్ తగు! బాహ్య సంస్మృతియె లేదు॥ 34

కనులు తెఱవక యట్టి సంకల్పమొప్పి
చేసెననుటయుఁ దగదు, సంసిద్ధి యెట్లు
చిత్తమది తీఱి గారడీ చేయుచున్న
సిద్ధి కలుగునె యే తపశ్శీలికైన? 35

నీలకంఠుని యాశ్రమంబేలె నాఁడు
భువనభువనాల సౌందర్య మవనియందు

పేరుకొనియున్న చోటని పేరుపొందె
మనుజులెవ్వారు చేరంగ ననువుగాక॥ 36

నీలో ధ్యానమటన్న మాట చెవి కందెన్ లోక లోకాలఁ, ద
చ్ఛైలం బెక్కి కనంగ వచ్చుసొబగున్, సంతోషముం బొంది మి
న్నేలక్ వచ్చు, నొకింతగా దరిసి యేరేఁ లోనికిం బోవగా
లీలా మాత్రపు టూహ నందఁ, గదలన్ లే రెవ్వారైనన్ సరే! 37

కాన సురక్షితం బగుచుఁ గానన ముండెను, కంచె లేక యే
కానన జంతుజాలములు గాని జనంబులు గాని చేర రా
నీని మహత్వ మొప్పి, బహునీడజముల్ విహరించు పట్టుగా;
వానిని గూడ శాంతికిని భంగముగాఁ జరియింప నీయదున్॥ 38

ఎప్పుడు నెవ్వరో తుడిచి యెంతయు శుభ్రము చేయుచున్న య
ట్లొప్పెడు నట్టిచోట, తన యున్నతికిన్ దగు సత్త్వపంబుతో,
నప్పర మేష్ఠితుల్యుఁడగు నాతఁడు, నాలుగు వత్సరంబు లే
చొప్పున నేగెనో కనక, చోద్యముగాఁ దన నిష్ఠ నుండఁగన్॥ 39

అయిదవ వత్సరంబు మొదలైనది, యంతట మెల్ల మెల్లగా
నయిదును నాల్గు నెట్టెదురులైన త్రికోణము లొక్కదానిపై
మొయి మెయి నొక్కటెక్కినటు, మెట్లగు సుందర శాల యొండు తా
నయి ప్రభవించి తత్స్థలము నంతటి వెల్గఁ జేయుచున్నచో॥ 40

ఐదవ యేడు పూర్తి యయినంతట స్వామియుఁ దోఁచె నంబతో
మోదముతోఁ గనుల్ తెఱచి ముందట గాంచెను నీలకంఠుఁ డ
య్యాదిమ దంపతి ద్వయము నాతఁడు మ్రొక్కుట చొక్కుటంతి యే
యేదియు నోరు విప్పి యతఁడించుకయైన వచింప లేదహో॥ 41

స్వామి యెఱుంగఁడా యతని వాంఛను? తాండవమాడ నెంచి యే
భామిని తోడఁదోఁచి తమ స్వైర విహారము తాళఁజాలు శో
భామయశాల ముందుగనె ప్రాభవమందగఁ జేసి యందె తా
మామెయి తోఁచులై యిఁకను నాగునె ప్రేక్షకుఁ డొక్కఁ డాటచే॥

ఒక్కఁడు తక్కువే? రసికుఁ డొక్కఁడె చాలును, నీలకంఠుఁడా
తక్కువ? వానితో శివుని తాండవముం గనఁజాలు వాఁడెవం?
డక్కజమౌ మహారసికుఁ డాతఁడు. వానికి నైవిభుండె యీ
మక్కువ తోఁటయున్ నటన మంటపమున్ వెలయించి నాఁడహో!

తాను తపస్సుకై నిలుచు తా వదియే యనుకోను లేక యీ
మానియు, విశ్వకర్మ విసుమానముగా సృజియించె నింతయున్
జానగు నంచు స్వామియును, సాంద్ర ముదంబునఁ జూచుచుండగాఁ
దా నగజాత నవ్వికొనెఁ దన్మయతన్ మొగమింత వాంచుచున్॥

నీలకంఠుండు తపసులో నిలుచునాఁడె
విశ్వకర్మను బిలిచి తెల్పెను మనంబు
స్వామి యానతి విన్న పార్వతియుఁ దానె
నీలగానయి వాని కన్నియును జెప్పి॥ 45

ప్రతిదినంబును వాని వెంబడి చరించి
మించు సౌందర్య మొప్ప నిర్మింపఁజేసె
నతని తెలివికిఁ దగిన యట్లయిన నిట్టు
లింత సుమనోహరంబగు తెట్టు లొప్పు॥ 46

నీలో ద్యాన మటన్న పే రగుట కా నీలా మహాదేవి త
త్కాలంబందున విశ్వకర్మ కృతిఁ జక్కం దిద్దుటే హేతువా!
నీలా శబ్దము నీలకంఠమున నుండెన్ గాన నవ్వాని పే
రేలా కాదనరాదు సత్యమిదియే యెక్కాల మందైననున్॥ 47

నీల కంఠేశ్వరుండట నిలిచి నంత
శైలజయు వెంబడిం జని నీల యగుచుఁ
దెల్పె నీ రహస్యంబు నా దేవునకును;
స్వామి విస్మయమందు టబ్రంబె యిపుడు? 48

విస్మయ మందుటాగి యొక వీక్షణమున్ బ్రసరించె స్వామి, తా
సస్మిత యాచు శైలజయు స్వామిని జూచె, మరంతలోన నే

సుస్మిత వక్త్రుఁడౌచు సరసుండగు బ్రహ్మయుఁ దాళమూనె, దే
హస్మృతి నంది నందిగొనె హారి మృదంగము, వెంట విష్ణువున్ ॥ 49

పటహము దాల్చె, లక్ష్మియును భస్త్రిక చేతనుబట్టె వాణి చో
క్కటమగు కచ్ఛపిన్ గొనియె, గౌరియుఁ గాహళమూనె, నింద్రుఁ డె
ప్పటి వలె వేణు వందికొనె, బాణుఁడు వేయికరంబు లాడదోః
పటల విశిష్ట వాద్యమునుబట్టె శివాంఘ్రులు ఘల్లు ఘల్లునన్ ॥ 50

మెలమెల్లఁగ గదలాడి మోహనత సామాచీన్యమై యొప్ప, గ
జ్జెలు ఘల్లంచును గుండియన్ గదల, లక్ష్మిదేవి భస్త్రీ స్వనం
బొలయన్ మిన్నుల, ధిం ధిమార భటితో నుద్ధూత లూగించుచున్
గలయం దాండవమాడె స్వామి నటరా డ్గాంధర్వ ముప్పొంగఁగన్ ॥

చినజాలై బలువంది వాగగుచు, రాల్ చెట్లున్ నిరోధింపఁగా
స్వన మొప్పన్ బ్రసరించి, లోయబడి పెల్బన్ వాగు లెన్నెన్నియో
తనలోఁ జేరగఁ బెద్దవాహినిగ వార్ధారా బలాటోపమై
ఘన శైలద్వయి దూసి కొండొరసి మ్రోగన్ జొచ్చుబల్ సింధువై ॥

స్వన మేపారును తాండవారభటిలో, స్వానమ్ముతో వేగమున్
ఘనమై మార్దవమేది, చంక్రమణ మేఘధ్వాన గాంభీర్య సం
జని తౌద్ధత్య మహోర్భటుల్ విరియుచో సంస్తబ్ధ దేహాత్ములై
కనువార్ బొమ్మలె యౌచు నిల్చెదరు దృక్కాంతుల్
చిరత్నమ్ములై ॥

వేలా సమాస్ఫాల నాలోల కల్లోల
మాలా సమాభీల చాలితాంఘ్రు
ఉద్యత్ఫణోదగ్ర ఖద్యోత బింబాళి
వాతాశనోగ్ర బాహా తరస్వి
ఆశా సముత్పాట నాశా సముద్ద్యోతి
తాభీల జిహ్వోగ్ర సాహసుతాగ్ని
వ్యోమాఖిల వ్యాప్త భీమాంబుదాస్ఫోట
నోగ్ర విద్యుత్సమా నోరుదేహుఁ

జూచి చూడంగ మనసయ్యెఁ జూడలేక
మూయు కనులైన నా రూపు మాయబోక
లోన వెలుపలఁ గానరానైన వేళఁ
జాల పరిచయమౌట సుస్వాదు వైన॥ 54

నీలకంఠుండు స్వామి నా నీలకంఠుఁ
దాండ వోదగ్ర ఘర్మ మార్తాండ తేజు
నున్న తామిత శాంత నృత్యన్నటేశు
నప్రధృష్యాభి గమ్య నిత్యస్వభావు॥ 55

చూచుచుఁ జూచుచే తనకుఁ జొక్కయి చేతులు కాళ్ళు సాగుసై
యేచిన పారవశ్యమున నృత్యగురున్ బరికించు శిష్యుఁడై
చూచెడి తాండవంబు నటు చూచిన యట్టులె చూపు నేర్పుతో
నేచినఁ జంద్రశేఖరుఁడు హెచ్చిన మోదముతో నభిన్నుఁడై॥ 56

నీలకంఠ ద్వయంబు మంత్రించి నట్టు
లిర్వురొక రీతిఁ గాలమ్ము పర్వులెత్త
నెంతసేపట్టు లాడిరో యెఱుంగరాదు
వాద్యఘోషలు మాను టెవ్వరును గనరు॥ 57

అందఱు వానినే కనుచు నద్భుతమందుచుఁ జూడఁజూడ సం
స్పందము లేని బొమ్మలయి శాంతత నందిన వేళ నిర్వ్య రా
నంద నిమగ్నతన్ దెలిసి యంతట నీరవ మొప్ప తెప్ప లిం
పొందగ విప్పి చుట్టుగని యూరక యుండిరి తమ్మె చూచుచున్॥ 58

అట్టు నిలిచిన నీల కంఠాఖ్య జీవ
తేజ మెల్లరున్ గన శివతేజ మందుఁ
గలిసిపోయెను దద్దేహ మొలయు జ్వలన
మందుఁ గర్పూరమై హృతమయ్యె నపుడె॥ 59

ఆతఁ డర్చించు శివలింగ మందె యుండె
స్వామి దేవేరితోఁ జొచ్చి వానిపేర

నీలకంఠేశ్వరుండు నా నిలిచెఁ దల్లి
యందిన దపుడె యుచిత నీలాంబికాఖ్య! 60

స్వామియు నాలయంబు కడు చక్కఁగ నున్నను నిత్యపూజ లే
కీ మహి నెవ్వరో యెపుడొ యెందుకొ యిట్టులు చూచి పోవుటే
తా మయి పొందఁగల్గు సముదారత యన్నటులుండు నచ్చటే
సోముఁడు సూర్యుఁడున్ గొలుచుచుందురు తప్పక దారి నుండుటన్॥

స్వామి శివతాండవం బాడు శాలయేమి
యయ్యెనో నేఁడు క్రిందు మీఁదేమి లేదు
పుట్టు పని యాట వెంటనే గిట్టెనేమొ
నాటి యుద్యాన ముండునా నేటికయ్యొ! 62

ఉన్నస్వామికి దిక్కు లేకుండె నకట
నాటి యుద్యాన మున్న నీ నాఁడు దాని
నాటి యట్టులె యుంచు మానవులు లేరు
సర్వ మందరి దాట శాసనుఁడె లేఁడు! 63

వ్యక్తి పేరిట నున్న నేదైన నుండు
వాఁడు ప్రబలుండె యైన తప్పకయ యుండు
మంది దన్నావొ చాలును ముందుటగును
ప్రభుత మాత్రము సుప్రజా ప్రభుతయగును॥ 64

ఆలయమున్న చోటు బడి యల్లె నగంబును వెంటనంటి మా
లాలయ మున్న దిక్కునను నమ్ములు మూఁడగు నంత దూర మం
దోలి గుహాల యంబొకటి యున్నది క్రింద గుహాంతరంబునన్
మాలికగాఁ గనంబడును మానిత తాండవ కేళి దృశ్యముల్॥ 65

ఎగువను కొండపై నెసఁగు నింకొక మాలిక రెంటి మధ్యగా
దిగువను మిద్దెపై నిలిచి తీరిక పశ్చిమ దిక్కు చూచు నా
ల్మొగముల బమ్మ వేల్పు మును పూజ యొనర్చిన బ్రహ్మలింగ మా
మొగముల నాల్గిటన్ దనరు మోహన శిల్పము చూడ ముచ్చటౌ॥

పెద్దగుహా ముఖం బొకటి పేర్మి వహించుట చూచి యెవ్వఁడో
తద్దయు బుద్ధిశాలి లిఖితంబొనరించెను కొండ గోడపై
నిద్దపు బొమ్మ లెట్టెదుట నీటగు చోటు విశాల ముండుటై
యిద్దియ నీలకంఠు కొఱ కీశ్వరుఁడాడిన చోటనం జనెన్॥ 67

నటరాజాడిన చోటె యిద్దియను టన్యాయంబు బాహాంఘ్రు లు
త్కటమై యాడినఁ గొండయే విఱుగునో తత్స్వామికే ముప్పా యి
ర్కటమౌ నిట్టి యెడన్ మహానటుఁడు సర్వస్వామి తానేల సం
కటమై యాడు నతండు నిల్చినది హృత్కంజంబొ దివ్యంబొయౌ॥

అది యుంగాక ప్రభుండు తా నిచట నాట్యంబాడనేన్ వాఁడు తా
నది యెట్లుండి కొనెన్ గనుల్ కనవె లేవా నాట్య మవ్వాఁడు తా
నది చూచెన్ దన యున్న చోటుననె లోకాశ్చర్యమై స్వామితో
నెదియున్ భేదము లేనివాఁడుగ మహేశైకాత్ముఁడయ్యెంగదా! 69

కావున దేవుఁడాడినది కల్పితమైనది యాటతోడనే
తావున దృష్టి గోచరత తప్పిన, దయ్యది విశ్వకర్మ మే
ధావితఁ దల్లి సూచనలఁ దత్క్రియకై జనియించి యచ్చటే
భావుక లోకమే తెలియు పద్ధతి నున్నది చూడఁ గల్గునో॥ 70

ఆ యను భావమున్ దెలియు హ్లాదమయుల్ శివనాథ భక్తులా
హా యని యందెగా దెచట నైనను గాంతురు, నాట్యశాల యే
మాయె మహానటేశ నటనాదిక మంతయుఁ గాంతు, రుల్లమం
దూయెల లూగులాడి యొహాహాహో యను చందుదు రాత్మ
సౌఖ్యమున్॥

నీలకంఠేశు స్వామి మన్నించి నంత
చొక్కు వదలంగ లేదేమొ చుఱుకు తఱిగె
దేశికుండును శిష్యుఁడా దేవు తోడి
వారలే యాట వారి తత్పరత ప్రబలె॥ 72

ఎదురు సేవకే సాయమా యెనుగదన్న
యయ్యె నొకగంట నీలకంఠాలయమున

నాలయము వెన్క నున్న యీ యగము నంద
మింత రాతిరి నీ వెట్టు లెంచగలవు? 73

పగలు చూచిన స్వానుభవంబె యున్న
దానినే రాత్రి చూచు నందమ్ము వేఱు
ఎద్దియేగాని రాత్రి మోహింపఁజేయు
వెండి కొండైన నింకఁ జెప్పెడి దదేమి? 74

చూచు చూపున్నఁ జాలును పొగసిపోదు
వా ప్రదేశమ్ము నుండి నీ వసలు కదల
వందు నీ వుండ నీకోస మందఱుండె
యుండిపోవ లెఁగాన నట్లుండ కన్న! 75

స్వామి వెంబడి మనము పోవంగ వలయు
నడకయే సాగకున్న దా నత్త నడక
మే లనంగను స్వామి యూయేల లూగు
నంతరంగాన హాయి తా ననుభవించు॥ 76

అతని నంతగ నూగించు నట్టిచోటు
నాతఁడై యేల వీడు వృద్ధాదులుండి
రందుకై మెల్లగాఁ గదలాడుచుండె
నతని చూపెల్ల కొండపై నంటియుండె 77

నీవును చూడు మా గిరిని స్నిగ్ధ మనోహర శైలరాశి నీ
వే విధి నెంతువో యటు లహీన విధంబునఁగాన వచ్చు భా
వా వధి రమ్య దృశ్యముల వారిగఁ గాంతువు శిల్పి వర్యు లూ
హా వధి నెట్లు చేయగల రద్భుత మిట్లు నిబద్ధ బుద్ధులై॥ 78

వారలు తీర్చు బొమ్మలను వారి మనంబులె కానవచ్చు వి
స్తారము లయ్యు నయ్యవి మితంబులె యాగద యందుచేత నీ
వారయ గల్గు దందు కనులార గజంబునొ గోవునొ కోతిపిల్లనో
క్రూర మృగంబునో మరియు కోమలినో త్రిదశాళి మూర్తులో॥ 79

దేవుని సృష్టియైన గిరి దేవుని యందుఁ గాదు నీ మనం
బేవి కనంగ నెంచునో యవే కనఁజాలుదు వీవు, వేఁడు తా
నేవి కనంగ నెంచునో యవే కనఁజాలును, వ్యక్తు లెందఱై
దేవిన వారి వారి కవి తీఱి కనంబడు స్వామి యాటచే॥ 80

స్వామి యనన్ సమష్టి మనసా గద, కావున నెవ్వ రే
మేమి కనంగ నెంతు రవి యెల్ల కనందగు నట్లు చూపి, తా
నేమి యెఱుంగనట్లు, గిరి యే యన, నూరక యుండు, నీవు నీ
స్వామిని చూడ నెంచినను స్వామియె యా గిరి యద్భుతంబుగన్॥

మంత్ర జపం బొనర్చు మహిమాన్వితుఁ డౌదువో? కానవచ్చు నీ
మంత్రము నందు స్పష్టముగ, మంత్రగతాక్షర పంక్తి మాత్ర గీ
స్తంత్ర విధానఁ జూచి, చరితార్థత నందిన యట్లు తోఁప ని
స్తంత్రుఁడవై పరాత్పరుని ధ్యానమునందున మున్గిపోయెదున్॥ 82

స్వామి గిరిన్ గనం గలుగు వానిని బట్టి, మనంబు సర్వ మా
స్వామిని జూచునట్లుగనె సాధన చేయుము, నీ మనస్సు కీ
స్వామియె యద్దమా మహిమ సాగుట సంస్కృతముం బొనర్చుకో
నేమియుఁ గష్టముండదు, విహీన మనస్కత చూడ కస్యముల్॥ 83

కామిత మెద్దియో యదియ కాంతువు కావునఁ గామితార్థమున్
స్వామి నొనర్చి స్వామి కనవచ్చెదు దాఁక సచేమనంబు నా
స్వామి పయిన్ నిలంబడగఁ బట్టుము, పుట్టును గిట్టఁ జేయు, మిం
కేమియుఁ జేయగా వలదు, నీశ్వరుఁడై మనఁజాలు దంతటన్॥ 84

ఎంత కృపాన్వితుండు పరమేశ్వరుఁ, డిట్టి యుపాయ ముంచు నే
పంతము పూని నిన్ను దన వద్దకు రాఁదగఁ డంచు త్రోయువాఁ
డింతయు నైన! స్వామి యెపుడేనియు సర్వులు రాఁగఁ గోరు, నీ
వెంతకు స్వామిఁ గోరక మహీమతి నుండిన స్వామి తప్పొకో? 85

కావున సోదరా వినుము కాంక్ష యొనర్పుము స్వామి కోసమై
జీవితమున్ వృథా వ్యయము సేయకు, మిట్టి యుపాయ మున్న దీ

తావున, రమ్ము రమ్మిచటఁ దద్దయు భక్తిని నిల్చి నిత్యమున్
దేవుని కొండపై నిలిపి దృష్టిని ముక్తి గడింపు మిమ్ముగన్॥ 86

దేవుని స్థూలమూర్తి యిది దివ్యము, భూమము వట్టి కొండయన్
భావము సందఁబోకుము, కృపా భరితంబయి కొండుకొండ టం
చే వివరింతురో యువియె యిచ్చుచు నుండుటఁ గొండయయ్యె, నా
కావధి నెల్ల వారలకు నాశ్రయణీయము స్వామి కొండయై॥ 87

బండలు గాగ నుండియును బాపము లన్నిటిఁ జెండివైచు నీ
పండిన పుణ్య మంతయును ప్రాపయి వచ్చిన దీనిగొల్చు శై
వుండగు వీలు కల్గు, నది యుండియు భ్రష్టతఁ గొల్వవేని నీ
కండగ నెవ్వఁడుండు నిఁక? నంధుఁడవై యణగారి పోకుమీ 88

క్రింద వాలయి మీఁది కెక్కిన కొలంది
నిట్ట నిడుపైన కొండయే నీదు కావ్య
మో సదాశివ నీవె చేయూత నిచ్చి
చేది కోవలె దయను నీ చెంత కెపుడు॥ 89

అయ్యొ రెండా మడలు నిరాయాసముగను
మిగులు క్రోశంబు కడచుటే మిపుల కష్ట
మన్న యట్టులు తోఁచు దయాసముద్ర!
నీలకంఠుని మరులు నిన్వీడ లేదు॥ 90

వాయు లింగంబు దరియగా వచ్చు నిచట
ప్రతి పదంబున భక్తాళి ప్రబలి యుండి
కదల నీయరు నీవునుం గదల లేవు
వత్సలత చేత నెవ్వరిన్ వదల లేవు॥ 91

## నీలోపాఖ్యానము

విదిత మయ్యెను స్వామి నీ కదల కుంట
కయిన హేతువు నీల కంఠాలయాన
కంత మెఱుఁగని నీల యాఁకట్టె నిన్ను
ఆమె కథ కూడ నెన్నియే యరుగుద మిఁక॥ 92

మాళవదేశ జాతయగు మానిని నీల, పురాజనుస్సునన్
వాలిన పండితుండయిన పాఱుఁడే, పాప మొకండు వాని నీ
నీల నొనర్చెఁ, బాండితిని నిస్తుల యయ్యెను, బాల్యమందె నీ
లాలక నష్టభర్తృకత నన్నియు వీడి విరక్త చిత్తయై॥ 93

విషయ పరాఙ్ముఖత్వమున విశ్రుతయై భువియెల్లఁ జుట్టి యు
న్మిషిత మనోజ్ఞ బుద్ధియయి నిర్మల విద్య లవెన్నొ నేర్చి యా
మిషపయి మైథిలున్ దరిసి మెల్లగ నేర్చెను బ్రహ్మ విద్యయున్
విషమయి గర్వమేచినది పృథ్వి తనంతటి వారు లేరనన్॥ 94

చదువెంతైనను గర్వ మబ్బునెడ దోషజ్ఞత్వమే దోషమై
బ్రదుకున్ భ్రష్ట మొనర్చు నట్లగుట నా పాండిత్య విఖ్యాత దు
ర్మదయై విశ్రుత పండితోత్తములతో మానంబు పాటించి యె
ల్లిదమున్ జేయఁ దొడంగె నెల్లరను కేళింబోలె భ్రష్టాత్మయై॥ 95

పేరుస యోగ విద్యయయి పెద్ద జగత్తునఁ దానె యుంచు నూ
రూరు చరించి వాదముల నోటమియే పెరవారి కబ్బగా
పౌరుష మంత కంతకును పట్టగరాక ప్రచండమైన హుం
కార మొనర్చుచున్ జని యెకాయెకి తాకెను కౌంఠరవ్యునిన్॥ 96

ఆతఁడు రమ్యశీలి మహిమాన్వితుఁ డాత్త సమస్త విద్యుఁడున్
జేతము పక్వమై యెసఁగు సిద్ధుఁడు పాపముపండి కాక ని
ర్భీతిగ నీమెపోయి యెదురించునె యాతని? పోతుటిట్ట్రి వి
ఖ్యాత మృగేంద్రమున్ గెలువ గల్గునె చూడక ముందరెంతయై॥97

గెలుపొక మాదక ద్రవము గెల్చిన కొద్ది మరింత కింత పై
గెలుపుల కంగలార్చునటు కీళ్ళు సడల్చును క్రోలి క్రోలి వీఁ
డలయును వాఁడు నట్లె హతమారును హద్దు నెఱుంగ లేక వి
హ్వాలిత మనస్క సాహసిక యాత్రఁ గనుంగొనె కౌంఠరవ్యునిన్॥98

"నా సరి లేఁడు భూమిపయి నన్ను వివాదము నందు చెల్చుచో
దాసిగ సేవ చేసెదను దాసుఁడవై మను గెల్వలేని చోఁ

గే సరి వన్న యట్లు కడుకీర్తి వహించితి కొంతరవ్య! నా
తో సరితూగి నిల్చి యగుదో మతి కాదో యెఱుంగు'' మన్నచో॥

తనకయి తాను గాల్కొదపు తత్త్వము లేని యతండె యైన నైఁ
బని వడి వచ్చి దూఁకిన సవాలు నెదుర్కొనకుండు టెట్లు? వా
గిన దది వాగి యేగునని గీటున బుచ్చిన రెచ్చుగాని వ
చ్చిన పని గాక మార్గ్గమును చెందదుఁగో లఘుచిత్త వృత్తియై॥ 100

వినిన మునీంద్రుఁ డామె గని ''వృద్ధుఁడ నైతిని వాదయుద్ధ నై
పుణి గలవాఁడఁగాను, కనఁబోలిన విద్యను సార మెద్దియో
మనసున కంటఁజేయు కృషి మానక యింటనె యుందు నెప్పుడున్
గనఁజను మింక నేరి కడకైనను గామితమెల్ల తీరగన్॥ 101

అని తన యందె తానయిన నాతని వీడక యోగవిద్య ''నీ
ఘనతను గూర్చి వింటిని, జగంబుల మ్రోతలు మ్రోగుచుండె, గె
ల్పును గొని పోదమన్న మతిపుట్టి సరాసరి వచ్చి చేరితిన్
వెను జనుటెట్టు లూరకయె వృద్ధుఁడ వై వివదింప వన్నచో॥ 102

వినియెద తెల్పు మీ వెఱుఁగు విద్యను వీడను తెల్పకున్నచో
ననుటయు నాతఁ డప్పుడును నామెకు లొంగక ''నీ వనంత కీ
ర్తిని గనియున్న దానవు, సరింగన కుంటివి, నీకు నేను చె
ప్పను గలనే? ననున్ విడచి పండితులన్ గనఁబొమ్ము నీ'' వనన్॥ 103

పక పక నవ్వి యామె ''బలె! పల్కిన విజ్ఞత తేలిపోవుఁ, బ
ల్కక పరువంబు నిల్పుకొనఁ గట్టుదు, వెంత వివేక శాలివో
సుకపడు'' మన్న వీనులను చూడిన యట్లయి గర్వభంగ మం
దక చననీయరా దనుచుఁ ''దన్వి! యెఱుంగుదె బ్రహ్మమిా'' వనన్॥

''ఎఱుఁగక పోవుటేమి? నను హేళన చేసెదా? బ్రహ్మవేత్త్రినై
తిరిగెద నెల్ల దేశముల ధీనిధి! బ్రహ్మ మెఱుంగఁ జెప్పెదన్
పరమము నద్వయంబు తెలివై సుఖమై యునికెల్లయై యగో
చరమును స్వప్రకాశమును సర్వగతంబగు బ్రహ్మ'' మన్నచో॥ 105

"ఎఱుఁగం జెప్పితి వింకనుం దెలియకే నెట్లుందు? నీ వైతివే
దురహంకార విదూషితా తెలివి? యెందున్ బ్రహ్మ మొక్కండె యై
యెఱుఁగం గల్గితి నే ననం జనుట కింకేముండు బ్రహ్మన్యమై
దురుసై వచ్చితి పొమ్ము పొమ్మిఁక మరెందున్ నిల్వ కస్మత్ప్రతిన్॥

శిరమున్ వాల్చి జనాళి చూడని పిశాచీరూపమై యుర్వరన్
దిరుగం బొమ్ము పొకాలువుం" చతఁడు దానిన్ దిట్టె నమ్మాటతోఁ
గరముల్ మోడ్చి ప్రకంపితాంగి యయి "దుర్గర్వాన నిన్ దాఁకితిన్
కరుణా సింధు! దయాళువై మనుపవే కళ్యాణమున్ గూర్చవే! 107

చరణంబుల్ గొని యుంటి" నంచుఁ బదకంజాతబులన్ వానిన్
సురుగన్ గ్రోధము జాలిగొన్న యెదతో "శూన్యాఖిల స్వాంతవై
తిరుగంగాఁ దిరుగంగఁ జేరి కొనె దా ధీశాలి కుంభోద్భవున్
సురుగున్ శాపము తన్మహాత్త్వమున నిచ్చోఁ నిల్వఁబోకింకిటన్॥ 108

ఎవ్వరినిన్ గణింప కటు లెంత ప్రదేశము సంచరించితో
నెవ్వరు నిన్ను జూడకిఁక నేవముతోఁ దొలఁగంగ నంతటన్
మవ్వపు గర్వ మంతయును మాయగ దీనత సంచరించి నీ
జవ్వన మంతరించు తఱి సంయమి గాంతువు శ్రేయమందెదన్॥"

అని శాపాంతము తెల్పి పొమ్మనియె నిం కానీల యానీల ఖం
జన సంఘూప ఘనోగ్ర దర్శనత దేశంబెల్ల నెవ్వారు చూ
డను రాకుండఁ గనంబడన్ వెఱచి యుండంబోక పాఱంగ న
వ్విన ప్రాంతంబుల నేడ్చుచుం దిరిగి యల్పీభూత చేతస్కయై॥ 110

తుదకెట్లో చని కుంభజాశ్రమము మొద్దుంబోలె మేన్వాల్చి త
త్సదయున్ గానగ లేకపోయియు నెడందన్ గల్గు మార్పుం బడిన్
సొదఁగుందం గని క్రూరతన్ విడచి యచ్చోఁ నెన్నఁడేగాని మే
లొదవున్ నాకని యుండగా మునియె భానూల్లాస తేజస్కుఁడై॥

కని సర్వంబు నెఱింగి దానికి నెఱుంగన్ జెప్పె మార్గంబు నీ
వను మం చొక్క మనూత్తమంబు వినిచెన్ వ్యాముగ్ధ చేతస్కయై

యనెనో లేదో సమస్త తాపమును మాయంబయ్యెనో నాఁ ద
న్మనువున్ బల్మఱు నుచ్చరించి కనియెన్ మంత్రాధి దైవంబునున్॥

మోహాన భైరవుం డొకఁడు మ్రోల నిలంబడ "స్వామి స్వామి! నా
దేహము నీ సమక్షమున దివ్యత నందిన చందమాయె నే
దాహము పొందనీయక ముదావహ మయ్యెడి నీ వెవండవో
మోహన మూర్తి వీ యనద మ్రోల నిలంబడ నేల చెప్పవే?" 113

అనుచు వేడిన నా బేల యనద తనను
నెఱిఁగి జాలిని బొంది "నన్నెఱుఁగు మీవు
నీవు జపియించు మంత్రాధి దైవతముగ
నపర శివుఁడైన ఘటజన్ముఁ డనుమతించె॥ 114

ఈ స్థలంబును దివ్యమౌ హేతువున నె
యల్ప కాలాన నీకుఁ బ్రత్యక్షమైతి
నా మహా మహుఁడనిన పుణ్యస్థలంబు
నిన్ను జేర్చెద నీ వందు నియతి నిలిచి॥ 115

అచిర కాలానఁ బాప ప్రహాణ మంది
మిగులు దురితంబు నా శిక్ష నిగురఁ దుదకు
నతి దయాశాలి శ్రీకాళహస్తి పతియె
పరమ దయఁ జూప సంతరింపంగఁ గలవు॥" 116

అనుటయు నెట్టి సందియము నందక నీల యతండు ముందుగా
జన వెను వెంట తాఁ జనుచు జాలిమెయిన్ పథమందు వింతలన్
వినిచిన వించు శ్రద్ధమెయి వీనుల నొగ్గుచు పోయి పోయి తాఁ
గనియె దురంత తాపహర కామ జితాగము కై మొగుడ్చుచున్॥

అట్లు కొని తెచ్చి భైరవుం డామె చేత
దయను చేయించె గిరికిఁ బ్రదక్షిణంబు
మూఁడుమాఱులు స్వామికిన్ మ్రొక్కుఁ జేసె
నీ ప్రదేశంబు చూపి చేయించె భక్తి॥ 11[illegible]

భైరవుఁ డండగా త్రిదశవందితుఁడౌ కలశోద్భవుండు నిం
డారుదయన్ విధించిన శివార్చన మం దెన లేని భక్తితో
వారక నిల్చె నా తరుణి పంచ దశాబ్దము లేక దీక్షమై
భారవి తోఁపఁ జీకటులు పాఱెడి నట్లుగ పోయె పాపముల్॥ 119

పాపము లంతరింప విడువన్ బెను భారము తేలికైన హృ
త్తాపముతో "నెదో యొకటి దారుణ పాపము మీఁదు శిక్షచే
త్రోపు వడంగఁ జేసి నను బ్రోచెద మంటిరి కావ నెంచరే
పాపి" నటంచు వేఁడ "దఱి వచ్చిన చేయుదు" నంచుఁ బుచ్చినన్॥

విసువక నీలయున్ శివుని విస్మయ భక్తిని గొల్చుచుండగా
పశువరి యింప భైరవుఁ డపార దయన్ మరణించె నామె త
త్ప్రశమిత పాపదేహము ప్రపాతము నందె భవాంతికంబునన్
వశుఁడయి స్వామి తచ్ఛవము సజ్జను నిల్చి మణిం జపించుచో॥ 121

మణి యన నోంకారం బగు
మణికర్ణిక యనఁగ స్వామి మహనీయ దయన్
దనువుఁ దొరంగుటతో ద
క్షిణ కర్ణమున స్వయము మణి చెప్పుటయె యగున్॥ 122

చెప్పుట యేమి జీవు లది చెంది తరించుట యేమి నీల య
ట్లొప్పుగ స్వామితోఁ గలిసి యున్నది స్వర్ణది తత్ప్రదేశమున్
ముప్పుఁ దొలంచు స్వామికడ మోహనుఁడై మణికర్ణికేశుఁడున్
తప్పక నిల్చియుండు సముదార తపస్వుల కార్తి బాపుచున్॥ 123

ముక్తి పాథోధి కరుణా సముద్రుఁడైన
స్వామి యం దెంద ఱెందరో క్షేమముందు
రెవ్వ రెవ్వరో భేద మొకింత లేక
యబ్ధి చేరిన నదుల రూ పరయ లేము॥ 124

అభవుఁ డిచ్చుట నీల కంఠార్చితుండౌ
నీలచే నర్చితుండగు నీలకంఠుఁ

డో మెఱుంగము దూరమందున్న వీర
వార మెసఁగెడి యా యొరం దూరు నందు॥ 125

నీల కంఠార్చితుండున్న నెలవు కలదు
ఇచట నున్నట్టి స్వామి నీలేశ్వరుండె
యని వచింతురు స్థల పురాణ నిపుణులు మ
నకు నిజము తెలియ దను స్వామికిఁ దెలియద? 126

నిలిచి తలపోసె స్వామి యా నీలకంఠుఁ
దొలుతఁ బులకించి తర్వాతఁ దలఁచె నీల
దేశ కాలాలు తనువు బంధింపఁ గలవు
ఆత్మ నయ్యవి యేమి చేయంగఁ గలవు? 127

మే కొనఁడు స్వామి దూర సమీప భేద
మెట్టి భేదంబు నుండ దా యీశ్వరునకు
స్త్రీ పురుష భేద మనరాదు సిగ్గు సిగ్గు
ఏక మేవాద్వయం బ్రహ్మ మీశ్వరుండు॥ 128

గురు శిష్యులు స్వామిని బడి
పర శివు వర కృపను నీల పరమేశ్వరులో
స్థిర వాసమందు చరితము
స్మరియించిన వారలగుచు సారతర మతిన్॥ 129

నీలకంఠుని చరితము నీల చరిత
వెలుఁగు నీడలవంటి వైవిధ్య మున్నఁ
బాఱు నప్పటి భిన్న స్రవంతులగుచు
స్వామి చేరంగ నేక రసత్వ మందె॥ 130

భైరవుం డింత మోహనా కారుఁడగుట
యెందు నున్నదె నీలకై యిట్లు తోఁచెఁ
దాఁ బిశాచిగ నై భయద స్వరూప
యగుట నామెకుఁ దోఁచి నాఁ డట్ల తండు॥ 131

భయము పుట్టించు రవముచే భైరవుండు
గాగ నుండుచు సమ్మోహక స్వనాన
నామె యెడ జాలిఁ జూపె మహా మహుండు
భైరవాచల మయి యుండు పర్వతంబు॥ 132

తొలుత సిద్ధాలయంబు నాఁ దెలిసి శీఘ్ర
సిద్ధి కలిగించు చుండెడి శిఖరి యిద్ది
భైరవున కాశ్రయం బయి పాపముక్తి
నీలకిచ్చి నీలాచలం బేలకాదు? 133

ఈ యనుత్తర కైలాసమే యమేయ
మహిమ కలదైన భక్త సంబంధమున్న
పట్టు పట్టున కెంతెంతొ ప్రాభవంబు
ప్రబలు చుండును స్వామి యపార కరుణ! 134

## అగస్త్యాశ్రమము

దీని లో తట్టు పుణ్య ప్రదేశమందె
యిం కొకండగు కొమ్మునం దంకురించు
లింగ మర్చించి తల్లింగ లీనతా ప్ర
సిద్ధి పొందె నం ట య్యగస్త్యేశ్వరుండు॥ 135

అతని యాశ్రమ మున్నదా యంతరాన
దిగువ జ్ఞాన ప్రకాశ సుతీర్థ మొప్పు
స్వామియే స్వామియే యన్ ప్రశస్తిగన్న
సకల సురపూజ్య పుణ్య వాస స్థలంబు॥ 136

లోయలో నెంత సౌందర్యమో యెసంగు
పైకి వికృతంబుగా నుండు బండలుండు
కాయమందెన్ని యెన్ని వక్రతల వున్న
హృదయ మీశ్వర స్థానమై యెసఁగు నెపుడు॥ 137

ఈశ్వరుఁడుండు చోటుః సాగ సింతని యెవ్వరు చెప్పఁజాల రీ
విశ్వగత ప్రశస్త రస విస్మృతి యంతయు వాని సొత్తె యై

శాశ్వత సౌఖ్య మిచ్చుటది సత్యమె యాగద యట్టిచో సదా
శశ్వతిశాయి మోహనత స్నిగ్ధుఁ డెసంగెడి తా వదెట్టిదా॥ 138

సర్వగతుండు శర్వుఁడు రసప్రథితుండన లేనిచోటు లే
దుర్విని బర్వి యుండియు నహో యతఁడుల్లము నందె ప్రస్ఫుటా
ఖర్వ మహస్స్వరూపమున గాననగున్ మఱివాని యందమా
శర్వుఁ డెఱుంగఁ డాతని నిజస్థితి తెల్పెడి యద్దమున్నదే? 139

ఆతఁడు కన్ మఱుంగయిన యప్పటి యందమె యింతయైన వి
ద్యోతితుఁడైన నాటి సొగ సూహ యొనర్పగ సాధ్యమౌనె వి
ద్యోతితుఁడౌట యన్న యెడ నుండవు నీవతఁడౌదు వందుచేఁ
జేతము ముంచి తన్మయత చెందుటయే రసమంది కొంటయా॥ 140

చీకటి యెంత క్రమ్మినను చిత్ప్రభ సర్వ మెఱుంగఁజాలు నా
ప్రాకట యోగు లిర్వురును స్వామి సమానత లోయలో రసా
సేకము నందు చిన్మయుని శ్రీ వసతింగనఁబోయి యచ్చటన్
నాకము లెన్నియైన సరినాన్ మతిరాని ప్రభావమందుచున్॥ 141

కన్నులు మూసి తెన్ను నను గమ్యము చేర గలారు వారు లో
నున్న మహత్త్వమున్ దెలుపునో వెలి వస్తువు లన్ని చూపు సూ
రన్నయుఁ దక్కువైన శశి యగ్ని ఝుణప్రభ రిక్కలెన్ని యేన్
కన్నుల కందనట్టి దది కానగనే వలె లోన లోననే! 14

రసము స్వశబ్ద వాచ్య మనరానిది వీరము వీరమన్న నీ
రసమె యగున్ జెవిన్ జొరగరా నెద పొంగెడు నట్లొనర్చు శ
క్త్యసమ మహార్థ సంజనక హార్ద వచస్సులె కల్గఁ జేయు నా
దెస రసమై యందమగు నందము నంద మటన్న చాలదే! 14

ఏమని చెప్పగల్గు నెవఁడేనియుఁ జూచెడి చూపు గల్గి నే
నా మహనీయుఁడున్న యెడ నప్పటి యట్టుల నున్నచోటనే
యేమెయి నైన నుందునని యేగి మరెవ్వరు తోడులేక కా
కా మహనీయు లట్టి సములైన యెడన్ గనవచ్చునంతయున్॥ 14

అవనీ గతమ్మైన హారి చైతన్యమ్ము
హారితమై చూపు నయ్యవని జములు
నవని జన్మస్థాన మైన యంబువులనే
యావిష్కరించు నయ్యవని తలము
నంబువుల్ పుట్టినా యగ్ని యందున నన్న
నిగమోక్తి ప్రకటించు నిగనిగలును
వహ్ని సంభూతి కీ వాయువే హేతువా
నని తెల్పు వీచు దైవానిలములు

నిన్ని నా యందె యున్న వీ యెల్ల నేనె
నాకు నెల్లలు లేవని నగు నభంబు
నభమనన్ వట్టి యవకాశ మభయ మీదు
అభయ మగుదును నేనె సర్వాత్మననుచు॥ 145

అచట నయ్యాత్మనే కందు వన్ని యెడల
నందు భేదంబు లన్నియు నడఁగి పోవు
చూచు వాఁడును చూపును చూడఁబడెడి
దృశ్య ముండదు దృక్స్వ దీప్తిని వెలుంగ॥ 146

అర్ణవ మెల్ల నేకరస మయ్యు ననేక విచిత్ర వీచులై
ఘూర్ణన మొప్పి పై పొరల గోలగ నున్నను నీరమాత్రమా
నిర్ణయ మొప్పి లోఁతులను నిల్వఁగఁజాలిన శాంతమైన యే
శార్ణవ తత్త్వమే యగుట నచ్చట భేదమె యుండ దెన్నఁడున్॥

అందము భిన్నతన్ గలుగు నందువె? యర్ణవ మందు వీచు లా
చందమునన్ రసంబె యటుసాగి విభిన్నత కానవచ్చుటన్
పొందు మమంద సౌఖ్యమును పూర్ణమెదో యనుభూతినందియా
నందమె చిందులై యిటు లనంత విధంబులతోఁచు నం చెదన్॥ 148

ఈ పూల చెట్లల్లి యెచట నేనియు నుండు
నే ముని పత్ని సృజింప కున్న
నీ పావనోదకం బే పొలమ్మునను౦డు
కలశోద్భవుని కోర్కి ఫలము గాక

ఎన్నెన్ని ఫల జాతు లిచ్చోట నున్నవి
యతిథి పూజకు నాతఁ డందిసవగు
పచ్చ కర్పూరంపు పరిమళం బిచ్చోట
విరియునే స్వామి తాఁ దిరుగకున్న

నేఁడి కుంభోద్భవుఁడు తా నెందుఁ బోయె
కుఱుచ బాపఁడు నరకరాంగుష్ఠ మాత్ర
దేహుఁ డందురు స్వామికిం దీసిపోని
మహిమఁ గలవాఁడు కబురు పంపగఁ జనెనో? 149

వింధ్య గర్వమ్ము నణచిన వీరుఁడనని
కొండ కొమ్మున నవ్వుచున్ గూరుచుండె
నతని చిరునవ్వు కాంతులే వితత మగుచు
రాక రాకయె తమము నిరాకరించు॥ 150

అమ్మ లోపాముద్ర యంగు ళాంగుళమున
తన ప్రభావము చూపు స్థల మనంగ
కనరా దొకండైన ఘనశిల పదముద్ర
యయిన జగన్మాతృ మయమె యగును
పదముద్ర కాల ప్రభావానఁ గనరాదు
కాని తన్ముద్ర నిక్కముగ నుండె
నమ్మ నారాధించు నమ్మలలో మిన్న
యై యమ్మయై యున్న యమ్మ యామె

కుంభ సంభవు వరియించె సంభృతాంగి
యతఁడు శివుఁడైన నామె పార్వతియె యగును
వారు లేకున్న శివరామ పదము లెట్లు
శ్రుతము లయ్యెను జగతి భద్రత గనంగ॥ 151

అనుకొనుచున్ గురు శిష్యులు
తనువుల రోమాంచ మొప్పఁ దన్మయు లగుచున్

మును మున్యాశ్రమ దర్శన
మొనరిచి వెలువడిన రాఘవోదయు లగుచున్ ॥ 152

తమ భక్తి సీత యత్యం
తము శ్రద్ధఁ బరమ వివేకి తంబూని రిపూ
త్తమ దశకంఠుని మాయన్
దమ విడువక నితర జాగృతంబయి యుండన్ ॥ 153

గురు వెంతో శిష్యుఁడంతయి
యిరువురు నా స్వామి యట్లె యెఱుఁగుచు సర్వం
బెఱుకయె తా మన్న పగిది
పరమానందాబ్ధి యందె పరవశులగుచున్ ॥ 154

చనుచుండన్ గిరి దూరమై దరియుచున్ సర్వంబు నా దారి వెం
టనె కానంబడుచుండ దూరమగుచోటన్ స్వామి యాగంగఁ దా
మును నిల్వంబడి కొండ వంకఁ గన నా పుణ్య ప్రదేశంబు నన్
గనవుండన్ జనుకేమి పాడియని నిగ్గందీసినట్లైనచో ॥ 155

## భరద్వాజాశ్రమము - లోబావి

అనుకొని రంతరంగముల "నాగి శివుం డొనరించె మేలహో!
దినముఁ జరించు తా వనుచు దీనిఁ దలంపక పోవుటొప్పునే?
చనిన మహాపచారమయి శాంతిని గోల్పడి బాధనందుచున్
దినములు పుచ్చు దుర్గతిని దేలెడి వారము, కాచి తయ్యరో!" 156

అని వినయాన మ్రొక్కులిడు చట్టె గిరిన్ గనుచుండి, రప్రద
క్షిణమని, యా దెసన్ దరియఁ గ్లేశము పెల్లని యిప్పుడెన్నుచై
నను స్థలతత్త్వవేత్త మునినాథుఁడు రోమశుఁడార్ద్రచిత్తుఁడై
తనకు సమస్తమున్ దెలుప ధన్యత గాంచిన ముఖ్య శిష్యుఁడో ॥ 157

భారద్వాజ మహర్షి నిల్చిన సమీపంబైన ముఖ్యస్థలిన్
జేరంగా నిటనుండి పోవవలె, మెచ్చెన్ స్వామి యద్దాని, నీ
దారింబట్టి యొకమ్ము దూరమగు భూధ్రంబెక్కి దాటంగఁ గ
న్నారం గానగవచ్చు లోయనొకఁ డందంబెల్ల విప్పారఁగన్ ॥ 158

లో బావి యందు రిప్పుడు
లో బావి ప్రశస్త మగుచు లోలో మునుగం
గాఁ బాఱు పవిత్ర మతుల
బాబూ! రం డనుచుఁ బిలుచు పట్టయి యుంటన్॥ 159

మూల లింగమునకు మూఁడమ్మ వేటులో
యాత్రకై శ్రీకాళహస్తి చేరి
యీ పుణ్య దేశమ్ము నేని చూడని వారు
దురదృష్ట వంతు లౌదురు నిజమ్ము
కన్నప్ప కొండెక్కి కానరా నిద్దాని
దానికైనను తీఱదేని యట్టి
వారి నే మనవలెఁ బరువులు పరువులై
వత్తురు గుడిచుట్టి వత్తురంతె

స్వామి నైనను క్షణము నిల్వక యె చూచి
చూచు కన్నుంచి స్వామిని జూడఁబోక
స్వామి హృదయంబు వంటి యీ స్థలము చూడ
కైన నైనది యాత్ర యన్నంత నౌనె? 160

కొండ శివుఁడైన నాతని గుండెనున్న
శ్వాస కోశమ్ము లివియె లో బావి యొకటి
యింకనున్ లోనఁగల యగ స్త్యేశ మహియు;
యక్షగుహ యున్న చోటు దభ్రాంబె యగును॥ 161

స్వామియె శైల మన్న మృదుభావన యుండి నిజం బెఱుంగు వాం
ఛామతి యున్న చోఁ దెలియఁజాలుదు స్పందము నిశ్చయమ్ముగా
నీ మహి చేతనత్వ మింక నెందు గనందగుఁ? జేతనుండవై
స్వామి నెఱుంగు నూహయును జాలని చో నదియేమి జన్మమౌ॥ 162

భారద్వాజ మహర్షి భక్తుఁడయి సంప్రార్థింప నా రోమశుం
డీరా ప్రాగ మహత్త్వ మంతయు నెంతేఁ బ్రీతి నుల్లంబు పొం

గారం జెప్పగ విన్న యాసుమతి నే నై దీక్ష నెచ్చోట నిం
డారం బూనెదనంచు స్వామియె శరణ్యంబంచు భావించుచో॥ 163

శాంకరవాణి వించెనట "సాధు శిరోమణి! వాయులింగమై
శంకరుఁ డున్న చోటునకుఁ జాల సమీపమునందె శాశ్వతా
ఖ్యాంకిత దివ్యభూమి గిరియందున లోయగఁ గానవచ్చు ని
శ్శంకముగా నటన్ నిలుము శాశ్వత సౌఖ్యము లభ్యమయ్యెడిన్"

విని ముని తత్ప్రదేశమున వీనుల విన్నది సత్యమైనటుల్
కని జగదేకసుందర సుఖప్రద కానన రమ్యమైన లో
యను దన కాత్మ చెప్పిన రహస్సలి నిల్వ స్వయంభువై శివుం
డను పదమందె లింగమయి యద్భుతవైఖరి నిల్చి నంతటన్॥ 165

నిచ్చలు నా శివున్ బరమ నిశ్చల భక్తి సమర్చ చేయుచున్
బచ్చని చెట్టు చేమలను బచ్చగ నుండుచు స్వామి కోసమై
యిచ్చట తీర్థముండఁ దగునే యని యెంచుటతో విశాలమౌ
నిచ్చెరు వుద్భవించెనట యెల్లరు నచ్చెరు వంద నిమ్ముగన్॥ 166

ఆకాశలక్ష్మి తా నందమ్ము చూచికో
నవని యీ యద్దమ్ము నమరఁబట్టె
నవని హృత్పద్మ కందాంకురం బీ బాని
సర్వత్ర వ్యాపించె జలజ మయము
కంజాత మధువొల్కి కమ్మనౌ జలములు
గమగమ వలచు చక్కఁజము గొలుపు
చండాంశు రశ్మి నీ జలము లుడుకగ నీ
య మనురీతిఁ దరువు లావరించెఁ

గంటఁ బడినంత నింత సౌఖ్యం బొసంగుఁ
జేరి సేవింప స్వర్గమే చేరువగును
స్వర్గ మేలాగు మే లపవర్గమబ్బు
స్వామి వినిపించి కనిపించు స్థల మిదెల్ల! 167

బహు ఫల వృక్షముల్ విరిసి పక్వ ఫలంబుల నే శ్రమంబు ధూ
ర్వహుల వహింపనీయక తపఃఫల మన్నటు నిత్యమిచ్చుచో
నహహహ కొంత యేమియగు! నచ్చెరు వయ్యెడు వానికై మహా
మహులిట నుండిరా? మునుల మన్ననకై యవి యుద్భవించెనా?

అది యెట్లైనను నీ మహర్షిదగు మాహాత్మ్యంబు సర్వాతిగం
బెద కుల్లాసమె కాదహో యిచట నేదేన్ బొందగావచ్చు సా
ర దయానిర్భరుఁడా రఘూత్తముని రా రమ్మంచుఁ జేసెంగదా
మదు లీనాటికిఁ బొంగు విందులవి విస్మార్యంబులౌనే భువిన్ ॥ 169

రాముని దెత్తు నే ననిన రాఘవుఁ డా భరతుండ యోధ్యతో
నాముని యిచ్చు విందుల హృదంతర మెల్లఁ బ్రమోద మందగా
రాముఁడు వచ్చినట్లుగనె ప్రాణములన్ సుఖయించి యేగె శ్రీ
రాముఁడు రానె లేదపుడు రానిడియున్ భువికెంతొ మేలుగాన్ ॥ 170

రావణుఁ జంపి సీతఁ గొనిరాగ రఘూత్తము వెంటనంటి సు
గ్రీవ విభీషణాదిక వరేణ్య మహాకపి రాక్షసాగ్రణుల్
గ్రోవిని జిమ్ము ధారలనఁ గోట్ల కొలందిగఁ బుష్పకమ్ముపై
రా విడువంగ లేదు ముని రంజితులన్ బొనరించె నందఱన్ ॥ 171

రామునికోస మేగునని రాముఁడు వచ్చె నటంచుఁ జేసెగా
కీ ముని యెల్లవారలకు నిట్లొనరించునె యంచు నెంచ రా
దీ మునికెల్లవారు శివులే మఱి రాములె పోయిచూచి యం
దా మహితానుభావ మదియంది వచింపుము తన్మహత్త్వమున్ ॥ 172

ఐకాత్మ్యస్థితి నందఁజాలి నిజమాహాత్మ్యంబు లోకంబు లం
దేకాకారత వ్యాప్తినందియు నతండేకాకియై యుండె యెం
తో కాలంబు వసించెఁ దుట్టతుది కెందున్ స్వామినేచూచు వాఁ
డై కైంకర్య మడంగి స్వామియయి లింగావాసియై పోల్చెడిన్ ॥ 173

భారద్వాజాశ్రమ మని
పేరొందిన తావు నీవు పిలువు మతండున్

గారుణ్య మొప్పఁ బలుకును
ప్రారబ్ధము తీఱె నీకు బాసట యయినన్ ॥ 174

గురు శిష్యుల నా మునివరుఁ
డరుదుగ నాశీర్వదించి యాహ్లాదించెన్
దరము లవెన్నియొ దాటిన
తఱి నరుదెంచిరి నరులని తద్దయు ప్రేమన్ ॥ 175

పూర్వము స్వామి లోపలికిఁ బోయెడి వాఁడఁట నాటియోపికల్
సర్వము మాయమైనవి విశాల సమస్థలి మోసికొంచుఁబో
నిర్వది మంది కూడియు నదెంతో శ్రమంబగుచుండెఁ గొండపై
బర్వును మోసిపోఁగలుగు భారవహుల్ కనరారు నేఁడహో! 176

మానిసి తెల్విమీఱి విసుమానముగాఁ బ్రకృతిన్ జయించి వి
జ్ఞానముగాంచి నాఁడనుచుఁ జాటెడి వారలు పూర్వపూర్వ స
మ్మానిత మానవాళికిని మానవులే యను నేటి వారికిన్
గానగనౌ విభేదమును గాంచి యెఱుంగగ నౌను సత్యమున్ ॥ 177

సత్త్వముజాఱె నేటి నరజాతి స్వశక్తిని గోలుపోయి ధీ
మత్త్వము పేరిటన్ బ్రకృతి మాయకు లోబడి నీరస స్థితిన్
చిత్త్వ మెఱుంగకున్నది వశీకృత చిత్తమె యైనచో మహా
సత్త్వమునంది యేపనికి సాధన మేదన దల్ప సత్త్వమై॥ 178

ఉపకరణాళిపై నొరుగు టొప్పనె యార్జిత సత్త్వుఁడెంతకున్
జపలుఁడు కాక దైవమిడు సాధనకోటి నధోక్షజుండయై
రిపుమతి నెంచి గెల్చి తన క్రీడకునై యపుడప్డు వాడు స
త్త్వపుఁ గలిమిన్ స్వతంత్రుఁడయి పాలనసేయు సమస్త విశ్వమున్॥

ప్రకృతిని గల్గు పంచకము వంచకమౌనని వాని కెన్నడున్
జకితుఁడు గాక తానెయయి సర్వ మెఱుంగును; వాని నూని త
త్ప్రకృతికి లొంగి సాధన పరంపరలన్ శతకోటి పెంచి వానిచేఁ
జకిత మనస్కుఁడై గెలువఁ జాలితి నంచనఁ డీ ప్రపంచమున్ ॥180

పరముఁ డొసంగు ముట్టులయొ ప్రాకృతముల్ పరివంచకంబులున్
బరిమిత శక్తి కల్గినవి వానిని బట్టియె మానవుండు నే
డరయక యేవి యేవొ తన యద్భుత బుద్ధి నమర్చి వానితోఁ
బరముఁడ నైతి నీ ప్రకృతిఁ బట్టితి నంచను నెంత వెఱ్ఱియో! 181

తెలివిని నూత్నసాధనము తీర్చిన వాఁడెవఁడైనగాని యా
తెలివిని సాధనమ్ము విడి దేనినిగాని యెఱుంగఁ గల్గునే?
తెలివియు నిన్ను ముంచు ప్రకృతిన్ లవలేశముగాగ దానితో
గెలిచెద వెట్టులీ ప్రకృతి? కేళియొకో ప్రకృతిం జయించుటల్॥ 182

కనిపెట్టంగల జ్ఞానియన్న జనుఁ డే కార్యమ్ముపై నంతగా
తన విజ్ఞానమె వ్యర్థమన్నటులె యాధారం పడన్ దాని తాఁ
గొని యూరేగెడి బుద్ధిహీనునకు దిక్కుం గల్గునే నేటి వా
రనలంబున్ ఫలబుద్ధిఁ జేరెడి పతంగాళిన్ విడంబింతురా॥ 183

పనిముట్టుంగొని ప్రాకులాడు నతఁ డల్పప్రాణి యెవ్వాఁడు నే
కనిపెట్టంగలఁ గ్రొత్తవాని నని మూర్ఖత్వంబుతో వానిపై
తన భారం బిడునో యతం డరయగాఁ దద్దాస దాసుండు వాఁ
డెన యెట్లౌను సహేంద్రియంబుగ మనస్సే గెల్చు ప్రాజ్ఞునికిన్॥ 184

చదువులు సంతకాల కగు చాకిరి విద్యలు లేకపోయినన్
బ్రదుకుటకైన వృత్తులనుబట్టి జితేంద్రియతన్ వశిత్వ మె
ప్పిదమయి యండ నిల్వ నవి పిండి నొనర్చిరి కొండనైన నె
ట్టిదియును హేలగా జరిపి తీవిగ నుండిరి స్వాత్మశక్తితో॥ 185

స్వామిని మోసి కొండపయి సాగుట సాగుట లేదు నేఁడు తా
స్వామిగదా యతం డరుగఁ జాలఁడ? చాలును మూర్తిలేని వాఁ
డీ మహితుండు మానవత యెత్తును బట్టి చరించుమూర్తి ము
న్నే మొ యతిక్రమించె మల యిప్పుడు చాలఁడు వీఁడు జాఱుడై॥

భక్తినుపాసనా మహిమ బట్టి ప్రతీకము శక్తిమంతమౌ
శక్తి సమస్తమాత్మకు వశంబయి యుండు వశిష్ఠముఖ్యులా

ప్రాప్తను లాత్మశక్తిని పరాత్పరు లాటకుఁ బూన్చి గెల్చి ర
ర్వాప్తను లేమొ దానినిటు వ్యర్థ మొనర్తురు ముట్లకోసమై॥ 187

శక్తిగలట్టి యా గురువు భ్రాతృఁడు కాయము లిందె యుండగా
నుక్త మహత్త్వమంతయును నొప్పగ లోనికిఁబోయి చూచి సం
సక్తులు గాక స్వాత్మరతి సాగిరి స్వామిని వెంబడించుచున్
భక్తుల మానసంబులనె స్వామి వసించు యథార్థమెన్న చో॥ 188

అంతయు లోన నున్నదని స్వాత్మరతుండగు వాఁడు సృష్టి య
త్యంతము లొంగి సేవకత నంది భజింపఁగ స్వామియై పరా
క్రాంతి సహింపఁ డించుకయుఁగాక వెలింగలదెల్ల గెల్తు నే
నంతయు నన్నఁ దత్ప్రకృతి యాటకు నాడెడి కీలుబొమ్మయౌ॥ 189

నవనవ మేధతో గెలిచినాము పురాతను లట్లు దేవి! యం
చవమతి మ్రొక్కుచున్ మనెడి సార విహీనుల మేముకాము క్రిం
దవు మఱి మీఁదవున్ మిగుల నంతయు గెల్చెదమంచు వీగు వా
రవుర! మనుష్యరూపముల నాడెడి బొమ్మలె యమ్మచేతిలో॥ 190

హే జగదీశ్వరి! రాజరాజేశ్వరి!
కావుము తల్లీ! నీవె సమస్తము!

శివుఁడు సమర్థుఁడు సృష్టి నొనర్పగ
శివతను వీవై చెందిన యప్పుడు 1

శివు సహచరివై చెలగెద వీవును
శివునకు నీకును చెందదు భేదము 2

మానవ మేధా మహిమము నీవే
మాయా మోహిత మానవుఁ డీవే 3

మానసమే వెనుమాయైనప్పుడు
మనసున మాయను గెల్చు టదెట్లగు? 4

# కుమారాలయము

జీవుల బుద్ధిరూపమున శ్రీసతియుండి పురాకృతంబు లే
వేవియొ వానిబట్టి బహు వృత్తుల నీని చరింపఁజేసి కా
లావధి నందఁజేయుచు మహాత్ముఁ డెవండు తదీయ భక్తుఁడై
దేవి! ననుంగృపం గనుము దింపకు మిందనఁగాచు చుండెడిన్॥ 192

తల్లికి లొంగి మ్రొక్కుటకు ధైర్యము కావలె ధీరయామె యీ
యెల్ల జగంబు భోగమున కెట్టెదుటన్ బడియుండ శక్తులై
యొల్లక నిగ్రహం బెసఁగి యుల్లములన్ జగదంబ నెంచుచున్
వెల్లిత బంధముల్ తెగనువ్రేయుట కెంతటి ధైర్య మొప్పనో॥ 193

ధీరా! ధీర సమర్చితా! యనుచు నా దేవిన్ సమర్చించు ట
ట్లారా యూరక యెట్లు సాధ్యమగు? నోరారన్ నుతింపంగఁ జె
న్నారన్ మ్రొక్కఁగఁ బూర్వపుణ్యములు తోడై వచ్చినంగాని యె
వ్వారున్ శక్తులు కారనన్ జననికై వారల్ సుసాధంబొకో! 194

దేవిన్ గొల్చెడి ధీరభక్తులకుఁ దద్దేవీకృతంబైన మా
యా వష్టంభ మదెల్ల మాయమగు, మోహంబెల్ల విధ్వంసమౌ
శ్రీవిద్యామహనీయ దర్శనమునన్ శ్రేయంబు సంప్రాప్తమౌ
దేవీమూర్తిగ నర్చితుండగుచు నార్తింబొందఁ డెక్కాలమున్॥ 195

మరల గిరీంద్ర సర్పమది మార్గము చెంతకుఁ జేరినట్లు వం
కరగ మలంగుఁ, గొంత సుసుఖంబగు క్షేత్రము మధ్యనుండుఁ, ద
ద్గిరిపయి చిన్ని దేవళము దివ్యముగాఁ గనిపించుఁ, జెంత నొం
టరిగ మహీజ మొండెసఁగుటన్ గిరి నెక్కు తలంపుఁ గల్గెడిన్॥196

కలఁడు మయూరవాహనుఁడు కాంచనులోయను ప్రాఙ్ముఖుండుగా
దలఁపులఁ దీర్చు దైవమును, దల్లికి ముద్దుల బిడ్డఁడౌను, శ
క్తుల ఖని, దేవ సేనకును గూర్చు ప్రియుండయి తండ్రివోలె భ
క్తుల యెడ నార్ద్రచిత్తుఁడగుఁ గొండపయిన్ వసియించె నేలొకో!

ఇరువురు నిర్వురే గిరిజ కెంతయు మోదముగూర్చుచుండు ర
బ్బురమగు సోదరుల్, తొలుతఁబుట్టు వినాయకుఁ డెట్టులైనఁ బో

టరి యయియర్ బ్రశాంతముగఁ దత్త్వ నిరూపక మందహాస సుం
దర వదనార విందుఁడయి తానె గురుం డనిపించు చుండెడిన్॥ 198

శరవణ సంభవుం డయిన స్వామి కుమారత పీడఁ డెప్పుడున్
గరివదనుండు మిన్న యనగా సహియింపని చిత్తవృత్తియై
త్వరపడుచుండుగాని మితిదాటఁడు తండ్రియు నన్న తుల్యులా
గురువులు గాగ మేల్మి బ్రదుకున్ జగమంతకుఁ జూపుచుండెడిన్॥ 199

గణపతి క్రోశదూరమునఁగాలు కదల్పగఁ జాలనట్లు కొం
డనుగను చల్లి యుండుటను డాసి మఱింతగ దగ్గరుండి త
ల్లిని దనతండ్రిఁ గొల్తమని లీలఁగ వచ్చిన స్వామి ముద్దు బి
డ్డని దన చంక కెత్తినటు టక్కున దోఁచు మనఃప్రియంబుగన్॥ 200

ఎత్తున గుట్టపై నిలుచు నీ మహనీయుని గొల్చి లోకమం
దెత్తగు తావులం బడసి యెంతయు గౌరవమందువారు లో
కోత్తరు లెందఱో గలరు ప్రోద్య దనుగ్రహబుద్ధి స్వామి నీ
కెత్తఱి నేమి కావలయునేని స్మరింపుము చాలు పొందనా॥ 201

ఇచ్చట కొండ చీలినది యీ గిరి నున్న సమస్త తీర్థముల్
హెచ్చిన వర్ష వేళల సమీకృతమై ప్రవహించు వాగు వా
విచ్చిన యట్టులో నిటను వెల్వడి వచ్చి సువర్ణ వాహినిన్
మెచ్చి సమైక్యమై నది క మేయ మహత్త్వము గూర్చు నిచ్చలున్॥

ఉత్తర వాహినీ గరిమ నూర్జిత మైన సువర్ణ వారితో
నుత్తర దక్షిణమ్ములకు నుర్విని బర్విన వెండికొండ రా
మెత్తని మధ్య భూమిపయి మెల్లగ సాగెడి స్వామి వెంట నీ
వుత్తమ భక్తి నేగుటన నూరక వచ్చెడి భాగ్యమానొకో! 203

ఎన్ని జనుస్సులన్ దపము లెన్ని యొనర్చి గడించికొంటి వో
యెన్నగ వచ్చునే యిహము నేలను మోక్ష పథానువర్తివై
యున్నను సిద్ధమే యదియు నోయి పరాత్పర! మాకు నేల యా
యున్నతిఁ గూర్ప వం చడుగు చుందురు తక్కిన చోట్ల భూప్రజల్॥

పురి వసియించియున్ జనకపోవుట యన్న మతేమి చెప్పనో
పరి పరి జీవులున్నటులె వారును, మానవ జన్మ గౌరవం
బెఱుఁగని వారలో మెఱఁగి యేచిన తీవ్ర నిరోధ హేతువై
యరుగగ లేక స్వామి యిటులాయనె యంచుఁ దపించువారలో॥

కలి వలనన్ జనంబులకుఁ గల్గు సహాయము లేకపోదు నేఁ
డలయక దాటి పోఁగలుగు టట్టిదె పూర్వము శైలతీర్థముల్
బలిసి స్రవించు నప్పు డిటు వాహిని దాటుట తేలికానె త్రి
ప్పల బడి తెప్పయం దిడుచుఁ బోటరులై తరియింపఁజేయనో॥ 206

## బ్రహ్మగుడి-నటరాజ రంగస్థలము

కలి మహిమన్ జలంబులటు కాలువ సాగవు తేలికయ్యె నా
వలి మలకూఁతు పెన్మిటికి భక్తగణంబుల కెల్ల వారికిన్
కలిగిన భాగ్య మిట్టిదని కాలు కదల్చిన వెంటఁ గొండపై
తెలియగవచ్చు దేవళము తెల్పుచు బ్రహ్మ సుధీ విశేషమున్॥ 207

నిత్య సమర్చితుండగుట నిల్చి వెలింగెడు దీప కాంతులన్
సత్యముగాఁ దలంపనగు సత్యజగత్తున భాగ మొంపు తా
క్షిత్యవతార మందెనని సృష్టి నొనర్చెడి దేనె యంచు సా
మత్యముతో మరెవ్వరును మాటన లేని స్థలంబు నెన్నఁబో॥ 208

గిరియు మృగేంద్ర మై తెఱచెఁ గిల్బిషమున్ హరియింపవాయినాన్
విరివియు నెత్తు కల్గు నొక విస్మయ హేతు గుహాముఖంబు త
చ్ఛిరమునఁ జిన్మయుండగుచు శీర్షములన్ నలు దిక్కు లెంచుచు
ప్పరమున లింగమై తనరు బ్రహ్మ సమర్చిత పార్వతీశుఁడున్ః 209

మూల స్వామిని బట్టి పశ్చిమ ముఖంబుల్ సర్వలింగంబు లీ
నేలన్, నిల్పిన భక్తు పేరు గనియే నిల్చున్ దదాచార మె
క్కాలం బందయి బ్రహ్మలింగ మనగా ఖ్యాతిన్ వహించెన్ శివుం
డే లింగంబయి నాల్గుమోములయి యుండెన్ బంచమం బూర్ధ్వమై॥

నాలుగు మోము లుండుటను నాలుగు మోముల వేల్పు గొల్చుటన్
బాలురు నజ్ఞులున్ గుడిని బ్రహ్మదిగాఁ దలపోసి రంతె కా

కాలయకారు మాటఁబడి యా యజు కెన్నఁడు పూజ లేదు దే
వాలయ మిద్ది పద్మజ సమర్చితుఁడై వెలుగొందు స్వామిదా॥ 211

సద్యోజాతము పశ్చిమంబగు, నుదంచ ద్వామ దేవంబు తా
నుద్యోతంబయి చూచునుత్తరము, ప్రాగున్ముఖ్యమై కొండ వై
పుద్యోతించు నఘోర నామకము, విద్యుత్తేజమై దక్షిణం
బుద్యోతించుచు మించుఁ దత్పురుష, మయ్యూర్ధ్వంబె యీశానమా॥

తొలుదొల్తన్ శ్రుతిశైవ వక్త్రముల సద్యోజాత వక్త్రమ్మనే
తెలుపం బూనుట దాని కన్నిటను నాధిక్యంబు చేకూరె నిం
దులకై కాదొకో పశ్చిమాభిముఖ మెందున్ శ్రేష్ఠమన్మాట పె
ద్దలు పేర్కొందురు కాళహస్తిపురి క్షేత్రస్వామి యట్లయ్యెడిన్॥

అజుఁడెంచెన్ శివుఁ గొల్వఁగా నభవుఁడీ యత్యద్భుతాకారుఁడై
నిజశక్తిన్ బ్రభవించె శిల్పమనుటెంతే వింత సాజమ్మనన్
నిజ మానంతియె సూక్ష్మ సూక్ష్మతర సుస్నిగ్ధాస్య రేఖా విభా
గజ వైదగ్ధ్యము చూపి రాతి నెటు చెక్కంగల్గు నే శిల్పియేన్॥ 214

చుట్టు ప్రదక్షిణించి చనుచున్ బ్రతి మోమును జూడవచ్చు, నా
కట్టెడి మోము నెట్టెదుట కట్టియ మేనయి నిల్వవచ్చు, నా
కట్టు నొకొక్క మోము నటె, కావునఁ జుట్టగలేవు, స్థాణువౌ
నట్టి శివుండు, నీవు నటు లాడుము, జీవుఁడనన్ శివుండెయా॥ 215

మానవ నిర్మితం బొకటి మాన్య జగద్గురులున్న గోపురం
బానిగిరీంద్రమున్ గలుపు నాలయమందునఁ జూడవచ్చు న
ద్దానికి దీని కంతరము దైవిక మెంత ఘనంబొ తెల్పు వి
జ్ఞాన మదేల లో మునిఁగి జ్ఞానివి కమ్ము జగమ్మె నీదియా॥ 216

సృష్టి నొనర్చు బ్రహ్మయును సిద్ధికినై శివుఁగొల్చి యిచ్చటన్
బుష్టి గడించె నట్టి తమ పుట్టువెఱుంగని వార లిర్వురున్
వృష్టిగ బ్రహ్మ తా నజుఁడు త్ర్యంబకుఁడౌ నభవుండు వారి సం
సృష్టి ఫలం బదేమి యిట సేవ్యత నందుట కేమి హేతువో? 217

సృష్టి లయంబు నందవలె సేవ్యత నంది శివుండు బ్రహ్మకున్
సృష్టిని మోహమున్ దొలఁచె శ్రీశివదేవుఁ డొకండె మోహమున్
వ్యష్టిగ నందనట్టి ఘనుఁడౌను లయంబది స్వీయధర్మమై
వ్యష్టిగ నున్న బ్రహ్మ శివభావమునంది విముక్తుఁ డయ్యెడిన్॥ 218

శివుని లయాన నాశనము చెందదు సృష్టి వినాశమున్నచో
శివుఁ డెటులౌను వ్యక్తతను చెందిన వన్నియు సంహృతంబులై
శివ తను వొందులే యగును సృష్టి విలాసము చూప నెంచుచో
భవుఁడయి సంహృతంబులను వ్యక్తము చేయు శివుండె సర్వమా॥

శివుఁడు మృడుండు భక్తులకు సేగి యొకింతయు సోకనీక మే
లవు సుఖమిచ్చు వాఁడగుట నట్లు మృడుండని పిల్తురాతనిన్
శివుఁడిడు సౌఖ్య మెట్టిదగు శ్రేష్ఠము శ్రేయము బొంది బందిలో
దవిలిన భోగజాత మది దాహకమౌ నది కాదు కాదయా! 220

హరి హర బ్రహ్మలను వార లాది శక్తి
చేతి పనిముట్లు విశ్వ ప్రసిద్ధులైన
శ్రీయు గిరిజయు వాణియు శ్రీస్వరూప
లే త్రిగుణ కలితలును కల్పితలు నిజము! 221

ఉన్న దా శక్తి యా శక్తి యుండు నెప్పు
డాత్మయందే యదియె పరమాత్మ శివుఁడు
అగును జగమెల్ల శివమయం బగును నిజము
శివుఁ డహమ్మని యుండులే శివతఁ గనుట॥ 222

వ్యవహారం బిది యెల్ల వాఙ్మయము హృత్పద్మస్థితిన్ దల్లి మూఁ
డవు శక్తుల్ వెలయించి త్రైపురుష విఖ్యాతిన్ సమార్జించుకో
నవకాశంబు నొసంగు నా జననియే యంతః పరావాక్కు త
ద్భవమై సర్వజగంబు భానమగు నా వాక్కే యుపాస్యంబగున్॥

ఛందంబన్న సరస్వతీ హయము హంసంబౌను స్వస్వామియై
ఛందోహంసి వశమ్ముగా త్రిజగతీ సౌందర్య సందర్శనా
నందంబంద విహారమేగు కవి రాజవ్యాహతుండై శతా

నందున్ మించి యనంత సంఖ్యల మహానందంబు తా నంది మి
న్నందున్ జాతికి నట్టిదేయగు రసానందంబు నందించెడున్॥ 224

గురు శిష్యులు కవు లగుదురొ?
సరస్వతి హాయము తలంచి సన్నుతి పరులై
దొరలించిరి పలుకుల నిటు?
గురుమతి! నా కొక్క మాటకున్ బదులిడుమా? 225

కవి యనఁగా నెవఁ డందువు?
కవి యనఁ గవి యనఁగఁ గవియె కావ్యం బల్లున్
కవి యనఁగ బ్రహ్మవేత్తయె
కవియై విహరించు జీవ కారుణ్యమునన్॥ 226

గురు శిష్యులు కవులే! శం
కరులను బోలుదురు వారిఁ గవులని యెంచన్
వర కవితా గురు వైభవ
మెఱుఁగని వా రొల్ల కేది యేదియొ యనుచున్॥ 227

కవిత మనుష్య మాత్రుల జగద్వ్యవహారము నెంచి వారికై
మివుల తపించి జీవితము మేలును చెడ్డ నెదల్ ద్రవింపఁగా
చెవులకు నింపుగా శ్రమము చెందగ నీక వచింపగా వలెన్
మివుల నదేమి యైన నగు మేలి కవిత్వము కా దనందగున్॥ 228

అని నిక్కచ్చిగ నందురు
ఘన మనుతె సుకవు లగుదురు కవితయు యోగం
బని యెంచు మనకు వారికిఁ
బని లేని వివాద మేల? వారును గవులే! 229

గురు శిష్యులు బ్రహ్మను విడి
పరికించిరి కొంత యెత్తు బండపయి నెవ్వండో
మురువుగఁ జెక్కిన బొమ్మల
వరుసను తచ్ఛిల్పి వరుని భావము గనుచున్॥ 230

మిద్దె దిగి కొండ నోర్విడు
పెద్ద గుహను గల్గు చిత్ర వీథిని గనుచున్
దద్దయు ముదమందిరి మది
నొద్దికఁ జని స్వామి వెంట నుండిరి సముల్లై ॥ 231

నటరాజ రంగ మనుటది
యెటు తగు నను ప్రశ్న పుట్టి యెప్పుడొ పోయెన్
పటువగు శిల్పము లున్నవి
నటరాజును జూడవచ్చు నలువురి నడుమన్ ॥ 232

ఇక్కడ నుండి యూరనుటయే సబ బయ్యెడిఁ గొన్ని యిండు లిర్
ప్రక్కలఁ గానవచ్చుఁ గుడి ప్రక్కను గొండ య దే విధాన నా
ప్రక్కను స్వర్ణవాహినియు బాటచనున్ నడి చాయఁబోను పోన్
నొక్కిన యట్టులై యెడమునున్ గనిపింపదు బాట మాత్రమా॥ 233

## మణికర్ణేశ్వరాలయము

కొండకు బాటకున్ నడుమఁ గోటి విశేషము లున్న వందుచే
నిండిన కండ యన్నటులె నిర్భరుఁడై చనుస్వామి బ్రహ్మక
ట్లుండగ నున్న దైవతము హాయిగ నాగె మరంతలోన నే
కొండ దరిన్ మణొక్క చిఱుకోవెల యున్నది పల్కరించుచున్॥

అదియే మణి కర్ణేశ్వర
సదనము మృతులైన భక్తజనుల కుడిచెవిన్
సదయుఁడు మణి వినిపించును
దదనుగ్రహ మంది ముక్తి తద్దయు నందన్ ॥ 235

శూలాగ్ర శిక్ష నందిన
నీలను మును భైరవుండు నియతి విసరగా
రాలెను దత్కాయాంబిట
వాలిన కృప వినిచె స్వామి ప్రణవ మణి చెవిన్। 236

దీనికి సూటిగ నదిలోఁ
గానగ నగు సిద్ధిద మణికర్ణిక గంగం

బోనిది దక్షిణ కాశీ
స్థానం బిది యని యనెవరు స్థల తత్త్వజ్ఞుల్॥ 237

కొండ నంటియ గుడియుండుఁ గూత వేటు
దూరమైనను కాదు విచార హేతు
వీ శివుండును నేఁడు పేర్మాసి పోయె
పూజ గోల్పోయి నాడు సంపూర్ణముగను! 238

పురిగల బావులన్నియును పూర్తిగ నెండిన యప్పు డీ గుడిన్
వఱలిన బావినీరె పురి వారలకెల్లర కార్తి మాన్పె నం
చెఱిఁగిన వారు చెప్పెదరె? యిప్పటి కట్టి జలంబు లున్నవే
గిరిదరి, నేల వాడుకొనకే త్యజియించిరొ చెప్పలే మహో! 239

ఈశకృపా విశేషమది యిప్పటికిన్ మును పట్టె యున్న నా
యీశుఁడె కాని వాఁడయిన యీ కలి కాల జనాళి, మోహితం
బై సిలుగుల్ భరించుటకునైన సుసిద్ధమె కాని యీశ్వరున్
వాసిగఁ గొల్వ నెంచదు కృపామయ! ఈశ్వర! నీవె కావనా॥ 240

బావి జలమ్ము లుండుటయె వాలిన నీ కృప కెల్ల సాక్ష్యమై
కోవెలతోడ నీవు బడుగుంబలె నెవ్వరు చూడకుండు దు
ర్భావము నందగా వలసె; వచ్చునొ రాదొ పునస్సమర్చనా
భావ వివేక మీ ప్రజకు బంధుర విశ్వజన ప్రతారకా! 241

నీ వే మైనను మా కదేల ప్రభువా నీ బావి యున్నీరు మా
కా వశ్యమ్ము లటంచు వాని వఱకే యత్యంతమున్ శ్రద్ధతో
దైవమ్మున్ నిను లెక్కసేయని మహాధన్యాత్ము లౌచుందు రిం
తై విశ్వాస మొకింతయున్ గనము దేవా మమ్ము రక్షింతువే! 242

చాల పురాతనాలయము చాలిక లున్నవి చిన్నదయ్యు మే
ల్మేలి విశిష్ట శిల్పము నమేయ కళా విభవంబు నొప్పి యుం
డాల నికేతనం బమరి న్యాయమె నీ విటు విస్మృతుండవై
మూలల పడుండు దుర్గతిని పొందుట చూపవయా ప్రతాపమున్॥ 243

మణికర్ణేశుఁడ వీవని
మణికంఠేశుండ వనుచు మాహాత్మ్యం బీ
యణుయుగమున గల దంచును
జనతతి యనుకొనును గాని జరుగవు పూజల్॥ 244

శివ కేశవ సంతానం
బవు నా యయ్యప్ప కంఠ మందున మణితో
శివుఁడ వని నిన్ను గొల్వఁగ
నవమణి కంఠేశ బిరుదనామము కలిగెన్॥ 245

ఇటు లెంతురు నిను గొందఱు
పటు వగు వాదంబె గాని వాకిట తా న
క్కటఁ బడియున్న దదియె ప్ర
స్ఫుటమై యా నీల మణిని పొందుట తెలుపున్॥ 246

కావున మణి కర్ణుఁడవే
దైవమవై నిత్యపూజ దైవాఱఁగ ను
మ్మే వేళఁ గాచుచుండుము
నీవే నీ పూజ మరల నెలకొలుపు మయా! 247

ఉచ్ఛిష్టుండవు నీవు నిన్ మిగులు నే యుర్విన్ మరేదైన, నీ
వుచ్ఛిష్టంబు కిరాతుఁ డిచ్చినను దేవో యంచు తిన్నావు, ని
న్నుచ్ఛిష్టుండని యన్న హోమమునఁ గంఠోక్తిన్ శ్రుతుల్ పల్కు మా
కుచ్ఛిష్టంబన దూరమైతివి కదే వ్యోమాలకా! వంచకా! 248

నీ వైశిష్ట్యము నీవె తెల్పికొని మన్నింపం దగున్ స్వామి! తా
దేవుండైనను గొప్ప యేమి కల దర్థిన్ దానె యత్నించి యే
నైవేద్యమ్ము గడించుకోవలె నెట్లైనన్ బిచ్చ మేవారికిన్
నీవై పెట్టుచుఁ బ్రోత్సహింపఁ దగ దెందే నీచ సంచారముల్॥ 249

బిచ్చము నీకు వృత్తి యయి వీరును వారు శ్రమించి కూర్చుచోఁ
బొచ్చెము లేక పొట్టకయి పోడిమి వీడి కరంబు చాచి నే

వచ్చితి బిచ్చ మిం డనగ హాయి యెటుల్ విడునయ్య పూర్వపుం
బిచ్చి దినాలు కావు విభు! బిచ్చము పుట్టదయా మహేశ్వరా! 250

నీకే బిచ్చము పుట్టఁబోని దినముల్ నీ వాది భిక్షుండ, వా
లోకేశుం డటులుండె నేను నటులే లోలత్వముం బొంద కే
కాకిన్ గావున బిచ్చమెత్తి కొనియే కల్యాణముల్ గాంచెదన్
నా కింకే మనరాదు పో యెవరు పంతంబూన బంధం బగున్॥ 251

మనుజుల తెల్వి నేఁడు విసుమానముగా నభివృద్ధి చెందె నీ
వనునది యొక్కటైన నిను నర్థము చేసికొనంగఁబోక వీ
రెనుబది నాల్గు లక్షల నహీనుల మే మె యటంచు నీవునున్
బనియెది లేక భిక్షుకుఁడవై బ్రదుకన్ దగదందు రయ్యరో! 252

సర్వజ్ఞుండవు నీ కుపాయమును దెల్పన్ జాలు టె ట్లౌను మా
పర్వున్ నిల్పితి వెట్టులో బ్రదుకు లీడ్వం జాలి నా మింతకున్
శర్వా! నిత్యుఁడవై యిఁ కెట్లు దినముల్ సాగింతువో చూచికో
యుర్విన్ బుట్టిన వారు గిట్టుటయు మేలో హా! కనం జాలితే! 253

వచ్చెదమని గురుశిష్యులు
బిచ్చమె ప్రియమైన శివుని వెంబడి జనగా
వచ్చిరి జనములఁ గలిసిరి
మెచ్చిన మది స్వామి వారి మే కొని చూడన్॥ 254

## శ్రీపాదములు - సూర్య చంద్ర పుష్కరిణులు

స్వామీ! స్వామి! దయానిధీ! యవియె దాపై వచ్చె మాకోసమై
శ్రీ మన్మోహన దివ్యకాంతి విలస చ్ఛృంగార పల్యంకికా
వైమానీక సమర్చనార్హములు శ్రీపాదంబులే వచ్చె మ
మ్మోమున్ నిత్యము వీధియందయిన నిత్యున్ నిన్ను చూపించుచున్॥

పడమటి గోపురంబు గని వాలిన భక్తి నమస్కరించుచున్
కడిని గలట్టి రావికడ గుంపుగ మూగిన నాగమూర్తులం
దొడయని వోలె నున్న పదయుగ్మము నుల్లము నందిమిడ్చికో
గడగెద వేని నీ బ్రదుకుఁ గాంచు కృతార్థత చూడు వాసినిన్॥ 256

రాతి పయిన్ ధురంధరుఁడు రాఁగ పదాంకము లంటెనట్లుగా
చేత నులిన్ ధరించి యొక శిల్పి రచించెను పాదముద్ర లా
చేతకు మెచ్చి యీ యవి వశి ప్రవరుండగు స్వామివంద్యు వ
న్నా! తగునే జనంబు నిటు నమ్మఁ డటంచును నీవు కోరుటల్॥ 257

ఏమీ యేమని యంటి వీశ్వరుఁడు తా నీ మాత్రమున్ జేయలేఁ
డో మౌనీంద్రుల డెందముల్ తనకు నెంతో హాయిగూర్పంగ సం
దే మోజై చిరముండి యుండి యెపుడో యీ దివ్యదేశంబు నే
త్రామోదమ్ముగ చూచిపోదమని రారా నట్లు కారాదొకో! 258

అడుగులు లేనివాఁడె యయి హత్తును ముద్ర లెడంద లందు, నె
త్తడచును లోక కంటకుల కట్టె రసాతల మంటిపోవ, నా
తఁడు తన కాలి గుర్తులను తాను శిలాతల మందు చూప లే
కడుగులు చెక్కి పెట్టుమని యాతని నీతని వేడికో వలెన్॥ 259

అభవుఁడు నామరూప రహితాత్ముఁడు నిర్గుణుఁడంచు స్వామినిన్
సభయతఁ దెల్ప నాతనిని చాలని వాఁడని యెంచుచుంటివే?
అభము శుభమ్ము నీ వెఱుఁగ వయ్య మహాత్మ! శివుండు సర్వదు
ర్లభుఁడయి యెల్ల వారలకుఁ బ్రాణపదంబగు వాయులింగమా॥ 260

ఉంటివి యూపిరాడెడి నహో తలఁపుల్ ప్రభవించుచుండె లేఁ
డంట యెటుల్ ప్రభూత్తముఁడె యంతయుఁ దానయి యున్నవాఁడు తా
నుంటయె సర్వముండు ననుచుంటకు మూలముగాఁగఁ దోఁచె నా
కంటను దెల్వియై పడసి తంటఁ బ్రియంబయి యుండు నాతఁడే! 261

కుడి రావి చెట్టు నీడల
నడుగులఁ గని మ్రొక్కికొంటివా? యిఁక నందే
గుడి యున్న దొకటి చిన్నది
పడి పడి మ్రొక్కంగనైన భాస్కరుఁ డుండెన్॥ 262

ప్రక్కనె యుట్టిపోని తనుపారు జలంబుల బావి యున్న దెం
తక్కజ మిట్టి గండ శిల యైన గిరీంద్రము చెంత స్వామి కిం

పెక్కుగ ముఖ్యమైన జలమిచ్చెడి బావి యుగాలనుండి న
ల్దిక్కులవారిఁ బిల్చి తన తీర్థము నిచ్చి తరింపఁజేయునా? 263

మనుజులు త్రవ్వఁ జాలరివి మానక వచ్చి శిలాప్రదేశమం
దను వని త్రవ్వు మూర్ఖు లెవరైనను నుందురె క్రీ జలంబు లెం
దును లభియించు క్షేత్రమునఁ దోయము లిట్టివి దేవఖాతముల్
పనివడి వారె యిట్టి ఘనవైభవముల్ ప్రకటింతు రన్నరో! 264

ఇద్దియె సూర్య పుష్కరిణి యిచ్చటనే రవి దక్షయజ్ఞ మం
దద్దిన పాప పంకిలము సాంతముగాఁ దపియించె స్వామి నాఁ
డద్దిర తోఁచి సూర్య జలమాని మనోహర మంచు నెంచి నే
నెద్దిన మేని యీ జలములే కొన్నె దంచు ననుగ్రహించెఁబో॥ 265

ఇప్పటి కట్టులే శివున కీ జలమే యభిషేక వారి యా
ముప్పొల మూపు గంగ యెటు మోహనమో యిది యట్లె బావియై
యొప్పుట స్నానమాడుటకు నొప్పరు దర్శన పాన సాధ్యమై
కప్పిన చీఁకటుల్ విరియగా వెలిగించును హార్ద గేహముల్॥ 266

ఎడమను చంద్రపుష్కరిణి యేర్పడి యున్నది చంద్రుఁ డిచ్చటన్
బడసెను సిద్ధి దైవకృపఁ బాపము లన్నియుఁ బాసిపోవ నేఁ
డుడు పతియై యుమాపతి మహోన్నత శీర్ష మునందు వెల్గుచున్
దడయక సర్వలోకములఁ దన్పుచు నుండును చల్ల వెన్నెలన్॥ 267

ఇదియును తగ్గిపోనిదియె యిందలి నీరమె నేఁడు శోభన
ప్రదముగ దేవళాన జనరంజకమై చెలువాఱుచున్న; దీ
మృదిత మలార్చనీయ పరమేశ్వరుఁడీ రవిచంద్ర సేవచే
ముదిత మనస్కుఁడౌచు జగముల్ దనియింపగఁజేయు నెప్పుడున్॥

రవి శశులిట శివదేవుని
ప్రవిమల హృదయములఁ గొలిచి భవ్యత నందన్
సువిదితమయ్యెఁ బ్రభాసము
భువిదీని సమాన ముండఁ బోదను ఖ్యాతిన్॥ 269

ఇచ్చటి చంద్రతీర్థమున కెక్కెదుటన్ నదిలో నమోఘమై
హెచ్చిన భక్తి గ్రుంకులిడు నెల్లర కార్తిని బాపి నిత్య సం
పచ్చయ మిచ్చు తీర్థము తపస్వి జన ప్రియమున్న దద్ది ము
న్నచ్చపు భక్తు లెందఱొ యార్తి నడంచినవై వెలింగెడున్॥ 270

గోపుర మున్న దెత్తయిన గుట్టపయిన్ గుడితోనె యందుచే
నా పయి కెక్కి చూడు మిటు హారి మనోహర వారిపూర మిం
దోపి ప్రశాంతమై కదలు నుత్తర వాహినిగా గిరీశ బా
హా పరి రంభణాశ నని నట్లుగ తోఁచును చూచినాఁడవే॥ 271

చూచుటతోడనే మివుల శుద్ధుఁడ వౌదువు భక్తి నప్రమత్తన్
ప్రాచికిఁ జూచి స్వామి గిరిపై కనులుంచి నమస్కరించి యిం
పైచను స్వర్ణవాహినిని హాయిగ స్నానము నాచరింపఁగా
వేచను సర్వపాపములు వేచును ముక్తియు నీదు రాకకై॥ 272

# మృత్యుంజయ వృత్తాంతము

నదియం దెన్నొ విశిష్ట తీర్థములు తీర్ణస్థాణు భక్తుల్ శుభా
స్పద బుద్ధిన్ గయికొన్న వున్నయవి నిల్వం బూను దెచ్చోట న
య్యదియే యొక్కొకఁడందె సిద్ధినని యొయ్యం జెప్ప నవ్వానిలో
నిది యొక్కండు మృకండు సూను దయతో నిందాడి ముక్తింగనెన్॥

ఆ రాజుత్తముఁ డా యమధ్వజ సుతుండై ధర్మియై కర్మియై
ధీరుండై సుగుణాల వాలుఁడయి యెంతేనిష్ఠ ధర్మప్రజా
వారం బేలుచునుండి దుర్విధినిరైక్వప్రోక్త శాపాహతిన్
ఘోరంబా పతనంబు నంది తుద కెగ్గుం ద్రోచె నిచ్చోటనే! 274

అంతటి పుణ్యశీలి యటు లౌటయ వింత సుమంతచాలు శృం
గాంతము నంటి యచ్చ టిసుమంతగ జాఱిన నేమియౌను బా
హ్యాంతర మందెవం డొ కరుణాన్వితుఁ డంది వహింప కున్నచో
సుంతయు నెమ్మి చొప్పడదు సున్నము లోనికి శీల మట్టిదౌ॥ 275

జీవిత మెల్ల కాలమును చీమ చిటుక్కన కాచికొంచు నీ
వే విధినైన శీలమున కెట్టి విఘాతము తాకనీయ రా

దావనితుండవై త్రుటియ యైనను నేమరి తేనిచాలు దో
షావహమై సమస్తమును వ్యర్థమె యైచను చూచుచుండగన్॥ 276

రంజన మాచరించుటను రాజన సార్థక మైనరాజు మృ
త్యుంజయుఁడెంత యోగ్యుఁడయియొక్క యనాదృతి శప్తుఁడయ్యె; నా
యంజనశైల మెంత యనునట్టిది యాతని గాఢనిద్ర కో
ల్పెం జనుఁ డొక్కనాటి పగలే పెను నిద్దుర నాఁడె రైక్వుఁడున్॥

వచ్చి మహర్షి రాడ్గృహము వాకిట నిల్చె నృపుండొ మంత్రులో
వచ్చి సమాదరింతురని వాలెను ప్రొద్దు, నెవండు రాఁడు, నే
మచ్చెరు వా మహర్షి కపు డాకలి మండెఁ, బురస్థు నొక్కనిన్
బుచ్చెను నిద్రలేపి తన భుక్తి గురించిన మాట చెప్పఁగా॥ 278

రాజును నిద్ర లేపుటన రాత మృగేంద్రము రెచ్చగొట్టులే
తేజు గలాఁడు మానియును దేలిక యా పని వాఁడు మెల్ల వ్యా
ఘ్రాజినధారి చూపు పడరాని ప్రదేశము చేరి యెట్టులో
రాజ గృహంబు దాపు జని ప్రాణము లుండునొ యుండవంచు నే! 279

గంటకు పైన వేచి యిఁక కంఠము విప్పక తప్పనట్లులై
కంటికి నిండుగా నిదురగాంచు నృపాలు చెవిన్ జలంబులన్
దుంటరి పోసినట్లు బిరుదుల్ పఠియింపఁగ వాని వించు నే
గెంటుఁడు వీని గొంతు విడి గీయన నీయక మాయుఁడంచనెన్॥

వాఁడేమి చేయఁగలఁ డిఁకఁ
గీడై నృపశిక్షఁ బడసి కిమ్మన కుండెన్
మోడై వాకిట నిలిచిన
వాఁడా మునిరాజు రాజు వచ్చుట కనకన్॥ 281

అతిథియు వచ్చి వాకిట గృహస్థుని మాటకు వేచి యుండ స్వా
గతమొ మఱొక్కటో తెలుపగా నొక్కఁడేసియు రాఁడు, చెప్పఁ జ
న్నతఁడును గానరాఁడు, మరియాదకుఁ బాత్రుఁడు కాఁడితండు నే
ఎతగఁ జనన్ జ్యుతుండగుచు వీథుల వెంటఁ జరించు గావుతన్॥ 282

అనియెను బ్రోవఁబోమె నతఁడాకలితో నిఁక నేమి యున్న దా
ముని నుడి వెంట శత్రువుల ముట్టడి, రాజపలాయనంబు, త
ప్పనివయి బంధు మిత్రులకుఁ బాసి యొకండును కానలందు నే
దనిన నదే భుజించి మనుష్యై తిరుగాడెఁ బదాఱు వర్షముల్॥ 283

గిరి శిఖరంబు నుండి తలక్రిందయి దొర్లెడు వానిఁ జావ నీ
కరసి వహించు వాఁడనగ నాతని పుణ్యము తోడురాగ శాం
తరజు, మృకండుసూను, కరుణామయుఁ, బావనసహ్య కన్యకా
వరతటినీ తటస్థిత నివాసమునన్ దపియించు మౌనినిన్॥ 284

కని కరుణాకరా! యనుచు గాళ్ళను వాలి యఘాపనోదనం
బునకు సహాయమై మనుచు పుణ్యమునం జనుమంచు వేడినన్
ముని కదలాడిపోయి "నృప పుంగవ! జేలవు కాకు లెమ్ము, నీ
వినుమడి భోగభాగ్యముల నిట్టె గడింతువు స్వామి సత్కృపన్॥ 285

ఈవు యమధ్వజాత్మజుఁడ వేను నెఱుంగుదు నిన్ను రైక్వశా
పావధి దగ్గఱయ్యెఁ గృతమంతయు భోగ్యము యెల్ల వారికిన్
శేవధులౌ నలాదులును జెందరె దుఃఖము, లందికోరె క
ర్మావధి పూర్వభోగముల కందని యింద్ర సమాన భోగముల్॥ 286

కావున ధైర్యమూని శివుకై తపమందుము లెమ్ము లె" మ్మనన్
చావె శరణ్య మంచదియు జాలి వహింపదె యంచు నేడ్చు నా
జీవుఁడు మృత్యు మృత్యురస సేచన భాగ్యము నంది నల్లె సం
జీవన మందిలేచి "మునిశేఖర! ప్రీణిత చంద్రశేఖరా! 287

నా జని ధన్యమయ్యె మునినాయక! నిన్ననఁజాలు పుణ్యమై
రాజయినన్ సుఖంబు గనరాదని స్వానుభవంబు చెప్ప నిం
కే జనుఁ డద్దికోరి కొను నీ జని నింక సుఖానుభూతి పై
మోజున వ్యర్థముం జలుపు మూర్ఖతవోయె దయాపయోనిధీ! 288

నీ నుడి వ్యర్థమై చనదు నిస్తుల భోగము లున్న వన్నచో
వానికి నై నిరీక్షయును పాటును రెండు నిరర్థకంబులౌ

పూని వివేకమూని తనువున్ బరమార్థము నందె నిల్ప నా
కైన యుపాయముం దెలిపి యాది కోనం దగునయ్య జాలిమై॥ 289

నన్నును దండ్రి తాతలను నా చరితంబును సర్వమీవె నా
కున్నది యున్న యట్టులని యుంటివి నేనిఁక నీకు చెప్పఁగా
నున్నదె? జ్ఞానదాయి యభవుం దనియించు నుపాయ మేదియే
నున్న వచించి సిద్ధిగన నోముఁడు పూర్ణదయా మహేశులై! 290

అడుగక భోగభాగ్యముల నందుమటంచును దాను సిద్ధుఁడై
నుడువగ వాని మాటయును నోవన గిట్టక త్రోసివైచి యి
ట్లడిగెడు రాజుగాంచి ముదమందిన మౌనియు "రాజశేఖరా!
తడయక నీవు ధన్యుఁడగు దారిని దెల్పెద విన్ము నా నుడిన్॥ 291

శివుని చరిత్రముల్ బహువిశిష్టము లల్పుర కందరావు తొ
ల్లి విధియు గర్వియై తలవలిన్ గోలఁకాడిన దానిగిల్లి యా
శివుఁడు జగత్ప్రియార్థియయి చిప్పఁగఁ జేకొని బిచ్చమెత్తె వి
ష్ణువును సురాసురల్ నరులు చోద్యముగాఁ దను వెంబడింపఁగన్॥

నేనును శంకరుం బడియె నిస్తుల భక్తిని సాగుచుంటి మా
ర్గాన యమాలయంబు కనరాగ శివుండట నాగె వెంటరా
నైన ననున్ యముండు వెనుకైనది సర్వము తోఁచి గొప్ప స
మ్మాన మొనర్చి శ్రేష్ఠ విధి మానిత పూజ నొనర్చి యిట్లనెన్॥

ఓయి మృకండుజా! భవదనూహ్య మహో మహిమంబు నాహృదిన్
మాయదు స్వామి వెంట నిటు మాసదనంబున కేగుదెంచి మే
లాయె ననుగ్రహించితివి యర్హుఁడ వీవు మహాసమర్చకున్
వేయివిధాల మేలగును ప్రీతుఁడ వైతివయేని మాయెడన్॥ 294

ఆప్తకాముండవౌ నీకు నమిత ముదము
కలుగఁ జేయున దేదియఁ గలను నేను
శివునకుం బ్రీతి పాత్రుఁడ వగుదు నీవు
నయిన నొక్కటి యిత్తు సమాదరింపు॥ 295

ఈశ్వరుఁడు లేని దేశ మెందేని లేదు
సర్వగతుఁడయ్యు నా జగజ్జనకుఁ డొక్క
యొక్క యెడ మడుగులను సూర్యుండు తోఁచు
నట్లె ప్రస్ఫుటంబుగ వెలుఁగందు చుండు॥ 296

స్వామి నిజవైభవంబు విస్పష్ట పఱచు
క్షేత్రరాజమ్ము లందు విశిష్టమైన
దాది కైలాస మట్టిదే యనుట యేమి
యధిక మే యగు శ్రీ కాళహస్తి పురము! 297

నిఖిలుఁ డచ్చట నానంద నిలయవాసి
నిఖిల జీవార్తి మోచన నిరతుఁడగును
తల్లి పార్వతి జ్ఞాన సాంద్రస్వరూప
దర్శ నాభయదాత్రి! నిత్యప్రసన్న! 298

సానంద యోగి పుంగవుఁ
డానంద నిమగ్న చిత్త జాహిత మతియై
దైనందిన సేవామతి
నా నగరము నందు శివుని యంతటివాఁడై॥ 299

ఐకాత్మ్య ప్రాభవమున
లోకులు నుతియింప నిలచి లోకేశ్వరుఁడౌ
శ్రీకాళహస్తి పతి నుతి
శ్లోకత వెలయించె నిఖిల సుశ్లోకుండై॥ 300

శతనామాంబుజ మాలిక
ప్రతిపద మహిమాన్వితంబు భావితకంఠ
స్థితి మాత్రతత నతిసుందర
మతి గిరిజా ప్రాణనాథ మహిములఁ జేయున్॥ 301

నీ కిచ్చెద నద్దానిని
కైకొని యోగ్యులకును విధిగా నొసఁగుచు లో

కై కోపకార మొనరుపు
మీ కరుణ వహింపు మనుచు నెంతయు శ్రద్ధన్‌॥ 302

నా కుపదేశించెను నే
నా కంజాత స్రజమ్ము ననవరతము ప్ర
త్యేక శ్రద్ధ ధరించెద
నీ కిచ్చెద దాని గొనుము నియమితమతివై! 303

దీనిఁ బరిగ్రహించి వెనుదీయక వెంబడి కాళహస్తికిన్‌
మానితభక్తిఁ బొమ్ము విసుమానముగా శివమూర్తి యట్టులే
కానగ వచ్చు నచ్చటి నగంబునకున్‌ బ్రణమిల్లి వాహినిన్‌
స్నాన మొనర్చి శైలజను స్వామిని దీని జపించి కొల్వుమీ! 304

సంజల మూట దీని ననుసంధిత భక్తి జపించుచున్న మృ
త్యుంజయ! చంద్రశేఖరుఁడహో మిగులన్‌ బ్రియమంది రక్షణం
బంజక యిచ్చి వెంబడినె యార్తి తొలంచును తృప్తుఁడైన మృ
త్యుంజయ సామ్యమేమి యయియుందువు స్వామిగనే యభిన్నతన్‌॥

మృత్యువు దీని నా చెవిని మెల్లగఁ జెప్పుచునున్న యప్పు డా
మృత్యువునే జయించి నను మృత్యువెఱుంగని నిత్యజీవిగా
నత్యనుకంపఁ జూచిన దయామయుఁడా శివదేవుఁ డెంత సం
ప్రీత్యను మోదముల్‌ జలదరింపులు తెల్పెనొ చెప్పలేనయా! 306

అని శతనామ కంజ సుమహారము నాతని కంఠమందు ని
ల్చిన దనఁ బ్రీతిఁ జెప్పి యిఁక శీఘ్రమె చేరుము కాళహస్తి నీ
వనుచును దారిఁ జెప్ప నతఁడాక్షణ మందె ప్రమాణమాచు ద
క్షిణ దిశనుండి యుత్తర ముఖినత ద్వాదశ యోజనంబులై॥ 307

దూరము నుండియే సకలదోష నివారక మాశుతోష సు
స్మేర ముఖారవింద మన స్నిగ్ధ మనోహర కాంతులీను గం
భీర సితాగ శృంగమును మే న్వడకంగను జూచి మొక్కుచున్‌
చేరువవైన కొద్ది శివుఁ జేరుట యేయనఁ బుల్క లందుచున్‌॥ 308

చేరి యిదే ప్రదేశమునఁ జిత్తము తన్మయతన్ భజింపఁగా
పాఱెడి వాహినిన్ మఱియు పర్వతమున్ గను చెంతసేపు నిం
డారు ముదంబు నందెనో హృదంతరవర్తి యెఱుంగఁగా వలెన్
చేరువ గ్రామమున్ మఱచు చిత్తము మోదము నందు నేటికిన్॥

గిరి శృంగంబున నుండి యేటికటు చక్కన్ నిల్చు బిల్వాగ్రమున్
బరికింపన్ బరికింప వాని మదికీ ప్రాంతమ్మునం దెల్లచో
గిరిజానాథ కృపా కటాక్షములు దుష్టైక శాపహారుల్ నిరం
తరమున్ వెల్వడి మాలలై తనువు నంతన్ గప్పుచున్నట్టులై॥ 310

కదలన్ లేక చిరంబు మెచ్చుచు శిరః కంపంబు గావించుచున్
నది మధ్యంబున కేగి తన్మయత స్నానం బాడి యద్వోచ్చెై నె
మ్మదికిన్ శాంతి ఘటించుటన్ దనకు నైర్మల్యమ్ము చేకూర్చు శ్రీ
ప్రద తీర్థమ్మని నిశ్చయించుకొని కొల్వంజొచ్చె స్తోత్రంబుతో॥ 311

నదిలో నిత్యస్నానము
నెదలో శివదేవు మూర్తి యెప్పుడు ముఖమం
దుదితంబగు సుమ మాలిక
చెదరక యుండంగ రాజు సేవించె భవున్॥ 312

కోవెలయందు దక్షిణ ముఖుండగు స్వామికి వామభాగమం
దా విమలాత్ముఁ డాత్మ శివుఁ డచ్చట నుందు ననంగ నిల్పి మే
ల్తావుల బిల్వపత్రములఁ దప్పక యిచ్చుచుఁ బూజచేసె నా
దైవము వాని పూజకును దన్మయతన్ భజియించెఁ దృప్తిమై॥ 313

మృత్యుం జయార్చితుండే
మృత్యుంజయ దైవమనఁగ మెలఁగెడు నేఁడున్
బ్రత్యక్షమ్ముగ బదులిడు
నత్యంత ముదావహాముగ నార్తుల మొఱకున్॥ 314

మూలస్వామికిఁ బ్రాతినిధ్య మిటఁ డెప్పున్ బొందు నా స్వామి యే
వేళన్ మై ఘన సార వారిని సమర్పింపన్ ముదంబందు ని

త్యాలంబుండని పాలు తేనె మొదలౌ నన్యంబు లెంతెంత ము
ఖ్యాలైనం గొనఁ డందుచే నితఁడె తానందున్ దదామోదియై॥ 315

వఱపులు వచ్చి వర్షములు వచ్చుట లేదని స్వామి గొల్చువో
కఱవులు దీఱునంచు జలకంబుల ప్రీతినొనర్ప నెంచువో
కొఱతలు తీర్తునే ననుచుఁ గూర్మి గొనున్ ముదితాత్ముఁడౌచు నీ
వరదుఁడె వారు వారొసఁగ వచ్చు సహస్ర ఘటాభిషేకముల్॥ 316

పగటను నిద్రఁబోయి మునివల్లభు పూజకు నోచుకోక ప
న్నగమగు దుష్టకర్మ దశనంబుల పీడితుఁడై పదచ్యుతిన్
దగిలి వచింపరాని పరితాపము నందిన మాట సత్యమా
మిగిలి యదే దోసంగతని మేలిమికిన్ కతమాట చిత్రమా॥ 317

పగలున నిద్రఁబోవుటది పాపమె కూడని నిద్ర పాపమా
తగునది మానుటెం కొకటి తార్క్ష్యను గావునఁ జెందనీయగా
దగదు సరే యితండపుడు తాపసి నాదర మొప్పఁ జూచినన్
రగులుట శాపమిచ్చుటయు రాజ్యము పోవుట లేమి క్షేమమా॥ 318

కానీ యీ ప్రభు వింతయున్నతిని మార్కండేయుఁ డందించు నా
మానీకంబునఁ బొందఁ జాలుటది సంభావ్యంబు కాకుండెడిన్
గానన్ రైక్వమహర్షి క్రోధమను వంకన్ శాప మన్ వ్యాజమై
వీనిన్ రాజ్యము వీడిపోయి యటు సేవింపన్ ప్రబోధించెఁబో॥ 319

ఎంత విచిత్ర మీస్థితి సమీక్షిత బుద్ధికి నేది దోష మ
త్యంత మటంచు తోఁచినదొ యయ్యది యంతము నందు శ్రేయమా
టంతకు హేతువంచు ముదమందగఁ జేయుచునున్న దందుచే
నెంతయు దీని నమ్మఁదగ దీశ్వరునే నెఱ నమ్మియుండనా॥ 320

మృత్యుంజయుఁ డిచ్చుట శివు
నత్యంతము శ్రద్ధతోడ నర్చించిన తీ
రత్యంతము స్తుత్యంబగు
ప్రత్యయమే భక్తతతికిఁ బర మందించున్॥ 321

తిరుగుడు వడి తిరిపెంబై
యరిగిన యవ్వాని కా మహాత్ముడు నుడివెన్
గురి కుదిరెను స్థిరమతితో
గురు సముండై జప మొనర్చి కోరిన దందెన్॥ 322

మాటకు శక్తి దాసి నను మానిసి బట్టి జ్వలించుచుండు వి
స్ఫోటిత మాక్షరమ్ములకుఁ బుట్టెడి స్రోతయె శక్తి శూన్య మా
ర్భాటము లేక శాంతమతి స్వచ్ఛ హృదబ్జపు మూల నాళ మా
స్ఫోటితమై క్రమాన నెగబోతయి లోననె యున్నదెట్టిదా। 323

అయ్యది వ్యక్తమయ్యెడిది యాతనికే యది యాతఁడే మరిం
కెయ్యది లేదు నాదమొకటే నిరతంబుగ సాగుచుండు నం
దొయ్యనఁ దొల్త సుస్వరము లున్నను మెల్లగ లీనమాచు సం
దియ్యని నాదమే మిగులు నేని పరాత్పరు నందినట్లెయగా॥ 324

ఆనంద లక్షణంబై
యానాహత మనుచుఁ దెలియనగు హృదయమునన్
(శ్రీ)నాదరూపమునఁ దా
నై నర్తించు నదియె పర యమ్మయు నదియే॥ 325

ఆ నాదమందు వారల
కానందమె యెల్ల యెడల నాదిమజననీ
స్వానంద మన్నయట్లుగ
లోనన్ వెలి లేక తోఁచు లోలోతులదై! 326

అటు కొండ, స్వామిదేవాలయం, బిటులింత
శాంతమై ప్రవహించు స్వర్ణది యును
వాహినీ పశ్చిమ ప్రాంతస్థ కాంతార
మాకంద తరు శిరో మాలికలును
మృదు నిస్స్వన శ్రవో మిళిత మంత్రాక్షర
వ్యోమ స్థితుండు మృత్యుంజయుండు
వాహినీ మధ్యాన ప్రభవించి నాఁడన్న
చందాన నిల్చు దృశ్యమ్ము నీవు

కన్ను లెదుటను కట్టించుకొన్న యెడల
నాతఁడొనరించు తపము నీయదియె యగును
తపసి వెంబడి జనవు తపస్సు లెపుడు
తపసియేపోఁడు నిలుచుఁద త్తప మదెప్డు॥ **327**

కావున క్షేత్రవాసమునఁ గాంతుము పూర్వ మునీంద్రకోటి సం
భావిత సత్తపః ప్రభవ బంధురశక్తి సహాయవహాచు ని
న్నే విధినైన సన్నిధికి నీడ్చుకపోయి దినంబు మ్రొక్కఁగా
దైవము నిన్ను దగ్గఱకుఁ దార్చుకొనం జను యత్నమంతయున్॥ **328**

గురు శిష్యుల కచ్చోటను
నరవర మృత్యుంజయుండు నాగవిభూషున్
వరశత నామాంబుజ సం
స్మరణంబునఁ దనియఁజేయు మహిమను తోఁచెన్॥ 329

పులకిత తనులై యిరువురు
పలికిరి తన్నామములను పలికిరి భక్తుల్
గలగల మని నది జలములు
జల చలన వినూత్న వాద్య చాతురి నెఱపన్॥ 330

## శతనామాబ్జ మాలిక

శివ! మహేశ్వర! శర్వ! శ్రీ రుద్ర! శ్రీ విష్ణు!
ఓ పితామహా! కావు మోయి మమ్ము!

సర్వభర్తవు నీవె, సంవాసభూమి నీ
కీ దివ్య కైలాస శృంగ మయ్య!

పార్వతీ దివ్యాంగ పరివర్తనం బౌ న
ఖండ బిల్వచ్ఛద కాంతిఁ వీవు,

లూతార్తి మోచకా! లోకార్తి నాశకా!
సర్వజ్ఞ! దేవ! సంసారవైద్య!

ఓ పరాత్పర! పరమాత్మ! యోపి మున్ను
కాళమును నేన్గు నీ పూజకై పెనంగఁ

ప్రాణములు పాయఁజేసియుఁ బరమదయను
ముక్తి నిచ్చిన యట్లె మ మ్మును గ్రహింపు॥ 331

వెలి మొగిల్ తెలి నీట జలకమాడెదవు, తే
జోనిధివి, త్రి జగద్యోని వీవు,
దివ్యమంగళ విగ్రహా! వ్యాపకానంత!
శతకోటి బ్రహ్మాండ సంతతులను
పిండి చేయగఁ జాలు పండితుఁడవు నీవు
మోహమే లేని సమ్మోహకుఁడవు!
సద్య ఉజ్జాత పంచబ్రహ్మ తను వీ, వ
నాది నిధన సువిఖ్యాతుఁడవును
శంభు! సచ్చిదానంద శశ్వత్స్వరూప!
ఓ హిరణ్యగర్భ జనక! త్రాహి త్రాహి!
జ్ఞానసూనాంబికా పతీ! జ్ఞానదాయి!
యో మయూరార్తి సంహర్త! యో మహేశ! 332

రామమోహ నిబర్హణా! మునీశవరద!
వేదాంత వేద్యా! ప్రమోదరూప!
కాలాత్మ! బహుచిత్ర కల్యాణ కృచ్ఛక్తి
మంతా! గిరీడ్ ధనుష్మంత! పశు ప
తీ! సర్వ తత్త్వోప జేశికా! శబరా భ
యద! గౌర! గౌరీశ! సదయ! దేవ!
స్వర్ణముఖీతీర వాసీ! శబర నేత్ర
పూజితా! విజయముక్తి దాత!
శ్రీరమేశాది సురగణ సేవ్యతనిడి
యా యగస్త్యుని మన్నించినట్టివాఁడ!
వైదికాగమ పీఠస్థ! వేదరూప!
భుజగ మణిజాల పూజాప్రమోద భరిత! 333

హరి విరించాదృష్ట సురపూజ్య పదశీర్ష!
మణికర్ణ! మృడ! స్వభూ! మంజుభాషి!
పంచాక్షరాకార! పరమేశ! దుర్గా క
నక రుచిప్రద! యనంత కమనీయ
గుణగణా! నీలా నిగూఢ పిశాచీ వి
మోచన కారణ! ముక్తిదాయి!
లింగోద్భవా! ధృతానంగ భస్మప్రియా!
విద్యామహారాశి! విద్యలపతి!
ఆమయాహీన! పంచాక్షరాభిధేయ!
ప్రబల సుభగా సకల శోకభంజనచణ!
అర్కపాపాంత! చంద్రదక్షయ ప్రహర్త!
సకల సురనాయకా! భర్త సకలపూజ్య! 334

ఆనంద తాండవా! హరహరోద్ధర్తా! మ
హా నేత! శక్ర ప్రహర్ష విభవ!
దుర్గా సమారాధ్య! భర్గా! మహేశ్వరా!
చక్ర కిల్బిష మార్జకా! క్రతుపతి!
స్కంద సర్వజ్ఞతాస్పద! పంచధాభిన్న
మస్తక! శ్రీనతమహిత వామ
పద! జపాలా భక్తివశ సంచరా! మూక
మృత్యుంజయార్తిఘ్న! మృత్యు మృత్యు!
వృద్ధభూసుర వేషధారీ! మహేశ!
నారదామోదదాయి! సనత్కుమార
శుకపరాశర పూజితా! సకల సురగ
ణోరు శక్తి విజ్ఞాత! మహోగ్ర తేజ! 335

కల్యాణదాయి! మార్కండేయ హృదయ సం
స్థిత సర్వ సంశయ చ్ఛేద దక్ష!
యక్ష వపుర్ధరా! యమశాసకా! సహ
స్ర సుర సంవంద్య! భుజంగ భూష!

పద్మ సేనక రాజవర కన్యకా యుగ్మ
సేవిత పాద రాజీవ యుగ్మ!
ధర్మాసనా! తుంగ! కర్మచ్ఛిదా! నిత్య!
భృత చక్రధర విభూ! నుతి వినోద!

నీలకంఠ మలాపహా! నిఖిల పూజ్య!
వరగుణాభీప్సితార్థ సంప్రదాయి!
బ్రహ్మపురవాసి! దేవర్షి వరపురాసి
కా! పితా! విష్ణునగరవాసీ! పరేశ! 336

రక్షిత సారంగ! శిక్షితాఖిల దైత్య!
భర్తా! భరద్వాజ వందితాంఘ్రి!
పాండ్య పురస్థితా! భక్త భీమార్చితా!
సకల సురనుత! ప్రసన్న కాళ
హస్తీశ్వరా! కుమార స్తుత కాళహ
స్తీశ్వరా! కాళహస్తీశ దేవ!
గోవింద నయనాబ్జ గుణిత కోమల పద్మ
సంపూజితా! సుదర్శన వినోది!

కష్ట సంప్రాప్తములు స్వామి కమలము లివి
భక్తి నర్పింతు నంతె కాపాడు మయ్య!
నీదు పలుకులఁ బలుకు పొందికయు లేదు
లేదటంచును త్రోయక లీలగొనుము! 337

అడుగులు పడ వెవ్వరికిని
నడచియు నడవదు జనమన నడచుచుఁ బదునై
దడుగులు కడచెనో లేదో
గుడి నుండెడి స్వామి చూపుఁ గొననగు చోటన్॥ 338

ఆ నడక యోగి పోగా
దానం గల విలువ మదులఁ దగిలిన యట్లై

మానితభక్తి జనమ్ములు
జానుగ ప్రాఙ్ముఖత నూని శైలము మ్రొక్కన్॥ 339

## పరస్పరాభిముఖ్యము

స్వామియుఁ జూచెను స్వామిని
ఆ మోములఁ వెలుఁగుచున్న యానందమ్మున్
ధీమన్ముఖ్యు లెఱుంగుదు
రే మాత్రపు వారలైన నెఱుఁగుదు రిమ్మున్॥ 340

అది యెదియో తనూలతల కైందవమున్ మఱపించు కాంతి యొ
ప్పిదమయి సోకి పుల్కలయి ప్రీతి ననల్ స్మృతిపల్లవంబులున్
పొదలగ మేనులుండినవె పొందగఁ జాలితి మిట్టిసౌఖ్య మిం
కెదియును గోరకిల్లె యిటనే కడతేరుద మందు రెల్లరున్॥ 341

అది సరిగా గృహస్థ తతి కొద్యుఁడు స్వామి స్వయంభువుండుగా
గదలకయుండి పశ్చిమ ముఖస్థితి దూరమునందు నుండి యిం
పొదవగఁ దన్ను జూచెడి తలోదరికై పరికించు చోటగున్
గదిసియు యుండి కాంచెదరుగా విరహంబు నపూర్వదంపతుల్॥ 342

షట్చక్రమ్ములు దాటి సప్తమ సహస్రార స్థితిం గాంచులే
షట్చం చన్మహిమాచలంబులను నిస్సారంబు లన్నట్లుగా
త్వట్చక్రం బాకఁడిల్లె ద్వార్లిచని యిద్దెంజేరె నింకద్ది యీ
ద్విట్ చేటీ నివహంబు తాఁగనక యందేయుండు నెల్లప్పుడున్॥ 343

బాలాజీ యను పేర వెల్గునది యా ప్రాతమ్ము నాసాయ మా
బాలాలోకన హేల నీ ప్రభువు కైవల్యమ్మునందుండు డెం
దాలం దొక్కరె యయ్యు దేహమిరుచందాల్ చెందె స్త్రీ పూరుషా
కాలంబు చిటురెండు మూర్తులుగనై యందది యిందిద్దియా॥ 344

ప్రాకారోన్నత కుడ్య రంధ్రఘటిత ద్వారమ్మునం జొచ్చి యే
చీకంజింతయు లేని యాల్మగల దృష్టి స్ఫార కల్యాణ కృ
ద్రాకాచంద్ర మయూఖ నిర్మథన నిర్యన్నవ్య భామాలికా
నీకమ్ముల్ జగమెల్ల నిండునిట సాంద్రీభూతమై పాల్చెడిన్॥ 345

ఆ యెత్తేమిటి యింతపల్లమున నీ యీశుండు నిల్చుంట యే
మీ యన్యాయ మిదెచ్చ టేని కలదే యెత్తెక్కి కూర్చుండురే
మాయా మర్మము లే మెఱుంగని సతీమాణిక్యముల్ స్వామికై
డాయన్ రారొకొ వేగిరం పడుచుఁ జూడంగానె నిల్వోపకన్॥ 346

స్వామిని గద్దెపై నిలిపి చాన కడుంగడు భక్తి గొల్చుటే
క్షేమము న్యాయమున్ సరియె శ్రీనిటు లగ్రమునందు నుంచి త
త్స్వామి యధః ప్రదేశమున స్వస్థమతిన్ వసియించి కొల్చుచో
నేమియు తప్పు లేదు మది నెట్టి విభేదము లేని వారలై। 347

ఎత్తును పల్లమంచనుట యేమి వివేకము దేశకాలముల్
విత్తులు మాయ యన్న పెనువృక్షము లోకము లెల్ల గప్పుచున్
మత్తిలఁ జేయు వానిబడి మాన్యులు లోబడ కా ప్రభావము
త్తుత్తిదిగా నెఱింగి యెపుడుందురు స్వాత్మలయందె స్వస్థులై॥ 348

స్వామీ! గర్త సదా! యిదేమి రసికత్వం బయ్యె యత్తెత్తి యి
ట్లీమెన్ జూచెదు బెణ్కెదో మెడయు? నా కా కర్మమేలా మదీ
యామే యూర్ధ్వ ముఖంబునం గనెద, ధ్యేయం బెప్పుడట్లున్న నే
యా మోదమ్మును గూర్చు నం చనెదవో యట్లైన నీవామెకో? 349

ధ్యేయుఁడ వందువేని యవధీరణ మందిన యట్లు గోత్రి యం
దాయమ సన్నిధానమున నంతగ శీర్షము వంచి యుండుటల్
హేయము కాదె? యో నిసుఁగ! యెన్నకు మిట్టు లధీనయామెనా
కాయెను మిన్న నేనె యటు లాయమకున్ మరియాద చూపెదన్॥

ఆయమ యిట్లు వెల్వడుచు నంతట వైభవ మెల్ల చూపుచున్
స్వీయ విలోకనామృత నిషేచనమున్ బొనరింపకున్నచో
మాయను సర్వలోకములు మాన్య జగజ్జననీత్వ పీఠిపై
నా యమ యుండ నే నిటుల సాక్షిగ నుందును స్వస్వరూపతన్॥ 351

ఇరువుర మంట వెట్టి యెటనేనియు నున్నది యొక్క తత్త్వమే
చేరి సగమంటయున్ దగదు స్నేహ వశాన సమైక్య మాటయున్

సరి యనరాదు చిన్మయ రసస్థితి నేకమె యయ్యు సృష్టికై
విరిసి యిటుల్ కనంబడుచు వృత్త శుభస్థితి చూపుచుండుటా॥ 352

పురుషుఁడె గొప్పయౌ ననుట పోలునె యెల్లెడలన్ గణంబులో
నిఱిసి చరించుటే యతని యెక్కువ తత్క్షణ ముబ్బఁజేసి యె
ల్లరు ముదమొందఁ జూడనగు లాగున విస్తృతి నందఁజేయుటల్
పురుషుఁడు తానుగా సలుపఁ బోలునె దానికి నామె కావలెన్॥ 353

లోనయి యేలుటే ఘనము లోపల నుండి గృహంబు నేలు, లో
లోన సుఖంబుగా నిలిచి లోలుఁడు గాక రథంబుతోలు నే
నే నిజమైన స్వామినని నిక్కి గృహోపరి నల్లె బండిపై
తా నిలుచున్నవాని గని తప్పక నవ్వును లోకమంతయున్॥ 354

కావున పూరుషుం డెపుడు గర్తము నందె యెసంగుచుండు మే
ధావి నటంచు నీ గరితఁ దక్కువ చేయకు మామె లేనిచో
నీ వెలుఁగంగ లేవు నిన్ను, నీకు విముక్తియె లేకపోవు శ్రీ
దేవి మహత్త్వముం దెలిసి ధీనిధివై వెలుఁగొందు మర్భకా! 355

ఇట్టులు స్వామి చెంగటనె యెంతయు సన్నిహితత్వ మొప్ప నీ
గట్టుల గుట్టెఱుంగుటకు గాఢ ప్రయత్నము చేసినట్టి యా
దట్టులు స్వామినుండియె నిదానముగా గ్రహియించువారలై
పట్టునఁ దన్మయత్వమున భావన చేసిరి తన్మహత్త్వమున్॥ 356

అంతటి పుణ్యాత్ముఁ డా రాజు కానాఁడు
పట్టుటే మది గట్టి పగటి నిద్ర?
అప్పుడే రైక్వుండు నతిథిగా వచ్చి య
భోజనం బయి తిట్టి పోవుటేమి?
రాజ్యమ్ము కోల్పోయి రమణీ సుతాదుల
కెడమై మహారణ్య మృగ మనంగ
తిరుగాడి తిరుగాడి తరుణమ్ము వచ్చిన
పోయి మార్కండేయ పుణ్యవసతి

చేరుకొనుటేమి? నరతను క్రూరమృగము
వా తెఱచి మ్రింగఁబోక తత్పాద పద్మ
యుగము నెత్తికి నంటకై యుగము మోడ్చి
యాతనిదయకుఁ బాత్రుఁ డిట్లగుట యేమి? 357

ఆ మహర్షియు జాలి నామాబ్జ మాలిక
కంఠార్పితంబుగాఁ గనికరించె
నితఁడీ ప్రదేశాన నింత దివ్యంబైన
యీ పట్టు నెట్లు గుర్తింపఁ గలిగె
శ్రీ కాళహస్తీశ శ్రీనివాస ప్రేయ
సీ దృక్కళిం దాళి శింజితములో
చారు స్వానా భోగ స్వర్ణముఖీ నదీ
సంచాలన స్వాదు జల నినదము

తెలియ రానట్టు లీ నదీ తీర్థమందు
నిలిచి యా రాజు మాలికా కలిత హృదయ
కందరాంతర వాసి రాకేందు వదన
నాద రూపానఁ దోఁచు నానంద వశత॥ 358

నిత్యమ్ము నద్దాని నియతిమై ముమ్మాఱు
పఠియించి పఠియించి ప్రణతుఁ డగుచు
వైదికాగమ పీఠవాసంబు వరియించు
నాత్మలింగము తృప్తి నంద పూజ
చేయుటే బ్రదుకౌచు నేడైదు మాసాలో
గడపి నాఁడే యంద మొడయఁడైన
శ్రీ కాళహస్తీశు స్నిగ్ధ హృత్పద్మంబు
విచ్చి సువాసనల్ విరియుటేమి?

విరిసి దరిసెన మిచ్చి యందఱకు జరుగు
నట్టి కోరుము వరమన నదియు కార్తి
కసిత పక్ష పూర్ణిమ తిథి దెసలు పదియు
వెన్నెలలలోన వెలుఁగందు వేళయందు॥ 359

కోరెనా యీరాజు? కోర్కెయుండున వేని
 కైనను మోదాబ్ధి యందె యుండి?
యాపాద మస్తకం బానంద వీచి యే
 సాధకాకృతి నిల్చు నాథ వేళ
తాను వెలుగ నుండి తనకోర్కె తెలుపగా
 యత్నమ్ము సలుపు వాఁ డవునె శివుఁడు?
శివుఁడు కాచున్నచో శివుఁగొల్వఁ గలుగునా
 శివునకుం గోర్కులు చెలఁగునేమి?

యతఁడు కోరఁడు, శివుఁడు మర్యాద కొఱకు
కోరు మను నంతె ప్రారబ్ధ పార మెఱుఁగు
నాతఁడే దాని బట్టి యనంత కరుణ
నేది యేదో శుభ మనుగ్రహించి చనును॥ 360

అతఁడు మృత్యుం జయుం డితఁడు మృత్యుంజయుం
 డెవరైన తీసిపోయెదరె యపుడు
ఇచ్చు వాఁడొకఁడయి పుచ్చుకో నింకొకం
 డచ్చుగా నున్నారె యాత్మ శివుఁడు
పదివేల రూపాలఁ బరగి నాటకమాడి
 బహురూపతను వీడి బ్రహ్మముగను
మిగులు పూర్ణానంద జగదింద్రజాల ద
 ర్శన విహీన నిరతి శయమె యగును

మాయయున్నదె యీ మహా మాయ కెపుడు
చూచు వాఁడుండ నదియు విచ్చుచునె యుండు
పరమ సమ్మోహకంబౌట నురక చూచు
వారి కెప్పుడు కొఱత రానేరదయ్య॥ 36

మృత్యుంజయ ప్రభు వత్యుత్తముం డౌట
 పదివేల యేనుగుల బలము గలిగి
పుత్రమిత్ర కళత్ర పూర్ణుఁడై సేనా స
 మేతుఁడై మంత్రి సమీహితమ్ము

పాటించి యరివర్గ పాటనం బొనరించి
తన రాజ్యమెల్ల విస్తరణ మంద
తాను ధర్మాననే తత్పరుండై యుండి
ప్రజనల్లి ధర్మ తత్పరత నిలిపి

పూర్వ భోగంబు లెవియు దాపునకు రాని
మేలి భోగంబు లీమేనఁ జాలపొంది
తుదకు నాఙ్మాజ్ఞ మాలికా భ్యుదిత సాంద్ర
మోదమగ్న మానసుఁడయి ముక్తినందు॥ 362

ఇపుడె ముక్తుఁడ వగుదె నీ యిష్ట మేమి
యేది యెపు డెట్లులో సర్వ మెఱుఁగు నతఁడు
నీదు మేలునుకోరి మన్నించు నతఁడె
శ్రీ శివాజ్ఞను రాజ్యమ్ము చేయవలయు! 363

మృత్యుంజయుని రాజ్య మెట్లుండ వలయునో
యట్టులే యుండు ధర్మాను గతిని
భానుమతీ సుధామానుపమామేయ
భక్తి సంసేవిత భవ్య దేహ
మది బంధమే కాక యనుకూల సాధనం
బై యుండ దైవ కార్యముల నెల్ల
ప్రతి పదమ్మున మెచ్చి ప్రసవ వర్షమ్ముల
నామోదమును దెల్ప నాచరించి

బంధు పరివార మంతయు బలిసి చుట్టు
స్వస్థమతి తాను చెప్పిన ప్పగిది శాంత
చిత్తులై చేరి తనతోడ శివునిగూర్చి
శివ మహేశ్వర శర్వ వచించుచుండ॥ 364

ఖట్వ మరణంబు క్షత్రియ గర్హితంబు
గాన నటుకాక వైరాగ్యఖడ్గ ఖండి

తాత్మ దేహుండె యగుచు వీరానుగుణము
ముక్తికొఱకైన సమరాన త్యక్తదేహి॥ 365

అతఁడు సార్థకనాముఁడై యభవుఁ జేరె
నా మహామహు పేర నీ యాలయమున
వైదికాగమ పీఠమై పరగు చోట
దక్షిణామూర్తి దగ్గర దర్శనీయ॥ 366

లింగ మున్నది స్వామి యశ్లే యదియును
పశ్చిమమ్మును జూచును పక్వబుద్ధి
తనను సేవించువారికిఁ దడయ కిచ్చు
నేది యైనను సేవింప నేల రారు? 367

మృత్యుంజయా పాహి మృత్యుంజయా!
సత్యమ్ముగా నాడి ఆడింపుమా!

జడమైన జగమెల్ల జగమౌను నీ మహిమ
శవమైన దేహమ్ము శివమౌను నీ దయను 1

స్థూలమ్ము సూక్ష్మమ్ము కారణమ్మును గూడ
నాలంబ మీవు కా కలరంగ వేవయా! 2

పదము పదమున మమ్ము పడనీక పట్టంగ
ప్రారబ్ధ మడ్డునా పరమేశ దయఁజూడు 3

బమ్మ తలగిల్లు నీ బలిమి ముందట వాని
తలవ్రాత లెటు నిల్చు తలయె మాయమ్మాను 4 368

కొండయు స్వర్ణవాహినియు గొప్ప కులమ్మున కూర్మిదంపతుల్
రెండు నుదఙ్ముఖమ్ములయి తృప్తిగ నిర్వురు రెండు వైపు లం
దుండి శివున్ గిరీంద్రుడును నోమెడి తల్లిని వాహినీంద్రమున్
రండని వెంట తోడుకొని ప్రత్యయ మొప్పగఁ గొంచు బోదగో! 369

వెంబడి భక్తబృందములు వేలకు వేలయి పోనుపోను మా
ర్గంబును సన్ననౌట నిరుగట్టుల సందున నుచ్చిసాగు వా

గుం బలెఁ దోఁపఁ బల్లకులకున్ బ్లవభావము పట్ట నద్ది ది
వ్యంబగు తెప్పయుత్సవము వైభవమున్ బ్రకటించు నెల్లెడన్॥ 370

# త్రిమూర్తి రహస్యము

అల్లుగ లన్న యాల్మగలు ప్రాదిమ దంపతులైన వీరికిన్
మేల్మి యెఱుంగ మెచ్చుట సమీహిత బుద్ధి నటెంత యేకమా
కల్మి ఘటించిరో తను వొకండయి నిల్చెను రెండుకాక యీ
చెల్మి నెఱుంగవచ్చునె విశిష్టమయా త్రిజగంబు లందునన్॥ 371

జంటలు మూటి యందునను జంపతి తత్త్వ మహత్త్వ బోధ కా
పంటయె కానవచ్చు నలువం గన వాక్సతి దాని జిహ్వపై
నుంటయు లచ్చి విష్ణునెద నుజ్జ్వల యాటయు మేను లేకమై
యుంట యుమా మహేశులకు నొప్పిన వైఖరి చూడముచ్చటా॥ 372

జగతి శరీరధారులకు సర్వులకున్ గరణంబు లెన్న మూఁ
డగును వచస్సు మానసము నంగము కాక మతేమియున్న వా
మగువలు ముగ్వురున్ బ్రియులమై నెట చేరిరొ కొంచెమెంచుచో
త్రిగుణితమై కనంబడుట వృత్తి విభిన్నత వ్యక్తి యేకమా॥ 373

ఏక వ్యక్తిని మూఁడు సాధనము లెట్లెట్లుండునో మూఁడు ప్ర
త్యేకం బొక్కొకచోట నుండి యెటులా యేకంబు పూర్ణంబు సు
శ్లోకంబున్ బొనరించునో తెలుపు విప్లుష్టసితింగాక తా
మే కైకంబుగ వాఙ్మనస్సులవి మేనే లేక యెట్లుండెడిన్॥ 374

ఏది ముందేది వెనుకని యెంతగింజు
కొన్నఁ దేల దయినను మిక్కుటము మేను
ముందు పొడసూపు లో డెందమును వచస్సు
నుండి పనిచేయు చుండెడి నండగొనుచు॥ 375

దేహమే లేని యెడల నదృష్టము లయి
యేమి చేయంగ లేవు కానీ శరీర
ముండఁగల దని లేకుండ నుండియేమి
ఫల మనంగను పంచతం బడయునంతె॥ 376

కావున నే త్రిమూర్తులను కాయజు బూడిద చేసి స్వీయమహా
దేవికి నేక కాయమున దీటుఁగ నుండ ననుజ్ఞ యిచ్చి శో
భావహలోక సంహరణ భారము దాల్చు శివుండు శంకరుం
డై వెలుఁగొందు నంతమున యందు ననంతుఁడు తానయాటచే॥

హృదయము లేకమై పలుకు లేకము దేహము లొక్కటైన యీ
సదయులు నామ రూపముల సర్వమునన్ శివమూర్తులౌదు రే
కొదవయు లేక లోకములకున్ దొలి జంటయి జంట లెట్టి స
త్పదమును బొందఁజాలుదురు స్పష్టముగాఁ బ్రకటింతు రెప్పుడున్॥

తలలో నాలుక, | మెదలో
మెలఁగెడి వెలుఁగొచు మగువ మెయి మెయి యగుచో
నిల నేల? పతి జగత్త్రయి
నలవోకగ నేల వచ్చు నద్వైతముగన్॥ 379

త్రికరణముల్ సమానముగ దీటి తనూద్వయ మన్నయట్లు లో
పక యొకటైన యాల్మగలు వంద్యులు వారు నుమామహేశ రూ
పకులనియే తలంచి యటు భక్తి నొనర్చుట చూచుచుందు మ
ట్లొకటయి తోడుగా భవమహోదధి దాటుట తేలికయ్యెడిన్॥ 380

దంపతు లెంత యొక్కరయి తాత్త్విక భేదవిహీన శుద్ధ నై
ర్లింపత నందినన్ గనగ లేరు విముక్తిని కూడి మాడి యా
సంపద స్వస్వరూపతయె చాల రొకళ్ళొక రంది యీయఁగ
ల్పింపఁగలారు తోడగుచుఁ బెంపు నహింపగఁజేయు యోగ్యతన్॥

ఇది నిజమైన హేతువున నే సతి చేయి గ్రహించువేళ "నో
ముదిత! త్రివర్గమందు మన భోగ మభిన్నము వ్యక్తి భావమే
గదియక యేకమై మనుట గమ్యము సిద్ధిని పొందఁ గల్గినన్
దుదకు విముక్తియున్ గలుగు తొయ్యలి! యద్ది స్వతంత్రమేయగున్॥

కావున నగ్ని సాక్షిగ త్రికాయ పరిష్కృత పూర్ణ సంస్మృతిన్
నీవు మదీయ పత్నివని నేను గ్రహించితి నిన్ను నన్ను నీ

జీవిత మేకరీతి రససిద్ధిని దన్మయులన్ బొనర్చి సం
భావిత ముక్తికిన్ దగిన బాసట యయ్యెడు కాక స్వాదువై॥'' 383

అనుటయునన్న మాటలకు నర్థమెఱింగిన సత్యశీలి తా
ననిన విధాన భార్యను సహస్ర విధంబుల తోడు నీడయున్
దనకు సుఖానుభూతికిని ధర్మసమాచరణాత్త నిత్య భా
వనకును ముఖ్యయౌ ననెడి పావనబుద్ధి వహించు నెప్పుడున్॥ 384

దార పరిగ్రహంబు మన ధర్మము నందు వివేకయుక్తి ని
ర్ధారిత జీవితాశయము ప్రాప్తికి గాక పశుత్వవైఖరిన్
ప్రేరణకున్ వశుండగుచుఁ గ్రీడలఁ దేలఁగ కాదు నిగ్రహం
బారఁ జరించి యైహికము పండి పరమ్మును గొంటకయ్యెడిన్॥ 385

ఇరువుర కీ వ్యవస్థ కడు నెత్తగు శ్రీతరు వెక్కినప్డు మేన్
బరువున జాఱకుండ నిలువన్ విలువెంచి వహించు బంధమై
సరస సుఖాప్తి తృప్తినిడి శాశ్వత సౌఖ్యమునందె నిల్పెడిన్
తిరుగఁగ నీదు స్వేచ్ఛమెయి తీర్చు పరస్పర సారసంపదన్॥ 386

ఒకరయి చేయఁజాలనివి యొక్కరి కొక్కరు తోడుగాఁగ తే
లికఁగ పొనర్ప గల్గునవి క్లిష్టములయ్యును లొంగి వచ్చు నె
న్నిక పనులెన్నియో గలవు నీవు గృహస్థుఁడవైన యప్పుడే
సుకరము లౌను సంఘమును జూచు నినున్ దసక్తైన వానిఁగన్॥ 387

బ్రహ్మచారి వానప్రస్థ పారికాంక్షి
భిక్షుకాది జనమ్ముల కుక్షికింత
కూడొసంగి రక్షించుట కూడ కలుగు
నీ గృహస్థుల ముఖ్య సత్కృతియె యగును॥ 388

స్వామి గార్హస్థ్యమున నిది సాధ్యమగునె
ఏల కాదయ్య యతఁడు మహిస్థుఁడగును
ఆది భిక్షువు తానై యనంతభిక్ష
నెల్ల వారల కెప్పుడు నీయఁగలఁడు! 389

ఇచ్చుచున్నాఁడు కాన నీ యెల్ల జగతి
స్వ స్వ కర్మానుగుణ ఫల ప్రకరమంది
జీవయాత్రలు సాగించి పోవఁ బోవఁ
జివరికైన శివస్వామిఁ జేరికొనును॥ 390

## అర్ధనారీశ్వరాలయము

కదలని యట్టులే కదలి కన్నులకుం బ్రియ మార దూరమం
దురిత శశాంక మండల మొకో యన స్వర్ణముఖీ స్రవంతినిన్
గదిసి యుదగ్దిశన్ విశదకాంతులఁ జిమ్ముచుఁ జిన్న దేవళం
బెదుట కనంబడన్ విభుఁడు స్వేచ్ఛమెయిన్ దనలోనఁ దానయై॥

పరిపరి నూహ చేయుచును భక్తుల మెచ్చుచునుండెఁ దత్కథా
సరణి నెఱుంగనట్టి జనసంఘము స్వామి ముఖంబు చూడకే
గురిగ నలే కనుంగొనుచుఁ గోవెలయున్ నదియున్ బ్రశాంతి సం
భరిత తదాలయావరణ భవ్యతయున్ హృదయమ్ము లంటగన్ ॥392

ప్రకృతి సమస్తమున్ హృదిని పావనమున్ బొనరింపఁ జాలుఁద
త్ప్రకృతిని సంస్కరించి తన ప్రజ్ఞ మెయిన్ గడు సుందరంబుగా
ప్రకటితమున్ బొనర్చి యది ప్రజ్ఞ ఫలంబని యెంచు మానవుం
డకట! తమంత సుందరములైన ప్రదేశములన్ గనండహో! 393

కనగల భావుకుం డచటఁ గాలు కదల్పగ లేఁడు పాద చా
లనమునఁ గాల శిల్పి విపుల శ్రమఁ జేసిన చేత యంతయున్
క్షణమున నాశమౌను మఱి కాంచుట యెట్లు తదీయ దివ్యనం
దన జయ రామణీయకము? తాల్పగ నో మృదు భావపక్షమున్ ॥

మిన్నున నుండి చూడవలె మేదిని యందము చాల యెత్తు పై
నున్న నిదంతయున్ బలియుఁ డున్నతుఁ డెవ్వఁడొ యుచ్చ నీచముల్
సున్న యొనర్చి బిట్టణచి చూపు సమానత నన్నయట్లు నీ
కన్నుల మాయఁగాన నగుఁ గాశ్యపి సర్వము వర్ణచిత్రమై॥ 395

దానికి సంతసించుటది తత్త్వమెఱుంగుట కాదు భేదముల్
కానగ నైన యెత్తునని కాకివి గ్రద్దవు కాక హంసవై
మానసచారివై యెగిరి మండల చంక్రమణం బొనర్చుచున్
దానిని గాంచినన్ దెలియు దైవ కృతాఖిల శిల్పరమ్యతల్॥ 396

ఇటు లిటు లుండగా వలె నిటే యని నీ వనుకొందు వట్లె చే
యుట యన మాటలే ప్రకృతి నున్నది సర్వము నున్నయట్లె నీ
వెటనెది కోరుదో యదియె యించుక భేదము లేకతోఁచు న
ప్పటి ముదమెంచి యందుదిగి వాలు మదే నొకయెత్తు చెట్టుపై॥ 397

శివ! కైలాస నగ స్వరూప! రసరాశీ! దివ్యమా నీ మనో
భవ శిల్పా ప్రతిమాన వైభవము సర్వంబున్ విలోకించి సం
భవతా సంభవతల్ మదిన్ నిలుప కా ప్రాంతంబు నందుండి పో
నవు నం చెంచి గభాలునన్ దుమికె దంతన్ లింగమై యొప్పెడున్॥

ఇది తండ్రీ! శివమైన షట్పదిని నీ వెంతే ప్రియంబార మె
చ్చెద వన్పించు మనోహరామృతకథా శిల్పంబునన్ నీ దయన్
పదిలంబైన చతుర్థమా పదము ప్రాప్తంబైన యీామెట్టె న
న్ను దయాసాగర! మీఁది మైదవది మిన్నుందాక నందించెడిన్॥ 399

పదిపది నిన్నె నిన్నె కనవచ్చు నటంచుఁ బరీక్షగాఁ గనన్
గదిసిన దెల్ల నీవ యని కాదని యల్లల నాఁడు మానసం
బదయత మాయఁ జేయుటకు నాప్తుఁడవై మరి కొంత సాయమా
సదయతఁ బొందితేని యిఁకఁ జాలును ధన్యత నీవయెయ్యెదన్॥ 400

# పంచమ పదము

## వాకార పదము

వాయన వచ్చు టొక్కటియె వర్తిలు చుందువు వస్తువీవె శ
ర్వాయ నమో భవాయ సుమబాణ హరాయ త్రినేత్రకాయ స
ర్వాయ నమో నమో నిఖిల వందిత దివ్య పదారవింద యు
గ్మాయ శివాయ హాళి పరిమండిత చంద్రకళాయతే నమో! 1

వాయన రమ్ము దేవయని పల్కుటయే యగు ద్రావిడోక్తి వా
వా యని యెంత పిల్చినను పల్కవు ద్రావిడదేవ! భాష రా
దా? యనుకూలతన్ గనవ? ద్రావిడి నాంధ్రుఁడ నీవు నెప్పుడో
వా యని నన్నుఁ బిల్తువని వాలిన భక్తిని వీను లొగ్గితిన్ ॥ 2

చదువన్ వేసిన నున్నకొద్ది మతి నాశంబైన దన్నట్లు బె
ట్టిదమై తోఁచు విభేదముల్ కనము కంటిన్ నమ్మియాంధ్యమ్మునం
దెదియున్ భేదము కానరాదనుచు నింతే సత్యమౌనంచు దు
ర్మదమై నిన్నును ద్రావిడిన్ జలిపి కొంపల్ తీయుచున్నామయా! 3

చనువు కొలంది యీ పగిది సాగెడి మాటల కేమిగాని రా
యని నను వాయటన్న నొకటౌ నవి రెండును జేర్చి రావయా
యనినను నొక్కటే యగు యథార్థముగా నొకచోట లేక యుం
డిన గద వచ్చి చేరుటకు నీ వయినన్ ద్వరనందఁ జాలుటల్ ॥ 4

ఉండియు లేని యట్లును మఱొండెదొ యున్నది యున్నదిద్ది వే
ఱొం డెది లేదు స్పష్టముగ నుండి కనందగు దాని మిథ్యగా
ఖండితమున్ బొనర్చి యొక కంటికి రెంటికి మూటికైన నె
న్నండును గానరాని నిను నమ్ముటయున్ బొనరించె దీ వహో! 5

వంచక మీ ప్రపంచకము వంచకుఁ డీవును వాస్తవంబు క
న్పించక, కానవచ్చు నది పేరును రూపమె, నాకులేవు, న

న్మించవు, నిత్య సత్యమును నేనె, సనాతనుఁడన్, స్ఫురింతు, న
న్నెంచు మటందు వీ-వొకట నేని నిజాయితి కాన నౌ నొకో! 6

మోసమెయౌ ప్రపంచమున మోసమె సత్యమగున్ గరిష్ఠ లౌ
క్యా సమ ధీ విశిష్టులకె యన్నియుఁ దోఁడగు నచ్చు తెల్వి, యే
మోసములేని, దీ జగతి మోసము బట్టబయల్ పొనర్చి వి
ద్యా సముపేతుఁజేయునది యక్కఱ లేనిది వ్యర్థమైనదిన్॥ 7

ఏరో యమాయికుల్ మన కివేల వినోదపు లోకలీల లీ
సారి శివాజ్ఞచే మనుజ జన్మము వచ్చిన దెంత పుణ్యమో
జాగరనిత్తుమే యనుచు స్వామిని నిన్నె వరించి సర్వ సం
సార విరక్తులై మనుచు సాధన లందె నిమగ్ను లౌదురున్॥ 8

వారే ధీరులు దేహ పాటవము తప్పన్ లేదు, భోగంబు ల
వ్వారై యెట్టెదుటన్ మమున్ గొనుఁడు తృప్తస్వాంతు లీరై సము
ద్ధారం బందఁగఁ జేయుఁ డంచు నిలువన్ దత్త్వజ్ఞులై ధారణా
ధారంబున్ గొని భోగజాతముల చెంతంబోరు సామాన్యమే! 9

కశ్చిద్ధీర యటంచు కారక మహోకంఠోక్తిగాఁ జెప్పె న
త్యాశ్చర్యంబగు గాదె కోటి కొకఁడట్లై కాంచు కైవల్య, మా
యుశ్చాంచల్య మెఱింగి వైషయిక మెట్లూర్పున్ బ్రతారించునో
నిశ్చయమ్ముగఁ జూచుచున్ దగులు టెంతే మౌర్ఖ్య మౌనే గదా!

కేవల భావనంబునన కేవలతన్ గనినట్లు వెన్నపై
మోరగ రాకయున్న పెనుమోత భరమ్మఖిలమ్ము మాయమై
పోవ సుఖస్థితిన్ విరతి పొందిన యట్లుగఁ దోఁచుచుండెనో
దేవ! దయామయా! వెనుక దీయక తోఁడ్కొని పొమ్ము వెంబడిన్॥

పంచమమైన యీ పదము వాది, వకారము సాధబీజ, మే
వంచన లేదు, తత్ఫలమె, భావము నం దమృతమ్ము లూరుచై
సంచిత పాప సంచయము సర్వమడంగి యనంత సౌఖ్య మి
ల్లెంచిన మాత్ర నబ్బినటు లేదో మహత్త్వము చూపుచుండెడిన్॥

# సుభగా విజయ వృత్తాంతము

స్వామి! కనందగున్ విజయ సౌధము నీయది చీఁకటిన్ స్వధా
మామిత కాంతిఁ జిల్చి సదయా యిటు రమ్మని కూత వెట్టునో
యేమొ ప్రయాసమైనదని యించుక తాళుము వచ్చినట్టులే
సోముని నీటఁ జూచికొను సోముని పోలిక తృప్తినందెడిన్. 13

సరిగా నిచ్చటి కుత్తరంబుగను క్రోశం బున్నదంతే పర
స్పర మొక్కింత సహాయమై మనుట నే సౌందర్య మువ్వొంగునో
యెఱుఁగంగా నటుచూడు, మేటి దరినా యీ శాలయం బెంత సుం
దరమై యున్నది వచ్చి వచ్చి యట తిష్ఠన్ వేసె నే సామిరో॥ 14

కొద్దిగ పశ్చిమంబునకుఁ గోరి మలంగిన యేటి గట్టుపై
నొద్దిక కూరుచుండి యట నొయ్యనసొంపుగ నాడుచున్న యే
ముద్దియనో కనుంగొనెడి మోదముతో నది వంకఁ జూచుచున్
దద్దయు కాల ముండఁగల దైవము సుందర సుందరుండగున్॥ 15

సత్యమె సుందరంబు శివ సంపద వానిని నీ వెఱుంగవే
సత్య మహేశ్వరుం డతఁడె సర్వ మహీతల రామణీయకం
బత్యమితాదరంబున విహాయస మందున నుండి చూచి సం
స్తుత్య మిదే యటంచుఁ బొడసూపెను వింతగ దేవితోడుతన్॥ 16

అర్థనారీశ్వర ఖ్యాతి కనుగుణముగ
వామ భాగస్థ పార్వతీ కోమలాంగ
సంగ సంజాత పులకోద్గమాంగ లింగ
రూపుఁడు శివుఁడు కలఁడపు రూపముగను॥ 17

అట్టిచో తెంచు కొనుటందె యతని గరిమ
పరమ సౌందర్య వేత్తృతా పటిమ తెలియు
నతని యంతటి వాఁడె మహత్త్వ మెఱిఁగి
భక్తి సేవించు భాగ్యమ్ముఁ బడయఁగలఁడు॥ 18

అచ్చట నుండి నీవు కను మాదెస యంత విశాలభూమి, నిన్
మెచ్చఁగఁ జేయు వృక్షతతి మెండుగనుండి యెడంద నిండుగా

నచ్చుపు భద్రభావమున నందగఁ జేయును శాంతి సర్వ సం
పచ్చయ శోభితంబయిన పట్టది, దానికి దక్షిణమ్మునన్॥ 19

కొసఁగల కోవెలన్ దరిసి కోరి యవాచిని గాంచుచుంటి వీ
దెసఁ బయినుండి నీ పదము ధ్యేయముగా ప్రవహించువాగు, త
ద్బిసరుహ నేత్ర వెంబడినె పీరుఁడు సుందరుఁడైన శైలరాట్
ప్రసవ శరుండు, నా నడుమ వాయు మయాత్మ శివాలయంబునన్॥

మువ్వురు మువ్వురే విరియు మోదము పట్టగలేక వాలుగా
రివ్వన వీచు గాలులకు రేగెడి జుత్తు పటాంచలంబులున్
మవ్వము గూర్ప మాటికిని మార్చుచు మార్చుచు మూటివంక దా
దవ్వుల నుండి చూచు శుభదంబగు పుణ్య మదెంతవారికో॥ 21

ఆ గాలి నీ తనూ వ్యాప్తృతి నందంగ
శివు కౌగిలింత వాసించినట్లె
ఉడు గణంబుల వెల్గు పొడల జరీ తళ్కు
వలి పెమ్మతో వచ్చు వాహిని గన
హైమవతీదేవి యనురాగ సుధ పొంగ
వాత్సల్యమున వేగ వచ్చినట్లె
శ్రీ కాళహస్తీశ శివ శిరోభూషణ
శశికాంతి నీ పయిన్ సాగినట్లె

నీవు నీవొచు నుండనే లేవటందు
మానుషత్వంబు సంసారమాయ సర్వ
మంతరించిన యట్లాచు సంతసమున
నీవు నీవైన మహిమ శాంతిని భజింతు॥ 22

అట్టి పట్టున సత్యేశుఁ డధివసించి
యుగ యుగమ్ములుగా నుండ నుర్విజనులు
ధర్మ మున్నన్నినాళ్ళు తద్దయును భక్తి
నిత్య పూజలు జరిపి నిర్నిద్రముగను॥ 23

వాని తనియించి ఫలములన్ బడసి యుండి
రి ప్పు డే కారణముననో యెవ్వ రచటి
కెంత పిల్చిన వెడల ర దేమి చేటొ
స్వామియని భ క్తి యనుమాట వదలివేసి॥ 24

ఉరక వాహ్యాళి కని యేగు నూహామైన
పుట్టకున్నది యిది యేమి పోవుకాల
మో యెఱుంగము కలి మహా పూరుషుండు
జీవ సుఖ మెట్టిదైన హర్షింప లేఁడు॥ 25

అంగము కల్గు దేవత స్వయంభువె యైనను పుట్టువేళ యుం
డంగ తదీయమౌ ఫలము తప్పదు జాతక మొక్కరీతి సా
గంగ నసాధ్యమౌ నెవరికైనను కావున నీ శివుండు చే
యంగల దేమి? సౌఖ్యముల నందెడి కాల మదెప్డు వచ్చునో? 26

వెనుక మహా విభూతిఁ దన వెల్గు జగంబుల నెల్ల నింపఁగా
ని న శతకోటి దీధితుల నేపు వహించిన వాఁడె శక్తి నేటికిన్
దనకడ నున్నవాఁడె యరుదారగ నిప్పుడు కూడ కొంద ఱా
యనఁ గనఁబోయి మ్రొక్కికొని యద్భుత సిద్ధుల నందుచుంద్రహో॥

ద్వాపరమందు కృష్ణభగవానుఁడు కాయము తాల్చియున్న యా
పాపపు వేళ - నే మనెదు? పాపమ? పాపమె మానవుండు ని
ష్పాప పత నున్నచో నతఁడు పాప మదేల శరీరమంది సం
తాపము నందగా వలయు? తప్పక యే యటు వచ్చెగావునన్॥ 28

అఘములు హెచ్చి ధర్మ మడుగంటిన యప్పుడె యుద్ధరింపగా
రఘుకుల రాముఁడో నరవర ప్రియ కృష్ణుఁడొ యాచు నార్తుఁడై
మఘవుఁడు వేడికో హరియు మానక భూమికి వచ్చి దత్తుఁడై
యఘు మడఁచున్ సదాత్ములకు నండగ నిల్చి సహాయ మయ్యెడిన్॥29

అటుల మహానుభావుఁ డతఁడార్తి నడంపగ వచ్చువేళ నే
చటుల తపస్సులన్ జలుపు సాధులు నుండిరి రాక్షసాంశ లు

త్కటమయి క్షత్రవంశముల కాయములన్ ధరియించి యుండెఁ ద్రో
క్కటమయి భూ భరం బడపగాఁ బనియైనది వెన్నదొంగకున్॥ 30

నాటి కథా విశేష మిది నమ్మవుగాని నిజంబు గాగ ని
చ్చోటనె సర్వ భూప్రజలు చోద్యము నంద విశిష్ట దంపతుల్
పాటవ మొప్ప దుర్భగ విపాటనమున్ బొనరించి స్వామియే
యాట తటస్థమయ్యె గుడియందులకున్ బలమైన సాక్ష్యమా॥ 31

పుష్కర పుత్త్రుఁడా విజయ పుణ్యుఁడు పుట్టె నవంతి దట్టుఁడై
దుష్కర విద్యలన్నిట సుదుస్సహ యత్న మొనర్చి జ్ఞానవాఁ
పుష్కలుఁడంబుజాసన సముండని పేరు గడించి యన్నిటన్
నిష్కలుషుండడై పరమనిష్ఠ కృతార్థత గాంచె మీఁదటన్॥ 32

ఆతని వర్తనంబున నొకంతట నెవ్వరు వేలు చూప లే
రాతని కాతఁడే దొర యటయ్యను లోకము చిత్రమైన దే
దో తన మాట వేయక యెదుర్కొనకుండ దదెంతవారి న
ట్లా తఁడు నొక్కమాట పడనయ్యెను సత్యము కాకపోయినన్॥ 33

చక్కని వాఁడతండు కడు చక్కని దాతని భార్య యిర్వురున్
మిక్కిలి మంచివారు కలిమిన్ బలిమిన్ గుణశీలవంశ తా
దృక్క మనీయ సర్వ పరిదృష్టుల యందును తుల్యులే మరిం
కెక్కడ గట్టి జంట జను లెవ్వరు చూడగ లేరు భూమిలో॥ 34

అందఱవంటి వారగుచు నందఱ పోలిక యీడు జోడుగా
బందుగు లందఱున్ దరిసి బ్రహ్మయె వీరికి వ్రాసిపెట్టె నే
కం దిసుమంత లేని యొకసంబగు జంట యిదొక్కటయ్యె వై
శంబ శుభాని కెప్పుడు విలంబము కూడనిదంచు మ్రోయగన్॥ 35

పుష్కర శంభురాతు లటు పూజ్యులు బందుగులాడు మాటలన్
నిష్కలుషత్వ మెంచి తమ నిర్ణయమున్ జవదాట నట్టి యా
నిష్కలుషాత్మలన్ దెలిపి నిక్కముగాగ పరస్పరంబు మ
స్తిష్కములందు ప్రీతి విరజిమ్మ మరుండు జయంబుగాంచుటన్॥ 36

ఒక సుముహూర్త మబ్బిన మహోత్సవ మొప్పగ నుద్వహంబు వే
డుక జరిపించి రెల్లరు కడుంగడు మోదమునందఁ గాల మం
దకలుష వైఖరిన్ దనువు లంకిత మాటకు యోగ్యవేళయున్
బ్రకటిత మయ్యె నాటి నిశి వారి చరిత్రము చిత్రమయ్యెడిన్॥ 37

యువకుఁడు నందగాఁడు విజయుండు వివేకి ప్రియానిరీక్షమై
వివిధ మనోజ్ఞ దృశ్య సముపేత కళాభవనంబు నందు ప
ల్లవ మృదు శయ్యపై నొరగి లాస్య మయూరిగ దేవి వచ్చు వై
భవమును జూడ దృష్టి నటె పాయక యుంచి తపించుచుండగన్॥ 38

సుభగా నామక వాని కాంత హృదయ జ్యోతిన్ సముద్దీప్తమై
సభ యాత్ముల్ వెలి జిమ్ముచుండ నడలో సంకోచ సామ్ముఖ్యముల్
రభ సంచార పెనంగుటన్ ముగుద భద్రాకార మత్తేభరాట్
విభవోపేత పదక్రమాభ్యసన ప్రావీణ్యంబు చూపించుటన్॥ 39

విజయుఁడు చూచి చూచి తన వీనులలో నొక వింతనాద ము
ద్భిజ మన మెల్లగా పొడమి తేనియ సోనగ తాకుచుండ నా
రజ మయి తన్మయత్వమున ప్రాణపదంబుగ క్రోలుచుండి వా
రిజ భవు వారువంబు వలె ప్రేయసి చెంతను వాలు టెంచుచున్॥ 40

ఎఱిఁగి యెఱింగి పెద్ద లిటు లిర్వురకున్ సమకూర్చిపెట్టి, రా
యిరువురు నిట్టివేళ నిటు లెవ్వరు లేని కళాగృహానఁ దా
మరుదుగ కూడి కొందురని యాత్రముతోడ నిరీక్ష చేయగా
నొరిగిన రమ్యవేళ నెటులుండగబోలునో యట్టులుండిరా? 41

ఉండక యేమి లోపమిట నున్నది చూపులు చొక్కులన్నియున్
దండిగ నుండె ముగ్ధయయి తన్వి సఖీజన వాక్య సంస్మృతిన్
కొండగ నున్న లజ్జయును గొండికగా పతి చెంతవాలి కూ
ర్చుండెను వాణి వారువమె రూఢిగ వాలిన దన్న యట్లుగన్॥ 42

ఆతఁడు నామె పార్శ్వమున నానుక యుండగ హంసి ఱెక్కలన్
బ్రాతిగ నంటి నల్లి స్వకరంబును చాచి ప్రియాంగనా మనః

ప్రీతికిఁ జేరదీసినటు ప్రీతి వహించెను కాని వీనికిన్
హేతు వదెట్టిదో తెలియ దెక్కడ తోఁచవు కామభావముల్॥ 43

గర్భాధాన గృహంబునం దిరువురా కల్యాణ కాలీయ సం
దర్భంబున్ గొని యాడి హాయిగ నిరాతంకంబుగా స్వేచ్ఛమై
నిర్భీతిన్ రమియింపవచ్చును కళానిర్వృత్తి పారమ్యముల్
స్వర్భోగంబు నధఃకరించుచు రసాస్వాదంబు నందందగున్॥ 44

అట్లైయైన విశేష మేమి? యపుడాహా యాల్మగల్ వారు తా
మ ట్లేకాంతము నందు శయ్యపయి నన్యోన్యంబు బాహ్యాంతరం
బెట్లున్ దప్పని దన్న యట్లె తడవట్లే యుండి యల్లంతలో
పొట్లంబైన సుమంబు విచ్చినటు కూర్పున్ వీడి యొక్కొక్కరిన్॥ 45

కన్నులఁ గన్నులుంచి యెద కాంక్షలు వెల్వడఁ జూచి చూచి రా
గోన్నతి సర్వమాంతర ముహుర్మథనంబున పక్వమైన య
ట్లెన్నఁడు మున్నెఱుంగని మహిష్ఠత గూర్పగ నామె లేచి కాం
తున్నయ నంబులన్ దనియ నోపక త్రావెడు నట్లు చూచుచున్॥ 46

నాథా! మోహము చిత్రమైనయది జ్ఞానం బార్చివేయున్ శిరో
వేధన్ గూర్చు నిదేమి యిట్లయితిఁ దన్విన్ మీకు సేవామతిన్
బాధన్ గూర్చిన సైచి నాకునయి యీ పాల్గ్రోలుఁడంచున్ సుధా
మాధుర్యంబు నడంచు క్షీరములఁ బ్రేమం బార నందించుచో॥ 47

పాత్రం గైకొని యాతఁ డాత్రమునఁ "జెప్పన్ దప్పగా దేమొ నీ
గాత్రం బీ దెస మెల్లగా నడచి రాఁగాఁ జూచి తల్లంతలో
నేత్రంబుల్ చిఱుమూత పడ్డయట్లై నిర్వాణ తుల్యంబుగా
శ్రోత్రంబందు నినాద మెయ్యదియొ యుచ్చుంబోలె విన్పించినన్॥ 48

ఒడ లొక్కింత యెఱుంగకుండుటయె కాదో బాల! లో తెల్విలోఁ
బడి యుంటిన్ మరి నీవు వచ్చినది నా పార్శ్వంబు నందున్న దే
వడువున్ దోపదు చేయి నీ బుజముపై వాలెన్ మరేదైన నీ
వడుగన్ జాలితొ నేను చెప్పితినొ నాకై గుర్తు లే దింతయున్॥ 49

అని విజయుండు చేఁగల పయస్సుల గ్రోలుచు నుండ "మన్మనో
ధన నిఖిలాపహారి విబుధా! విజయా! విజయమ్ము నీ కగున్
నినుగని నప్పుడే తనువు నీయది డెందము నీది కొంచెమై
నను మిగిలించి నాదని యనందగ దన్న మనంబు గల్గుటన్॥ 50

అవి యివి చెప్పి నెచ్చెలులు హాస్యము లాడుచు నన్ను వీడి పో
వివశత నందియున్న తను విద్ది యెటుల్ కదలాడె నెట్లు నీ
సవిధము చేరె నీ కరము సాగి ననున్ స్పృశియించుదాక నా
కవగతి లేకపోయినది యప్పుడు వేఱొక పారవశ్యమై॥ 51

విచ్చిన పూవు వృంతమును వీడి చ్యుతంబగు నట్లె వచ్చి నీ
పచ్చని పట్టునం బడితి వల్లభ! నన్నిఁక వేఱు వ్యక్తిగా
మచ్చునకైన నెన్నకుము మాటల చేతల నూహలందునన్
నిచ్చలు నీ కభిన్ననయి నీవె యనం దగి యుంటి నాయకా!॥ 52

అనుచు నిపీత శేషము పయస్సును కన్నుల కద్దికొంచు భ
క్తిని గొని యాకులన్ ముడిచి కీరము లన్నటు చుట్టి యిచ్చుచో
ఘనుఁడతఁ డందికొంచు చిబుకంబును బట్టి ప్రియాంగనా ముఖం
బునఁ గనులుంచి చూచుచునె "పోలునె దేవి! త్వదుక్తి కిద్దియున్॥

నీ వనినట్లె నీ వయిన నే నతి ధన్యుఁడ లేనిదేమి యే
దైవము నిన్ను నన్నిటుల దంపతులన్ బొనరించెనో యదే
దైవము నన్ను నీ యెడల దాసమతిన్ వరివస్య చేయు మం
చే విధి నైన దేవి కృప నెప్పుడు కోరు మటంచుఁ జెప్పెదిన్॥ 54

దేవీ! నీ విడు తమ్ములమ్ము గొన నెంతే వాంఛ కల్గెన్ గృపా
వైవశ్యమ్మున నీ గదే" యనఁగ నా వాత్సల్య పూర్ణాత్మత
ద్భావమ్మున్ గ్రహియించి నోటనిడి పుత్త్రప్రేమ నోల్కించెఁ ద
త్సేవా విస్మృత సత్కవిత్వమున భక్తిన్ దేవిఁ గీర్తింపఁగన్॥ 55

స్త్రీమూర్తీ! త్రిగుణాన్వితా! ప్రకృతి! కంఠింబోలు నీ తత్త్వమున్
వ్యాముగ్ధాత్ము లెఱుంగఁజాలరు జగద్వ్యాపార రూపాత్మవై

సామాన్యుఁ విశేషుఁ బొనర్చెదవు వాత్సల్యమ్ముతో నేరి నీ
వామోదింతువొ వారికే కలుగు నిన్నర్చించు సద్బుద్ధియుఁ॥ 56

సతిగా వచ్చి ననుఁ బ్రియాత్మజునిగా సాకఁ గృపావార్ధివై
మతి సిద్ధంబయి నిల్చి నా వనిత నమ్మఁ వచ్చునే తల్లి! మో
హితుఁగాఁ జేయక పూర్ణవత్సలత నన్నే వేళ రక్షింపు మీ
బ్రతుకుఁ బెంబడినుండి కాచి తుది సాఫల్యమ్ము నందింపు మీ! 57

నతు లర్పింతు మదీయభార్య గతి నీ నా జీవితం బేలగా
నతి లోకాద్భుత సుందరాంగి వయి నాయావాసముం జేరితే
నుత నానావిధ సేవలన్ జలిపి నిన్నున్ మెచ్చుగాఁ జేసెదన్
సుతుగా సాకి కృతార్థుఁ జేయుము సుధాస్రోతస్సు లందించుచున్॥

పతి సతి నట్లు స్తోత్రములు పట్టుచు నుండ సతీ మనస్సు త
త్పతి పయి నెట్టి భావము నవశ్యము పూనును? మాతృభావ మం
దతివ స్థిరంబుగా నిలువ నయ్యెడి కార్యమె? కోర్కె యుండియున్
సతిపతినట్లు బిడ్డవలె సాకఁగఁజాలునె చూడనయ్యెడిన్॥ 59

కార్యము లందు దాసి, గృహకార్య వినిశ్చయమందు మంత్రి, మా
త్సర్య విహీన రూపగుణ సంపదలక్ష్మి, ధరిత్రి యోర్పునన్
భార్యయె మాతయై నిను నపారకృపన్ గని పెంచు, శయ్య యం
దార్య మనోభిలాషఁబడి యాను తిలోత్తమ రంభ యెవ్వరేన్॥ 60

అనియెడు శాస్త్ర వాక్యముల నమ్మయు నౌ నను మాట యున్న, దై
నను పతి నట్లు చూడఁగల నారి లభించునె యెచ్చటైన? క
ల్గిన ప్రియనందనుండు పతికిన్ బ్రతిరూపముగాన వానికిన్
జనని నె తండ్రికిన్ జనని నా వచియించుట సాధ్యమౌనొకో! 61

మగనికి తల్లియౌ మగువ మాన్య జగత్త్రయ లోకమాతయే
యగును, సమంజసంబె యది, యామెకు మాతృత స్వీయధర్మమౌ!
తగునొకొ తల్లియౌ మగువ దారగ నెంచుట యట్టి సేత చే
సగు నతఁ డంబకున్ మగఁడు నట్లనఁ బాశవ మీశ్వరత్వమౌ! 62

అంబ మగండె సాంబ శివుఁ డాతని కంబయె లేదు, సర్వలో
కాంబకు భర్తయై యతఁడు నంబ మగం డనఁ జెల్లె నల్లె లో
కంబునఁ దండ్రు లందఱును కాని నిజాంబకు భర్తయైన వా
నిం బతి వన్న చాలదు కనీసము పశ్వధముం డనం దగున్॥ 63

శయనాగారము ప్రేయసీ ప్రియుల స్వేచ్ఛాగేహమై పోక దే
వియు భర్తుండు నిగూఢముల్ కను సమావేశస్థలంబయ్యె స్వా
శయముం దెల్పి శరీరభోగమున కాశంజూప కానంద చి
న్మయ దేహంబున ధర్మపత్నియగు చానన్ బొందు ధన్యత్వమై॥ 64

వాహినియున్ సముద్రుఁడును పాఱెడి మూర్తులు గడ్డకట్ట నే
మోహము లేక యంటకయె మోదరసస్థితి నున్నయట్టు లీ
దేహము లంటకుండినను దేహి యొకండు రసస్వరూపుఁడై
యూహల నేల వారి మధురోహల యూయెల స్వామి యూడెడిన్॥

దినముల్ సాగుచునుండె బంధుతతి తద్దివ్యత్వమే కొంచెమై
నను గన్పట్టగ లేకపోయినది యానందంబె పొంగారు చుం
డను సందేహము లేల కల్గు? నిజమాడన్ వారి దాంపత్యమున్
గని యోహో యనుకోని వారు గలరే గార్హస్థ్య సీమావధిన్॥ 66

నరుఁడు గృహమేధి యగుట సంతతిని గోరి
యనుట సత్యంబె జీవితంబునకు లక్ష్య
మేది యన్నను తుది మోక్షమే యగుగద!
భోగమున శక్తితోడుత సాగవలయు॥ 67

పరమ పురుషార్థ మందించు కొఱకె యన్ని
యాశ్రమంబులు వర్ణముల్ యజ్ఞములును
జీవుఁడున్నట్టి స్థాయి తజ్జీవ యాత్ర
యెట్లు సాగిన సఫలమో యెఱుక పఱచు॥ 68

కాయములు కల్గు భోగ మోక్షముల కొఱకు
భోగమున పాపపుణ్యాను భూతి యగును

కృత ఫలమ్ములఁ నందుచు బ్రతికి యుండి
యెట్లు బ్రతికిన ముక్తియో యెఱిఁగి బ్రతుక॥ 69

అట్టి జన్మంబు చారితార్థ్యంబునందు
బ్రహ్మచర్యంబె మోక్షార్థి వ్రతము గాఁగ
విజయ సుభగాంబ తన ప్రియ విభుని చేత
నాతిగల బ్రహ్మచర్యంబు నడపఁజేసె॥ 70

వాలు పయి నడక యగునిది
యే లౌల్యము లేని ధీరులే యిటు పోఁగాఁ
జాలుదురు వీర లిరువురుఁ
జాలిరె జనియించి యిట్టి జత కట్టిరొకో! 71

మన పురాణంబులం దిట్టి జనులు పూర్వ
ముండి రన్నట్టి కథలు చెప్పుటకు ముందె
నాకుఁ జెప్పకు మిట్టి సన్యాసి కథలు
అట్లు బ్రదుకుట మనుజ సాధ్యంబె కాదు॥ 72

సంఘమును వీడి చని మనుజ స్వభావ
మించుకైనను దెలియని క్రించెవండొ
ఉత్తమోత్తమ మంచుఁ బెల్లూహ చేసి
చెట్ట కథలల్లి చెప్పెఁ దాఁ జెడ్డ కోతి॥ 73

అనుచు దురుసుగఁ ద్రోఁచి నట్లనెడి వారె
నేఁడు బహుమంది వారి కింతిని గనంగ
గంగ వెఱ్ఱులు పుట్టు నాగంగ లేరు
కాన నట్లందు రంతియే గద నిజమ్ము! 74

పూర్వ యుగముల నే కాదు పుణ్య పురుషు
లుద్భవింతురు దుష్కలి యుగము నందు
ఘోర కలి పెచ్చురేగి క్రమ్మింగుచునె యుండ
శారదా దేవి ప్రభవించె భారతమున! 75

ఆమె సహధర్మపత్ని శ్రీరామకృష్ణ
పరమహంసకు, వారి దాంపత్య మెట్లు?
సంసరించిరి? సంసార సాగరమున
నమృత పాథోధి విహరించు హంసలయిరి! 76

చెవులు చెవులకు మధ్య కొంచెమ్ము తెలివి
కలుగువారలు విని వినఁ గలుగు వారి
కిట్టి వా రుండిరని చెప్పి యెంతయేని
భక్తి మ్రొక్కంగఁ దగిన దంపతులు కలరు! 77

పేరు ముందేల చెప్పుట? విన్నయంత
వీరలా వీరలం గూర్చి వినియె యుంటి
మదియు నెవ్వరో కల్పించి నట్టి కథయె
మనుజమాత్రులె యట్లుండి రనుట తగదు॥ 78

అనుచు విన్నట్టి దాని వెన్కను గలట్టి
తత్త్వ మారయ కురక చెత్తగ గణించి
త్రోసి వేయుట యేగాని వాసి గాంచి
యట్లు కావచ్చు నని యైన నాస పడరు॥ 79

తెలిసినది యైన క్రొత్తగాఁ దెలియుటుండు
నెవని ముఖవాణి యెట్టిదో యెవ్వ రెఱుఁగు
దు రది కావున వినుట కాతురత వలయు
విని విచారించి సత్యమున్ గనగ వలయు॥ 80

ఆయన పండితాగ్రణియు నాత్మ విచార పరత్వ నిష్ఠచే
నేయది యేమి యైన నొక యించుక యేనియు లెక్క సేయ కూ
హాయతి లోనలోనఁ జరమావధి చర్చ యొనర్చుచుండు టే
ధ్యేయము గాగ జీవితము తీర్చిన పుణ్యులు బ్రహ్మవేత్తలున్॥ 81

తరుణమునందె పెండ్లియయి తన్వియు వచ్చిన దత్తగారితో
సరసముగాఁ జరించి పరిచర్యను పెద్దల మెచ్చఁ జేయుచున్

వరవు డనంగ నిల్చినది వర్షము లేగిన వత్తమాామలున్
దరలిరి పెత్తనమ్ము తనదై గృహ బాధ్యత పూనె నెమ్మదిన్॥ 82

పరముఁ డతండు నిత్య విధి వాలును భోజన మాాచరించు స
త్వరుఁడయి చింతనమ్మునను వ్రాతను శోధనమందు మున్గెడిన్
జరుగుచు నుండె నిల్లు తన సాధన సాగుచు నున్న దింకఁ దా
నరయు పనేమి యున్న దటు లర్ధ శతాబ్దియు దాటె నెట్టులో॥ 83

తన పనియందె తాను నిరతమ్ము నిమగ్నుఁడు లో మునింగి యో
చన మొనరించు చుండుటయొ సాగి జపంబున మున్గి యుండుటో
మనసయి వ్రాయుచుండుటయొ మాానక యధ్యయనంబుసేయుటో
తన కశనం బదెట్లు తరి తప్పక వచ్చునొ నేరఁడాతఁడున్॥ 84

ఎనుబదియేండ్లు వచ్చినవి యింతియు నెత్తిన ముగ్గు బుట్టయై
పెనిమిటి నట్లె కొల్చినది విశ్వమెఱింగిన పెద్ద పండితుం
డనితర దుర్లభుండు తనకయ్యెను భర్త యిఁకేమి కావలెన్
వనితకు భర్తృసేవనమె వాలిన పంట కొఱంత లేదటన్॥ 85

పడమటి సంజ వాలినది భామిని దీపము గొంచుఁబోయి యా
తఁడు కలచోట నుంచినది తన్వియె తన్వియె తన్వియెవ్వరో
"పడఁతి! యిటేల వచ్చితివి? వచ్చితొ యెవ్వరుగాని పంపిరో
నుడువు మటన్న "దైవమ! కనుంగొను మే నిట నింటి కోడలన్॥ 86

అరువది యేండ్ల క్రింద తమ యాశ్రయమందితి నాటినుండియున్
నిరతము సేవచేయుచునె నీరజ బంధుని రాక పోకలన్
పరిగణనం బొనర్చుచునె వాలిన జీవితమయ్యె నేటికిన్
గురుకృప గల్గి నా పయిని కూర్మి ననుం గనుగొంటి రయ్యరో! 87

జని చరితార్థమయ్యె నిఁకఁజాల కృతజ్ఞ" నటంచు మ్రొక్కుచో
విని తనువెల్ల నిక్కగను విస్మయ మందుచు "నీవు పత్నివా?
నినుగొని నట్లె నాకు స్మృతి నిల్వక పోయినదేమి సేసెదన్
మనము బహిర్ముఖంబగుట మాానెను జ్ఞానసమాధి మగ్నమై॥ 88

ఐనది యేమొ యైన దీఁక నాత్మసతిన్ నిను విస్మరించితిన్
మేనిది నీదు సేవలనె మేనయి యున్నది యింతదాఁక నీ
కేను కృతజ్ఞతా మతి నహీన వరం బొకఁడిత్తు కోరుమా
చాన!'' యనంగ ''మాతృత నొసంగుము స్వామి!'' యటంచు
వేడినన్॥ 89

మరల మరింత విస్మితుఁడు మాన్యుఁడు భామిని తేరి పారగా
చురుచురు చూపులం గనుచు ''సుందరి! యీ వయసేమి? యిప్పుడా
వరమెటు లబ్బు? కోర్కె యిది వ్యర్థము కాఁ జన దందుచేత మ
ద్వర రచనంబు నీ స్మృతిగ భామతి యయ్యెడుగాక యింకిటన్॥ 90

శిష్యులు పుత్త్రులే యగుట శ్రీమతి భామతి! ఈ మహాకృతిన్
పోష్యమటంచు నెంచు బహుపుణ్యులు బోధ్యముగాగ నెంచు స
చ్ఛిష్యులు నీకు పుత్త్రకులె చింతను వీడుము నాదు మాటచే
శిష్యకు నీకుఁ బుత్త్రవతి చెందెడు లోకమె చెందుగావుతన్॥ 91

అని దయఁ జూచెనంట! తన యంతటి జీవితమందు నింట నుం
డిన కులకాంతనే యెఱుఁగఁడే యది యేమి సమాధి? యట్టివా
నిని నిజభర్త నట్లు చిరనిష్ఠ యజించిన యామె యెవ్వరో
మనుజులె మానవోత్తములు మాన్యులు మానవ జాతి కంతకున్॥

వాచస్పతి మిశ్రులన్
వాచస్పతి తుల్య బుద్ధి వైభవ మొప్పన్
ధీచణ మోదావహ మగు
వాచా మహిమంబు గల్గు భామతికారుల్॥ 93

అట్టి వారలు పాడమెడు నట్టిచోట
నిట్టి వా రుండి రనఁగ నదేమి భ్రాంతి?
దేహ మనునది కట్టె సందేహమేల
దేహియేదానిఁ దన యిచ్చఁ దీర్చికొనును! 94

తనువు నిమిత్తమాత్రమగు దానికి లొంగిన నద్ది యేలికై
నిను తన దాసుఁ జేసికొని నీ రథులన్నిటిఁ గ్రోలఁజేయు, దా

నిని నియమించి నీ యదుపు నెక్కొనఁ జేసినఁ జెప్పినట్లుగా
పని విను స్త్రీయుఁ బూరుషుఁడు వర్తిల లేరొ శివ స్వరూపులై॥ 95

సుభగా విజయు లవంతిని
శుభమతులని కోరి వెడలి చూడఁ దగిన దు
ర్లభ దంపతులని జనములు
సభలను వచియించు దాఁక సాగె యశస్సుల్॥ 96

ముదిత మనస్కులై మెలఁగు మోహన మూర్తులు శశ్వదాత్మ సం
పదకయి నిర్విరామముగ పాటు పడంజను పుణ్యదంపతుల్
గదిసినవారి నెల్లరను గాఢహృదబ్జము విచ్చి యందులో
పదిల మొనర్చు నట్టి మృదుభావులు వారికి వారె యీడహో! 97

పడక టింటను వారి ప్రవర్తనమ్ము
తెలియ దెవ్వారికిని వారు తెలుపరుగద
ఎవరు లోనికిఁ జోరుగా వెతఁగి వెతఁగి
యింక నా లీల తెలియు టె ట్లేది దిక్కు? 98

ఏది తెలియుటకైన ధీ చోదకుండె
దిక్కగుం గాక యన్య మేదియును లేదు
శయన గృహమైన నేమి? రే జనుట తగదు
పగలు చూడంగ వచ్చుగా దిగులు తొలఁగ॥ 99

ఎందుల కంత యచ్చెరువు? ఏమి కనుంగొనఁ జాలితందు? రా
ణ్మందిర మెందు బోలదను మాదిరి నున్నది పాలగచ్చుతో
పందిరి పట్టె మంచమున పాన్పు సుధాబ్ధిని శేష శయ్యయే
విం దొనరించు దిండ్లు కనిపించును రెండు మనోహరంబుగా॥ 100

గోడల నిండ బొమ్మలవిగో యిది దంపతులుండు చోటు నీ
వోడక వచ్చి తే మనుచు నున్నవి మూలల సాలభంజికల్
పాడగ నాడగా వలయు వాద్యవిశేషము లొక్కటేమి కొం
డాడుట కేండ్లు పూండ్లు నగు నట్టి యగారము దాని యందునన్॥

దినమును నేక శయ్యపయి దేహము లొండొకటిం స్పృశింపఁగా
వనితయు వల్లభుండు తెలవాఱలు నుండియు నే వికారముం
గనకయె తల్లియున్ సుతుఁడుగా మెలఁగం గల వారు వారు సా
ధనమున కిద్దియున్ దగిన దారియయా దృఢ చిత్తులైనచో॥ 102

ముదుసలి తల్లి దండ్రులకు మోదముతోఁ బరిచర్య చేయు నే
యదనున నిత్యమున్ విడక యన్నియు యజ్ఞము లాచరించు నా
చదువుల తల్లి లచ్చియును చక్కని స్నేహము తాల్చి తన్ను నిం
పొదవఁగఁ జూడ నా విజయుఁ డొందిన సౌఖ్యము దివ్యసౌఖ్యమా॥103

దేశ దేశముల తైర్థికులు సూటిగ వచ్చి
వారింట విశ్రాంతి బడయు చుండ్రు
ఏ మహామహుఁడు తద్గ్రామంబునకు నూత
నాగంతుకుండైన నచటె విడియు
సంతానహీను లా సతి పతులను మాట
తెలియ లే రిల్లు బాలల మయంబు
కల్పవృక్షంబుతోఁ గామధేనువు వచ్చి
జతయయ్యె ననెడి దే జనము మాట
సుజన మూర్ధన్యుఁడైన యా విజయ విప్రు
భార్యయై సుభగ గనె సౌభాగ్యగరిమ
పరమ పుణ్యాత్ము లవ్వారి వందనమ్ము
సకల సౌభాగ్య దాయి నిస్సంశయమ్ము! 104

వారి గృహస్థ జీవితము వంద్యము, సంగ మొకింత లేని సం
సారము, భక్తిబంధురము, జ్ఞాన వినిర్మల, మాత్మ వేత్తృతా
పార కఠోర దీక్షమెయి బాధక మయ్యును సాధకమ్ము, సం
స్కార పునీతమై రసజగద్వ్యాహృతిన్ బరి మోద హేతువై॥ 105

కామ సహస్ర మూర్తి యగు కాంత తనంటత శాంతచిత్తయై
సీమమునన్ బ్రియున్ నిలిపి నిస్తుల భక్తి సమస్త భోగముల్

కామితముల్ కొలంతయని కందువ కైనను దోఁపనీక సం
ధా మహిమాన నిత్య నియతంబుగఁ దీర్చుచునుంట పూర్ణమా॥

స్త్రీ మూర్తిన్ విహరించినంత పడతిన్ స్త్రీ మాత్రమే యందువో
శ్రీమాతన్ దలపించు నన్నిగతులన్ శ్రేయః ప్రసన్నాత్మయై
సామోదమ్మున వచ్చి యాత్మజుని మోక్షప్రాజ్య సామ్రాజ్య పీ
ఠీ మధ్యమ్మున నిల్పఁజూచునటు చేటీయుక్తయై బోటియై॥ 107

సుభగ యని పేరు పెట్టె విశుద్ధుఁ డతఁడు
వినుతి కెక్కెను సౌభాగ్య విద్య గాగ
షోడశిగ వచ్చి చేరె విశుద్ధు విజయు
వేఱె యే మున్న దింక శ్రీవిద్య యగును॥ 108

శ్రీవిద్యా మయమైన వారి గృహమున్ సేవించుకోనెంచి తా
నై విచ్చేసె మృకండు సూనుఁడొకనాఁ డా మాని కాంతామణిన్
దేవిన్ జూచెడి కన్నులన్ గనుచు దేవీ! యంచు బోధించి యున్
దీవించెన్ మనసార మూర జయమూర్తిన్ భర్తనగ్గించుచున్॥ 109

బాబూ! సత్యము చెప్పుచుంటి నిల దాంపత్యంపు సౌభాగ్యమున్
శ్రీబండారము మానవావళికి మీచేఁ జెప్పి చూపింపగా
నా బంధూక సుమాభ యాల్మగలుగా నావిర్భవించెన్ సదా
శ్రీ బుద్ధ్యాత్ములు మీకు నొక్కటేక నాచే నౌన దే మున్నదో?

అయినను తల్లి యే నుడువు మన్నది కావున వచ్చితిన్ మదా
శయమును నట్టిదే నరుఁడు సల్పు శ్రమం బెటువంటిదైన నా
శయము ఫలించు నెప్పుడును స్థానము కాలముబట్టి యుండెడున్
జయమిట మీకుఁ గల్గదు నిజంబు చనుండిఁకఁ గాశిహస్తికిన్॥ 111

అటమును పేను నిల్చిన మహా మహిమాన్వితమైన మంచి చో
టట పదముంచు టేమి ఫల మందుట యేమి విలంబ ముండ దొ
క్కట స్థిరవాసమున్ జలుపు కాంక్ష నె పొందు నిరస్తమోహులై
కటకట పొందనేల యిట కాంతు రటన్ వెనువెంట లక్ష్యమున్॥

అను మార్కండేయుని మా
టనుగొని విజయుఁడు క్షణము నటన్ నిలుచుట కొ
ప్పని మనసై వెనువెంటనె
తన ధన మఖిలమ్ము సంచితమ్ము నొనర్పన్॥ 113

గురుతర యత్నమ్మునరిచి
సరిగా నొకమాసమునకె సన్నద్ధుఁడుగా
నెఱిఁగిన యవంతి వాసులు
విరహము సహియింప లేక బృందమ్ములుగాన్॥ 114

తాము ను సాగిరా విజయ దంపతు లిద్ద రుమామహేశులే
యీ మహనీయ యాత్ర జరిపింతురు చూడుఁ డటంచు దివ్యులున్
ప్రేమను జూడ భక్తి నిబిరీస మనంబుల స్తోత్రగానముల్
స్వామిని గూర్చి వెల్వడగ సాంద్ర ముదంబునఁ దేలియాడుచున్॥ 115

కొండకు దక్షిణాగ్రమునఁ గూర్మి మృకండుజుఁడున్న దివ్య భూ
ఖండము మంగళాయనము గాంచి యటన్ సదనం బొకండు తా
ముండుట కేర్పరించుకొని యూర్జిత మా శివ భక్తి పెంపునన్
దాండవ కేళిలోలు పదతామరసంబులఁ గొల్చుచుండఁగన్॥ 116

విజయుఁడు నిత్యముగ్ దనదు వీటికి వాయు మయాత్మలింగ భా
వజరిపు దేవళమ్మునకు వచ్చుచుఁ బోవుచు దూరమెంచ క
క్కజమగు భక్తి నప్పుడు కాంతను గీమును విస్మరించుచున్
భజనమునందె తన్మయతవాల గతించెను మూఁడు వర్షముల్॥

ఆశ్వయుజ శుద్ధపాడ్యమి యగుట యేమి
దేవి నర్చింప విజయుండు దిగుట యేమి
ఆలయమ్మున కేగి తానచట నిలిచెఁ
దనకుఁ దన పూజ యోతఁ డంతర్ముఖుండు॥ 118

బాహ్య పూజయు సాగింపవచ్చు దాని
కవసరంబైన హంగు లత్యధికములగు

నింటి పట్టున నైన వాల్గంటి తోడు
తో సమస్తము నమరు సంతోషముగను॥ 119

దేవి సాన్నిధ్య మందె తా దీక్ష నుండి
విడువ కర్చింప వలె బహిర్వీధి నటన్న
స్వీయ గృహ మానె తనకు దేవీ నిలయము?
అదియును న్గాక యాంతరం బధికము గద! 120

మూల లింగంబు వాయవ్య మూలనున్న
దివ్య విజ్ఞాన భూమి యందే వసించు
దేవి; యచ్చోటనే తాను దీక్ష పూని
అమ్మ నర్చింప వలె నది యతని వాంఛ! 121

అంతర్యాగ విధానమే వరముగా నాతండెదో మూల నై
రంతర్యా సమ బాహ్య సంస్మృతి విహీనాంత స్సమారాధిత
స్వాంతానంద మహేశ్వరీ మహితుఁడై సాగించె నా దీక్ష రా
కాంతం బందు బహి స్స్మృతిం గనియె ధన్యంబయ్యె జన్మంబనన్॥

సుభగా దేవి తనంత వచ్చినది యా శుద్ధున్ విలోకింప వ
ల్లభుఁ డందందగు దాని నందికొనె నాహ్లాదంబు కాకేమి? దు
ర్లభమా సిద్ధి లభించె క్షేత్ర మహిమన్ ద్రాసంబు లేదించు కే
నభయంబౌనని యింటి కేగినది నాఁడై రాక యాతండురాన్॥ 123

ఒకటియు రెండు నాళ్ల పదునొక్క దినంబుల పైన నాల్గు నా
ళ్లకట శ్రమించె నంచు నబలామణి వానికి సర్వ పోషక
ప్రకరము కూర్మి నిచ్చి మధురంబగు విందుల తన్పి యాతఁడున్
చకితుఁడు కాదు నాక కొని చాన మదిన్ గమనించు చుండగన్॥

కార్తిక పూర్ణిమా నిశిని కాంత తనంతట వాని సన్నిధిన్
పూర్తిగ నగ్నమై జలధి పోలిన శయ్యను ద్వీపమన్నటుల్
మూర్తి విలోకనంబున నె మోహితుఁడై పయి వాలు నెట్లు రా
గార్తి నటన్న వైఖరిని నాతనినే గమనించుచున్నచో॥ 125

ఎన్నఁడు స్వీయదేహమునె యిట్టులు చూడక స్వీయకాంతనై
నన్నడ యాడు పద్మిని యనన్ ముఖమున్ బద హస్త యుగ్మముల్
కన్నులు తప్ప నింకొకటి కానని యా విజయుండు దీక్షతో
నిన్ని దినాలు సర్వజగదీశ్వరినే తలపోయు చిత్తమై ॥ 126

చూచిన దేమి ? చుక్కలను చొక్కఁగఁ జేసెడి నల్ల మిన్ను మీఁ
దై, చెలువారు మీలు సొగసైన మృణాళము లున్న చెర్వు క్రిం
దై, చెరు వంటియే హృదయ హారి గిరి ద్వయ మొప్ప, నవ్వియే
చాచిన కాంతి పూరముల చందమునన్ దగు నాల్గు కాల్వలున్ ॥

సొగయు నెడంద యున్న యెడఁ జూడగ వచ్చు సమస్త దేశమం
దగ జను లోకమాతఁ జిఱు హద్దులనైన సమస్తమందు నేన్
నిగనిగలాడు తల్లి కమనీయ తనూద్యుతియే కనందగున్
మిగిలి యనంతయై జనని మృగ్య యగున్ గనుచుండు సర్వమున్ ॥

మట్టియె కుండలై నటులు మాతృ శరీరము నుండియే సుతుల్
పుట్టెడు నట్లు కోటులయి పొల్చెడు దేహము లన్ని తల్లి లే
కెట్టులు వచ్చు నా తనువు లేమి యగున్ జననీమతల్లియే
పుట్టిన యట్లుగా వివిధ మూర్తులఁ దాల్చును సత్యమింతియే ॥ 129

ఏ తనువైన నీ ప్రకృతియే జడ మన్నటు చేతనంబునై
యా తొలి యాకసంబు మొద లంతమునంగల భూమి దాఁక నా
నా తనుతన్ నవంనవము నాఁ బొడ కట్టుచు నుండుఁనంతె వి
ఖ్యాత కణంబు నందయిన నంతయు నుండును సూక్ష్మరూపమై ॥

అణువుల నణువు మహాత్ముల
కును గడు మహాత్తగుచుఁ బరగును గద పరమా
త్మునకుఁ దనకు భేద మెఱుం
గని జనని నిఖిలము జనని కాక మఱే మా! 131

స్వవశుండై విజయుండు స్పష్టముగ విశ్వంబెల్ల దర్శించి యం
దె విశిష్టంబుగ నొక్క చెర్వొకడ రెండే రెండు సూచ్యగ్రవృత్తాద్భుత

స్తవనీయామల కాంచనాగములు దృష్టంబైన నవ్వానినే
యవలోకించుచు నుండి యుండి మహనీయానంద ముప్పొంగగన్॥

శివదేవా! కరుణించి నా విటులు మచ్చిత్తంబు మత్తంబుగా
భవదీయాకృతి నిండియున్న యది శర్వా! పార్వతీ భ్రామరీ
స్తవనీయాగ్రము లొప్పు లింగ తనువుల్ సంభూతమై రెండు నైం
దవ సమ్మిశ్రిత కాంచన ప్రభలు చిందన్ వెల్గు నిచ్చోనహో! 133

అని పూజించెను తెల్ల వాఱులు సహస్రానేక పర్యాయ చి
ద్ఘన నామస్మరణంబె సర్వముగ దీక్షన్ నిల్చు నవ్వాని క
న్గొనుచున్ శైవమహంబొకండె తన కన్నుందోయికిందోఁచుచుం
టను చేష్టారహితాకృతిం గడపెఁ జంటన్ శైవభావంబుతో॥ 134

షోడశియైన తల్లిఁ దలఁచున్ మన మన్న స్వదేహ మామెయా
నీడకు మార్పు మూలముగ నిల్చిన దానిని బట్టి యాను వె
న్నాడిన దేవి తానగు కనన్మణి కాంచన దేహ యష్టి యా
నీడను వాఁడు స్త్రీ వపువునే కనకుండెను లింగలీనుఁడై॥ 135

ఇంతకు మించి సిద్ధి యని యింకొకఁడున్నదె వానికిం బరీ
శాంతమునందు పూర్ణ జయ మబ్బిన, దట్టులు తాను మానవీ
స్వాంతము నూనినందున తపంబుననే మఱి స్వాస్థ్యమందనౌ
నింతియ యింతి దేవి యయి యేమి విశేషము; స్త్రీ కరంగెడున్॥

విజయుని కన్నుదోయి యరవిచ్చిన పద్మము తాచు చూడగా
నిజమున కున్న దచ్చట మణిద్వయవైఖరిఁ బొల్చు కన్నులన్
బుజమున చేయి వైచి తను పూర్ణదయన్ గనుచున్న తల్లి యే
యజపజ లేకపోయినవి యద్భుత లింగము లేమి యైనవో! 137

శయనాగార సుదర్శనంబుననె వాత్సల్యాత్మయై మద్రి పుం
జయ మార్గంబున దిద్ది తీర్చిన ప్రియా సౌభాగ్య మీనాఁడు త
జ్జయమున్ వమ్మొనరించు యత్నమున వస్త్రంబూడ్చి నగ్నాంగియై
శయనించెన్ స్తన యుగ్మ మర్చితము దీక్షన్ లింగ భావంబునన్॥

పున్నము తోడుగాగ తన పుట్టువు భ్రష్టముకాక యోగ్యమై
యున్నది యింతవట్టు నయరో దిగజాఱుట కెంత కావలెన్?
సన్నని చీలికైనను వెసన్ బ్లవమంతయు నీటి భారమై
తిన్నగ మున్గి యబ్ధి కవధిన్ గనకుండునె చూచుచుండగన్ ॥ 139

తల్లి దయాంతరంగ సుతు తప్పును గాచు స్వతంత్ర యామె నే
నెల్లి యెఱిఁగినన్ దిగు లొకింతయు లేక వసింపఁగల్గు సం
ధిల్లిన సన్నివేశము మదిన్ మెలఁగన్ దనువెల్ల నిట్టి కం
పిల్లుచు నున్న దింకఁ దడ విందుఁ జరించుట యొప్పదింతయున్ ॥ 140

అని తలపోసె నా విజయుఁ డాక్షణ మందె ప్రయాణమై తపం
బున కనువైన తా వెది యపూర్వము పట్టగ నౌ నటంచు మె
చ్చిన మది యేటిగట్టుపయి శ్రీకర సోముఁడు సత్యమూర్తియై
కన నగుటన్ కృతార్థతను గాంచి ఝుకించుక యుత్తరంబునన్ ॥

పర్ణకుటీర మొండు తన పాటుననే వెలయింపఁజేసి సా
పర్ణుఁడు దైవపాటయె యపర్ణత నుండు మటంచుఁ జెప్పు నీ
నిర్ణయ మేను తప్పనని నిల్చెఁ దపంబున నంతలోనె మో
దార్ణవ మందు మున్గె నిఁక నాకలి దప్పియు లేవు వానికిన్ ॥ 142

అనుకొనినట్టి యైనదని యా సుభగాంబ తనూప సంహృతిన్
గనఁ గృతనిశ్చయాత్మయయి కట్టినగీము సమస్త సంపదల్
ధన కనకాదులున్ బహువిధంబుల యోగ్యుల కిచ్చి వైచి ని
ల్చెను తపమందు స్వర్ణముఖి చెంత శివాలయ ముల్ల గాంచుచున్ ॥

అనుకొనినంతనే తనువు నారతి కప్పుర మట్లు మాయమై
చనవలెగాక యమ్మయును చాన వలెన్ దప మాచరించి యే
చనవలెనో యటంచు మనుజత్వము నెంచక మాటలాడరా
దినుఁడు నభంబునన్ గదలఁ డించుక తత్ప్రతి బింబ మూగడిన్ ॥

అందిన దేహముం బడియె యాచరణంబును నుండు నేను స్వా
నంద మయాత్మ నా తనువు నాకు వశంబయి యుండు నన్నచో

సందియ మేమి యట్లె వివశత్వము నందక యుండి పోమ్మనీ
పందిన దేహ మూడుటకు నచ్ఛతపంబె శరణ్య మయ్యెడిన్॥ 145

అదియనుగాక దైవమిటు లంది మనుష్య శరీర మందులోఁ
బదిలము గాగ నుండుచు స్వవర్తనముంబడి తోడి మానవుల్
బ్రదుకులు దిద్దుకొందురని పట్టుగ పెట్టెడి నొజ్జబంతి న
య్యది గమనించి దిద్దికొని యుండెద రాత్మహితాళి మానవుల్॥ 146

సుభగా దేవి తపస్సు సాగిన దటుల్ శుద్ధాత్ములా వార లా
యిభజిన్మధ్య వయస్సురూప విభవం బీ దీక్షలో ధన్యమై
యభయంబందు నటంచు మెచ్చుచుఁ దదీయంబౌ తపోమార్గమున్
శుభమౌనంచు వరించి తాము నటు నిల్చున్ శ్రద్ధ పాటింపగాన్॥

తెలవాఱకుండ నిస్తుల మణీ కర్ణికా
స్థలమందు శ్రద్ధమై స్నానమాడు
దినము పార్థివ లింగమును నిల్పి భక్తిమై
సర్వోపచార పూజల నొనర్చు
క్రమముగా పెంచి సంఖ్యను దినమ్మునకు నూ
ర్లింగమ్ము లర్చించు రీతిసాగ
ఓం శివాయ నమ ఓం ఓం శివా యనమ ఓం
ఓం శివాయనమ ఓం ఓం శివాయ

నమ యనుచు నిర్విరామ నినాద మొకటె
భృంగ రుతివోలె రోదసీ రంగమెల్ల
నింగి నిబిడీకృతమ్ముగా నియతి నిలువ
సుభగ సౌందర్య మన్య దుర్లభమె యయ్యె! 148

అస్మదంశాప తారమై యమిత నియత
జాగ్ర దున్మత్తుఁడైన భక్తాగ్ర గణ్యు
విజయు నంతగ నొఱపిడి పెట్టె నీమె
యీమె యేమాత్ర మాగునో యెఱుఁగుదమని॥ 149

శివుఁడె తలపోసి వేంచేసె నవునుగాక
యిట్టి జంగమ శివుని మున్నెన్నఁ డేని
యరసి నారమె శ్రీకాళహస్తి పురిని
ఎవరికై వచ్చి నాఁడో మహేశ్వరుండు? 150

ఉమ కొఱకు గాక యాతఁ డిం కొకరి కొఱకు
వచ్చునే కల్ల సుభగ శివాయ మతియె
రజ్జుపై గుంజె ననఁగను పజ్జఁ జేరి
కూరుచుండెను వానిఁ గన్గొనద సుభగ॥ 151

శివుఁడె కావచ్చు వచ్చి నిల్చినది చెంత
నామరూపంబు లంది కన్పట్టు వాఁడు
భవ్యుఁడే యగుగాక కేవలుఁడు కాఁడు
ఆతఁడెప్పుడు హృదయంబునందె యుండు॥ 152

తాన యతఁడౌచు నతఁడె తా నైన యపుడు
ఎవరి నెవ్వరు చూతు రిం కేల కన్ను
తెఱవ గావలెఁ దెఱవ కన్దెఱచు టన్న
తాను తాఁగాక తనువైన తవ్వి యగుట! 153

ఆమె నిష్ఠను పరికింప నతఁడు వచ్చె
నెదు రగుచు నది తనకె పరీక్ష యయ్యె
నేమి చేయు నా భక్త కాంతా మిళింద
మెపుడు దయఁజూచునా యని యెదురు చూచె॥ 154

పోదమా యని యింక లేవఁబోవు వేళఁ
గాంచె నాతనిఁ దత్సుభగా లతాంగి
సంభ్రమించుచుఁ దన్వి "ద్విజప్రవర! త
మరు కరుణను వచ్చినది నే నరయకుంటి॥ 155

నన్ను మన్నింపవలెను విన్ననువు దోప
నెంత సేపుంటిరో యేమొ యీ యబలను

చూడవచ్చిన పని యేమి? శుద్ధమతుల
రాన తిచ్చినఁ దీర్పంగ నైనఁ దీర్తు"॥ 156

ఆమె గాంభీర్యమునకు మాయాద్విజుండు
చకితుఁ డౌచు నె కన్బొమల్ ముకుళితములు
గాఁగ నొక యింత సేపుండి "కాంత! మొదటి
యీ పురంబే దినంబు నిల్లేగు నపుడు
చూచుచుంటిని నిన్ను నీ చొప్పు నెల్ల॥ 157

నవనవంబగు త్వత్తనూ నైగనిగ్య
మెల్ల నీ లింగ పూజ నశించుచుండె
నీ వయసులోన నీ విట్టు లెందుకింత
నియమనిష్ఠల నుంటివో నెలత! యెఱుఁగ॥ 158

నీ నేత్ర యుగ్మాన నిలిచె నీరధు లన్ని
యాలోఁతు నెఱుఁగ నే నభిలషింతు
భవదురో జౌన్నత్య మవరోధతం బొందు
మేరు వింధ్యమ్ముల స్మృతికిఁ దెచ్చు
గగనావలగ్న! యీ కాయ శోషణ మేల
నా మాట విని నీకు నమ్మకమ్ము
గదుర మాయింటి కయ్యదె దగ్గరనె యున్న
దరుదెంచి స్వయముగా నన్ని తెలిసి

సకల భాగ్యంబులున్న నా చాన వైన
నేను ధన్యుఁడ నగుదు నీ కీ దురంత
యాతనయుఁ దప్పు యావనమ్మతి తరస్వి
దానిఁ బోసీక భోగింప నౌనుగాదె!" 159

ఇంతవటుకును సుభగ సహించి యుండి
విన్న దాతని పల్కులు కన్న దతని
వంచనారీతి! యతనికిన్ బదులు పల్కి
యెల్లవారల కెఱుక కల్గింప నెంచి॥ 160

శివ శివా! నీవెట్లు శ్రీకాళహస్తి పు
        ర నివాసి నంటివో యనిన మాట
లన్నియున్ క్షేత్ర మాహాత్మ్యము నెఱిఁగిన
        వాఁడైనఁ గలనైన పలుకరాని
వీక్షేత్ర మందుండి యిట్లేల యాడితో
        యేనించుకంతయే నెఱుఁగకుంటి
ననుజూడు మో యన్న! నా మెడ నున్నట్టి
        మాంగళ్యముం జూచి మాటలాడు
కాళహస్తిని నిలిచి నిక్కలుషమతిని
తప మొనర్పంగఁ దగు నరతనువు నంది
యద్ది చేయవు మగనాలి యొద్ద నిలిచి
నన్ను పెండ్లాడు మందువా? నాన లేదా? 161

క్షేత్ర రాజమ్ము నందు నీ చేయు పుణ్య
మెట్లు వేరెట్లు పెరుగునో యట్లె పాప-
ఫలమును పెరుఁగు నీ కింతవట్టు తెలియ
దో? మహీ సురుఁడ వనఁగఁ దోఁచుచుంటి? 162

ఇంతకంటెను ఘోర మింకేమి యుండు
పొమ్ము నా ముందల నిలువక పొమ్ము పొమ్ము
పోక నిలిచిన నాగేంద్ర భూషణుండు
నీకు నీ హద్దు నెఱిఁగించి నిలుపఁగలఁడు!" 163

అన్నదో లేదో యాతండు నయ్యె శివుఁడు
జ్ఞాన సూనాంబ, గణపతి స్కందముఖ్యు
లితర దేవత లంద అద్భుతము గదుర
వెంబడిం దోఁచి రట వియద్వీథియందు॥ 164

జయ సర్వదేవేశ! జయ శూన్యకారణా!
        శశిరవి శుచినేత్ర! జయము జయము
త్రైలోక్య విగ్రహా! లీలోప సంహార!
        జూట జూటీ గాంగ! జయము జయము

హాలాహలాదనా! ఫాలాగ్ని నిర్దగ్ధ
సంకల్ప సంభవా! జయము జయము
త్రయ్యంత సంవేద్య! తన్వీకృత రమేశ!
శాక్వర వాహనా! జయము జయము

నీవె నేనయ్యు నీనుండి నెగడి నేను
నీవు కాదన్న యటులె వేవొ చేయు
చుంటి నిచ్చట స్వామి నన్నొంటి చేయ
కింక నీయందె యేకమై యుముడఁ జేయు॥ 165

అనియెడి విజ్ఞప్తిని విని
కనుచుండెను సుభగ మెఱుపు కన్నుల వెంటన్
ఘన తేజ మొకఁడు వెలువడి
యిన శశి శుచినేత్రు చేరు టెల్లరు కనఁగా॥ 166

ఇల సుభగ తనువు నల మి
న్నుల శివ గిరిజాకుమార నుత దేవా నే
కుల దృశ్యము నొకపరి క
న్నుల కగపడని వయ్యె నోట్వొక దయ్యెన్॥ 167

అటు సుభగా విముక్తి విధమంతయు గాంచిన స్థాని కర్షలి
చ్చట తప మూనియున్న ఘనసాధకు సర్వజయున్ స్మరించి యే
కటకట చెందనీక యొటుఁగన్ బ్రియమారఁగఁ జెప్పినంతటన్
జటి నిట వీక్షణ స్మరణ సంభృత చిత్తుఁడు జృంభితాత్ముఁడై॥ 168

ఆమె గురుత్వమందె తన యభ్యుదయం బగుటన్ స్మరించుచుఁ
దా మెయి దాల్చి వచ్చి యురుదారగ దారగఁ జేరి తల్లియై
యీ మహి మానవాంగమున నెట్లు చరించిన జీవితంబు బో
ధామల సత్ఫలం బిడునొ యంతయు నేర్పిన యామె నెంచుచున్॥

జయహో ఉమానాథ! మానాథ నాథ!
జయహో జగన్నాథ! మన్నాథ! నాథ!

సుభగా మహోదార! శుభ చింతనాధార!
ఇభచర్మధర! ధరాధర కన్యకా మార! 1

అభయ ప్రదాయకా! అఖిలాండ నాయకా!
ప్రభు విష్ణు సాయకా! అజయాఖ్యమాయికా! 2

పాపవిచ్ఛేదక క్షేత్ర సంవాసకా!
పాపౌఘ నాశకా! భవబంధ మోచకా! 3

త్రిపుర సంహారకా! సంసార తారకా!
స్మర గర్వ దారకా! మారకో న్మూలకా! 4 170

అయ్యేటి స్నానంబు నయ్యాబు పానంబు
శివవిభు స్మరణంబు చింతనంబు
నిత్యాభిషేకంబు సత్యాభి భాషంబు
నేకాంత వాసంబు నిదె తపంబు
ప్రణవాది పంచాక్షర ప్రాణ మూలంబు
మహితాల వాలంబు మను జపంబు
బిల్వంబొ నీపంబొ విశ్రమ స్థానంబు
నంతర్ముఖ త్వంబె యాశ్రయంబు

పంబు కుశపల్ల వంబులే ప్రస్తరంబు
నందు నాచ్ఛాదనంబు కృష్ణాజినంబు
సైకతం బాసనంబు సుసంగతంబు
విజయ జయ మూలము లివియె నిజము నిజము! 171

అచిరకాలంబునందె జయంబు నందె
స్వామి సత్యే శ్వరుని యందె సంభవించి
దర్శనం బిచ్చె విజయు నాదర్శమందు
బింబితంబును బింబమే పంబినట్లు! 172

ఊరక యిచ్చినా యదియు నూర్జితుఁ డాతఁడు స్వామి పూజ దై
వారగఁ జేయగాఁ దిరుగు వారని నిర్మల భక్తి చూప నా
రారగఁ దా నొనర్చు నిజమారయ నైన పరీక్షలందు నిం
డారిన దీక్ష నిల్చి చ్యుతి నందక యుండిన యప్పు డిచ్చుఁబో॥ 174

విజయ విరక్తుఁ డూర్జితుఁడు విశ్రుతుఁ డప్పు డొనర్చు పూజ ప
ద్మజుఁడును చేయఁజాలనిది మానిసి తాను విరక్తుడైన భా
వజ విషయాభిలాష విడువం జనుగాక తదీశ్వరుండు న
క్కజముగ మాడిపోవ నణగారుట కొప్పునె యొప్పఁ డెన్నఁడున్॥

తనకంబు పానంబె ధారణ కగుగాక
యభవు నైవేద్య మనర్ఘమయమె
తనకు వృక్షచ్ఛాయ తలదాచుకొనుచోటు
స్వామికి దివ్యమౌ భవనమె తగు
తాను దర్భల పైనె మేను వాల్చును స్వామి
కర్పించు మృదు శయనాదికంబు
తనస్నాన మయ్యేటి మునకతో సరిపోవు
స్వామి పంచామృత స్నానమాడు
సకల జగదీశ్వరుఁడు స్వామి సకలభోగ
ములను కొఱత లేకుండ నెప్పుడును పొంద
వలయునేగాని తనవలె నలయరాదు
విజయుభక్తిని స్వామి కుబేరు మించె॥ 175

సంకల్ప సిద్ధుఁ డాతఁడు
సంకల్పము లన్ని స్వామి సౌఖ్యమ్మునకై
కింకర త దిన దినమ్మును
నింకిం తింకింత గాగ హెచ్చగఁ జేయున్॥ 176

ఏది తలంచు నయ్యది యదే క్షణమందు తలంచినట్టులే
మోదము గొల్పుచున్ నిలువ మోసులు వాఱెడి భక్తి పెంపునన్

మేదిని మీఁది మీఁది వికి మేకొనఁగా కని సంస్మరింపఁగా
భూ దివ మయ్యె స్వర్గము నపూర్వ మిదంచును దృప్తి మెచ్చఁగన్॥

విజయు నిచ్ఛను బట్టి వెలసె నాలయమట
దివ్యనిర్మాణ మన్ దీప్తి గనుచు
నందనంబును మించు నవనవోజ్జ్వల పుష్ప
ముల నిచ్చు పూఁదోఁట వెలసె వెంట
పూఁట కిద్దుము పాలు పాదుగంటఁ గురిసెడు
కపిల ధేనుగణంబు కదలి వచ్చె
వివిధాభిషేక వైభవము పెంపొందింప
బహువిధ ద్రవ్యంబు లహరహంబు

నతి వినిర్మలములు నమిత మూల్యంబులు
నమిత కష్ట సాధ్య మయ్యు వచ్చె
విశ్వమునకు విభుఁడు విజయుఁడే యన్నట్లు
అతని యిచ్ఛ కొదిగి యన్ని వచ్చె॥ 178

ఇంతటి భోగమున్ దనకు నిచ్చెడి కింకరు మెచ్చి దర్శనం
బంతట నీయరాదొ గిరి జాధిపుఁ డట్టు లొసంగ నేని కా
లాంతకుఁ డన్నమాట యెటు లబ్బును? స్వామి పరీక్ష చేయ నొ
క్కింత తలంచి చేయు మిటు లిట్లని పంపెను చంద్రహాసునిన్॥ 179

ప్రమథగణాధిపుం డతఁడు వచ్చెను విష్ణువు వేషమూని స్వ
ర్గము దెస వైనతేయ తను కాంతులు వింతగ గాతువైన సం
భ్రమమున భక్త శేఖరుఁడు పాద్యము నర్ఘ్య మొసంగి కొల్చి "మ
ద్భ్రమ లుడుపన్ దయన్ దలఁచి వచ్చిన యొప్పుఁడ నీకు
ప్రమొక్కెదన్"

పనిగొను మంచు ప్రొక్కి నిలువన్ విజయుంగని యాతఁడంత "నో
మునివర! నీ తపంబు కడు మోదము గూర్చిన నీ హితంబు కో
రిన మది వచ్చితిన్ వినుము ప్రేతపతిన్ శివుగొల్చెదేల? జో
గిని గని నీవు పొందెడిది గిందెడి దంతయు భస్మమే సుమా! 181

ఇహమున నెల్లభోగముల కెంతొ సమర్థము మానవాంగమున్
దహతహ తోడ నిల్పికొను దారిని బూనక వెఱ్ఱివాఁడవై
యహరహమున్ ద్యజించుటకె యాత్రము నందెదు భోగసాధనం
బహహ త్యజించి నిస్పృహత నందగ నేల? వరింపు మెద్దియేన్॥ 182

సుభగను మించు సుందరుల శోభనమూర్తులఁ గోరికొందువో
శుభమతి నిచ్చెదన్ వెనుక చూడక వేడు కుబేరుఁ డెంతి యీ
విభవము ముందనం దగిన విస్తృత వైభవమిత్తుఁగొమ్ము నీ
కభయ మగున్ వరంబుగొని హాయిగ నుండుము దీర్ఘజీవివై!" 183

వచ్చినవాఁడు విష్ణు లిటు వారక వారని భోగ వాంఛపై
మచ్చిక పుట్టఁ జెప్పిన నమాయికు లెవ్వరుగాని నమ్ముచున్
జెచ్చెర వేడికొందు రని చెప్పిన యట్లె యొసంగు విష్ణువున్
త్రచ్చిన పాలవెల్లి గను తన్వి వరించిన ముద్దు పెన్మిటై! 184

విజయుఁడు నట్టిఁడే యగున వీరుఁడతండు సుశిక్షితుండు భే
షజముల గాంచి జావయగు సత్త్వవిహీనుఁడు కాఁడు విష్ణువున్
విజయుఁడు మెచ్చి నట్లుగనె వీనుల విందగు మాట లాడి నీ
రజ నయనాభిలాషబడి ప్రార్థన సేయు వరంబు లన్నటుల్॥ 185

భ్రమ కలిగించి తుట్టతుది "భాగ్యవతీ! పరమార్థవేత్త! నా
భ్రమ నుడివింప వచ్చితని భ్రాంతి వహించితి నీవు భ్రాంతతన్
ప్రమను భ్రమాత్మకంబుగ నిరాస మొనర్పఁగఁ బూను కొంటివే!
శ్రమపడి వచ్చినందులకుఁ జాలకృతజ్ఞుఁడ నన్ను వీడుమా! 186

నీకంటెన్ మునుపైన భక్తుఁ డొకఁ డున్నే? మున్ను వే పద్మముల్
స్తోకంబైన విలోచనం బొసఁగి హెచ్చున్ భక్తి మెప్పించి త
చ్ఛ్రీ కారుణ్య మహాత్త్వమై కొనవె నీ చే చక్ర మద్దానిచేఁ
జీకుం బాసి సమర్థతన్ బదవి మెచ్చింపింతు వయ్యీశ్వరున్॥ 187

నీవును బ్రహ్మ మున్ను కన నేరక యాదియు నంత మెంతయో
వావిరి వోవు టంతయును బ్రాఁబడెనో యటుగాక నీవె యా

దైవము చూరగొంచుఁ బరదర్శన మబ్బగ నీక యుండగున్
భావమొ యిట్లు చెప్పినను భ్రాంతు నొనర్పగ నెంచి దేలొకో?''

అనుటయుఁ జంద్రహాసుఁ డహహాహోయని చూపుచు స్వస్వరూపముఁ
''నను శివదేవుఁడంపఁ బయనంబయి వచ్చితిఁ జంద్రహాసుఁడన్
జని శివదేవు ప్రీతిఁగనఁ జాలితి వయ్య ననున్ సహింపు మే
ననినవి నావి కావు గద యా శివు మాటలె యప్పఁ జెప్పితిన్॥ 189

పోయి వత్తు'' నటన్న యబ్బురము గదుర
విజయుఁ డతిభక్తి ఫలము లర్పించి వాని
సాగనంపెను పిదప నచ్చటనె యుండి
హెచ్చు శ్రద్ధను పూజ సాగించుచుండ॥ 190

తరుణమున స్వామి యొసఁగె సుదర్శనంబు
పుత్రమిత్ర కళత్ర సంపూజితుఁడుగ
వానికి శివైక్య మొసఁగి యవ్వాని చేత
నర్చితంబైన లింగంబు నధివసించె॥ 191

ముందు వెనుకల కేమి సంపూర్ణ విజయ
మంది గార్హస్థ్య మందుండి యంది కొనఁగ
వచ్చును విముక్తి తెలివిగా బ్రతికి తేని
యందు రా దంపతులు మనకందఱకును॥ 192

వియ దఖిలంబు నా విజయ వీరు జపంబయి ఓం నమశ్శివా
య యనియె యిప్పుడున్ వినఁగ నౌనట నించుక యేటి గట్టుపై
నయమున నిల్వఁ గల్గునెడ నాదము సర్వము నింగిలోననే
లయమయి యుండు నొగ్గు చెవులంబడి తెల్పును తత్త్వమంతయున్॥

ఇది సుభగా జయాఖ్య సక లేష్ట శుభప్రద పుణ్యాదంపతుల్
ముదితయుఁ బూరుషుండు ఘన మోదమునందు విధంబు తెల్పు శ్రీ
ప్రద కమనీయ గాథ శివపార్వతులన్ స్మరియింపఁ జేయుచున్
ముదమును భుక్తి ముక్తులు నపూర్వముగా నొసఁగంగఁ జాలెడిన్॥

శివంభజే సాంబశివం భజే
భవం భజే స్వానుభవంభజే!

స్వానందంబున చక్కఁగ నుండక స్వాన్యానందము నందగ నెంచుచు
శివతను మెచ్చక జీవుఁడవైతివి శివుఁడవు నీవే భవుఁడవు నీవే!

విషయానందము విషమని తెలిసితి విషము గ్రమింతి స్తంభించుట తెలిసితి
విషకంఠుఁడవై విహరింపుమురా విషమే యమృతంబయిపోవునురా!

రాగములో భవరోగంబున్నది త్యాగములో భవ భేషజ మున్నది
తలఁపును బట్టియె భవమునఁబడితివి తలఁపును ద్రిప్పిన తొలఁగున
దంతయు

జగతికి మేల్కని చిక్కుల బడకుము మిగిలెడి శివునకు మేల్కనిసుఖపడు
ఎఱుఁగుము నిద్రను జగమే మున్నది శివుఁడొక్కఁడే నిద్రను మేల్కను.

నిద్దుర నెఱుఁగని శివుఁడవు నీవై నిశ్చింతుఁడవై నీలో నుండుము
శివతను వీడక భవత భజించిన భవముపసంహృతమై పోవునురా!

## రాయగోపురము

ఉత్తర దిక్కుగాఁ జనుచు నుండిన దారి యిటన్ మలంగి ప్రా
గుత్తర మూలఁ బ్రాఙ్ముఖత నున్న మహోన్నత గోపురమ్మికై
తత్తర మంది యేగు దివిఁ దాకున యన్నటు లున్న దద్ది యా
యెత్తున నాగి దేవతలు నీ భువికిన్ దిగి వత్తురే మొకో! 196

వత్తురొ యేమి వచ్చిరని వాకొన వచ్చును స్వామిరాకకై
తత్తర మందు డెందముల దానికి ముందటి వీథులందు నెం
తొత్తుగ నెంతమంది జనముండిరి? చేతుల పళ్ళెరంబు లె
త్తెత్తుగ పట్టి కాచికొను చెప్పుడు వచ్చునటంచు వేచుచున్॥ 197

కేవల మూరివారెయనఁ గ్రించు దనంబగు నంతమంది పో
రే వల గొంట? కీ జనము లెక్కడి వారొ? పరాయి వారితో
దేవతలున్ నిరీక్షణ మతిన్ మిళితంబయి యుందు, రట్లు కా
కేవముగా దె స్వామి చనియెన్ జనముండిరి యూర నన్నచో॥ 19[illegible]

ఈ గాలి గోపురం బెంతెత్తు కట్టిరి
వేయి యేడులు దాటి పోయినవట!
ఉత్తర ద్వారంబు నుండి వేంచేసి శ్రీ
స్వామి యిందుండియే చనును పురికి
నెవరు కట్టిరో యేమొ యెచ్చోటఁ జూచిన
ఖడ్గ వరాహమ్ము కానిపించు
రాయగోపుర మన్న ప్రఖ్యాతి నందిన
దే రాయలో యెవ్వ రెఱుఁగ రిపుడు

చోళులో పల్లవులో చాల సుందరంబు
ఆఱు చక్రాలపై సహస్రార మనఁగ
నేడు నంతస్తు లిప్పటి కెక్కవచ్చు
నాటి జనముల శ్రద్ధ కంతకును సాక్షి! 199

దీని నిటఁ గట్టిరేమి విదిక్కునందు
ఆలయము తోడి సంబంధ మగపడదని
ఇప్పు డనుకొంటలో వింత యేమి కలదు?
కట్టినపుడున్న యట్టు లొక్కటియుఁ గలదె? 200

ఈ గుడియె లేని యప్పు డీ యేరు మున్న
మేరు కైలాస గిరుల మేల్మోలటంచుఁ
దాఁకుచునె పాఱు చుండంగ దాని నాపి
యుత్తరం బేగఁ ద్రిప్పి రీ యూరి కోఱకు! 201

దగ్గఱగ నున్న రెండు కొండలకు నడుమ
నేరుఁ బాఱంగ నింకెట్టు లూరుకట్టు
టీశ్వరునకు దూరము పోవు టెట్టు లనుచు
నేరు త్రిప్పంగ గోపురం బెత్తినారు! 202

సిద్ధ సంకల్పు లవ్వారు సింహ బలులు
గండ శిల లెన్నొ తెచ్చి యఖండముగను

చాల దృఢమైన మిగుల విశాలమైన
నరు లెఱుంగని లోని పునాది గాగ॥ 203

ఏటి నుత్తర మంపి "ముంపింక రాదు
నేను రక్షణ ముందు మీ ర్నిలువుఁ" డంచు
నభయ మచ్చెడి దీని సమర్థముగను
కట్టి రానాఁడు బద్ధ కంకణులె యగుచు॥ 204

అగుట నాఁడిది యాలయం బందలిదియె
పెద్ద ప్రాకార ముండి యీ పెద్దగోపు
రమును నాలయు సంబంధితముగ నుండ
నది శిథిల మగుట నిపుడు చెదరియుండె॥ 205

మధ్య పెనువీథి వచ్చెఁ గొంపలును పెరిగె
నాలయావరణమ్మె గృహాల మయాము
అగుచు నున్నను వారించు నధిపుఁ డేడి?
స్వామి సాక్షియె చూచు నికేమి చేయు? 206

ఇప్పుడు పెద్ద గోపురము నెట్టెదుటన్ నిలుచుండె స్వామి యం
దొప్పెడి పూజలం బడసి యోర్పునఁ దూర్పున కేగి వెల్వడన్
జెప్పిన నించుకంతయును చీల్చక దారి యొసంగ వీలు లే
కెప్పటి యట్లె యుండు జన మెట్లొ తలంగగ నుత్తరానకున్॥ 207

మలఁగి నగరంబు నాల్గు వీథులఁ జరించి
రాయగోపురమునకు మిత్రం బనంగ
తేరు వీథికి నెదురుగాఁ దీరి యున్న
చిన్న గోపుర మందుండి చేరు గుడికి॥ 208

జనము లిద్దాని నేఁడు బిచ్చాల గోపు
రమ్మటందు రెవ్వరో దాసి రాజు మునుపు
గుడిని కట్టించినప్పుడు కోర్కి పడి త
నంత బిచ్చ మెత్తిన సొమ్ము వ్యయ మొనర్చె॥ 209

వెలయఁజేసిన దంపురు; నిలయ మిపుడు
బిచ్చ మెత్తెడు వారికి పేరు స్వార్థ
కంబు చేయంగ వా రందె కాపురంబు
చేయు చున్నట్టి యుందురు చెదరకుండ॥ 210

అదిసరే యింతజన మిట నంతగుంపు
కట్టియుండుటకుఁ గలదు కారణంబు
పెద్ద గోపుర మందుండు వేళస్వామిఁ
జూచి సేవించు కొనుట వచ్చునె మరింత? 211

అది మహా భాగ్య మగుట నత్యంత భక్తి
నట్టి దర్శన మంది జన్మాంతరంబు
లేక యుండుదు మన్న వివేక మూని
యంతగాఁ జేరుచుందు రనంతజనము! 212

కష్ట జనుఁడయ్యు నరుఁడు సుఖప్రియుండు
శ్రమయె లేకుండ ముక్తి పుష్పంబు వలెను
ఒడిసి పడవలె స్వామి మహోన్నతుండు
గోపురాంత స్స్థితుఁడు జగద్గురుఁ డొసంగు 213

అది మహావూహ్య మే యగు నయిన నేమి
స్వామి కాబట్టి ప్రభు వైభవం బెలర్పఁ
గదలి బిచ్చాల గోపురం బొదిగి రాఁగ
దాటి చనునంత జనములున్ దరుగుచుంద్రు॥ 214

కుడికిఁ జూచిన నొక చిన్న గుడి యగపడు
నదియె శ్రీకాశి విశ్వేశు నాలయంబు
కాశి విశ్వేశ్వరుఁ డిటకుఁ దాఁ గదలి వచ్చె
నన్న నీ క్షేత్ర మహిమ నే రెన్నఁ గలరు? 215

ఇచట నుండియుఁ గాశికే నేగవలయు
ననుకొనెడి వాఁడు నరకాని కరుగు నంట!

ఆ నుడికిఁ గల యర్థంబు నరయ వలయు
స్వామి యందు విశ్వాసమ్ము సడలకున్న॥ 216

కాశి మాటేల యెత్తు? సంకల్ప మిదియు
సడలి నప్పుడె కలుగును సరియె కాని
కచటి స్వామి యందైన నెట్టైన సడల
కుండునే నమ్మకమ్ము తా నుండఁబోదు॥ 217

అట్టి భాగ్యమ్ము కలదేని యయ్యదిటనె
కుదిరి యుండెడి దయ్యది కుదుర లేదు
"సంశయాత్మా వినశ్యతి" సందియంబె
యదియొ యిదియొ తరింప నే యదియు నొకటె॥ 218

## తూర్పు గోపురము

దక్షిణ ముఖమ్ముగాగ నద్దాని దాటి
కొంచె మటు నిటు తిరుగగా గోపురంబు
మరి యొకటి తోఁచుఁ దూర్పు గోపుర మనంగ
నయ్యదే యెంత రమ్య శిల్పాన్వితంబు 219

ప్రొద్దున యాత్ర కేగు తఱిఁ బ్రొద్దగునంచు నిటం గలట్టి యీ
గద్దఱి శిల్పి రమ్యకృతిఁ గానకపోతిమి యిప్డు చీఁకటై
యెద్దియుఁ జేయలేముకద యీశ్వరునిన్ సరి దేవళమ్ము నే
తద్ద యెఱుంగఁ జాలని వృథా మతులేమి యొనర్తు రీ నరుల్॥ 220

గోపుర మందు శిల్పములు కోరికదీఱఁ గనందగున్ బరీ
తాపము తీర్పఁ జాలిన సుధామయ మూర్తు లనేక మున్న వా
రూప మనోహరత్వమె యరుంతుద వేదన నైన మాన్పు నీ
వోసి వెలుంగునన్ గనుము ఉజ్జ్వల మయ్యెడి నీదు డెందమున్॥ 221

లోనికిఁ బోయి వెన్దిరిగి లోలుపతన్ గమనింప వచ్చు నె
న్నేని మనోహరాకృతుల నిచ్చట శంకర దేశికోత్తముల్
మానిత వేద శిష్యగణ మండితులై కనవత్తు రెవ్వరే
గాని తలన్ ధరింపనగు జ్ఞానులు వారని తెల్పుచున్నటుల్॥ 222

దీని కుభయ పార్శ్వంబులన్ గానవత్తు
రా కుమారుఁ డొకంట జ్ఞానాంబ యొకట
అమ్మ చిన్నప్పు డట్లున్న దన్న యట్లు
చిన్న విగ్రహ మున్నది చెలువముగను॥ 223

బిల్వమున్ వేప పెనఁగిన వేది యొండు
దాని చెంతనె జ్ఞానాంబ త్యక్తమూర్తి
పూర్వరాట్ ప్రతిష్ఠిత లింగములు కడచిన
వచ్చుఁ బాతాళ విఘ్నేశ వరవివేకి! 224

కొండ నంటియు యున్నది కోవెలేమొ
పశ్చిమాభి ముఖుండయి వచ్చు స్వామి
కెడమ ప్రక్కన గుడి దాని కెలన నున్న
వరుసలో వీర లున్నారు వరదు లగుచు॥ 225

కుడిని గల బహిః ప్రాకార కుడ్య మంటి
బాల జ్ఞానాంబ సత్రంబు పైని కొన్ని
దివ్యమూర్తులు కంటి కెంతేని ముదము
గూర్చుచుండు నాగి తెలిసికొనఁ దగినవి॥ 226

ప్రక్కనే యున్న దుత్తర ద్వార మనఁగ
పైని గోపుర నిర్మాణ మేని పూర్తి
కాక, యట్టి భాగ్యము మరి కలదొ లేదొ
యెప్పుడో పడిపోయి నటులుండు నింపు లేక! 227

స్వామి యీ ద్వార మందుండి బయట కరిగి
యేరు చేరును నగరాని కేగునపుడు
పెద్దగోపుర మందుండి వెడలవలయు
నిట్టి యాచార మిచట పాలింపఁబడును॥ 228

కోట వలెఁ గట్టి రీ పెద్దగుడి నదెంత
యెత్తు? పైనున్న నందు లచ్చెత్తి చూచి

తనియుచునె నిల్వలేక నీ తలను వాల్తు
వీ పథం బిది మిపులు ఘంటా పథంబు! 229

పశ్చిమోత్తర మూలను స్వామి యోగి
గురప సాని మంటపమునఁ గొను సమర్చ
అచటనే బహిః కుడ్యము నంటి యుండె
రెండు కాళ్ళ మంటపము నీ దృష్టి నాపు! 230

అందు గణపతి యుండు నానంద మూర్తి
స్వామి క్షేమంబుగా తిర్గివచ్చె నన్న
సంబరంబెల్ల వాని యాస్యమునఁ దెలియు
నేన్గు మొగమైన నేమి పూర్ణేందు సమము 231

ఇది మహాలీల బ్రదుకు లివెల్ల వట్టి
నాటకమ్ములు వ్యక్తులందఱును లోన
నాత్మకై సర్వ మొనరింతు రన్యులకయి
చేయుచున్నట్టు లెంతో వచించుచుంద్రు! 232

''ఆత్మనస్తు కామాయ ప్రియం భవతి'' య
ని శ్రుతియె వచించి దానినే నీవు శ్రద్ధ
గురు ముఖంబున విని మదిఁ దఱచి తఱచి
యదియ వైయె యుండు మను నిది ధ్యానసమున! 233

గురు శిష్యు లాత్మ నిరతులు
గిరి చుట్టుట వారి హృదయ గేహము లందున్
స్థిర నిశ్చ లాత్మదీప
స్ఫురణంబును నిర్నిరోధముం బొనరించెన్ ॥ 234

వెలి తనువుల గనవచ్చును
తెలిసియె యనుబంధ మెల్లఁ ద్రెంచినవారై
గల గల లాడెడి కురిడీ
లలయక తమ యందుఁ దామెయై యుందురహో! 235

కదలెడి దేహము కదలును
కదలదు నదియెల్ల స్వామి కదలిక బడియే
యెదలేని దెదియు నున్నదె
చిదంబరమునందు శివుఁడు చిందులు ద్రొక్కన్॥ 236

రెండు కాళ్ళ మంటపము గుర్తించి యచటె
దక్షిణాభి ముఖుండయి తరలె స్వామి
కదలనీయదు కాదె ప్రాకారనంది
స్వామి యభిమాన మట్టులే సాగుటెట్లు 237

ఇదియె కైలాస శిఖరంబు కదలివచ్చి
స్వామికై నిల్చె నిచ్చట స్వామి మున్నె
వాయులింగ స్వరూపుఁడై ప్రభవ మందె
వచ్చినది కొండ స్వామియు మెచ్చె నంతె! 238

సరిగ శిఖరాన సద్భక్త వరులు కలరు
శివుఁడు తనుగొల్చు వారిఁదన్ మివులఁజేయు
నందు రది యెంత సత్యమో యరయవచ్చుఁ
దాను క్రిందనె శిఖరమున్ దనయులకిడె! 239

కలఁడు కన్నప్ప సర్వ జగత్ప్రసిద్ధి
గన్న మహితానుభావుండు గాన నగము
కూడ కన్నప్ప కొండగా నేడు పేరు
పొంది యున్నది యతిలోక పుణ్యుఁడతఁడు! 240

అచటనే కాదు గర్భగృహంబునందు
స్వామి చెంతనె యుండి యా స్వామి కంటె
ముందు స్నాన భోజన సౌఖ్యములను పొందు
చుండె నిజకుమారులకు ముందుందు ననుచు॥ 241

ఎంత వాత్సల్యమో స్వామి కితని మీఁద
అతఁడు చూపిన భక్తి యనన్య సాధ్య

మట్టి భక్తికి స్వామి యట్లగుట యందు
వింత యేమందు స్వామికిన్ బ్రీతి యెందు॥ 242

## సారంగోపాఖ్యానము

ఇతనితోడఁ గైలాస నాథేశ్వరుండు
నుండుఁ గొండపై భక్తుఁడా తండు గూడ
చాల చిత్రమా జీవి యుయ్యేల లూగి
చారి తార్థ్యంబు నందెను స్వామి కరుణ! 243

సారంగుం డొక బ్రాహ్మణ బ్రువుఁడు విశ్వఖ్యాత గోదావరీ
తీరంబందలి విప్రకూట మను భూదేవాగ్ర హారంబునన్
సారైశ్వర్య మహాధనాఢ్యుఁడయి వేశ్యామోహ మూగింప సం
సారంబున్ ద్యజియించి యా యెడకు వేశ్యం గోరి వచ్చెన్ జెడన్॥

చేడియున్ వేశ్యయె బుద్ధి చెప్ప మరలన్ శ్రీకాళహస్తీశ్వరున్
విడకుండన్ భజియించి బాగుపడియెన్ విశ్వాస ముండన్ వలెన్
జెడుగుల్ కూడఁ దరింపగాఁ గలరు నాస్తిక్యంబు మెండౌచు నె
వ్వఁడు యత్నింపఁడు గాక స్వామి యనుకంపామూర్తి ముమ్మాటికిన్॥

అని మహారాజు సుమతి సింహధ్వజుండు
పాలనము సేయు దినములు స్వామి కపుడు
జరుగు భోగము వర్ణింప సాధ్య మగునె
దేవత లసూయ పడుదురా తీరుఁ జూచి! 246

దంతులు సైంధవంబులును దాంతులు శాంతులు వేదవేత్తలున్
బంతముతోడఁ బాల్గొనెడి వారసతీ తిలకాల మేళముల్
వింతలు వేడుకల్ వివిధ విద్యలఁ జక్కఁగఁ జూపు నేర్పరుల్
కొంతకుఁ గొంత స్వర్గ మిదిగో యని పించెడి దప్పు డెంతయున్॥ 247

రాజు స్వయమ్ముగా నడచిరాఁగ జనంబులు స్వామి వెంట న
వ్యాజ కృపాపరుండయిన స్వామికిఁ దామయి యేమిసేయ సం
పూజన మానొ యంచు నది పుష్కలమై ప్రభవిల్లఁ జేయుచున్
దేజము నెల్లఁ జూప శివతేజము పట్టగరాని దయ్యెడిన్॥ 248

రాతిరి రాత్రికాదు శివరాత్రిగ సాగెడి యుత్సవాన ల
క్షాతిగ దీపకాంతుల ప్రకాశమునన్ జనయాత్రసాగ నం
దే తరుణీ లలామ జగదేక విలాసిని విశ్వమోహినీ
ఖ్యాత మొనర్చు నాట్యమును గానక పోయిన జన్మవర్థమా॥ 249

భోగము మేళమున్ శివుని భోగములం దొక టౌనె సిగ్గులే
కేగతిఁ జేర్చి రద్ది విభుఁడెట్లు స్వయమ్ముగ నుండె నచ్చటన్
త్యాగము త్యాగమంచుఁ గుల మంతయు నీతి యొకింత లేక యా
భోగము వృత్తి మానుటయు పుణ్యమె స్వామి సహించు టెట్లొకో॥

ఇప్పుడు చర్చకున్ దిగిన నీ కథ సాగదు నీవు వృత్తి నే
చొప్పున నిర్వహింతు వది చూచునె గాని యదెట్టి వృత్తి యం
చెప్పుడు స్వామి లెక్కఁగొనఁ డింపుక దేహము నిల్పికొంటకై
చొప్పడు వృత్తి యేదయిన శుద్ధమె యా భగవంతునెన్నినన్ ॥251

అన్నియు వృత్తులే యెదియు నక్కఱ లేనిది లేదు హేయమా
నన్నది కూడ సంఘమున కందుఁ బ్రయోజన ముండి తీఱుఁ గా
కున్న స్ఫురింప దద్ది యదియున్ దగునీతి యొసంగి సేవ్యమా
తిన్నగ నర్పితం బగుచు దేవునకున్ బ్రియమైన భోగమా॥ 252

వృత్తి యసహ్యమన్న విపరీత మనస్థితి పూర్వులందు కే
వృత్తియుఁ దప్పుగాదు బ్రదికించుట కైనది జీవితానికై
వృత్తిని నిర్వహించుకొను చెట్టి మన స్థితి కల్గియుంటి వా
చిత్తము ముఖ్యమంచుఁ దమ జీవితముల్ నడిపించి రోర్పుమై॥ 253

పుట్టుకఁ బట్టియే యదియుఁ బుట్టును దానిని నీవు శ్రేయమం
చెట్టి జుగుప్సయున్ గనక యీశ్వరు నెంచి కృతజ్ఞ బుద్ధివై
నెట్టెద జన్మ మెట్టులనొ నీవు ప్రియంపడి మేలి జన్మకున్
నెట్టుము మెట్లు మెట్లుగను నీదరిఁ జేరుదు నిశ్చయంబుగన్ ॥ 254

అని దృఢ బుద్ధి నూని యెవఁ డాతని కయ్యెడి స్వీయవృత్తిలో
ననితర సాధ్యజీవితము నా పరమేశ్వరు నెంచి తీర్చునో

శను నతఁ డైహికంబున సుఖంబు పరంబున యందు సౌఖ్యమున్
దనిసెన యేని యీశ్వరుఁడు తథ్యముగా నిడు ముక్తియున్ సఖా॥

భోగము చాన యయ్యుఁ గను ముక్తిని, వేదము లన్ని నేర్చియున్
రాగము నూనుచోఁ గనఁడు రాగముఁ జంపెడి స్వీయవృత్తి నా
భోగము చాన వీడక యపూర్వ కళావిభవంబు సాధ్యమై
రాగ శివార్పణంబుగ విరాగత చూపి తరింప వచ్చుఁబో! 256

తనువు లభించు నెప్పుడును దానికి నైజము నీ వొనర్చు క
ర్మను బడి కాన తత్ఫలము మానునె? పొందగనిమ్ము నీవు దా
నిని గొని దాని నంటకయె నీవయి యుండుచు దేవు నెంచు మా
పనిని కృతార్థతన్ గనిన స్వామి నినున్ దయఁజూచుఁ దప్పకన్॥

ఇంతకు విశ్వమోహిని యహీన కళావిభవంబు చూడకే
చింతను మున్గిపోయితిమి చిన్మయ నృత్య విహార నైపుణీ
శాంత తిలోత్తమాదిక యశస్విని యామె నొకింతసేపు త
త్ప్రాంతము నందు నిల్చి కను స్వాంత శివున్ విడకద్ది మేలగున్॥

శివుఁడా బొందిని గూడ నుండెఁ కద యే సిగ్గున్ గనంబోక యెం
త విచిత్రంబుగ హావభావముల నత్యంత ప్రియంబౌ నటుల్
శివుఁడున్ మెచ్చెడు నట్లు చూపు? నెద మెచ్చెన్ విద్య యద్దాని కౌ
భవ మందెన్ గృహకృత్యతన్ గనెద నా భాగ్యంబె భాగ్యంబనున్॥

ఆమెను నృత్యవేళఁ గని యర్భకు లూరక నేను నేనటం
చామెను గోర నూరువరహాలకు శుల్కము తెచ్చికొమ్ము ర
మ్మా మెయి చేతకాని యెడ నర్భక! పొమ్ము ధనమ్ము తెమ్ము నీ
వేమెయి వాఁడవైన నిదివృత్తి యిటుల్ చనునంచుఁ జెప్పెడిన్॥

ఒకపరి విప్రకూటమున ధనాఢ్యులు కొంద ఱిందు యా
త్రకు నయి వచ్చి భాగ్యమున దాని మనోహర రూప సంపదన్
జకిత మనస్కతన్ గని విచాలితు లయ్యును దూలిపోక త
త్ప్రకటిత విద్య డెందములఁ బాయక యుండగ వీటి కేగుచున్॥ 261

సారంగుండు విశేషముల్ తెలియు వాంఛన్ వచ్చి వేడంగ నా
మారా కారున కీమె గూర్చి వినిపింపన్ వాఁడు వెన్వెంటనే
దారన్ బిడ్డలఁ దల్లినిన్ విడిచి చేతన్ లక్ష కేమాత్రమో
మీరంగా నగు సొమ్ము కైకొని యిటన్ మిండండుగా నిల్చెఁబో!

వానికిఁ దండ్రి యిచ్చి చనె భాగ్యము తొమ్మిది లక్ష లందులో
నై నవి యెన్మిదిప్పటికె యంతయు నిందుకె యున్న లక్షతో
దీనిని పొందగావలె నిదే పరమార్థ మటంచు వచ్చె న
వ్వాని వివేకమే మనఁగ వచ్చును కేవల శిశ్న దేవుఁడౌ॥ 263

ఎవఁడు మనుష్య జీవితము నెప్పుడు శిశ్నమె దేవుఁడంచు సం
భవమగు సర్వ మా సుఖము వాంఛ వ్యయించునో వాఁడు భ్రష్టుఁడౌ
శివుని గనం డతండనుచుఁ జెప్పును వేదము శిశ్న దేవుఁడై
భవమున మ్రగ్గు చుండునని పల్కును తప్పని సత్య మిద్దియా॥ 264

వేదము శిశ్న దేవులని వీరిని పేర్కొని నిందసేయ మ
ర్యాద లెఱుంగనట్టి త్రిపురా సుర సంతతి జాతి మానవుల్
వేదము శిశ్న దేవుఁడని పోర్కొనుటన్ శివుఁడన్న శిశ్నమే
కాదన లేము యోనియును గానగ వచ్చును చూడరాదొకో! 265

మునుపు మనుష్యు లెక్కువగ పుట్టక పోవుట చేత దేవునిన్
మనుజుఁడు స్వీయ వాంఛబడి మన్నన చేయునుగాక లింగ రూ
పునిగ భజించి రీ భరత భూప్రజ లంచు శ్రుతిన్ స్పృశించు యో
చనకు న యోగ్య లే యగు విచక్షణ శూన్యులు పల్కరక్కటా!

వారిని బట్టి నేఁడు మన భారత మందలి పెద్ద పెద్ద లే
మార విజేత, నెన్నఁడును మానిని స్వీయ శరీరమందె యే
పార తనూద్వయంబుగల వారల యట్లు చరింపరాని కా
మారిని శిశ్ని యోని మిళితాకృతి యంట వివేకమానొకో? 267

మేళన చిహ్నమే యయిన మేఢ్రము యోని నిమగ్నమౌను, లిం
గాలఁ దదగ్రముల్ నిగిడి కానగ నౌను, జనించు నవ్వి త

న్మూలములైన యోనులను పూజ్యనరోత్తమ! వ్యర్థజీవివై
యేల చరింతు విప్పగిది యీశ్వర తత్త్వ మెఱుంగ నెంచుమీ! 268

ఈభువి నెవ్వఁడేని జగదీశ్వరు సత్కృప నందఁగోరు వో
ద్రాభ నొనర్చు దేహమునఁ దన్మయతన్ గనరాదు'' మాతృదే
వో భవ'' యాజ్ఞ తండ్రి గురువున్ మఱి పెద్దలఁ బూజనీయులన్
శ్వో భవితవ్యమున్ గనక శుద్ధుఁడవై భజియింపు మంచనున్॥ 269

వేదము చెప్పె తీఱది వివేకితఁ దల్లిని దండ్రి సద్గురున్
భూదివి జాది పూజ్యులను పోడిమి నా భగవంతు నట్టులే
మేదుర భక్తిఁ గొల్వవలె మ్లేచ్ఛుని వోలిక శిశ్న దేవుఁడై
కాదని చెప్పునట్టి శ్రుతి కా శివుఁడన్నను శిశ్నమర్థమా॥ 270

శివ శివ! యింత ద్రోహమును చేయుచు నున్నను చూచుచుందువే
శివ తగునా యుపేక్ష? మఱి చేయునదేమిటి? సాక్షి నీవు, నీ
వెవని కృతంబు వాఁ డనుభవించెడు నట్టులు కర్మసూత్రమున్
దవిలిచి యూరకుంటి వికఁ దప్పునె ముప్పు కృతాపరాధికిన్॥ 271

శిశ్నము హేయమానె? యది సృష్టికి మూలముకాన పూజ్యమా
ప్రశ్నమె లేదటన్ బ్రజలు భక్తి భజించుట తప్పు కాదయా
ప్రాశ్నిక! తండ్రి కెట్లు పరివస్య నొనర్తువొ యట్లు సేయుమా
శిశ్నమె దైవమై నిను వశీకృత చిత్తు నొనర్చి కాచెడిన్॥ 272

ఊరక లేనిపోని విధురోహలఁ దూలుచు నీ మనస్సు న
ట్లారడి పెట్టికొందు వకటా! యది మానవ కల్పితంబు కా
దేరికి సాధ్యమా నటు మహేశ్వరు నెంచుట నాగలింగ ది
వ్యేశ్వరు సుమంబుచూడు మట నున్నది సృష్టిరహస్య మంతయున్॥

శివలింగంబది కేంద్రబిందువును సూచించున్ గనన్ రాని త
ద్భవు నట్లూహ యొనర్పగా వలయుఁ గేంద్రంబైన తద్బిందువే
యవు నీ విశ్వము గాఁగఁదోఁ చెడిని గాదా బుద్ధినూహింపుమా
శివుఁడే తత్సుమమున్ సృజించి యిడి పూజింపంగ బోధించెడిన్॥274

అతి సూక్ష్మంబగు బిందు వొక్కటియె పెల్లై రేఖయై కోణమై
ద్రుత నానాగతి వృత్తమై వివిధ మూర్తుల్ తాల్చు సమ్మోఢ్కి న
ద్భుతమా విశ్వమిదంతయున్ బ్రభవ మందున్ నిల్చు లీనంబగున్
ద్రితయాకార భవత్ప్రభావమునఁ దండ్రీ! బిందురూపా! శివా! 275

సమతన్ వీడక బిందువై త్రిగుణ వైషమ్యమ్ముతో భిన్నమై
యమితాశ్చర్యము గొల్పు నీ మహిమ వ్యాఖ్యానించు చిహ్నమ్ముగా
నమలోదాత్త మనీష సంయములు దివ్యప్రేరణన్ సత్య త
త్త్వము దర్శించిన మూర్తిరాజము నెడందన్ నిల్పి కొల్వందగున్॥

ఏకంబై త్రిగుణంబుగా ద్వయముగా నేనే నటంచున్ ప్రపం
చాకారమ్మునఁ దోఁచెదీవె పరమేశా! స్వాత్మయోనీ! భవ
ల్లోకాతీత మహత్త్వమంతయు సమాలోచింపగాఁ జేయు నీ
శ్రీకారుణ్యము నంజలించెద విభూ! శ్రీకాళహస్తీశ్వరా! 277

వచ్చిన సారంగుం డిటఁ
జెచ్చెర కట్టించె నొక్క శ్రీ సదనంబున్
పచ్చని పీతాంబరములు
ముచ్చట ధరియించి విశ్వమోహినిఁ గనియెన్॥ 278

"వింటిని నిను విన్నట్లే
కంటిని నా కనులు రెండుఁ గన్నవి ఫలమున్
పంట వగు నిన్ను నెట్లేఁ
గొంటకు నరుదెంచి నాఁడఁ గోరు మెటేనిన్॥" 279

వానిన్ జూచిన విశ్వమోహినియు వహ్వాయంచు డెందంబులో
మేనం బొంగులు వార మెచ్చుచు "రతిస్మేరాననాంభోజ ది
వ్యానందప్రద మారసుందర! సహస్రానంద మందించెదన్
దేనెన్ ముంచెదఁ దెమ్ము నూరువరహాల్ నిత్యమ్మునన్ గోరుచో॥"

దినముల్ నూర్వరహాల నిచ్చుకొనుచున్ దేలెన్ మహానంద మం
దనయమ్మున్ ననయమ్ము వాని ప్రతిభయై యా లక్ష్మియున్ దీరు నం

దనుకఁ ద్రవ్యము తత్త్వమింతె యగు నిందఁ బొందుఁ బొందించు ని
ల్వను నిల్వఁ నను నిల్వ నీదు తరమే వహ్వాయనుఁ జాఱుచుఁ॥

వెల వెలఁది యనుట దేనికి
విలువం దగి యుంట కాదె విలుచుకొనంగా
వలయునుగద ధన మదియును
గల యంతకె చూచు నిన్నుఁ గాంతుని గాఁగఁ॥ 282

ధనమైపోయిననాఁడె వానికి గృహద్వారంబు మూయంబడెఁ
గన రాదాయెను విశ్వమోహినియు నిక్కం బచ్చటే వాఁడు ని
ల్వన నీరై విలపించె సేవకులు పల్వర్ మోచి యవ్వాని నా
తని గేహంబున దింపిపోయి రదియే దక్కెఁ విలాపానకుఁ॥ 283

వెల వెలఁది యన్లె విటుఁడును
కలితనమున సక్తి లేక కలియగ వలయుఁ
వెల వెలఁది సంగమునఁగా
వెల కొలఁదియె లేని యపుడు వెడలుటె గతియా॥ 284

సారంగుం డటు కాక క్రీతయగు నా చానఁ స్వకీయామతిఁ
బారం బేదిన మోహమై కలిసె దుర్వార వ్యథం జెందె స్వా
గారం బందె దురంత వేదనను చిక్కంబట్టుకో లేక నో
రారం బిల్చుచు నేడ్వఁ జొచ్చె దిన మయ్యారావముఁ విన్నదై॥

విశ్వమోహిని యవ్వాని వీటికేగ
విప్రకూటీయ విప్రుఁ డీ వెలఁది కొఱకు
కాళహస్తికి వచ్చి యిక్కాంత యింటి
కట్టెదుట కట్టికొనెనంట కనక గృహము! 286
దినమునకు నూరు వరహాల ధనము నిచ్చె
లక్ష ధన మబ్బినది గాని లాభ మేమి
తలుపు తీయదు నేఁడు నిర్ధనుఁ డటంచు
నేడ్చు చున్నాఁడు పాప మింకేమి చేయు? 287

జనము తన్నెంచి యిట్టు ల న్కొనుట వినియు
వాని యేడుపు స్వయముగా వీనుల విని
వృత్తి వా రెల్లరును జూచి విస్మయపడ
విశ్వ మోహిని యవ్వాని వీటికేగె! 288

వచ్చు నక్కాంతఁ జూచి సంభ్రమము నంది
కన్ను చెదరంగ లేదని ఖాయపరచు
కొన్ని తరువాత లేచి పైకొన్న మోహ
వివశత నొక యించుకయుఁ గప్పికొనలేక॥ 289

పోయి కౌగిలి నూని "నా పొలతి మిన్న
ప్రేమ మెయి వచ్చినావె నిన్వీడి నేను
బ్రదుక లేనింక దయను న న్వదలి పోకు
లక్ష ధన మిచ్చితిని ప్రేమ భిక్ష నిడుము." 290

అనుచునె యేడ్వసాగె నటు లంతటి వ్యక్తి నిసుంగు వోలెఁ దన్
బనవుచు నుండ నామె తన పజ్జను నిల్చిన వానిఁ జూచుచున్
"ఘనమతి! యేల యిట్లురక కన్నుల నీరిడి యేడ్చె దీమెయిన్
గనియెడి దేమి? యెమ్ములును కండలు ప్రేవులు చీము నెత్తురుల్॥

తను వన నింతియే వెలికి తన్విని తోలిది కంటి కింపుగా
నణువణు వెంత కశ్మలము? స్వాంతమునన్ గమినింపు మిందుకై
ఘనమగు జీవితంబు వృథగా విలపింతువు వెఱ్ఱిగాని రో
వనితకు నాకుఁ బ్రేమయన వచ్చునె కేవల నాటకం బగున్॥ 292

ఎవఁడు ధనమ్ము నిచ్చు నతఁడే ప్రియుఁ డంతియె కుంటివాఁడో గ్రు
డ్డివె యగుదో యెవండయిన డెప్పర మే వెలయాలు కుష్ఠినిన్
గవయును మన్మథుం బలెనె కానదు మోహము వేనియందు రా
నవు ధన మబ్బులే వలయు నంతరహఃక్రియ ముంచి తేల్చెడిన్॥

వేలవుకాక నా పయిని ప్రీతిని దేవుని వైపు త్రిప్పి జ
న్మాల యఘుంబు లన్నియును మాయగ జీవిత చారితార్థ్యమున్

హేలగ నంద బ్రాహ్మణుఁడ వెందుకు యత్నము చేయకుంటి వీ
లీల వృథా విలాపములఁ గ్లేశము నందెదు బుద్ధి హీనతన్॥ 294

శివునిఁ దలంచి యీ పురిని చేరిన మాత్రనె ముక్తి కల్గు నీ
శివుఁడు దయామయుండనుచుఁ జెప్పెద రెల్లరు తత్త్వవేత్త లీ
వవుర! ననుం దలంచి యిట కాత్రము మైపరువెత్తివచ్చి నేఁ
డవిధిని నిర్ధనుండ వయి నప్పటికిన్ శివునెంచ వేలొకో! 295

మూడేండ్లైనది వచ్చి నీ విటకు సౌమ్ముం దెచ్చి నా పొందుకై
పీడం జాలితి వెన్నఁడేని చని దేవిన్ జూచినావే గుడిన్
పాడౌ బుద్ధి కదెట్లు తోఁచు భువి నెవ్వండేని నిన్ బోలె ని
ట్లాడం బోవునె తీర్థ మింకయిన నన్నా! స్వామి సేవించుకో! 296

కలరు మహాత్ము లిచ్చట నికామ దయాపరు లెట్టి పాపి ను
జ్జ్వలతర శక్తి పాతమున స్వచ్ఛు నొనర్చి హితమ్ము కూర్చు వా
రలఘులు పోయి యందొకరి యాశ్రయముం గని దీక్షితుండవై
యలఘు తపం బొనర్చి కరుణాకరు సత్కృప నంది కొమ్మికన్॥ 297

ఎన్ని దినమ్ము లీ విటుల నేడ్చిన నేను కరంగుటుండు నం
చెన్నకు మన్న! నాదయిన వృత్తి ధనార్జన శీల మద్ది సం
పన్నునె కోరు నిర్ధనుఁడవై ననుగోరుట వ్యర్థమన్న! నే
నిన్నిటు నిర్ధనున్ సలుప నిల్చిన దైవ నిమిత్త మెంచుమీ! 298

తెలియరు గాక మానవులు దేవుఁడె సర్వము దొంగ, వేశ్య, త్రో
వలఁ బడు బందిపోటు, వెనుపాటునఁ గత్తుల గ్రుమ్ము ఘాతకుం,
డొలసి దహించు వహ్నియును, నూరక పన్నులు గుంజు రాజునున్
దెలిసి శివాజ్ఞ చే నటులు తీర్తురు కాలము వచ్చి నంతటన్॥ 299

వారు నిమిత్తమాత్రులయి వ్యక్తుల భాగ్యము తారుమారుగా
నేర మొనర్తు రా పనికి నిల్చుట యందును వారె యాటకున్
గారణముండు నీశ్వరు నికామ నియామక మెట్టు లెట్టులో
నేరరు మానవుల్ తెలిసి నిల్వుము సోదర! భక్త జీవివై! 300

ఎంగిలి దోషమంచనక యింతి ముఖామృత మానుభ్రష్టు సా
రంగుఁడు తన్ముఖంబున నె రాగనిరాసక వాక్యజాల మి
ట్లింగల మన్నయట్లు నిలువెల్ల దహింపఁగఁ గాళహస్తి పై
పొంగిన భక్తిచేతఁ దన పూర్వ చరిత్రను సంస్మరించుచున్॥ 301

చెంగున లేచిపోయి గుడి చెంత నదింగని తాప మార్పుకో
నంగద గొన్న యట్లుగ నిజాంగము నీటను ముంచి యుంచి కొం
డం గను చట్టె యుండి ప్రకటంబుగ భావము మాఱినట్టులై
గంగను గంగ చేరుననఁ గన్నులఁ గార్చెడి నీటి వెల్లువై! 302

‘‘ఎంత నిజంబు పల్కినది యింతి? మహేశ్వరుఁ డీమెచేత నా
కింత వివేక మేర్పడగ నిట్లు వచింపగఁ జేసె నంతె; నే
నెంతటి మూర్ఖుఁడన్? జనకుఁ డిచ్చిన తొమ్మిది లక్షలాస్తి ని
శ్చింతగ వెచ్చ పెట్టితిని చిత్తజు తొత్తయి బుద్ధిహీనతన్॥ 303

పుట్టితి బ్రాహ్మణుండనయి పుణ్యము వెన్కటి దంతొ యింతొ చే
పట్టి ధనాఢ్య పుత్త్రునిగ, బ్రాహ్మణ ధర్మము నూననైతి, న
న్నెట్టిన పాప మెట్టిదియొ నిచ్చలు శిశ్న పరాయణుండనై
పుట్టువు వ్యర్థముం జలిపి పూర్తిగ నిర్ధనుఁడైతి నేటికిన్॥ 304

ఆలిని బిడ్డలన్ జనని నావురు మంచన వీడి వచ్చితిన్
దూలితి నిట్టు లాపదను తూలి యటన్ సరివారి మధ్య దు
ష్కాలము నెట్లు నెట్టెదరొ కాన నొకించుక నా యఘుంబు న
న్నేలయణంప దిట్లగుట కిం కెది యౌ నదె కారణం బగున్॥ 305

కల సొమ్మంతయు కామినీ సుఖమె ముఖ్యమ్మంచు వెచ్చించితిన్
జలుపన్ లేదయొ దాన ధర్మములు పీసంబేని యిన్నాళ్ళకీ
వెలయా లిట్లు ప్రబోధముం జలుపఁ దెల్విం గాంచి దుఃఖింతు నే
యలఘుం డిప్పుడు నన్నఘాలయుని డాయంబో దయం జూచెడిన్॥

అని తా నించుకయైన పుణ్యమును చేయంబోని దుర్మార్గుఁడై
చనుటెట్లున్ ఫలియింపదంచు నిదియే సత్కార్య మీ జన్మ కం

చను కొంచున్ దోలుదొత్త నేగె గుడికిన్ స్వామిన్ సవిత్రిన్ గనుం
గొని సాష్టాంగ మెఱంగి యార్తిమెయి మ్రొక్కుల్ మ్రొక్కి-
సుస్వాంతుఁడై 307

ఒక్కని బ్రాహ్మణుం గని మహోదయు నాదర మొప్పఁ బిల్చి నా
కొక్క గృహంబె యున్న దిట నుత్తము లీ రది స్వీకరించి నా
చిక్క వదల్చి పెట్టుఁడు ప్రసిద్ధ దురాత్ముఁడు వీని యిల్లు నా
కక్కఱ లేదటంచు నెదురాడక నన్ దయఁజూడుఁడంచునున్ ॥ 308

తన వెంటన్ గొని పోయి వానికది వార్ధారా సమేతంబుగా
మనమం దెట్టి ఫలంబు గోరకయె సమ్మానంబుతో నిచ్చి వెం
టనె పోయెన్ గుడి చెంత కచ్చటనె యుండన్ నిశ్చయించెన్ యదృ
చ్ఛను లబ్దంబగు నద్దియే మనుచు నష్టంబేమి యంచెంచుచున్ ॥ 309

పోరిఁబడి నాళులిట్లు దినమున్ నది మున్గుచు స్వామి మ్రొక్కుచున్
బరిపరి వేదనం గనుచు బ్రాహ్మణు లుండెడి చక్రతీర్థమున్
దరిసి యెడమ్ముగా నిలిచి దక్షత వా రొనరించు నిత్యమున్
గర మరుదా ననంగ నటె కాంచుచుఁ గాలముఁ బుచ్చుచుండఁగన్ ॥

మూఁడేండ్లైనది వాఁడు వచ్చి పురి కమ్మూఁడేండ్ల లో నెన్నఁడున్
వాఁడా బ్రాహ్మణ సంఘమున్ గనిన పాపంబించుకేఁ జేయఁ డే
నాఁడున్ వేశ్యల కొంపలంబడియె యుంటన్ వాని నెవ్వారు నె
వ్వాఁడో సుంత యెఱుంగ రట్లగుట నవ్వాఁడట్లై కూర్చుండుచో ॥

విబుధుఁ డొకండు జాలిగొని "విప్రుని పోలిక కానిపింతు, వే
దా బెదురు కన్నులన్ బలిసి తోఁచు నెవండవు నీవు? నిత్యమున్
గుబులుగ వత్తు వూరకయె కూర్చుని యుండెదు వేమి కావలెన్
సబబెటు మూగివై యడుగఁ జాలవొ? చెప్పుము సత్య" మన్నచో ॥

ఇన్ని నాళ్ళకు నైన మహీసురుం డొ
కండు తన్ను విప్రుఁడని ముఖంబు చూచి
పలుకరించుట కతఁడు విహ్వలితుఁ డగుచు
నురక కన్నీరు గార్చుచు నుండి యుండి ॥ 313

ఏల కదలించి వీని కేనింత నలత
కలుగఁ జేసితి నంచు నక్కటిక మూని
యాతఁడును నిల్పుకొన లేక యడలు నంద
నెట్టులో గొంతు విచ్చి తండ్రీ! యటంచు॥ 314

"తా మనినట్లు విప్రుఁడనె ధన్యుఁడ నేటికి నాదు మోము నం
దా మెయి లక్షణం బొకటి యైనను జూడగ నయ్యె మీకు నా
మోమును జూడఁ బాపమగు మూర్ఖుఁడ, భ్రష్టుఁడ, దుష్టచిత్తుఁడన్
స్వామి! ననున్ గృపంగనగఁ జాలితి రెంతటి భాగ్యవంతుఁడన్॥

తండ్రి యొసంగి నాఁ డగణితంబగు భాగ్యము విప్రకూట మం
దాండ్రురకై యథేచ్ఛముగ హద్దులు మీఱి వ్యయించి వేశ్యకై
తీండ్రము హెచ్చి యీ పరమ తీర్థము చేరి వ్యయించి లక్ష నేఁ
డెండ్రిని బోలి భూవివర మేదని చూచుచు నుంటి భూసురా! 316

ఇంతటి భ్రష్టు నన్నుఁ గరుణించి మహేశ్వరు నందఁజేయు సు
స్వాంతులు నున్నవా రని భవత్ప్రియ భాషణమే వచించె నా
యంతట నేనుగా నడిగి యాశయ భంగము కాంతునేమొ నా
కంతటి భాగ్యమున్న నెవరైనను ప్రేమను పల్కరింపరే? 317

అని తలపోసి నిత్యమిట కాత్రము తోడుత వచ్చుచుంటి నేఁ
డనఘ! భవత్కటాక్షమున కాదర పాత్రమునైతి నెట్టులో
నను నొక చిన్నమెత్తు సుగుణంబున కేని యెడందయందు తా
వును గన నీని దుష్టు శివుఁ బొందెడి త్రోవను జూపి కావరే?" 318

అనుటయు బ్రాహ్మణుఁడు విమలాత్ముఁడు వానికి "నీవు ముందుగా
దినమును విస్మృతంబయిన దేవి సవిత్రిని తీవ్రనిష్ఠమై
మనన మొనర్పు మార్నెలలు మానక నిత్యము వేయిమారు లా
జనని మనూత్తమం బనుము సర్వము చక్కబడున్ దనంతటన్॥

అని వానికి గాయత్రిని
వినిపించెను మరల వేద విధి పూర్వముగన్

మును పొందియు నుఱచిన దది
కినుకను గొన కెంతొ నెనరు కృపయయి చూపన్॥ 320

వాఁడును దాని శ్రద్ధమెయి వార్చుచు వచ్చెఁ ద్రిసంధ్యలందు నా
పోడిమి నాఱు మాసములు పూర్ణముగా ముఖమం దదేదొ క్రొ
వ్వాడిమి తోఁచె వాని యెద స్వచ్ఛముగా నొక నిబ్బరమ్ము పా
ఱాడె ద్విజన్ముఁ డెన్నఁడును త్రాయక మంత్రము వీడరాదహో!

ఉపనయనమ్ము వేడుకయి యూరక వేలు వ్యయించు టో యదై
నపుడె వివాహ యోగ్యతని మైనదిగా ననిపించుకొంటయో
యిపుడు పనయ్యె నెవ్వరికి నేని జపంబొనరించు బుద్ధియే
కృపమెయి కల్గకున్న దిఁకఁ గీడు ఘటిల్లక యెట్టు లుండనో॥ 322

గాయత్రియె పరమంబగు
నీయది సత్యమ్ము శ్రద్ధ నెవ్వఁడు దీనిన్
వేయి జపించునొ నిత్యము
మాయురె యవ్వాఁడు చెడఁడు మహనీయుఁడగున్॥ 323

సారంగున్ బురికొల్పి దీనిపయి నిష్ఠన్ నిల్ప నప్పాఱుఁడే
తీరుం జూచి ప్రహర్షితుండగుచు సందేహంబు లే దించుకేన్
ధీరుం డీతఁడు దీక్ష నిల్పఁగలఁ డర్థిం జెందు పారమ్యమున్
ప్రారబ్ధం బనుకూల మయ్యెనని సంభావించి యవ్వానితో॥ 324

"కంటేమిత్ర! యనుగ్రహించినది సాక్షాత్సర్వవిశ్వేశి యీ
వెంట న్నీవు మరింత శ్రద్ధమెయి దేవిన్ గొల్చుచో నెన్నఁడో
పంటల్ పండు తరింపఁగల్గుదువు శీఘ్రంబే ఫలంబందు చూ
పుంటేన్ చాలదు దీనికిన్ జతగ వే ఱొండంది చేయన్ వలెన్॥ 325

కను మా బిల్వము నీడ మాఱట శివుల్ కైలాసనాథాఖ్యు లీ
వనుమానింపక పోయి వేడికొనుచున్నా! నిన్ను నవ్వారె దీ
క్షను నిల్పంగల రద్ది పొందిన యెడన్ గైవల్య మే దక్కు నీ
జని ధన్యంబగు" నంచుఁ జెప్పి చనె వాత్సల్యంబుతో నంతటన్॥

గాయత్రీ జపపూత చిత్తుఁడగు దీక్షాశీలి సారంగుఁ డా
ధ్యేయం బందగ నెంచు ధీరుఁడగుటన్ దీర్ఘాత్మలం జేయగాఁ
గాయంబంగెె శివుండనంగ నట వృక్షచ్ఛాయ నున్నట్టి ధౌ
రేయున్ భక్తి వినీతి యుక్తుఁడయి ప్రార్థించెన్ సమిత్పాణియై॥ 327

మూఁడవ కన్ను, మౌళి శశి, ముమ్మొన వాలును, మై సగాన న
య్యాడుది లేని శ్రీ శివుఁడె యన్నటు పండిన బ్రహ్మవర్చసం
బాడెడి ఫాలమొప్ప విమలాత్ములు వారలు వీనిజూచి యె
వ్వాఁడో భవిష్య మెట్టిదో తపస్వితసర్వ మెఱింగి వెంబడిన్॥ 328

గురుకృప వానికిం గురుత కోరి వరింతురె వారె యన్నటుల్
పరమ రహస్యముల్ మిపుల స్పష్టము లౌనటు విప్పి చెప్పి స
త్వర ఫలదాయి సంసరణ వార్ధి తరిష్ణు తరిన్ పడక్షరిన్
త్వరితముగా నొసంగి "వినువత్స! ననుంగని మే లొనర్చితో॥ 329

గిరి శిఖరంబు నందొకట కీర్తి పతాకము నాగ లింగమున్
స్థిర మొనరించి నిత్యము మదిన్ గురు నెన్నుచు మంత్రరాజమున్
స్మరహరు ప్రీతికై యయుత సంఖ్య జపింపుము సంధ్య నెన్నఁడున్
మరువని స్వామిపూజ నియమంబగు బిల్వదళాదికంబులన్॥ 330

ఇటు లొనరించితేని మది నీశ్వరుఁ డెంతయు మెచ్చి నిన్ను సం
కట పడనీక సత్వరముగా దయఁజూచును సందియంబు లే
దిట శివుఁడెంతో వత్సలుఁ డహీన కృపామతిఁ గాచు నెల్లరన్
కటకట చెంద నీఁడు నిను గావగ నిల్పెను విశ్వమోహినిన్॥ 331

కర్మవశాన వేశ్య యయి కామిని యున్నది కాయమెప్పుడున్
కర్మఫలంబె తుచ్ఛమయి కట్టగ లే దది జ్ఞాని జీవునిన్
మర్మ మెఱుంగు మట్లగుట మంచిదె సాధన కెవ్వ రెట్టిరై
శర్మము నందఁ జాలెదరొ స్వామి యెఱుంగును భూసురోత్తమా!332

అనుకూలం బగు దేహ మబ్బినది నీ కా దేహ మేమయ్యె నీ
వనుకూలింపక కామభోగమున హేయంబయ్యె, హేయంబె యై

యను వర్తింపని జీవుఁడుండి యట మాన్యంబైన ధ్యేయంబునే
కనుచుండెన్ మఱిమీఁదు నిర్వారకు సాంగత్యంబు దైవాజ్ఞయా॥

ప్రారబ్ధక్షయ మయ్యెఁగావునఁ దరింపన్ గల్గు దీవన్న! ని
స్సారంబైన జగంబు పోవిడుచు నా చందంబు చూపింతు నే
నీ రీతిం గనుఁడన్న యట్లు శివ శైలేంద్రంబు శృంగంబు నం
దారూఢిన్ దపియించి దైవకృప సౌఖ్యంబందవయ్యా వెసన్॥ 334

కైలాసేశ్వర సద్గురుం డటులు పల్కన్ విన్న సారంగుఁడు
ద్వేలం బౌ సుఖ మప్పుడే కలిగి వార్థిన్ మరాళంబు నా
హేలాడోలల నూగి యాడు మనసై యెంతే ప్రియంబౌనటుల్
మాలాకార వచస్సులన్ దనిపి సమ్మానించి యాజ్ఞం గొనెన్॥ 335

సుముహూర్తంబున వెంట బ్రాహ్మణులురా శుద్ధాంతరంగమ్ముతో
యముఁడేనిన్ నిలుపంగఁ జాలునొకో నన్నన్నట్లు తద్దివ్య శై
లము కొమ్మెక్కి గురూత్తముం దలఁచు చాహ్లాదమ్ముతో వారి నా
మము నిల్వన్ వలె నంచు లింగ మనుకంపన్ జూడ స్థాపించుచున్!

నియతిన్ సద్గురు విచ్చు శైవమనువున్ నిర్దిష్టరీతిన్ దినం
బయుతం బొగ్గి జపించుచున్ గిరి పయిన్ వ్యాపించి యున్నట్టి త
త్ప్రియ బిల్వాగ దళమ్ములన్ శివుని భక్తిన్ గొల్చుచున్ వాఁడు వి
స్మయముం గొల్పుచు నాలుగేడు లతి నిష్ఠన్ నిల్చె నచ్చోటునన్॥

## కన్నప్ప కొండ

దివ్య కైలాస స్థ భవ్య శృంగంబైన
యానంద నిలయమే యగు నగంబు
తెల్ల తెల్లని రాళ్ళు తెల్పుచున్నవి నేటి
కియ్యది వెండి కొండే యటంచు
కైలాసగిరి పైన కైలాసనాథాఖ్య
లింగ గురువరు సారంగుఁ డుంచె
నా కొండ కొమ్మన్న నంబికా ప్రియునకు
నత్యంతమున్ బ్రియమైన చోటు

స్వామికిని కన్నొసంగి విశ్వమ్ము చూచు
మంచి యవకాశ మిచ్చిన చెంచుత్రోడు
కోరి వసియింపఁ గన్నప్ప కొండ యంచు
పేరు గాంచిన పరమ పవిత్ర నగము! 338

దిగువ ప్రాకార నంది నందించుచోట
నుండి యెగువను శిఖరాన నున్న స్వామి
నెట్లు చూచుట యంచుఁ బ్రశ్నించు కొనకు
కనెదు సోపాన పంక్తి దక్షిణము నందు॥ 339

ఎక్కి వచ్చెదు దాక విశ్వేశుఁ డిచట
నుండునా యందు వేమొ రాకుండునే య
తండు? బోయలు మోసి పై దాక వచ్చి
దింపగా లేరుగాక పంపింప లేరొ? 340

భావవిమాన మెక్కి గిరి పైగల శోభను జూచి వచ్చుచో
నేవిధమైన చిక్కు ఘటియింపదు భక్తి ప్రదక్షిణించి సం
భావన మొప్ప వీరిఁ గని వచ్చుట యెంతయు ముఖ్యమాట నే
దో విధమైన త్రోవ నెటొ త్రొక్కవలెఁ ద్యజియింపరాదహో॥

అనుకొనుచుండగా నె నడయాడెద విచ్చట దారియందు దే
సిని గనకుండ విల్విడిచి నిక్కిన బాణము వోలె వచ్చితో
కనుమిట నుండియోని సరిగా నెద కెంతటి హాయి గూర్చెడిఁ
గనులకుఁ జారితార్థ్యమును గల్గునుగా రమణీయదృశ్యమై॥ 342

స్వామి ప్రతీచి చూచు దిగువన్ బయి నీవును నట్లె నిల్చి స్వ
ర్ణామర వాహినిం గనుచు హాయన మైనను తృప్తిగాంచెదో
నీ మును బాఱునట్టి నది నీ కనిపించును కృష్ణవేణియా
భామిని గాగ ముక్తి సతి వాలెను గాదె మనోహరాంగియై॥ 343

ఎడమకుఁ జూచుచో దిగువ నెంతటి విస్తృతమైన లోయ యా
నడుమను రమ్య వాపి గగనానికి సుందరమైన యద్దమై

బడలిక సర్వముఁ మఱచి భావన సేయగ ప్రోత్సహించు నం
దడుగిడి వెంబడిఁ దిరుగు టన్నది సాధ్యము కాద యేరికిఁ॥ 344

అది లో బావిగ గుర్తు తెచ్చికొని యత్యంతమ్ము నూత్నమ్ముగా
మదికిం దోచుట కద్భుతంబు గదురఁ మన్నించి యీ ప్రక్కగా
మృదులాపీన మహీస్తనం బనగ నెమ్మిఁ దోచు దుర్గాంబ క
ట్టెదురౌనట్టి నగమ్మునే కనుచు నట్లే యుండగా నెంచవే! 345

మరియుఁ దూర్పున కీవు చూచిన పురీ మాతృస్తనం బన్య మ
చ్చెరువై తోఁచు నదే గుహాలయము తచ్ఛ్రీమన్నగంబుఁ గవీ
శ్వరుఁడౌ ధూర్జటి నీలపర్వతమునా వర్ణించె నాఁ డట్లు పి
ల్చిరొ? విద్యా నగమన్న పేరొకటి వాసిం గాంచె నీనాటికిఁ॥ 346

నడుమ గలట్టి యూరును గనఁ మది కేమని పించు నీకుఁ గా
ల్నడ నడయాడు నప్పు డొక నైపుణి లేదనిపించు దాననే
పొడగనె దెంతొ యందమును బుద్ధికి దూర సమీప భేదమం
దడరెడు వింతరీతులకు నద్భుతమై కనుచుందు వట్టులే! 347

పరుగుల్ వెట్టి క్షణంబు తీరని యటుల్ పాటాడగాఁ జేయు న
ప్పురి చైతన్యము సర్వ మేమయినదో బొమ్మయ్యె నిశ్చింతగా
పరుగుల్ వెట్టుచునుండు నెప్పటి వలెఁ పైకేమొ యట్లుండ దీ
తిరకా సేమిటి? దూరమైన యెడ నెంతే శాంతి నందంగనా॥ 348

గురుఁడీ హేతు వెఱింగియే యటు లనుంగుం దెల్పెఁ గొండెక్కి మి
న్నొరయన్ నిల్చి తపింపు మంచు నిట వాఁడొందెన్ మహానందము
ర్వర సర్వంబును వాని డెందమున కార్పాటంబు లేనట్టి ని
ర్భర దృశ్యంబుగఁ దోఁచె బాలుఁడగునే రంజిల్లి తోనాడఁగన్॥

తన పూజయుఁ దన జపమును
దనకున్ బరితృప్తి గొలుపఁ దత్పరుఁ డగుచున్
దనయందె నిలిచె నాతఁడు
కనుగొన నితరంబు క్షణము కానగ లేకన్॥ 350

శృంగము చూపినట్టి సొగ సియ్యది నింగికి దగ్గరాచు సా
రంగుఁడు సారగుం డయిన రాజ పథంబిది రౌప్యశైల మీ
భంగి ననుగ్రహించు బహు భంగుల వారి శివత్వ మిచ్చుచున్
పొంగులువారు భక్తిమెయి పూనుఁడు దీని భజింప నెల్లరున్ ॥ 351

జపముం జేయుచుఁ బూజ చేయుచును సాక్షాచ్ఛైవ తేజంబె స్థూ
లపు శైలాకృతిఁ దోఁప దాని పయి లీలామానుషుండై స్వ దే
హపు సౌందర్యము చూచికోఁ దలఁచి సారంగుండుగా స్వామియే
వపువుం దాల్చి చరించుచున్నటులు తోఁపన్ నాల్గు వర్షంబులై ॥

మెడ రుద్రాక్షలు, బూదిపూఁత మెయి, విస్మేరా ననంబున్ సదా
మృడ సంభావన మొప్ప వానిఁగనఁ దానే దేవుఁడై యుండి వె
ల్వడి తానే తను జూచు నన్నటులు తోఁపం జేయు టాశ్చర్యమే
పడయ స్నేరము గాక తత్త్వ మదియే భావింపఁగాఁ గల్గుచో॥ 353

జ్ఞానాంబా పతి కాళహస్తి శివుఁడా జ్ఞానాంబతోఁగూడి సే
నానీ విఘ్నపతుల్ విరించి ముఖ నానాదేవతల్ వెంట రా
నానందంబున వాని కెట్టెదుట ప్రత్యక్షంబుగాఁ దోఁచి "వ
త్సా! నీ భక్తికి మెచ్చితిన్ భవ దభీష్టం బెద్ది వాక్రువ్వు"నాన్ ॥

జలజల పూలు రాల్చుచు నెసంగెడి నూతన పారిజాతమై
పులకలు తేరు మేను జలముక్సమ వక్త్ర విసారి బాష్ప తుం
దిల నయనాభిరాముఁడయి "దేవ! దయానిధి! కానవచ్చితే
కలుషము లన్నియున్ గఱచి కాచితి వింకను గోర నున్నదే! 355

స్త్రీ వ్యసనాన చిక్కికొని శ్రీని సమస్తము కోలుపోయి యే
స్త్రీ వ్యయహేతు వౌచు వివశీకృత చిత్తు నొనర్చెనో తదీ
యా వ్యయ బోధ మేల్కొని దయామతి సద్గురుఁ డిచ్చు మంత్ర రా
డ్దివ్య మహత్త్వ మిట్లు నను తేల్పగ నిన్గనఁజాలి తీశ్వరా! 356

నీదయ విశ్వమం దిపుడు నిన్నె కనుంగొనుచుంటి నెల్లెడన్
మోదమహార్ణవంబిదియె పొంగులు వాఱెడు భేద బుద్ధియే

లేదు మఱేమి కావలయు? లే రొక వాంఛయు నాకు శ్రేయమీ
వేది తలంతువో యది వరించెడి గావుత నన్ను నీశ్వరా! 357

అని కృతకృత్యతన్ గనిన యట్లు జపంబున మున్గిపోవ నా
తని శివుఁ డెంతొ మెచ్చి తన తత్త్వమునన్ లయమందఁ జేసినన్
దినకరుఁ డన్న యట్లె నవదీధితులన్ వెదజల్లు చప్పుడుం
డిన యటె యిప్పుడుండు నతనిన్ స్మృతి గొల్పుచు లింగమచ్చటన్ ॥

కైలాసనాథ వినుతం
బై లింగము తన్ను భక్తి నర్చించిన త
త్త్వా వేయాంశు మనస్కుని
శీలము ప్రకటించు చుంట చిత్రముగాదే! 359

అది వ్యసనంబె యా మగువయందె మరెందునుగాదు కాని వాఁ
డెదియు నసుందరంబు వరియింపఁడు సుందరమైన దానికై
యెదియును లెక్కచేయక త్యజించు విరక్తత వచ్చి వచ్చి యుం
డెదనని యేరికొన్న ధరణిం గను మెంతటి సుందరంబహో! 360

తన కూర్చుండిన చోటు శృంగమయి చెంతన్ లింగము న్నిల్పి పూ
జను ముప్పొద్దులు మున్గుచున్ నడుమ శీర్షం బెత్తుచో ప్రోలఁ గొం
డనె లింగాకృతి చూడగాఁ గలుగు చోటన్ వాఁడు కూర్చుండెఁ జ
క్కని చోటయ్యది వానిగుండె సొగసున్ గన్పింపఁగాఁ జేసెడిన్ ॥

గహనం బెవ్వరి కైన కర్మగతి దుష్కర్మంబొ సత్కర్మమో
ప్రహితంబై తనువయ్యె నెప్పుడెది విస్పష్టంబుగాఁ దోఁచునో
మహి నెవ్వాఁడు నెఱుంగ నేరక యసంభావ్యంబు సంభావ్యమై
విహృతిం జెందు విచిత్ర మాచుఁ గనమే పీఁ డెట్టి వాఁడయ్యెనో! 362

## శ్రీ కాళహస్తీశ్వర కవచము

తారకధ్వంసి విద్యాశైల విభుఁడు
కారుణ్యమునఁ దూర్పు కడనుండి కాచు 1

ఆపీత వార్ధి వీరాగస్త్య మౌని
తాపసాగ్రణి కాచు దక్షిణమునుండి 2

నీలకంఠస్వామి నిలిచిపడ మటను
జాలమ్ము లేక రక్షా పరుండగుత 3

హస్తాత్త వార్ధి విఖ్యాత దుర్గాంబ
నేత్రస్థమై కాచు నిర్ణిద్ర యుత్తరము 4

పాతాళ విఘ్నేశ పరమ పావనుఁడు
త్రాతయౌ నా కధ స్థానంబు నుండి 5

ఆకాశ భైరవుం డభయ ప్రదాత
ప్రాకారమై కాచు పై నుండి నన్ను 6

తత్సదా శివుఁడు ప్రాతః కాలమందు
మత్సహస్థితి బాల మధ్యాహ్నమందు 7

మణి కర్ణ సంత్రాతృ మణి సాయములను
నను నెప్డు శ్రీ విశ్వనాథుండు కరుణ 8

కాచు చుండెదరు రక్షా శీలు రౌచు
యే చెట్ట నన్నంటి యేచకయ యుండ 9

సర్వశత్రూత్సార సామర్థ్య మొప్పి
సర్వాస్త్ర దేవుండె సంరక్ష నిలుచు 10

ఆరోగ్య మాయతం బగు నాయు వొసఁగి
ధీర మార్కండేయ దేవుండు ప్రోచు 11

సాధకుం డీకవచ సంరక్ష నిలిచి
బాధ యే కనకుండు ప్రభు పాలితుండు 12

(ఇది విశిష్ట ద్విపద, ఇంద్రగణములలో చతుర్మాత్రా గణములు పరిహరించి భల, నలల మున్నగు పంచమాత్రాగణములంగీకృతములు) 363

శ్రమ కోర్చి గిరి చుట్టి స్వామి వేంచేసె
విమలాత్మునకు నింక విశ్రాంతి వలయు. 1

ఎంత భారంబైన నెత్తిన్గా నోర్చి
సుంతైన కుదుపు తత్సుఖ భంగ మగుట 2

జాగరూకత మోచి సాగంగ వలయు
లో గుడిన్ దగులు మల్పులు తిర్గువేళ 3 364

ప్రాకార నంది నిలుమని
శ్రీకాళానేకప పతి స్మేరాననుండై
మీకౌ శ్రమ నా కంటునె
యాకాశము నంట గలవె యన్యము లెవియేన్॥ 365

సరి సరి సాగుం డనుచున్
గరుణింపగ క్రొత్త బలము గాంచిన యట్లై
భరమూనిన పరివారము
కరమరుదుగ ముందుకేగి కదలక నిలిచెన్॥ 366

స్వామి గిరిన్ గనుంగొనుచుఁ జక్కగ నుండెను రాయ మంటపం
బా మెయి దక్షిణాన నిటులంజి వినాయకుఁ డొప్పుచుండ, నిం
కేమి వలెన్ ప్రభూత్తమున కిష్టమటుల్ గిరి చూచు చుండుటల్
స్వామి స్వతంత్రుఁ డాతనికిఁ బట్టవు చుట్టుకి గోడ లెవ్వియున్॥ 367

కదలిచి దేవళాని కిఁకఁ గాంతుని జేర్చుట కష్టమానె? బె
ట్టిదమగు కష్టమా సనియె డెందము కొందల మందుచుండె, నీ
యదనున స్వామి కెట్టులో మహోముద మందఁగఁ జేసి మెల్లగా
సదయుని లోని కొప్పదల సంధిలఁ జేర్పగ నౌను తెల్విమై॥ 368

అదియే మంతగఁ గష్ట మెప్పటికిఁ గాదయ్యా శివస్వామి చా
ల దయాశాలి మదిం దలంచిన నె నిల్వం జొచ్చు నౌదార్య మా
యెదకున్ నైజము సార్ద్రచిత్తముల నిల్చే తోఁచుచుండున్ సదా
మది నింకిం చెడి ధైర్య మబ్బుటది సామాన్యంబె జీవాళికిన్॥ 369

ఎదుటను నున్నవాఁడె యగు నెప్పుడు పెండ్లి కుమారుఁ డన్నటుల్
పొదలిన సత్కథల్ వినుచుఁ బొంగితి మింతకు నెంద రెందరో

మది నుదయించి స్వామిదయ మన్నన చేసిన తీరు తెల్పుచున్
బదము కదల్చు లోపలనె వార్ధి మునింగెద రెట్టు లెన్నుటల్? 370

## వరగుణపాండ్యుఁడు

వరగుణుఁ డనంగ సుందర పాండ్య వంశ
జాత భూపతి మంత్ర దీక్షా గురులను
భ్రష్టమతి వీడి మిగుల నాపదల నంది
కాళహస్తీశు కరుణ మోక్షమ్ము నందె॥ 371

పిప్పలా దుండు కరుణఁ దెల్పిన వివేక
మందఱకు గూడ నెంతో శ్రేయస్కరంబు
గురుని తర్గురు బోధను సరకు గొనని
వాఁడు వరగుణుఁడైన నాపదల నొందు॥ 372

అఖిల జగమును శక్తి శక్తాత్మకంబు
శక్తి మచ్ఛక్తులకు భేద ముక్తి యందె
యవి యనుటయె చెల్లని వవి యద్వయమ్ము
నేక మగుట నియ్యది విస్మరింపరాదు॥ 373

పార్వతీ పరమేశ్వరుల్ పరగుదురటు
పార్వతియు నీశ్వరుండును ద్వంద్వ మెట్లు?
సరిగ పార్వతీపుఁడు రమేశ్వరుఁడు నట్లె
హరి హరాత్మక మౌన యీ యఖిల జగము॥ 374

హరి హరుల కిర్వురకు భేద మరయువాఁడు
అంతమే లేని నిరయ మందడఁగు వాఁడు
బొమ్మ బొరుసైన నాణెంబు పోలుపు గాంచి
యేకమని తెల్పి నంది సుఖింప వలయు॥ 375

సర్వ పతి యాది శక్తి చతుర్విధంబు
భోగశక్తి భవానియే పురుషునకును
హరి సుదర్శనధారి రెండవది యగును
అనిఁ బ్రకోపించు కాళి మూఁడవది సుమ్ము॥ 37

దుర్గతి నివారిణియె దుర్గ భర్గునకును
నాల్గు శక్తులు శివ విభిన్నములు కావు
శుద్ధ చిద్రూపిణి భవాని, శుభుఁడు హరియు
సత్త్వగుణమూర్తి, దుర్గ రజః ప్రధాన
తామసియె భద్రకాళి తత్త్వమ్మునందు॥ 37

శక్తి శక్తము లౌటఁ గేశవుఁడు శివుఁడు
వేఱు వేఱని పల్కుట వెఱ్ఱిమాట
శివుఁడె విష్ణువు విష్ణువే శివుఁడు గాన
వారి నిర్వురుగా భ్రమం పడగ రాదు॥ 37[illegible]

ఆలయంబున స్వామి జ్ఞానాంబ యెట్టు
లభిముఖంబుగ నున్నారొ యట్టె యుందు
రేడు కొండల బాల యీతేఁడు చూడు
బాల కాదని వేంకటేశ్వరుఁడె యన్న
పేరు మాఱెను తత్త్వమ్ము మాఱలేదు॥ 379

ఇట్టి నిశ్చయ జ్ఞానమ్ము నెపుడు విడక
జప మొనర్పు మటంచుఁ బంచదశి నొసఁగె
వరగుణుఁడు దాని జపియించి స్వామి కృపను
స్వప్నమున గాంచుచుండెఁ గేశవ శివులను॥ 380

మోద సంధాయి హరిహరాభేద బుద్ధి,
గురుని యందలి భక్తి, తద్గురుఁ డొసంగు
మంత్ర జపమున నిష్ఠ సంపదలు గాగ
వరగుణుఁడు తేలె సర్వ సంపదలయందు॥ 381

చెరువు నిండిన కప్పలు చేరునట్లు
సర్వులును చేరుచుందు రైశ్వర్య వంతు
నట్లె చేరిరి బౌద్ధులా యవని పతిని
వీని మతి సౌఖ్య లాలస విఱిగిపోయె॥ 382

వైదిక మార్గమందు నిలువన్ వలెనన్న శ్రమంబు హెచ్చు నిం
దేదియు నశ్రమంబున లభించెడి దుండదు భక్తిదార్ఢ్య సం
పాదితమైన జ్ఞానమె భవంబును దాట శరణ్య మంచనున్
మాది సుఖాధ్వ మిందు చనుమా యని యేరిని వేడ దెన్నఁడున్॥

వేదము నొప్ప మే మనెడి వారలు తేలిక దారి యంచు దు
ర్వాద మొనర్ప భ్రాంతులయి వైదిక ధర్మము వీడి భ్రష్టులై
వేదన లందుచుండెదరు వెఱ్ఱియ కాక జగత్తునందు శ్ర
ద్ధాదర లభ్య మెయ్యదియు నశ్రమ లభ్య మొకండు నుండునే! 384

బౌద్ధమును స్వీకరించిన వరగుణునకు
గురుని ధిక్కృతి మంత్ర విస్మరణమునను
ప్రబల దోషంబు లేర్పడి ఫలితముగ నె
సంపదల పోకతో నపస్మార మబ్బె॥ 385

బౌద్ధు లప్పుడు తను వీడి పారి పోవ
నుభయతో భ్రష్టుండైన యా యుర్విపతియు
దిగులుపడి కాలమును వెళ్ళదీయుచుండ
దేవ ముని నారదుండరు దెంచుటయ్యె॥ 386

ఆతఁడు సర్వమున్ దెలిసి యక్కటికంబున రాజుతో "మహీ
నేత! గురూపదేశమున నిల్వని దోషము నిన్ను తాకి సం
పాతము తెచ్చి పెట్టె నను భావ్యము తప్పి కొనంగ శక్యమే
చేతము చిక్కబట్టుకొని చేరి కొనందగు కాళహస్తికిన్॥ 387

అక్కడ పూర్వమట్లె గురు వందును మంత్రము నందు శ్రద్ధమై
నిక్కపు భక్తి నూని శివునిన్ భజియింపుము లింగరూపునిన్

మిక్కిలి కంటి వాని దయ మిక్కిలి శ్రేయము నీకుఁ గల్గెడిన్
చిక్కుఁ దొలంచి కాచుటన శ్రీ శివదేవు స్వభావమయ్యెడున్॥ 3

అనుటయు జాగుచేయక రుజార్దితుఁడా నృపు డీ పురాని కె
న్నినమతి వచ్చి స్వామిని గనెన్ గనునంతనె ధైర్య మందె భ
క్తిని శివలింగమున్ నిలిపెఁ దిన్నగ స్వామికి వెన్క తట్టునన్
వెనుకటికంటె నెక్కువగ వేడిమితో జపియించె నిష్ఠమై॥ 38

స్వామి యనుగ్రహంబు సులభంబుగ పొంది తరించె నాతఁ డం
దేమియు వింత లేదు; ముని యిచ్చిన మంత్రము నందె దోషమై
భూమిపుఁ డార్తి నందెనని పూర్ణదయామతి నన్యు లెవ్వరో
క్షేమము తెల్ప బాగునడె సేగి తొలంగగ నందు రక్కటా! 39

దోషం బేమి యనంగ భేద మొకఁ డెందున్ లేదు పొమ్మంచు నే
రో సామిన్ భజియింపు మంచనక వారున్ వీరటం చిర్వురన్
వైషమ్యమ్మునఁ జేర్చుటే మిగుల పాపం బయ్యెఁ గాబట్టి యా
దోషంబున్ బొనరింప రా దనుచుఁ దోడ్తో నందు రా పండితుల్॥

పిప్పలాదుం డొసంగిన వింత మంత్ర
మందు శివరామ గోవింద యనిన పిదప
మరల నారాయణ యని పిమ్మటను మరల
శివ మహాదేవ యనుచు వచింప వలయు॥ 392

ఇరువు రొకరైన యపుడు పేర్లెట్లు భిన్న
ములగు? నుభయుల కగు నామములును గలవు
గాదె? నామ రూపముల కైక్యమ్మె చెప్పఁ
గలిగి నపుడు నామ సాంకర్య మేమి? 393

పిప్పలాద మహర్షి యల్పియుఁ డగునె?
అతఁడు తప్పేల చెప్పును? వ్యర్థమతులు
తామె సుమతుల మనుకొని తప్పులనుచు
లేని పోనివి యురక కల్పింతు రిల్లె॥ 394

వరగుణుఁడు భ్రష్టుఁడయ్యెఁ జార్వాకమైన
బౌద్ధమున్ స్వీకరించుట; బుద్ధి కలిగి
నారదుని దయఁ దిరిగి తన్మంత్రమున నె
స్వామి దయకును పాత్రుఁడై స్వాస్థ్య మందె॥ 395

ఏకం బద్వయమైన బ్రహ్మమున కెందే సామ్య మెట్లుండు? న
శ్లోకం బయ్యును సాధకాళి హితమూహించున్ ప్రసన్నాత్ముఁడై
యేకైకంబుగఁ దోఁచు నొక్కకరి కక్లే యాట నేరూపమై
యేకం బద్వయమైన బ్రహ్మమె యగున్ హేయంబగున్ భిన్నమై॥

స్వామీ! పంచమ సత్పదం బిటులు నీ సంపూర్ణ సాహాయ్యమై
యీమై వెల్వడె మంచి నీ దగుత తప్పెందున్నఁ దత్సర్వ మీ
యాముష్యాయణు నెత్తిపై నిడుము దేవా! పుట్టు వందన్ గృతం
బేమైనన్ భరియింప నే వలయు నాకే చింత లేదయ్యరో॥ 397

అనుకోన లేదు నే నిటు మహాకృతి కూర్పఁగఁ జాలు దంచు నే
మనిన సుదీర్ఘ కావ్యముల కాదర ముండని కాలమిద్ది నీ
వె నను నిమేష మేని మతిపెట్టి తలంచుట కింత సందు నీ
యని యుబలాటమై తరిమి యంతయుఁ జెప్పి రచించి తయ్యరో॥

వా యని పిల్చితిన్ మరల వా యని పిల్చితి దేవ దేవ రా
వా యని పిల్వఁ బిల్వ దయవచ్చితి చొచ్చితి గుండెగూడు ముం
దే యట నుండి పల్కితి వదే నిజ మీవు వినా మరేమి లే
దా యెనటుల్ వచించుటకు నైనను నీవయి దిక్కు లేదహో! 399

అంతగ నొక్కఁగా నొకఁడవై నను సర్వము గాగ తోఁచి నీ
యంతట నీవె వేషము లనంతముగా ధరియించి మించి క
ల్పాంతము సాగు నాటకము నాడెదు సాక్షివి నీ వొకండవే
చింత యిదేటి కయ్య నినుఁ జెంది సుఖంబుగ నుండరాదొకో! 400

ఐదవ సత్పదం బయిన
హ్లాదమునన్ మిముగూర్చి యన్నటుల్
నా దగు మోహామున్ దమ ద
నన్ వచియింతును మాట కారినై
వాదము పెంచ నేల? నినుఁ
బట్టితి షష్ఠ పదంబు పూర్తిగా
బ్రోది యొనర్చి నీ పదము
ముట్టగ నిమ్ము దయా పయోనిధీ!!! 401

# షష్ఠపదము

## యకార పదము

"యశ్శివో నామరూపాభ్యాం యా దేవీ సర్వమంగళా
తయో స్సం స్మరణా త్పుంసాం సర్వతో జయమంగళమ్॥
లాభ స్తేషాం జయ స్తేషాం కుత స్తేషాం పరాభవః
యేషా మిందీవరశ్యామో హృదయస్థో జనార్దనః॥" 1

అడుగిడి సాగునప్పు డిటు లన్కొనుచున్ జనుచుంట పెద్దలం
దెడపగరాని వాడుకయి యెల్ల శుభంబుల గూర్చుచున్న యీ
నుడుల గలట్టి యర్థ మపనోదన హేతువు పాపరాశికిన్
మృడుఁడు మృడాని విష్ణువును మేలొనరింతురు మువ్వు రొక్కటే! 2

యా యా యే. యని యా గుణింత మటులే యామూల కీ మూల కీ
వై యెన్నెన్ని విధాల ప్రశ్నమడుగన్ యత్నించినన్ వచ్చు తే
ల్వి యొక్కండగు నేక మద్వయము నింకేమైన లేదంటయే
యై యా యొక్కటి యాత్మయే యనుటతో నైక్యస్థితిన్ జెందనా॥ 3

యా యా యా యని బుఱ్ఱ చించికొని యన్యోన్యంబు తర్కించి యే
మా యెన్ దేలెడి దేమి యన్నిటికిఁ దా నా మూల మాత్మాన్య మే
చాయన్ దోఁపదు తా నె స్వీయమగు నిచ్ఛన్ బట్టి తా నౌనుదుర్
జ్ఞేయం బైన జగంబుగా నగు పురారీ! స్వాస్థ్యమే శ్రేయమా॥ 4

వరగుణ పాండ్యుఁడు నిలిపిన
సురుచిర లింగంబు చెంత సుందర లింగం
బరుదైన దొకటి యున్నది
హరలింగం బదియు చోళుఁ డర్పించినదా॥ 5

# రాజేంద్రచోళుఁడు

రాజేంద్ర చోళుఁడనఁగా
రాజేంద్రుఁడె చాల మంచి రాజగు నతఁడున్
మోజుపడి యొక్క పూవున
కై జర్జరితుఁడు విముక్తికై యిటు వచ్చెన్ ॥ 6

కరుణా వరుణాలయుఁడౌ
గిరిజా పతి వానిఁ గాచెఁ గేవలుఁ డయ్యెన్
హరుఁ డెంత చిత్ర మతియో
వరకృప నెదో వంక పెట్టి భక్తుల నీడ్చున్ ॥ 7

త్రి శిరః పల్లి నాథుఁడు
శశిమౌళియె వంశ దైవ సన్నుతి నందన్
వశి యయి రాజ్యము నాతఁడు
శశి శేఖరుఁ డాత్మ మెచ్చఁ జలుపుచు నుండెన్ ॥ 8

కాంతి మతి చంద్రరేఖలు కాంచనాంగు
లచ్చరల మించు వార లర్ధాంగు లయిరి
వారితో సర్వభోగ మవ్వారి గాగ
ధార్మికుండయి రాజు స్వస్థమతి నుండె॥ 9

తిరుచి యనంగ నేఁడు వినుతిం గను పట్టణ మద్ది, తల్లియై
హరుఁడట సర్వజీవులకు హాయి నొసంగును, వాని గొల్చి యా
నరపతి సౌఖ్య మందుచు జనప్రియుఁడై వసియించుచుండగా
హరునకుఁ గాళహస్తి పతి కాతనిపై దయ కల్గె వింతఁగన్ ॥ 10

మాతృ భూతేశ్వరుఁడు మహా మహిమ కలఁడు
కలఁడనంగను విన్న విఖ్యాత యోగి
యక్కడున్నట్టి కాశ్మీర మందునుండి
యిచటి త్రిశిరః పురమ్ము మే లెంచి వచ్చె॥ 11

ఆ మహా యోగి సర్వజ్ఞుఁ డగుట వలన
హరుఁడు జవ్వంతికా ప్రియుం డనుట వినుచు

నేమిటది యని కడు విచారించి తెలిసి
యోగ బలమున సాధించి యుగ్రుఁ గొలిచె॥ 12

అది యొక రమ్యమౌ కుసుమ మద్భుత మైనది వర్ణ వాసనా
విదిత మనోజ్ఞతాదులను వేరికి విన్నదియైన కాదనన్
గుదురునె చూచుటల్ మునియు కోరి దివంబున కేగి దానినిన్
గదిసిన యోగశక్తి మెయిఁ గట్టిన యంటునె తెచ్చె నింటికిన్॥ 13

దేవ పూజార్థమౌ తన పూవు దోట
దాని మివుల శ్రద్ధను నాటి తత్సుమంబు
లెన్ని పూచిన నన్నిటి నీశ్వరునకె
భక్తి నర్పించుచుండెఁ దీవ్ర వినయమున॥ 14

అది పెరిగి పెద్దదై రోజు కైదు పదియు
పూచుచుండెడి దట్టులె చూచుచుండ
నేఁబదియు వంద యగుచు నెన్నేని పూయ
నన్నిటిన్ స్వామి కర్పించు నయ్యనఘుఁడు॥ 15

స్వాదు జవ్వంతికా పుష్పజాతి పూజ
యా మహామహు వ్రతమది యాగరాదు
యోగ శక్తిని సాధించి యోర్పుతోడఁ
గష్టపడి పెంచి పూలిచ్చు కాలమందు॥ 16

దాని పూవులు స్వామియే తాల్ప వలయు!
నేరు నాచెట్టు దరియ రా దెవరు పూవు
కోయనే రాదు కోసిరో యాయెనంతె
యెవరి కేట్టట్టు లానౌనో యెఱుఁగ రెవరు॥ 17

రాజున కిట్టి యోగి శివరాత్రుఁడు పట్టణ మందె యుండి సం
పూజన మాచరించు దినముల్ శివు నన్న సువార్త కూడ నే
రోజున నందలేదు పలుత్రోవలు పూజకు స్వామి కేదియుల్
యోజన రాదు మానసమె ముఖ్యము వాలుట దాని బట్టియూ॥ 18

ఒకనాఁడా విభుఁడాల యమ్మునకు భక్త్యుద్రేక మొప్పఁగ సభా
ర్యకుఁడై పోయి విభుఁ భజించి చనుచో నా పుష్ప నిర్మాల్య మ
ర్చకుఁడీయం గొని కళ్ళ కద్దుకొని తత్సౌందర్య సౌరభ్యముల్
చకితుం జేయఁగ నట్టె చూచుచు మహాశ్చర్యంబునఁ మున్గుచున్॥ 19

ఎంత మనోహరం బిది మహీవలయంబున నిట్టి పుష్ప మీ
ప్రాంతము నందు లభ్యమగు వార్త యెఱుంగక యుంటి నేటికీ
వింత సుమంబు కంటఁబడె వీడుదునే యిది యెక్కడున్ననుఁ
స్వంతము చేసికోవలయుఁ జానల కీవలె నంచు నెంచుచో॥ 20

కాంతిమతి చిన్న భార్య యకాంతు గదిసి
యా సుమంబును గూర్చి మహాభి మాన
మంది యెట్టైన నద్దానిఁ బొంద కున్న
బ్రదుకు బ్రదుకేమిటని వాని పట్టుదలకు॥ 21

ప్రాణముఁ బోసి పెంచి యూర్వాడనీక
తరిమినఁ రాజు తహ తహ పెరిగి పెరిగి
పురమునం దెచ్చు టున్నను పూవులెన్ని
యున్న నన్నియుఁ రాజస్వ మూరివారు॥ 22

తమకుఁ దామయి తెచ్చి రా ధాత్రి పతియు
మెచ్చి బహుమాన మిచ్చు బల్మిని గొనంగ
వలసి వచ్చెనా పడియెడి పాట్లు తెలియ
నేరి కెఱుఁగంగ రా'' దని యెల్ల యెడల॥ 23

చాటఁ బంచెను చాటింపు సాగి సాగి
యెల్ల చోటులఁ బర్వె యోగీశ్వరునకు
వినగ నయ్యెను రాజాజ్ఞ వినియు నతఁడు
వ్రతము భంగింపఁ జనదని వదలఁడయ్యె॥ 24

భటులు పురమెల్ల గాలించి పట్టువడక
యెవరు తెత్తురో యెప్పుడో యెఱుఁగుద మని

యాలయము కడ కాపు కాయంగఁ దుదకు
యోగి తెచ్చుట కనుచు నయ్యోగి దరిసి॥ 25

రాజు నానతిఁ దెలుప విప్రవరుఁ డతఁడు
సాధు మార్గాన నద్దాని చరిత యెల్ల
పేరు విన్నది మొదలు తద్విసుత పుష్ప
వృత్త మంతయు దాని కెల్లింత చేయ॥ 26

ఇప్పు డిట్లుగ లభియించు నింత కష్ట
పడుచు దైవంబు కృపను లభ్యమగుచుంట
స్వామి కర్పించు టొక్కటే వ్రతము గాఁగ
దాను నివసించుచుంట నంతయును దెలిపె॥ 27

వినిన వారలు యోగ్యులై వెడలి రాజు
నకు వినతి చేసిరి నృపతి యొక విధమున
మతిని మందలించుకొని సుఖం పడగ వచ్చు
కాని ప్రారబ్ధ మట్లు చక్కబడనీదు॥ 28

కాంతి మతి వాని బుద్ధి ఖడ్గమ్ము నంచు
సాన బట్టుచు పదును హెచ్చుంగఁ జేసె
నంతె రాజాజ్ఞ మరల నూరంత తెలిసె
నెల్లవారికిఁ బెను భయ మినుమడింప॥ 29

"స్వాదు జవ్వంతికా పుష్ప జనక వృక్ష
మీ క్షణము నుండి రాజస్వమే యెఱింగి
యెవ్వరును ముట్టరాదు యోగీశ్వరుఁడును
పొరుఁడే యాట రాజాజ్ఞ మీఱరాదు॥ 30

దినము భటు లేగి పూవులు తెచ్చి మూఁడు
మాలలన్ గట్టి తనకును మహిషులకును
వేఱు వేఱుగ భక్తి నర్పింప వలయు
తప్పుచో ద్రోహులకు మృతి దండనంబు॥" 3

యోగి శివరాత్రుఁ డెంత మహోగ్ర కోప
మందియున్ శాంతుఁడై శివునాజ్ఞ యెట్టు
లున్న నట్లగుం గావుత మనుచు నరక
సాక్షియై యుండిపోయె; రాజాజ్ఞ భటులు॥ 32

వచ్చుచుండిరి, పూవులు వ్రతము తప్ప
రాజునకుఁ జేరుచుండెను; రాజమాలి
మిన్నకుండెన? యుండునే మిన్నకతఁడు?
ఏమి యెఱుఁగని యట్లె యెన్నేని చేయు!! 33

భటులొసంగిన మాల నా ప్రభుఁడు తలను
భక్తి ధరియించి సంతోష పడుచు నుండె;
కాంతిమతి దాని దాల్చి నాకంటె ధన్య
కాంత లెవ్వా రటంచును గర్వ మంద॥ 34

సాగె; జ్యేష్ఠభార్య యయిన చంద్రరేఖ
దినము నద్దాని గొనుచు మందిరము నందె
కరుణ వేంచేసి యున్న శ్రీహరున కిడుచు
మ్రొక్కులన్ మ్రొక్కుచుండె విముక్తి కోఱకు॥ 35

ముప్వు రుండిరి ముగ్గురకు మూఁడు మతులు
రాజునున్ రాజు భార్య లుర్వురను వారు
పొందనగువాని కనుగుణంబుగనె కలుగు
నట్టి బుద్ధులు పుట్టించునది శివుండె॥ 36

ఇట్లు పదినాళ్ళు సాగెనో యేమొ యంత
లోనె వింత వార్తలు గాలిలో యథేచ్ఛ
జనుల చెవులను బడుచు వచ్చినవి నిజము
లవునొ కాదో యిపుడు తెలియంగరాదు॥ 37

కాంతిమతి యెంత ధన్యనుగాఁ దలంచి
కొన్న నామెకు నొరిగిన గొప్ప లేదు

పైగ నాథున కామెకుఁ బడుట లేదు
చంద్రరేఖ గర్భముఁ దాల్చె స్వామి కరుణ!! 38

రాజు మతియందదేదొ విభ్రమము తోఁచు
నిపుడు సామాన్యులకు మారు పెఱుఁగ రాక
యున్న దేశాని మతిమంతు లున్న విషయ
మిట్టి గ్రహియించి రధిపుఁ డింకేమి యగునొ? 39

నెల నాళ్ళైనది మిన్ను మన్ను నొకటే నేలేది మిన్నేది? నీ
తెలివిన్ నన్ను భజించు వాని సుమముల్ తెప్పించుకోఁ జాలి, తీ
వలలోఁ జిక్కితి వెందుఁ బోయెదవురా పక్షీయటంచున్ శ్రవో
వలభుల్ దూఱి రవంబు లువ్వెసఁగ వీవన్ సాగె దిగ్వాయువుల్॥ 40

మతి మంతుండయి యున్న రా జెటులు సంభావించునో గాని నేఁ
డతఁ డు ద్విగ్నుఁడు గేహమున్ విడిచి భార్యా ద్వంద్వసంబంధమా
స్మృతి యొక్కింతయు లేక యేదో పనిమీదే పోవునన్నట్లుగా
మతి వెంటన్ జనఁజొచ్చెఁ గాంతిమతియున్ మన్నాఁథుఁడంచున్
జనన్॥ 41

మొదటన్ గాలిగఁ దోఁచి వారిరువురా పోటాడ్డు కోలేక త
ప్పిదమున్ జేసినవారు వీధి బడగా వెన్నంటి మన్నే దివం
బు దెసన్ వర్షము రీతిగాఁ బడు క్షణం బున్నన్ గిరిన్ మించునా
నది యెట్లున్ గననీక పొవుటయి వా రెల్లగిరో యేమొకో? 42

కాంతి మతి యేమి యయ్యెనో కాంతుఁ డెఱుఁగఁ
డామె యణగారిపోయె నా భూమి రజము
పై బడంగ నెచ్చటనో యేర్పఱుప రాక
యామె స్మృతి లేని రాజు బాధాకులుండు॥ 43

వాని వెన్నంటి వెనుమట్టి వాన విడక
పడగ సాగెను వాఁడు దుర్భర దురంత
వేదనం బడి పడలేక వెఱ్ఱి యగుచు
నెచట తలదాచు కొనక పర్విడగ సాగె॥ 44

వాన తరుముచునుండె నవ్వాఁడు పరుగు
పెట్టుచున్ జాల క్షేత్రముల్ విడిచి చనుచు
నెచ్చటను రక్షణంబింత యేని కనక
వచ్చి వచ్చి యిచ్చోట సువర్ణ ముఖరి॥

పశ్చిమపు టొడ్డు చేరి ప్రాగ్భాగ మందు
కానవచ్చెడి కైలాస కాంచ నాగ
ములను గాంచుచు కైమోడ్చి మ్రొక్కవలెను
వాని విడువక మినుమట్టి వాన తరిమె॥ 4

ఏటఁబడి వాఁడు తూర్పున కేగి నిలిచె
నాగిపోయెను మనువాన యంతలోనె
కావునను నేటికిని రెండు గట్టులకును
చాల వ్యత్యాస మగపడున్ సర్వులకును॥ 47

పశ్చిమమ్మున మెరక యా ప్రక్క పల్ల
మిట్లగుట కిద్దియే హేతు వట్లేగి చోళుఁ
డద్దరిని గిరిని గిరి ప్రత్యంతధాత్రి
స్వామి యున్నట్టి వసతి సర్వమును జూచి॥ 48

సహజముగ సాధువున్ విజ్ఞుఁ డహరహంబు
దైవమున్ గొల్చు సద్భక్త జీవుఁడగుట
నిట ప్రవేశమ్మునను ముక్తి నిడు శివుఁడని
విదితమై యున్నమాట తప్పదను రీతి॥ 49

వాని మతికిని స్వాస్థ్యమ్ము పరమ తపము
నందు నిల్వగ ననుకూల మయిన చోటు
వసతి సౌకర్యములు తమంత సమకొనగ
పంచ వర్షంబు లతఁడు తపం బొనర్చె॥ 50

ధర్మపురిలోని రాజ సౌధంబునందు
గాలి వీచుచు నుండ శంకరుని పూజ

యందు నుండిన పెదరాణి యిందువదన
గర్భవతి చంద్రరేఖ నిక్కమ్ము నెఱిఁగి॥ 51

చాల దుఃఖించి తేఱి తత్సమయమందు
ముఖ్యమగు ధైర్యమును గోలుపోక స్వస్థ
మతిని మంత్రుల తోడ్పాటు నితర జనుల
సాయ మందుచు రాజ్యంబు చేయసాగె॥ 52

కాల మందునఁ బ్రసవించి బాలు గనియె
సర్వసుగుణాల వాలుఁ డా సతి సుతుండు
అమర జవ్వంతికా నాథుఁ డనఁగఁ బరగె
మాతృభూ తేశ్వరున కది మాఱు పేరు॥ 53

ఇచట రాజేంద్రచోళు మహిత తపంబు
శివుఁడు కడు మెచ్చియును పరీక్షింపఁ గోరి
వానికిని స్వప్నమునను గన్పట్టి ''యోయి!
చాలు తపమికఁ జాలు విశ్వాస ముంచి॥ 54

కోరు మెదియేని తీర్చుట కొఱకె యిట్లు
కాని పించెదు నెట్టి భోగముల నేని?
వలయు వానిని కోరుము వత్స!'' యనుఁడు
వాఁడు పరిపక్వబుద్ధి యా పలుకు వినుచు॥ 55

''శివ శివా! స్వామి స్వప్నమే యనువుగాక
నిన్ను జూచిన వాఁడు నిన్నే వరించు
గాక తుచ్ఛ భోగంబులన్ గాంక్ష సేయు
నెట్లు పొసఁగును ముక్తి నాకి'' మ్మనంగ॥ 56

స్వామి వదలక యెన్నియో పద్ధతులను
పూని పరికించి లోభమ్ము నూనకుంట
కాత్మ మెచ్చుచు నపుడె సాక్షాత్కరించెఁ
గలయె నిజమయ్యె వాని కక్కజము గదుర॥ 57

"ఓయి రాజేంద్రచోళ! నీ వుండు మిచట
నాలయంబున స్వామి వెన్నంటి యున్న
తూర్పు దిక్కునఁ గొండ నత్తుకొని యున్న
స్థలమునన్ లింగమున్ నిల్పి కొలుము దినము." 5

అని వచించెను వెంట నం తర్థినందె
నాఁడె రాజేంద్ర చోళుఁడు నాథుఁ డనిన
చోటుననె వరగుణ శివుం డాట కయిన
తోడు వచ్చె నటంచు సంతోషపడగ॥ 59

చోళ లింగంబు నెలకొల్పి శుద్ధ హృదయ
పారి శుద్ధ్యము త ల్లింగ భావమంది
కానవచ్చె ననంగ నఖండముగను
వెల్గులన్ జిమ్ముచుండ సేవించుచుండె॥ 60

చాల కాలమ్ము సాగె నా చోళుపూజ
చంద్రరేఖా సుతుండు రాజత్వ మంది
తండ్రి సంగతి తెలిసి యాతనిని గూర్చి
దేశమంతయు గాలించి తెలియ లేక॥ 61

తెలిసి యెట్టులో కాళహస్తికిని వచ్చి
తన్నె టెంగించుకొని "కన్నతండ్రి! పోద
మింటికిన్ రాగదే" యన్నఁ జంటివాని
చూచినట్లుగ రాజైన సూనుఁ జూచి॥ 62

"బాబు! నీ వింతవాఁడవై భారమెల్ల
చక్కగాఁ బూని యుండ నా కక్కడేమి
పనియు నుండదు మీకు నేనని యొకండు
ఉన్ననున్ లేక యున్నను నొక్కటె యగు॥ 63

అమ్మ నడిగితి ననుము న న్నడుగకు మిఁక
స్వామి నర్చించుకొనుచు నిచ్చటనె యుందు

నెప్పటికి నైన కరుణింపఁ డేమి స్వామి?
యిక్కడే యుండునింక నీ వేగు బిడ్డ!॥ 64

అని వచించి పంపించెను తన జవాన
తాను మునిగెను శుద్ధ సత్త్వమ్ము నంది
నిష్ఠ మెలఁగెడు వారి కా నీల గళుఁడు
చాల సులభుఁడు స్వామి సాక్షాత్కరించి॥ 65

లీన మొనరించికొని వాని లింగమందు
తాను లీనమ్ము గాగ నాతండు నిలుపు
లింగ మీనాటికిన్ కథా శ్లిష్ట మతుల
కతుల శుభముల నొసఁగి యాహ్లాదమందు॥ 66

శాంత శివ మచ్యుతం
దాంతం హర మద్భుతమ్

భజేఽహం భజేఽహం భజేఽహం భజేఽహం
నిరీహం భజేఽహం భజేఽహం నిరీహమ్॥

సత్యం శివం సుందరం
నిత్యం జ్ఞాన మనన్తమ్

భజేఽహం సదాఽహం భజేఽహం సదాఽహం
నిరూహం సదాఽహం భజేఽహం భజేఽహమ్

ఏక మేవా ద్వయం బ్రహ్మం
సచ్చిదానందం స్వయమాత్మమ్

భజేఽహం దురూహం నిరీహం భజేఽహం
సదాహం భజేఽహం స్వయం స్వాత్మరూపమ్॥ 67

స్వామి కెదుట శిలా ధ్వజస్తంభ మొప్పు
దాని శిఖరానఁ జిఱునంది కానవచ్చు
స్వామి ధ్వజ మన నంది ధ్వజమ్మె యగును
నంది స్వామి కెపుడు వాహనమ్ము గాదె! 68

నంది యనఁగను నానంద మందువాఁడు
ఎల్ల జీవుల నానంద మెవని కబ్బు!
ధర్మమున నిల్చు వారె యందంగలారు
ఘన మహానంద రస సదాఖండ సుఖము! 6

నంది ధర్మమ్ము శివు వాహనమ్మగుంగు
మన మొనర్చెడి ధర్మమే మనకు శివుని
తానె వహియించి తెచ్చి ముందటను నిలుపు
నందివలెఁ జూచుచుండి యానందమంద॥ 7

## చక్రధర వృత్తాంతము

ధ్వజము తలపోయగాఁ జక్రధరుఁడు స్మృతికి
వచ్చు చున్నాఁడు మహితాను భావుఁడతఁడు
సాధువై యుండి పాషండ సంగమమున
నపజయము లంది యేమిరా యనుచుఁ గలత॥ 71

అంది య య్యాగస్త్య ముని దయన్ మెలఁకువ
గని గురుండిచ్చు మంత్ర మఖండముగను
నొక్క రోజున జపియించి యక్కజముగ
స్వామిలో లీనమయ్యె నా చక్రధరుఁడు॥ 72

శివ మూలం బగు ధర్మ వృక్షము వశిత్వ శ్రేష్ఠత్వమే హేతువై
శివుఁడే తన్మహనీయ వృక్ష మహితా స్తిత్వ ప్రధానుండగున్
శివునిం గాదన ధర్మమెట్లు నిలుచున్ జిత్తంబు మత్తంబుగా
వ్యవహారంబు సమస్త మెల్లరకు వ్యత్యస్తంబయ్యె కూల్చెడిన్॥ 73

శివునిన్ దద్వ్యవహారమున్ గనుచు వాసింగాంచగా లేని దు
ర్భవు లర్థంబు గ్రహింపలేక మదులన్ వైరస్య ముంబూని వా
చవికిన్ లోగి మతుల్ మలంచికొని భ్రష్టత్వంబె మే లన్నటుల్
శివతన్ భాందక నష్టపోయెదరు ఛీ ఛీ యెంత కష్టంబహో! 74

మూలం బందు జలంబు పోసినయెడన్ మూర్ధాగ్రమందున్న శా
ఖాలం బ్యేక కిసాలయంబును పునః కాం త్యుజ్జ్వలం బౌనటుల్
మూలం బౌ శివుఁ డర్చితుం డయిన సంపూర్ణార్చనంబై త్రివృత్
త్రైలోక్య స్థిత దేవతా తతియు ప్రీతంబై ప్రసన్నంబగున్॥ 75

సత్యా మిటుండ దక్షమతి సాగిన యల్పులు తాము సూటి దా
ర్ఘత్యము నందుచున్ బరులఁ గాంచి శివుండు శ్మశానవాసి సా
మత్యము లేదు కాటి బసుమంబును పాములు పచ్చితోళ్ళు నీ
వ్యత్యయ వేషధారి కొక వందనమా యని యీసడించుచో॥ 76

అలసులు, నున్నకొద్దిమతియైనను వాడక వారు వీరు నె
ట్టులు పలుకాడినన్ దల నటుల్ కదలించెడివారు పట్టి మ
చ్చలుగ నెయెంచి పూజ్యతయుఁ జావగ నెవ్వగఁ బొందుచుందు రే
యలపును బొంద కెల్లపుడు నర్థమెఱుంగుట శ్రేయమయ్యెడిన్॥ 77

జగ మన్న నె మహా శ్మశానమై యున్న దం
దు మిగిలెడిది తానె ధ్రువుఁడు తాను
అధ్రువం బగు సర్వ మడఁగించి యందుండు
తాను గావున నె శ్మశాన వాసి
సచ్చిదానంద విశ్రాంతి నందింపగా
జడము నాడించు చిత్స్వామి యగుట
నటరాజ బహురూపి నామంబులన్ దాల్చు
నిత్య జాగరత నిర్నిద్రుఁ డతఁడు
సర్వ కశ్మల మైన ముజ్జగము లతని
కలుషహర శీలమున నె మంగళములగును
సర్వ మంగళ మాంగళ్య చాన యయిన
శివుని కంటె విశుద్ధుఁ డే ధవుఁడు కలఁడు? 78

ఊర వైవిధ్యము గారి వాస మురమా నూహన్ బ్రదర్శించు వా
రుజ్వై యి ర్తైఱ గట్లు తోఁచుటయె మేలో హో యెడంబుందు నే

కర మాశ్చర్యము స్త్రీయుఁ బూరుషుఁడునై కామందురా హేతునై
యెఱుఁగంగా నగు నేక మద్వయ శివంబే సర్వమానం బొగిన్॥ 79

తా నుమాధవుఁ డగు రమా ధవుఁడు నిజము
ధవత మాత్రమ్మె శక్తి శక్తములు వారు
వేషనామ వైవిధ్యము విసరి వైచి
తత్త్వ మాత్మఁగ దెలియు చిత్త్వమ్మె శివత॥ 80

ఆ వ్యాఘ్ర చర్మ మెట్లగు పించు నయ్యదే
    నిర్జితాహంకార నియతి సుమ్ము
కృత్తివాసోనామ కీర్తితుం డగు కేల
    యజ్ఞాన గజ చర్మ మది ముసుంగు
తాను తానై యున్న తత్త్వంబు నందింత
    విశ్వమ్ము వ్యక్తమై వెలుఁగు నెటు
లా ముసుంగున నుండి యనుభవించి విముక్తి
    నందింప నందుచు నఖిల జగము

నింద్రి యాహుల నతఁ డొక్కఁడే జయించి
వలయునట్లుండు మేని సొమ్ముల నొనర్చె
మనసె మాయా మృగం బౌను మది శివునకె
లొంగి యున్నది చేత నుప్పొంగు భక్తి॥ 81

తలపై సుధాంశువు తత్త్వదీప్తియె సుమ్ము
    సుర సింధువే జ్ఞాన సర మెఱుంగు
మా ఫాలలోచనం బది విచ్చెనా యేని
    జ్ఞానాగ్ని సర్వమ్ము కాల్చి వైచు
జీవుఁడున్ దేవుఁడున్ జెలఁగుచుండియు గూడ
    జగతి లేకున్న చో సాగ కుంట
నా కన్ను తెఱవక యర్కేందులోచన
    ద్వయమునన్ జూచు విశ్వముల నెల్ల

నెవఁడు తొన్నైన వాఁడో బ్రహ్మిష్ఠుఁడగుచు
వాని ఫాలాంబకము విచ్చి వాని సర్వ
కర్మ సంచయమున్ గాల్చి శర్మ మిడుచు
లోకముల నెల్ల గాచు నలోలుపతను॥ 82

ఆ శివుఁ దద్విరోధుల యహంకృతి మూలక దుష్టవాక్య వై
నా శక ఘాసమట్టె తిని నాదని ప్రోయుచు విస్మరించుచో
వేశమునన్ దిగంబడుఁటె విష్ణువు నమ్మి శివద్రుహాండుగా
నాశము తప్ప దట్టె హారు నమ్మియు శ్రీహరి మ్రొక్కఁగావలెన్॥

చక్రధరుండు స్వచ్ఛమతి సద్గుణ భూషితుఁడచ్ఛ శీలి ని
ర్వక్ర పరాక్రముండు బుధవర్గ సమాశ్రయమొప్పువాఁడు రాట్
చక్రము నెల్ల గెల్వ గల శక్తి గలాఁడని పేరుపొంది శ
స్త్రక్రమ మంచు తూర్పుదెస దక్షిణ మిట్లు ప్రదక్షిణమ్ముగా॥ 84

దిగ్విజయ మెంచి పోయి ప్రాగ్దిశనె యూఱు
చోట్ల గెల్పొందలేక విశుద్ధుఁ డగుట
నేమి యిట్లగు చున్న దే దేని దోష
మున్నదో యేమొ దిద్దుకొందున్న యట్లు॥ 85

అనుచుఁ దద్దోష మెఱుఁగు టెట్లని విచార
పరతఁ దిరుగుచునుండ నిల్వాల కృతాంతుఁ
డయ్యగస్త్యుండె యెదుట ప్రత్యక్షమయ్యె
నా క్షణంబందె రాజు సాష్టాంగ మెఱగె॥ 86

లేచి వినీతుఁడై శివుని లీల వెలింగెడి వాని కన్నులన్
జూచి యెదో మహత్త్వమది చొక్కఁగఁ జేయగఁ గై మొగిడ్చియే
నా చెవి పావనం బగున? నాథ మునీంద్రుఁడు సర్వదర్శియై
యీ చెవి కేదియైన వినిపించున శ్రేయమటంచు నెంచుచో॥ 87

"నాయనా! చక్రధర! ప్రసన్నమగు దారి
తాత ముత్తాత లందఱు నేతలగుచు

త్రొక్కనది యుండ నది పెడద్రొక్క నడచి
చిక్కు పడుచుంటి వీవు మంచిదియె వినుము॥ 8

స్మార్త దృష్టిని మాని పాషండ మతిని
శివుని నిరసించు చున్నావు శివుఁడె సర్వ
మది యెఱుంగక యురక స్వయం ప్రహాణ
పద్ధతిన్ బూని దురపిల్ల ఫలము కలదె॥ 8

ఒకని నమ్మంగ వచ్చు వేఱొకనిఁ దిట్ట
నేమి పని యిర్వురును నొక్కరే యగుటను
ఎవని నమ్మితొ వానినే యీసడించు
చొ మహా పాప మగుచున్న దేమి వింత? 9

సలుప రాదద్ది శివుఁడు కేశవుఁడు నొకరె
ఒకరి పూజింప నొకరు మే లొసఁగు చుందు
రట్టి యన్యోన్యులకుఁ గలహంబు తెచ్చు
దుష్టమతి యేమి సరియైన త్రోవ నడుము॥ 91

నీకు మంత్ర మ్మొసంగెద నియత మతిని
దాని గొని హోమ్మ మన్నదీ తట గతమ్ము
కాళహస్తికి నచట శంకరుని ప్రోలఁ
గూరుచుండి జపంబు నిండారు భక్తి॥ 92

చేయు మీ మంత్ర మహిమ మీవే యెఱుంగు
దనుచు నాతఁడు వినయాన నంజలించి
వినుట కొగ్గిన చెవియందు వినిచె మనువు
దీక్షితుండయి కాళహస్తికిని వచ్చి॥ 93

ఆ మహాముని చెప్పిన యట్లె మొదట
నదిని స్నానమ్ము చేసి శ్రీనగము చుట్టి
దేవళమ్మున స్వామిని దేవిఁ గొలిచి
స్వామి ప్రోలను గూర్చుండె జప మొనర్ప॥ 94

తెల్లవారలు జపియించెఁ దెల్లవారెఁ
దెల్లవారిన హృదయమం దెల్ల లోక
ముల్లసిల్లఁగ లోకమ్ము లుల్లసిల్లె
శివుఁడు వాఁడయి యంతటన్ జెందియుంట॥ 95

ఎంత చిత్రమ్మొ వీని యీ వింత ముక్తి?
వింత యంతయుఁ బొందెడి విధమునందె
ముక్తి యొక్కటె స్వామియే ముక్తుఁడెపుడు
ఆతఁడే జీవుఁ డతఁడు గానైన ముక్తి!! 96

దేవ దేవ! దయానిధీ! భవదీయ దర్శన భాగ్యమీ
జీవుఁ డందిన వేళ యెట్టిదొ చేరి నిల్తు సమక్షమం
దీవు చూచెదొ చూడవో తనువిద్ది యున్నది లేనటుల్
నీవె యుంటివి నేను లేనని నిత్యమున్ దలపింతువే! 97

నేను లే నని యున్నదీ వని నిన్నె చూచెద నన్నచో
నైనదా ప్రభు! చూతు రెవ్వ రటన్న యంతట నేననన్
లేనె లేనని యుంటి వేగద లేచి తెప్పుడు నీ వనన్
కానవత్తురు మీరె యట్లుగ కాక వేఱుగ నుంటినే? 98

చూచు వాఁడును చూడ నౌనది చూపు సర్వము నీవెయై
యేచు విశ్వము నెల్లకాలము నిట్టులే కనుచుందునో?
నీ చరిత్రకు నీదె బాధ్యత నీ వలెన్ నిలిచుండగా
కాచుటయ్యదె కానరాకయె కాంచుచుండెద సర్వమున్॥ 99

"శ్రీ కాళహస్తీశ చరణౌ శరణ మహం ప్రపద్యే"

ఇది పదునేడు వర్ణముల యీశ్వర మంత్రము నీ పదద్వయం
బదె శరణంబటంచు శివునందె ప్రపత్తిని గల్గియుండి యీ
పదిపయి నేడు వర్ణములు పల్కిన మాత్రన మోక్ష మబ్బెనే
యదియును నొక్కనాడ పరమాద్భుత మియ్యది కానమెచ్చటన్॥

చక్రధరుఁ డొక్కఁడే యిందు స్వామి లింగ
ముంచి పూజింప లేదు తా నున్న దెంత
యొక్క దినమయ్యె నంతలో నున్నవాఁడె
యున్న యట్లుగ స్వామిలో నుండె నంతె॥ 1

స్వామికా చక్రధరుఁడన్నఁ జాల యిష్ట
మెంత యిష్టము కాకున్న నంత త్వరగ
ముక్తి నొసఁగును? సరె యిచ్చె ముగియ లేదు
దేవు దయసాగె వాని పుత్రికల యందు॥ 1(

## రాచ పడుచులు

అతని కిర్వురు పుత్రిక లమృత లతిక
కాంతి మతియును రాజశేఖరుఁడు కొడుకు
తండ్రి వైరాగ్య మూని యాత్రా నిమగ్నుఁ
డైనపుడె రాజ శేఖరుం డయ్యె ప్రభువు! 1(

తనయ లిర్వురు మోక్ష తత్పరత నుండి
పెద్ద వా రయ్యు నుద్వాహ విధికి చొరక
శైవ దీక్షను నిరతమున్ స్వామి గొలుచు
చనుచు సోదరు రక్షణ మందె యుండ॥ 10

స్వామి పనిఁ బూని వారికి స్వప్నములను
కానిపించి పంచాక్షరిఁ గరుణ నిచ్చి
శిష్యుఁ డనుపేరఁ దా నె యా శీలవతుల
వెంబడిన్ నిల్చి తెచ్చి యిప్పీట నిలిపె॥ 10

"అక్కా! వింటివె రాత్రి నాకుఁ గల యందా కాళహస్తీశ్వరుం
డు కన్గొంబోని వృద్ధాశ్మగాత్రుఁ డటులయ్యున్ వాయుమృద్వంగి న
చక్కన్ నిల్చి మనూపదేశ మొసఁగెన్ సత్యాభిధేయుండు ని
న్నిక్కన్ జేర్చును వాని వెంటఁబడి రమ్మా యంచుఁ జెప్పెన్ జుమా

కల కల్లా కాదె చెలీ! సుఖానుభవ మొక్కండే యగున్ గాదె నా
తల ముట్టెన్ ప్రభు వీ తనూలతిక సంతానద్రు శాఖంబలెన్

బులకించెన్ గనుదోయి చెమ్మలురిసెన్ బూర్ణేందు బింబాస్య ని
మ్ముల కెళ్లేగుట చెప్పవే యిచట నూర్పుం దీయలేకుంటినే! 107

అను చెల్లింగని యక్క "నాకు నటులే యాస్వామి కన్పించె శ్రీ
మనువుం జెప్పెను రమ్మనెన్ మనకు శర్మ స్వామి యెవ్వండో దా
రిని చూపం గలఁడంచుఁ జెప్పె నిక వేఱే చింత యేలా సనా
తనుఁడౌ స్వామి యనుగ్రహంబు కలిగెన్ ధైర్యంబునన్ నిల్వనౌ॥

అని యిట్లిర్వురు వారి వారి కగు నట్లా రాత్రి కన్నట్టిదా
యనుభూతిన్ స్మరియించుచుండ నట కోయ్యన్ వచ్చె నొక్కండు వా
నిని శిష్యుండో గురుండో యేమనఁగనౌ నీ ముందు శ్రీస్వామి ని
ల్చిన నేమాదువు వారు నల్లె యయి మల్లెల్ గుప్పు మన్నట్లుగా!

తను వెల్లన్ బలు సౌరభంబు లెసఁగన్ దారాడు నవ్వాని దే
వునిగా నెంచి న పర్యలన్ జలిపి యా పూర్ణేందు బింబాస్య లా
తనితో "స్వామి! పనేమి" యన్న "మిము నా దైవంబు పంపింపఁ దో
డ్కొని పోవచ్చిన సత్యశర్మ" ననఁగాఁ గొమ్మల్ చిగుళ్ళెత్తుచున్॥

రా జగు తమ్మునిన్ దెలిపి ద్రవ్యములన్ సమకూర్చి సిద్ధమై
రాజ నిభాననల్ తలిరు ప్రాయము కన్యలు స్వామిఁ జేరు చే
మోజయి వాని వెంట బడి పోయిరి నమ్ముచు వాఁడు దేవుఁడై
పూజకునైన పూవులను బోలెడి వారలఁ గాళహస్తికిన్॥ 111

చేరిచె; రాజ కన్యకలు చేరిన వెంటనె స్వర్ణవాహినీ
నీరములన్ మునింగి గుడి నిల్చిన స్వామిని దేవి మ్రొక్కి యా
దారిని జూపి తెచ్చిన సుధామతి చెప్పిన చోట లింగముల్
కూరిచి పూజ చేయుచును గోట్ల కొలంది జపించుచున్నచో॥ 112

శివుఁడు కనిపించి తనలోనఁ జేర్చుకొనిమె
స్వామి యింతటి శ్రద్ధ నవ్వారి యెడలఁ
బూన కారణ మేమి తత్పుణ్యమె యగు
పుణ్య ముండిన మనకు న ప్పుణ్యుఁడబ్బె॥ 113

ధ్వజమునకుఁ దూర్పుగాఁ గొండ దరిని కట్టి
యున్న మందిరమ్ముల యందు నోగిరమ్ము
లిప్పు డమ్మెడి కొట్టమ్మె యిర్వురపుడు
లింగముల్ నిల్పుచోటు ముక్తిం గనంగ॥ 114

లోనికిం బోయి చూచిన గానవచ్చు
నొక్క లింగంబె కాని యందుండె రెండు
నందులు వరుస ముందు వెన్కలుగ నొప్పి
యట్టి లింగంబు లుండిన వా యనంగ! 115

రాచ పడుచుల గుడి యన్న ప్రథ యొకండు
కలదు గాని యే రాచ కన్నెలో తెలియదు
పద్మసేనక రాజాత్మ భవ లిరువురు
నిందె శివపూజ చేసి తరించి రంట! 116

బహు శతాబ్దుల నుండి తీవ్రమగు కాల
మునకుఁ దోడుగ పాలనమ్ములును మాఱు
చుండు నపుడెల్ల మఱి యింత శోభ పేర
నెన్నియో మార్పు లగుట వింతేమి కాదు॥ 117

ఉభయ వంశాల వారివి యుండెనేమొ
పూర్వ మది నాల్గు నేటికిప్పు డది యొకటె
అంత వఱకున్న యందుకు హర్ష మంది
స్మృతిని తనియుట మేలు సంస్మృతియె ఘనము॥ 118

ఆంధ్రకవి ధూర్జటి ప్రభు వన్య కన్య
లిరువురం జెప్పె మధురవా రిరువు రగుటె
సామ్య మితర చరితము పొసంగ దెచట
వారు వేశ్యలె యే మాయె భక్తమణులు!! 119

వేశ్య కన్యల కథను ద్రావిడము నుండి
తెచ్చెనో యేమొ ధూర్జటి తెలియరాదు

స్థల పురాణాన వారి సంస్మరణ లేదు
పద్మ సేనుని చరితమ్ము పడయ నగును॥ 120

## పద్మసేనక వృత్తాంతము

శీర్ష కాశ్మీర దేశ పశ్చిమ విభాగ
మందునన్ మనోభంగ మన్నట్టి కొండ
ఆ నగంబంటి శ్రీ నగరాభి ధాన
రాజధానీయుతంబగు రాజ్య మొప్పు॥ 121

మాయురే! నాటి రాజగు యమధ్వజుఁ డిర్వురు భార్యలుండియా
జాయల పెద్ద సత్యవతి చక్కని పుత్త్రుని యోగ్యుఁ గాంచినన్
హేయము నాక కాంతిమతి యెక్కువ చక్కనిదంచు నామెకై
మాయని మచ్చగా వసుధ మాన్యుఁడు కాని ద్వితీయునందిడన్॥ 122

వాఁడు దురాత్ముఁడై ప్రభుత వాలి యొనర్చుచు నన్న నెంచకే
ఱేఁడుగ విఱ్ఱవీగ నొక భృత్యుని పోలిక పద్మసేనుఁడున్
కీడు పడన్ దదంబయును క్లేశము లంది సపత్ని చేష్టలన్
వాడి చెడంగ నుండుచు దివా నిశ లా శివు నెంచుచుండఁగన్॥ 123

తండ్రి యున్నాఁడు బ్రదికి. యుత్తముఁడు పెద్ద
కొడుకు వాఁడయ్యె రాజ్యమ్ము కోలుపోయె
హేముఁడను చిన్నవాఁడేమొ హీనుఁడయ్యె
రాజ్యమున్ బొందె నిది వ్యతిక్రమము నిజము॥ 124

హేతు వా కొండ యం దున్న దేమొ దాని
రంగ దేమి? పేరును మనో భంగ మనుట
యేమి? యెంత చిత్రమ్ము మహీపతియును
ఆ మనోభంగ మందియే యట్లొనర్చె॥ 125

అట్లనుట గూడ తప్పె యా నసగ వచ్చు
కొండపేరు మనోభంగ మండ యగుచు

నమ్మ వారల కిడు నమనస్క యోగ
మందు రద్దాని కభిమాను లయిన వారు॥ 126

సత్యవతి చాలయోగ్య దుస్సహాము కాల
మెట్టులో యీడ్చుచుండె నా యీశ్వరుండె
యెన్నటికి నైన దయఁ జూచు నన్న మతిని
దినము గడవంగ దినము దుర్దినము గాగ॥ 127

నృప పురోహితుఁ డున్నాఁడు నీతివేత్త
సాధు వతివృద్ధు ధర్మ సంస్థాపనేచ్ఛ
నవని పతి యిట్లు సేయ సాహస మొనర్చి
సత్య మిత్రుం డతండు దుస్సహాము గాగ॥ 128

కోరి రాట్సన్నిధికి వచ్చి గురుఁడటంచు
రాజు తగినట్లు చేయు మర్యాద లంది
కూరుచుండి యతండు వాక్శుద్ధి యొప్పఁ
బలుక వలసిన మాటలు పలికె నిట్లు॥ 129

"కులమునకున్ బురోహితుఁడఁ, గూర్తును నీకు, గురుండనంచు నా
వలన నొకింత గౌరవ ప్రవర్తన మున్నది యందుచేత నీ
కలుషము చెప్పి చక్కఁబడగా నొనరింత మటంచు వచ్చితిన్
దెలిసియు నిట్లు చేయుటనఁ దీఱని దోషము రాజశేఖరా! 130

జ్యేష్ఠు, నవక్ర విక్రముని, శ్రేష్ఠుని ప్రక్కకు నెట్టి కామ భూ
యిష్ఠమతిన్ ప్రియాంగనకు నిష్టము కావున ధర్మమంచు బం
హిష్ఠ వినాశహేతువగు నింతటి పాపము చేయు టొప్పునే?
కోష్ఠ మహాగ్ని పెట్టితివి క్రోయును నాల్కలు రేపు మాపటన్॥ 131

నీ హేమ ప్రభురాజ్య మెట్లగునొ కంటే పద్మసే నాగ్రజున్
ద్రోహింగాఁ జెఱసాలఁ బెట్టుమతి నుద్యోగించు చున్నాఁడు రా
మోఽహ మ్మానసుఁ డాతఁ డుత్తమ్ముఁడుగా మోహాంధుఁడై
వీఁడు కా
లాహిన్ రేపుఱె యాను సాధువన శౌర్యం బేది యైనాఁడో కో॥

దోషంబున్ గ్రహియించితేని యిపు డా ద్రోహిన్ విసర్జించి ని
ర్దోషున్ యోగ్యుని పద్మసేనకుని వంద్యున్ రాజు చేయంగ నా
తోషమ్మందు సమస్తలోక మటు సంతోషమ్ముతోఁ జేయగా
నీమచ్ఛక్తియు లేక యున్న విడుమా యిల్లాలితోఁ బుత్త్రునిన్॥ 133

వారిం దుండి వినష్టు లా నెడల నీ పాపంబు పండున్ ధరా
భారం బూనగనైన వాఁ డొకని సేవన్ మ్రగ్గగా నేల దు
ర్వారంబైన పురాకృతం బిటులు జారన్ యోగ్యకాలంబు రా
నేరున్ వానిని నిల్ప లే రతఁడె పాలించున్ బ్రభూత్తంసుఁడై॥ 134

మంచి వాఁడే ప్రభుండు యమధ్వజుండు
యుక్త మెఱుఁగును గురుని నియుక్తి నెఱుఁగు
గురువు నందెంతో భక్తియుఁ గొఱత లేదు
శూన్య ఫలమయ్యెఁ గాంత దాసుండు గాగ॥ 135

ఎంత యత్నించి జ్యేష్ఠున కీయఁ దగిన
రాజ్య మీయగ లేక తద్రక్ష నెంచి
గురువు నలరింప వాని నిష్ఠురత నెపము
పెట్టి రాజ్య భాగము నుండి వెడల నడచె॥ 136

ఇట్లు చెఱనున్న యప్డె యెంతెంతొ కష్ట
మురక పడుచున్న పద్మసేనోర్వి పతికి
స్వేచ్ఛ లభియింప నవ్వానిఁ జేరఁదీసి
సత్య మిత్రుండు నిల్చె బాసటగ దయను॥ 137

కాలాధీనము సర్వ మీ జగతి తత్కాలం బహో యేకమై
హేలా వైఖరి నొక్కరొక్కరికి ప్రత్యేకంబగున్ వింతగా
నాలో నెన్ని విశేషముల్ పయికి కీడై లోన మేలౌను త
త్ప్రా లేయాంశు కిరీటికే తెలియనౌ ప్రారంభ సంరంభముల్॥ 138

పద్మసేనకుఁ డట్లు వెల్వడినవాఁడు
సత్య మిత్రుఁడు మార్గ దర్శకుఁడు గాగ

క్షేత్ర రాజమ్ము వారణాసికిని జనిమె
నచట నొక మాస ముండె శైవార్చనమున॥ 139

బ్రహ్మ మానస సుతుఁడు నారదుఁడు వచ్చి
యార్ద్రమతి చెప్పె శ్రీ కాళహస్తి మహిమ
తత్ప్రబోధము మెచ్చి యిద్దరును వచ్చి
చేరి రీ పుణ్య వాసమ్ము సిద్ధినంద॥ 140

వారటు వచ్చి నంతటనె స్వర్ణముఖిన్ బెను భక్తి మున్గి శ్రీ
వారిని దేవినిన్ విమల భక్తి భజించి ప్రదక్షిణంబుగా
వారని భక్తిఁ జుట్టు నెడ వారి యదృష్టము పండినట్టులై
చేరె మరుద్వతీ సుతుఁడె చెంతకుఁ జూచెను సత్యమిత్రునిన్॥ 141

"మీరు మహానుభావు, లను మేయమె యియ్యది పుణ్య మెంతయో
చేరిన హేతువై యిటకుఁ జేరిరి యూరక రాఁగలారె? కా
మారి కృపార్హు లైనపుడె యాతఁడె తెచ్చును యోగ్యజీవులన్
జేరిరి గాన మీకు నగుసిద్ధి యభీష్ట మదెట్టి దైననున్॥ 142

సత్య మిత్ర నీవు సకలార్థ సాధక
శక్తి కలుగు నట్టి సత్య హితుఁడ
వీ నిసుంగు పద్మసేనుండు నీ యండ
జయము గాంచు నిజము స్వామి కరుణ!" 143

అనుచు మృకండు సూనుఁ డమలాత్ముఁడు శ్రీ శివదేవుఁ డన్నటుల్
ఘనమతి వారి నేటి కుడి గట్టున పశ్చిమ దిక్కునందు చ
క్కని యెడ లింగమున్ నిలుపు కర్మకలాపము బోధచేసి దీ
క్షను దయ నిచ్చె నంతట సుఖ స్థితి నిల్చెను పద్మసేనుఁడున్॥ 144

ఉత్తర ముఖమ్ముగాఁ బాఱుచున్న యేటి
కెడమ కుడి భాగములకు నదెంత భేద
మీ కుడిని గుడియు గిరియు నెడమ వైపు
పట్టి మిట్టైన బయలును ప్రబలి యుండె॥ 145

అయ్యదియె తూర్పు పడమర యగు నిదియును
దేశ కాలమ్ము లివియు భ్రాంతి ఫలితములె
ముమ్మొదటి వౌట ప్రబలముల్ మోహావృతు
విూ ద్విదళ విస్ఫుటనమున వృద్ధినందు॥ 146

భ్రాంతి గెలువంగ భ్రాంతి తోడ్పడగ వలయు
ముల్లు తీయంగ విఱుగని ముల్లె వలయు
నట్టులే భ్రాంతులందు సహాయకములు
నున్న వటువంటిదే తూర్పు మిన్న యనుట! 147

ఎచట నైనను తూర్పె మహీయము గద
సూర్య నారాయణుఁడు సాక్షి సోముఁడు నటె
ఉదయ మంది వెలుఁగుదు రభ్యుదయమునకు
కాళహస్తీశ సోముఁ డక్కడనె యుండె॥ 148

క్రమమార్గ దర్శన ఖ్యాతి మార్కండేయ
 మునితాను పొంది మున్ముందు నిలువ
సత్యమిత్ర పురోధ సార్థకాఖ్యుండౌచు
 వెంబడి నుండి దుర్విధి నడంప
స్వామియే స్వప్న దర్శన మిచ్చి యిట్లిట్లు
 చేయు మంచును మధ్య చెప్పుచుండ
బహుసిద్ధ జనగణ ప్రబల సేవా పుణ్య
 దేశమ్ము ఫలదమై దీప్తి నిలువ

పద్మ సేనక రాజేంద్ర భవ్యపూజ
సాగె నిర్విఘ్నముగ పది సమల వఱకు
ప్రమిద దీపమె కానగా వచ్చె మొదట
నిపుడు వేయి వెల్గుల వేయియే వెలుంగు॥ 149

స్వామి యతనికిఁ గరుణ సాక్షాత్కరించి
పద్మ సంఖ్యాక సైన్య సంప్రాప్తితోడ

నామ సార్థక్య మిచ్చి యనంత విజయ
శక్తి దయచేసి "పోయి రాజ్యమ్ము చేసి॥ 15

భోగ భాగ్యాలతోడి సంపూర్ణ జీవి
తమ్ము తృప్తిగా పొంది యధర్మ మిలను
గాన రాకుండఁ జూడు దక్షత కుమార!
యే నె వెన్నంటి యుండి రక్షించుచుందు॥ 15

ఇతఁడు సంపత్ప్రదేశ్వరుం డింక నెల్ల
వారి కిచ్చు సంపదల నవారి గాగ
జీవితం బంత హృది నన్నె చెంది యున్న
కతన మోక్షమ్మె దేహమ్ము పతన మంద॥" 15

అని కరుణించె, నట్లె శివునాజ్ఞ చెలంగుట సైన్య మబ్బె, గె
ల్పును గొనె, రాజ్య మబ్బినది, పూజ్యుఁడు తండ్రియు తమ్ముఁ
డొక్కఁడున్
తన మతి నంటి నిల్వ నరుదారగ వారిని దొల్తనుండి యి
ట్లనుగులె యన్నరీతిఁ గని యందఱకున్ బ్రియమాచు నేలుచున్॥

నూరో నూటికి మించియో బ్రదికి వేనోళ్ళన్ బ్రశంసల్ గనెన్
సారంబౌ పరమార్థముం గనియె నిస్సారంబె యయ్యున్ నరుం
డారీతిన్ జగమెంచి దానిగొనియే యందన్ వలెన్ సారమున్
పారం బందగ నావ నెక్కవలె నావన్ వీడి పోవన్ వలెన్॥ 154

శ్రీకాళే భోన్నతాంగున్ శ్రితసుజన గతిన్ జిత్తవిశ్రాంతి హేతున్
శ్రీ కైలాసాగవాసున్ హృదయ విహరణున్ జిన్మయానందరూపున్
నైకాభీష్ట ప్రదాతన్ నఖధుత దురితున్ స్వాత్మసంస్థి త్యనంతున్
సాకారామోద వాయున్ సతము గొలిచెదన్ సచ్చిదానంభావున్॥

జ్ఞానాంబా ప్రాణనాథున్ నత సుజన శివున్ సార సంపత్ప్రదాతన్
నానాత్వచ్ఛేద దక్షున్ బహుభువన ఖనిన్ నవ్యనవ్య ప్రభావున్
కేనేశావాస్య తత్త్వున్ గృతక తను ధరున్ గీర్తనాంహో వినాశున్
ధ్యానానందాత్మరూపున్ సదమల హృదయున్ ధ్యానముం జేయు
చుందున్॥ 156

రుద్రాక్షాకార లింగా! రురుకలితకరా! రూపనామ ప్రకాశా!
కద్రూజా భూషితాంగా! కరధృతడమరూ! కామినీకాంత దేహా!
నిద్రాహీనాతిరేకా! నిరతిశయనిధీ! నిత్యజాగ్రత్ప్రబుద్ధా!
చిద్రూపా! పార్వతీశా! చిరసుచిరసుఖీ! చేష్టితాశేషలోకా! 157

## దండకము

శ్రీ కాళహస్తీశ! కైలాసవాసా! మహాదేవ! దేవా
త్రిలింగాధిష్ఠితాంధ్రీ మహాపుణ్యధాత్రిన్ శివానంద చిన్నామ ధాత్రీ
ధరేంద్రమ్ము ప్రత్యంత భూమిన్ మహాప్రాణ రూపాన మా పుణ్య
ముల్ పండి మున్నెన్నఁడో తోఁచి స్వర్ణాకృతిం జెంది రౌప్యంబుగా
నిల్చి లోహంబుగా మారి యీనాటి కీరీతి సుశ్వేత శిలయౌచు
నున్నా వసన్ నీదు కారుణ్య వారాశి కంతంబు లేదయ్య యద్దాని
యందే నిమగ్నంబులై యుండు బ్రహ్మాండ భాండమ్ము లెన్నెన్ని
యైనన్ సుధా ఫాలనేత్రా! సదాభోగి మూర్తీ! మహాయోగి నేతా!
శివాఽహం శివోఽహం సృష్ట్యాది యం దేకమేవాద్వయం బ్రహ్మవై
యుండి యంతర్గతానేక జీవార్తి నిర్మూలనావేశముం జెందియో లేక
స్వానంద మందెంత సేపుందు నిట్లుంచు నీ వెంచి యున్నావో
స్వాస్థ్యమ్ము కాకుండ స్వాధీనమై యుండు మాయన్ మహామాయ
మాయమ్మ నో సాంబ! నీ నుండియే వ్యక్తముం జేసి మీ యిద్ద
రేకీకృతాకారులై యుండి యీ సృష్టి కల్పించి యిందంతటన్ నిండి
యుండద్వయున్ లేని తత్త్వమ్ము వారయ్యు భిన్నంబుగాఁ బొల్చు
భూతాత్మకంబౌ ప్రపంచమ్ముగాఁ దోఁచి కోటాను కోట్లైన కోశ
మ్ములన్ దాల్చి తద్భిన్న మేదైన జాడ్యమ్మె యైయుండ భోగంబుచే
గాని పోనట్టి కర్మమ్ము భోగింపఁగాఁ జేయ సర్వాన జీవంబు తోలు
కాడగాఁ జేసి చైతన్య ముప్పొంగఁ గ్రీడించు చూడంగ నాడించు నది
నీవు నాడునది నీవౌచు నీయాట నీవే కనుంగొంచు నానంద మందేవు
దేవాది దేవా! మహానంద సాంద్రా! మహేశా! నటేశా! చిదాకాశ
దీపా! జగద్దీప! తాప ప్రణాశా! సదాభక్త జీవార్తినాశా! పురే
భక్త జీవా! కృతంబందు నా సాటి పుర్వేమి యా గూళ నట్లల్లు

చుంటేమి యవి దగ్ధమై పోవఁ దా నందు పడుటేమి కైంకర్యమే
తాను తానె కైంకర్యంబు తాఁ జేయు కైంకర్య మా స్వామికై
యుండ నా యయ్య యద్దాని కాశింప కే కాల్వఁ దానుండగా నేల
త్యాగంబునన్ ద్యాగ మద్దానికిన్ మెచ్చి యైక్యమ్ము నందించి; తా
కాశీమున్నాగ మది యేమి వైరంబు నాస్వామి నాస్వామి నా పూజ
నా పూజ నేను కాకుండంగ వేఱొండు లేదెందు నీవు నేనే తప్ప
నన్యంబు లేదన్న నీవె నేనై యుంట రెండేవి యొక్కటే యొక్కటై
యున్న దయ్యా స్వామి! యా రెండు జంతువుల్ వేదాలు శాస్త్రాలు
వెల్గించు నా బుద్ధి నీ దయన్ బెం పొందు భక్తి యుండన్ వలెన్
భక్తిచేఁ గానట్టి కార్యముల్ లేవయా యా బోయకున్నట్టి యా
భక్తి యుచ్ఛిష్ట మల్లాట నుచ్ఛిష్టమున్ మెచ్చి భక్షించి యవ్వాని
రక్షించి నిన్ జెందగాఁ జేసి యా కంటితోఁ జూచుచున్నావు లోకాల
శ్రీకాళహస్తీశ్వరా! సూర్యచంద్రాగ్ని నేత్రుండవయ్యున్
స్వ విశ్వమ్ము చూడంగ సాధ్యమ్ము కాకుంట నందమ్ముగా నున్న
యా బోయన్ జూచి కాఁ జేయఁగా నెంచి యానాటకం బాడి
ముక్కంటివై యుండి నక్కంటివై నావు నా ప్రేమాల నీవున్న నీనామ
రూపంబులన్ దుల్చి నే గొందు నామంబు రూపంబె యీ జగంబౌ
చుండె నా రెండు లేకున్న నొక్కండ నే నేను నేనె యీ సర్వంబు
నా కంటె నన్యంబు లేదంచు నున్నాము నీనామ రూపంబులే
యెంచు నా తెల్వి యేమందునో దేవ! నా మాట మన్నించి నీ
తత్త్వమం దేను భిన్నమ్ము కానుండ లీనమ్ముగాఁ జేయు నీ స్తోత్రముం
జేయ నెవ్వారు లేకుందు రందేమొ యెవ్వారు లేకున్న నే నుందు
నీయందు శ్రీకాళహస్తీశ! కైలాస సంవాస! శ్రీ పార్వతీనాథ!
మన్నాథ! నాథా! నమస్తే నమస్తే నమః!!! 158

గురు శిష్యుల యనుభూతికి
స్వరూపమె స్వరూప మగుట స్వాత్మల యందే
నిరతిశయ సుఖము నందుచుఁ
బురత్రయము లోని తత్త్వము నె ప్రకటింపన్.॥ 159

స్వామి కడ దీప వహాన
శ్యామాయిత దేహులగుచు నద్వయభావ
ప్రామాణ్య మెఱుఁగఁ జెప్ప న
సామాన్యులు సర్వ మాన్య సత్ప్రముట్టులనన్ ॥ 160

వెలుఁగుచు నుండిరి; కథలన్
దెలియఁబడు వ్యక్తు లనుదుగ దే యటు లయ్యున్
వెలుఁగుదు రెల్లరు తమలో
జలనిధి భంగంబు లనఁగ స్వామియుఁ దామున్ ॥ 161

జలనిధి యొకండె యన్నటు
తలపోయుచు నుండ స్వామి తానిఁకఁ గదలన్
గల కలము కలుగఁ జేసెను
జలజలమని పాఱుచున్న స్వర్ణముఖి యటుల్ ॥ 162

జయ నాదమ్ములు పిక్కటిల్లె దెసలన్ స్వామీ! జగన్నాథ! దు
ర్జయ! కైలాసనగ ప్రదక్షిణ మహా సంతోష ముహ్వాంగు నీ
దయచేన్ భ్రాతుల మైత్రి మీఁ తనువులే ధన్యంబు లయ్యెన్ సదా
భయదాతా! యెదనుండి ప్రోవు మెపుడున్ భక్తప్రసన్నేక్షణా! 163

జయజయ పార్వతీశ! జయసాంబ! సదాశివ! చంద్రశేఖరా!
జయ జయ పంచవక్త్ర! గజ చర్మధరా! జయ! భోగి భూషణా!
జయ జయ! ఫాలనేత్ర జయ! సద్గురు రూప! సదార్ద్ర చిత్త! చి
న్మయ జయ! సంభజిష్ణు జన మంగళదాయక! బంధమోచకా! 164

పదునాఱు కాళ్ళ మంటప
మది యడ్డగు నట్లు పోవ నందులకయి యే
యదె యష్టోత్తర శత
గదితుం డున్న గుడికి వెడగఁ జనియె నచటన్ ॥ 165

నందీశ్వరుఁ డుండిన యెడ
ముందుగఁ గనిపించు కొండ ముట్టిన యట్లై

మందిరము లోనికిం జనఁ
బొందుగ నటు లుత్తరాభిముఖుఁడై నంతన్ 16

ఎదుట శ్రీ దక్షిణామూర్తి ముదిత వదనుఁ
డమిత వృద్ధులు శిష్యులై యాలకింప
వట విటపి నీడ యువక భావమ్ము నంది
మౌన ముద్రనె బ్రహ్మమ్ము మహిమ తెలుపు॥ 167

కంచు గడపలు దాటించు కష్టమెట్లొ
కడచి లోయలు మెట్లన్ని గడచి యెదుట
దక్షిణా శాముఖ స్వామి దయను జూడ
బడలికం దీర్చి కొనుచుండ నెడదలందు॥ 168

ఎల్ల వారికిఁ దోఁచె నయ్యాశు గూర్చి
కరుణ శంకరులన్న శ్లోక దశకమ్ము
దాని స్మరణమ్ము తత్త్వచింతనము ధ్యాన
మన్నియు ననంత ఫలదమ్ము లగుట నిజము॥ 169

## శ్రీ దక్షిణామూర్తి స్తోత్రము

అద్దములో నీడ యద్ద మందే యుండి
యద్దానికిని దూరమై కనఁబడు
స్వప్నమ్మునన్ దోఁచు జగమంతయున్ గూడ
వెలి నున్న యట్లై కన్పించు నట్లె
స్వాత్మ యందే విశ్వ సర్వస్వ మున్నది
యద్దాని కన్య మెయ్యదియు లేదు
మెలఁకువ గలుగంగఁ గలిగిన కలయెల్ల
తనయందె యను జ్ఞాన మెనయునట్లు

లా యనాద్య విద్యా వశమైన మనసు
సాధనమ్మున గురుదయన్ స్వచ్ఛమైన
విశ్వ విభ్రాంతి పోయి సం విన్మయైక
దక్షిణామూర్తి రూపుఁడై తాను మిగులు॥ 170

బీజస్థ వృక్షమై వెలయు విశ్వంబెల్ల
నాత్మోద్భవం బౌచు నందె యడఁగు
నయ్యాత్మ మాయావి యన్నట్లు తన మాయ
దేశ కాలములను ద్విదళములను
విస్ఫుటం బొనరించి పెనువృక్ష మానట్టు
లిదియెల్ల వింతగా నెదుగఁజేసి
యోగీశ్వరుని బోలె యుక్తుఁడై విహరించి
స్వేచ్ఛమై యుపసంహరించుచుండు
పాడ వెలుంగని విశ్వమా భూమమందె
వ్యక్తతఁ బొందకుండి యవ్యక్త మనఁగ
నుండి యున్నదె జీవ దేవుండు నల్లై
దక్షిణామూర్తి కిదియె మద్వందనంబు॥ 171

ఎంత చిత్ర మ్మొకో యీ విశ్వ మిదియెల్ల
నెవ్వాని వెలుఁగుచే నిట్లు తోఁచు
నయ్యాత్మ మే లేని యట్లె యిదే యున్న
దన్నట్లుగాఁ దోఁచు నట్టి దశను
విస్మృతంబగు నాత్మ విజ్ఞాన మందించి
తత్త్వమసి యని సత్యమ్ము తెలిపి
యాత్మాను భవ మంది నంతట తిరిగి జ
న్మం బెఱుంగని మోక్ష మహిమ నిలుచు
నట్టు లాశ్రితకోటి క నంత కరుణ
వేద సారంబు నెఱిఁగించు వేద వేద్యు
దక్షిణామూర్తి కేను ప్రదక్షిణించి
యుంచు భక్తిని సాష్టాంగ మెఱఁగువాఁడ! 172

చిల్లుల కుండలోఁ దిల్లిక యున్నట్లు
వెలుఁగైన యయ్యాత్మ వెలుఁగు లవియె
కను ముక్కు చెవి యాది గాఁగల జ్ఞానేంద్రి
య ద్వారముల నుండి యవలి కేగి

యవ్వాని పరిమితి హద్దున శబ్దాది
　　పంచకం బెఱుఁగ నీ వంచితుండు
నేను ప్రపంచ విజ్ఞానంబు నందితి
　　ననుచెల్ల యజ్ఞాన మాత్మ వెలుఁగె
యింద్రియమ్ములచేత నల్లెఱుఁగఁబడును
నీవె నిను భ్రాంతి వశత వేత్తైన యట్లు
చూచుచుంటి వటంచు విశుద్ధుఁడైన
దక్షిణామూర్తి తెలుపును తత్త్వ మతఁడె॥ 173

దేహమ్ము ప్రాణ మింద్రియ మనోబుద్ధ్యాదు
　　లివి యాత్మ కానేర వింక నెదియు
ననుభవంబున కెట్టు లందుట లేదని
　　శూన్యమే యాత్మగాఁ జూచువారు
బాలాంధ జడులని భావింపవచ్చును
　　మాయా విమోహితుల్ మర్మమెట్లు
తెలియ నేర్తురు? శ్రుతి తెల్పు మార్గాన దై
　　వమును నమ్మి కొలుచు భక్తజనులు
దేవు మహిమను చిత్తశుద్ధిని భజించి
మాయ పారవీడఁ దత్త్వ మర్మమ్ము తెలిసి
శూన్య మెఱుఁగెడు వాఁడె తచ్ఛుద్ధుఁ డనుచు
దక్షిణామూర్తి గొల్తురు తత్పరులయి॥ 174

సుప్తిలో ననుభూతి శూన్యంబుగా నుంట
　　నాత్మ శూన్యం బని యనఁగరాదు
అర్కేందులను రాహు వాక్రమించిన యట్లె
　　మాయ క్రమ్ముటనె యాత్మయు తెలియదు
ఉపకరణములన్ని యుపసంహృతమ్ములై
　　యునికి మాత్రముగాగ నుండు నపుడు
సుప్తికిన్ ముందున్న చొప్పున మెలఁకువ
　　కన్నంతఁ దెలియగాఁ గలుగుచుంట

నాత్మ శూన్యముకాక యయ్యదియె నిత్య
మెదియుఁ దెలియక పోవుట నెఱిఁగి నిద్ర
సుఖము నందితి నేనను సుఖమయుండె
దక్షిణామూర్తి స్వామి నిత్యము భజింతు॥ 175

బాల్య కౌమార యౌవన వార్ధకమ్ముల
జాగ్ర త్సుషుప్త్యాది సమయములను
తెగక యనుస్యూతముగ నుండి తెలియుచు
నహ మంచుఁ బ్రకటితం బగుచునుండు
నాత్మయన్నది నిత్య మదియ వస్త్రము లట్లు
జీర్ణ దేహము లూడ్చి చెందు నూత్న
ములను గావున భ్రాంతి మోహమ్ము నందక
భజియించు వారి కభయ మొసఁగుచుఁ

దన్ను దాఁ దెల్పికొను పరాత్పరుఁ డతండు
ఏక మేవాద్వయం బ్రహ్మ మెపుడు నుండు
దక్షిణామూర్తియె తెల్పు తత్త్వమెల్ల!
బ్రహ్మ మెఱుఁగుట తద్దయా ఫలిత మగును॥ 176

స్వప్నానఁ బురుషుండు సకల జగమును భి
న్నముగఁ జూచెడి రీతి జ్ఞాని కాక
ముందరీ విశ్వంబు మోహితుండై యుంట
భిన్నమైనట్లె కన్పించు చుండు
గురువును శిష్యుండు కొడుకును దండ్రియు
యజమాని సేవకుం డనెడి భ్రమలు
వెంటాడు చుండును విద్యచేఁ దత్త్వంబు
తెలిసిన యంతటఁ దెలియు నతఁడె

స్వప్న జాగ్రదారులఁ దాను బడయుచున్న
భిన్న విశ్వము మోహ కల్పితమె యగును
ఆత్మ యొక్కఁడె సత్య మయ్యదియె తాను
దక్షిణామూర్తి తాన యా తత్త్వ మరయ॥ 177

ఈ విశ్వ మందున్న వెనిమిదే యెనిమిది
యవియె భూ జలములు వహ్ని వాయు
వులు నాకసమ్మును వెలుఁగు సూర్యుఁడు శశి
యూ పైని యజమాని యనెడి వాఁడు
నీ యెన్మిదా యీశు నెనిమిదౌ తనువులు
కాగ నీశుఁడు కాని కణము లేదు
శ్రుతులన్ని యిట్లన్ని శుద్ధుఁడౌ యీశుండె
పురుషుఁ డనఁబడు నీ పురము నందు
నిచ్చ మెయి జీవుఁడనఁగ వసించు నను
మోహమును వీడి చూచిన దేహ మాది
విశ్వమంతయు శివుఁడె త ద్భిన్న మేది
దక్షిణామూర్తి కిదియె మ ద్వందనంబు॥ 178

ప్రత్యగాత్మయె సర్వ పరమాత్మ యగునని
స్పష్టమ్ము చేయు దశకము నెవఁడు
కంఠమ్మునన్ దాల్చి కరుణ సద్గురుఁ డన్న
యర్థమ్ము మరువక యనవరతము
మననమ్ము ధ్యానమ్ము స్మరణమ్ము భక్తితో
చేయునో వాఁడు వశిష్ఠుఁడె యగు
సార్వాత్మ్య సంసిద్ధి సర్వేశ్వరుండౌచు
నయ్యష్టమూర్తి విఖ్యాతి నందు
నాతఁ డవ్యాహతైశ్వర్య మంది దేహ
పతన మంది నంతనె ముక్తిఁ బడయు నిట్టి
పరమ సౌభాగ్య మిచ్చు సద్గురు వరులకు
శత శతాధిక నతులు సన్నుతులు నగుత॥ 179

దక్షిణామూర్తి యెదుట క్షేత్ర పతినిలుచు
సన్నివేశంబు లభియించు టన్నఁ జాల
కష్టమది లభించి యిటు శ్లోకముల యర్థ
మనన మొనరింపఁ గలుగు శే మనఁగవచ్చు॥ 180

కొండ చుట్టిన ఫలితంబు కొంతయయ్యె
దీనిచే నది కొండంత యౌను నిజము
స్వామి నిత్యమ్ము చేసెడి స్వప్రదక్షి
ణమ్ము తత్త్వమ్ము తెల్పు నద్ది మ్మిదయ్య॥ 181

## నమ్మకము

నమ్మక మెన్నఁడున్ నరుని నాశ మొనర్పదు నమ్మకంబు త
త్త్వమ్మున నీశ్వరుండె యగు తత్సముఁడైన మహామహుండె తా
నమ్మను దేనినైన భువన మ్మిది సర్వము వంచకమ్ముగా
నమ్మట యన్న తేలి కగునా బహుజన్మల పూర్వపుణ్యమా॥ 182

శిశువులు బ్రహ్మ సమానులె
పశువులు నటులౌను సాధు పశువులె యైనన్
ప్రశమిత చింతాకులమై
విశదమతిఁ జరింపవచ్చు విశ్వాసముతోన్॥ 183

మన మెంత నమ్మ గలిగిన
మనలను లోకమ్ము నంతమాత్రమె నమ్మున్
మన మందలి కాలుష్యమె
మనలను నమ్మంగ నీదు మహి నెద్దానిన్॥ 184

అకలుష చిత్తులే దయిన హాయిగ నమ్మి చరించి తత్ఫలం
బు కని సుఖింతు రెప్పుడును పొందరు నష్టము సంశయాత్ములె
న్నక చరియింప కంతయును నష్టము గాగ నశింతు రందుచే
వికల మనస్కులై మనుట వీడెడి చేతయె మానవాళికిన్॥ 185

కొందఱు నమ్మకంబునకు గ్రుడ్డి తనంబొక టంటగట్టి న
మ్మం దగుదాని నిర్ణయము మానవ బుద్ధికృతం బటంచు మే
లం దగఁ జేయుఁ జేయదని యాగ్రహమూనుచు బుద్ధి భేదముం
బొందగఁ జేసి నమ్మకము పొల్లయి పోవఁగ జేయుటయ్యెడిన్॥ 186

నమ్మట హేతుపూర్వక మనం జన దెన్నఁడు బుద్ధి తర్క జ
న్యమ్మె యనన్ బొసంగదు తనంతన నమ్మక మేర్పడున్ జెడున్

వమ్మగు టుండవచ్చు దృఢవైఖరి నమ్మట యొాటి నమ్మకం
బిమ్మయి భేద ముండనగు నిద్ది జనంబుల స్వానుభూతియా॥ 187

గ్రుడ్డిది యంచుఁ బేరిడుచుఁ గుంఠితమున్ బొనరించు కొన్న నీ
వొడ్డును చేరు టెన్నఁడును నుండదు కారణ ముండి లేక యే
యుడ్డును లేని యట్టి దృఢమైనది నమ్మిక నిన్ను గట్టుకున్
దెడ్డును వోలెఁ జేర్చు నిది తెన్ను తరింపగ నమ్మమో సఖా! 188

దేహము నావ, నమ్మకము తెడ్డగు, లక్ష్యము వేదవేద్యుఁడై
దేహమునందె స్వాత్మమయ దీపముగా వెలుఁగొందు శంకరుం,
డూహ లనన్ దరంగములు, నూరక పుట్టెడి సంశయంబె స
మ్మోహ మయాబ్ధి, దాటి కను మోయి పరాత్పరు స్వాత్మరూపునిన్॥

శివుని ప్రతీక యేదియన స్త్రీస్తనమో మఱి మేక పెంటికో
భవునిటఁ గొల్వు మన్న నుడిఁబట్టి దృఢమ్ముగ నమ్మికొల్చి సం
భవమగు సర్వ సత్ఫలము హాయక పొందిన ధన్యులుండి రా
శివుని స్వయంభువున్ గొలిచి సిద్ధిని పొందని వార లుందురున్, 190

తన విశ్వాసముబట్టి తాఁగను శుభోదర్కంబు భావంబు వెం
టనె సిద్ధింగను జన్మ మియ్యదగుటన్ టాటోటు లేకుండ నె
ట్లని భావించిన నట్లె సిద్ధియగు, నూఁగాడన్ బనేమున్న, దో
యనఁ బల్కన్ శివుఁడేల నమ్మవిఁక నన్నా! నమ్మ ముమ్మాటికిన్॥

కొంచె మెడమకుఁ దిరిగి దిక్కులకు దిక్కు
స్వామి పడమర కేగి యా పయిని మరల
నుత్తరంబుగ నేగ సర్వోత్తమంబు
స్వీయ పద మంది వచ్చు నిస్సీమ మహిమ॥ 192

అల్లదే ధ్వజస్తంభ మొందైన గలదె
యింత యెత్తున్న దిట్టి దింకెందుగనము
మీఁది కప్పును దూసి తా మింటి నందు
నన్న యట్లుగ నున్న దత్యద్భుతంబు॥ 193

మూల పీఠమ్మె సర్వ సమ్మోహకమ్ము
తేటి చూడంగ శిల్ప సందీపితమ్ము
విఘ్నపతి, నంది నెక్కిన విశ్వగురులు,
శరవణ భవుండు, శూలమ్ము స్వామి కెదుట! 194

తిరిగి వచ్చిన స్వామి మందిరమునందు
తనదు రాకను వేయియౌ కనుల నెదురు
చూచుచున్నట్టి స్వామిని చూచుచుండెఁ
దన్ను తాఁజూచు కొనుచెు యాతని పనిగద! 195

గురువును శిష్యుఁడున్ తనువు కోవెలమై తమలోనఁ దాముగా
మురిసెడి మానసంబు లోక మోహము నందక విశ్వమంతటన్
విరిసిన శైవ భావమున విస్మృతి నందుచు నుండ స్వామి యె
క్కరుఁడె దృగధ్వ మందాదుగఁ గాంచుచు నుండిరి తన్మయంబుగన్

శివోఽహం శివోఽహం
శివః కేవలోఽహమ్॥

స్వ స్వరూప జ్ఞాన సంసిద్ధి నందుటే
శశ్వత్సుఖంబందు సాధనం బగును 1

పంచకోశంబులన్ ప్రాకారములు దాటి
సర్వాంతరుండైన స్వామియే శివుఁడు 2

మూల విరాట్టు గర్భాలయంబున నుండు
ఉత్సవ స్వామియే యూరేగు నెపుడు 3

కూటస్థుఁడౌ సాక్షి గుడిలోననే యుండు
జీవరూపుండైన శివుఁడే చరించు 4

దేహమ్మిదే చర ద్దేవాలయం బౌను
దేవుఁ డెప్పుడు స్థాణువే వెంట నతఁడె॥ 5 197

# కన్నప్ప కథ

శ్రీ కాళహస్తీశుఁ డేకాయనుండౌను
లోకాళికెల్ల నుల్లోకుఁ డతఁడు
లింగాన నెందఱో లీనమై యున్నారు
వాత్సల్యమయ వరా భయదుఁ డతఁడు
కనుముక్కు లేని లింగానికే శ్రీకాళ
హస్తు లర్థించి తదంగమందు
నామ చిహ్నంబులన్ బ్రేముడిఁ దాల్పంగఁ
గోరి యీ రూపంబు కూర్చి యుండి

రంతటన్ స్వామి బోయ భక్త్యంతరంబు
మునులకున్ దెల్పు నెపమున మోహ జనక
మైన యాతని కన్నొకం డైనగాని
పొందకుండంగ లేకయే పోయె నకట! 198

ఆ కన్నే కనిపించు లింగమున, నామార్థంబు నందున్న, దే
మీ కన్నిద్ది ప్రియాంగనా మణిది కాదే? యిన్నినాళ్ళిట్టి యూ
హే కొంచెమ్ము జనింపనీయవు కదే శృంగారి వయ్యా శ్రమం
బై కన్నందినదామె, యందమది నీదై యున్నదయ్యా ప్రభూ! 199

స్వామీ! యా కనుచూపులే తెలుపు నా వామాక్షి కామాక్షి దే
యే మా దివ్య మనోజ్ఞ దీధితులు దేహిన్ వెంబడిన్ నిల్పి లీ
లా మాత్రంబున మోహితుం జలిపి డోలాం దోళితుఁ జేసియున్
క్షేమం బందగఁ జేయు వత్సలత నక్షీ! మమ్ము రక్షింపవే! 200

అవయవ మేదియున్ గనక యన్ని యెఱింగెడు వాఁడ వీవయై
చివరకు బోయవాని గని చిక్కితివే కను మోహ మందుచున్
శివ శివ యింత లేమి పని చేయగ నౌనటె! బుద్ధి బుద్ధి! యో
శివ! కనుఁగొంటి వాతనికిఁ జెందిన మోహము తీసివేయఁగన్ ॥ 201

కణ్ణుం డాతఁడు తీర్ణ పుత్త్రుఁడగు నే కన్ జూపు కన్నాయ నా
కన్నా తండు కుబేరు చైత్రరథమన్ గాంతావనంబందు వే

కన్నుల్ చాలని సుందరంబగు కురంగంబున్ వెసన్ జంపి యీ
తిన్నం డయ్యెనొ యీ సులోచనమె పుత్రీభూతమై నట్లుగాన్॥

మణిమంతుండను యక్షుం డొక్కఁడు మహామత్తేభ సాహస్ర ము
ష్కని యూదంగల శక్తిచాలి కనె నిద్ధ్యర్థ్యక్షు నుద్యాన మం
దున లోకోత్తర దివ్య సుందరతనూ దుర్గాయితంబౌ వినూ
తన సారంగము చూచి చూచి మనసై దానిన్ నిరోధింపఁగన్॥

బహుయత్న మ్మొనరించి వ్యర్థమయి జీవగ్రాహముం జేయ లే
కహ మంతంతకు దుస్సహంబగుడు తోలైనన్ సరేగొందు మ
ద్బహు రత్నద్యుతి మేదురంబయిన తల్పం బిట్ల నల్పంబగున్
విహరింపన్ జననీ నటంచుఁ గసిఁ జంపెన్ నంది వీక్షింపఁగన్॥

కంటికిఁ జిక్కి యక్షుఁ డటు క్రౌర్యము నూని మృగంబుఁ జంపుచో
"బంట నటంచు వ్యర్థముగఁ బట్టి వధింతువె ముద్దులేడి? యీ
మంటి మనస్సు పుట్టెఁ జని మానవతంగని బోయవాఁడవై
యంటిన క్రౌర్యము న్నిజపు చక్కఁడ నుండుము పొమ్ము పో"
మ్మనన్ 205

నంది యిటుల్ శపింప దహనంబునఁ దూలిన యట్లు వేదనం
బొందుచు వాఁడు "స్వామి! యిది పొచ్చెమె, చేసిన కర్మ తప్పునే?
పొందెద మానుషత్వమును పూర్ణ దయన్ దుది మాట చెప్పవే?
యందె యెటుల్ భరింతుఁ జిరయాతన" మంచని వేడికొన్నచో॥

దయనందీశ్వరుఁ డట్లె చూచి "మణిమంతా! పుత్రజన్మావధిన్
స్మయ మెల్లన్ జన యక్షతన్ గనెదు నిచ్చల్ కాళహస్తీశ్వరున్
దయ పాలింపఁగ వేడికొంచు మను భక్తశ్రేష్ఠుఁ డొక్కండు స్వ
చ్ఛయశస్సుందరుఁ డబ్బ పుత్త్రుఁడయి విశ్వాసంబునన్ బొమ్మికన్"

క్రూరుండై మృగమున్ వధించితివి యక్రూరత్వ మెట్లబ్బు? నా
పోరామిన్ ధరయందు బోయకుల మబ్బున్ వ్యాధ వృత్తిన్ దదీ
యారంభబు నశింప భక్తి ఫలితంబై భక్త పుత్త్రుంగనన్
స్వారాజ్యంబును చేరికొందు విఁక వత్సా! నీకు మేలయ్యెడున్॥ 208

అని దయఁ జూచె నట్లుగనె యాతఁడు తీర్ణుఁడు గాన వ్యాధుఁడై
జననము నందె నీ పురికిఁ జక్కఁగ దక్షిణ దిక్కునందు భ
క్తిని దినమున్ భజించె శివుఁ గిన్నరియా కణిశన్ వధూటిగాఁ
గొని కనియెన్ గుమారకుని క్షోభము తీఱి విముక్తి నందెఁబో॥

కణ్ణని యందమంతయును గన్నుల నున్నది వాని కన్నులన్
దిన్నగ లోని తేజమది దివ్యముగా వెలుఁగొందుచుండు, నే
తన్న యనంబులే యతఁడు, తండ్రి మనోజ్ఞమృగంబుగాంచు నా
కన్నుల నీ కుమారకుఁడు కాంచెను దన్మృగధారి దైవమున్॥ 210

సుందర సుందరున్ శివుని జూచెడి కన్నులు సుందరంబులో
సందియ మేమి, వానిఁగను సత్కృతి నీతఁడ దేమి చేసెనో?
పొంది శివప్రసాదమును బొంది శివార్పితమైన పుణ్యమై
చెందెను తీర్ణ పుత్రత విచిత్రములౌగద జన్మమర్మముల్॥ 211

బోయఁడు గాఁగఁ బుట్టుటయుఁ బోలును పూర్వభవాన కుక్కుటం
బై యితఁ డెప్పుడున్ శివుని కర్పితమైన ప్రసాద మెట్టులో
బోయని నుండి కైకొనుచుఁ బుష్టిగ నుండినదానిఁ జంపి యా
బోయ శివున్ భజింప నది పుట్టిన దిట్లుగ బోయ భక్తుఁడై! 212

కణిశ కుమారకున్ బెనిచెఁ గన్నుల వత్తిగ, నాత్మ తేజమున్
గనుగొని హృద్గుహా మణిని గన్నుల కద్దునొ యన్నయట్లు, నీ
డను బలె నంటియుండి, ప్రకటంబగు గ్రుడ్డును ఱెప్పయట్లు కా
చినది శివుండె పాపఁడయి చిందులు ద్రొక్కను మ్రోల నన్నటుల్॥

శివుని ప్రసాదముం గొని నశించెడి మేను శివార్పితంబుగా
భవకృప నందు మేను విడి వచ్చిన వాఁ డెటు లుండనౌనొ యా
ట విక కిరాతపోత మటు టక్కరి మేను గణింప కింతయున్
శివుఁడు శివుండటంచు తన జీవితమున్ శివుకిచ్చి పుచ్చుచో॥ 214

నిత్యము స్నానమాడి శివునిన్ గుడికేగి భజించిగాని ప్రా
ణాత్యయమైన నీరము సహా గొనఁ డించుకయైన, మాంసమున్

ప్రత్యయ మొప్ప దేవునకుఁ బ్రాణ పదంబుగ వండిపెట్టు నై
యాత్మ్యము తోడ స్వీయనియమావళి తప్పక యుండు నెప్పుడున్ ॥

శివ పంచాక్షరి వాని కూర్పు, శివునిన్ సేవించు నిత్యమ్ము, త
చ్ఛివుకై జీవిత మన్న నిశ్చయముతోఁ, జింతింపఁ డెద్దానిఁ, గై
తవ మే కోశమునందు లేదు దినమున్ దత్సేవలో మున్గి శాం
భవ దీక్షన్ మనుచుండి లోకసుఖముల్ వాంఛింపఁడే మాత్రమున్ ॥

ఇంతయు నీశ్వరార్పితమునే భుజియించిన పుణ్యజీవి య
త్యంత శివార్చనా పరత నాత్మజు నందుటతోఁ దొలంగు ప్రా
ణాంతకమైన బోయ తను వందు జనించుటఁ బ్రాప్తమైనదై
స్వాంత విశుద్ధి నాతఁడటు వంటి పవిత్ర చరిత్రుఁడయ్యెడిన్ ॥ 217

అంత శ్శౌచము వాని దట్టిదయి బాహ్యంబందు న వ్వాని వి
భ్రాంతిన్ గూడిన వర్తనంబు కడు చిత్రం బౌను వాఁడెన్నఁడున్
శ్రాంతిన్ బొందక స్వామి కోసమయి నిచ్చల్ కాళ్ళ చెప్పుల్ విడన్
సుంతైనన్ మన సొప్ప కల్లై తిరుగున్ శుద్ధాత్ముఁడై కొల్చెడిన్ ॥

చెప్పున్ వీడిన కాలు నొచ్చిన యెడన్ సేవా విఘాతంబుగాన్
మెప్పోనో తను వెంతొ ముఖ్యముగ దా మేలొంద? స్వామ్యర్థమై
ముప్పున్ బొందగ వచ్చుగాని వృథగా ముప్పున్ వరింపంగ రా
దప్పా! చెప్పు శరీర భాగమె యగున్ వ్యాధాత్మ శుద్ధింబడిన్ ॥ 219

ఒంటరి పాప మన్ని పను లొక్కఁడె చేయ వలెన్ గరంబు లా
రెంట నొకంట బిల్వమును రెండవదానను మాంసఖండముల్
వెంట నెవండు వచ్చు నిఁక విశ్వపతిన్ జలకంబు లార్పఁ బు
క్కిఁట జలంబు గొంచుఁ జనఁ గీడగునే శివుఁ డొప్ప కుండునే? 220

స్వామికి మానసానగల భక్తియె ముఖ్యము ప్రాత పూజ తా
నే మెయి త్రోచుఁ జేతులివి యిట్లు పదార్థములన్ భరింపఁ, గా
ల్లై మహనీయు సేవ విషయంబున దూష్యమె? చెప్పు కాలితో
స్వామి తలన్ స్పృశించి తుడువందగుఁ జేతుల పూజ చేయనా॥ 221

తొమ్మరజ దూషితంబయిన చర్మ మయంబగు కాలి చెప్పుతో
స్మేరముఖుండునై తుడుచు శ్రీశివు, పుక్కిటఁ బట్టి తెచ్చు నా
నీరము తోడనే శివుని నిత్యము భక్తిని స్నానమార్చు నీ
దారి నొనర్చు పూజయెడ త్ర్యంబకుఁ డెంత ముదంబు నందెనో?

కమ్మగ మాంసఖండములు కాల్చి యొకొక్కటి యెట్లు కాలెనో
యిమ్ముగ వాచవిం గనుచు నెన్నినవానిని దొన్నె పేర్చి నేఁ
డెమ్మెయి నైన స్వామికివి యిచ్చి తరించెద నంచు నెంచు దో
ష మ్మొట నున్న దద్ది కనఁజాలము వాని మనస్సు నందునన్॥ 223

ఎంగిలి చేయరాదు రుచి యెట్లు గ్రహించుట? నోటి నీట నా
లింగము నట్లు చేసిన బలే యిరు చేతులు నిండియుండ నో
రెంగిలటన్న నీళ్ళిటు మహేశున కీ యిరుకై శివుండు ని
ర్లింగుడుగానఁ గిమ్మనక లీలగ నందెను సర్వసేవలన్॥ 224

కణ్ణుని కాల మందె గుడి కట్టిరి చిన్నది యూరు మాత్ర మెం
తున్నదొ లేనెలేదొ ఋషు లుండిరి దేవత లుండి రందఱుక్
కణ్ణుని జూచుచుండిరి యొకండును వానిని జూచి యే మనం
డన్నఁ గిరాతుఁ డే మనునొ యన్న భయంబున నూరకుందురో?225

కాక స్వకీయ మా దశకుఁ గష్ట నికృష్ట కిరాత జన్ముఁడుక్
ప్రాకృతుఁడైన వానికిని పట్టగ రాని విభేద ముండుటన్
లోకుల నమ్మకమ్ముల విలోల మొనర్పగ రాదు దైవమే
సాకును వాని నన్న మతి సాగగ నిత్తురొ పూజ సాగెడిక్॥ 226

కణ్ణుఁడు సుందరుం డగుటె కాదు కనుల్ రమణీయ చిన్నెలుల్
తిన్నని దేహ పుష్టియును దీటె యతం డొక యక్షుఁ డన్నటుల్
మన్నన బొందు వాస యెడ మానవ కాంతలు మోహితాత్మ లా
టెన్నగ సాజమే యగు నహీన దృఢవ్రతుఁ డాతఁ డొప్పఁడే! 227

కావున కేవలుం డతఁడు కాలము సర్వము పార్వతీశ సం
భావన యందె స్వేచ్ఛమెయి వర్తిలుచుక్ వ్యయముం బొనర్చు ని

ద్రావశుఁడైన యప్పుడును దత్పరమా కలతే జనించు నే
దే విధి పూజ తప్పు నెడ నెంగిలి పడ్డ యఘాన పోఁడు పో! 228

తల్లియు నెన్నఁడున్ సుతుని దారికి నడ్డము పోదు కణ్ణఁడా
తల్లికి దైవమాట సుతు తత్త్వమె యా తన తత్త్వ మన్నటుల్
మొల్లమునందు గాని యొక మోహము నంద దరణ్యరాజ్య మా
భిల్లుని స్వీయరాజ్య మది వీరుని దే యగుఁ దానె వీరుఁడౌ॥ 229

ఈగతి కణ్ణపూజ కొక యించుక విఘ్నము లేక వర్షముల్
పూగము లయ్యె భక్తియును పుష్కలమై యెడమీయకుండె నాఁ
డా గిరి కోనలోఁ గనుల కానిన పందిని స్వామికోసమై
యాగిన కణ్ణఁ డద్ది తన కందక పో వెనువెంట నంటుచున్॥ 230

చని చని దాని వీడకయె సాగుచు తుప్పలు తిప్ప లెన్నియేన్
గనక చరించి యొక్క పరి గట్టును చుట్టిన యల్లియై యెలే
గిన నటు పోయి యెట్లొ తుది గిట్టగ నేసి ముదంబు నందుచున్
దన కతి తృష్ణ యేర్పడగ దగ్గఱి తీర్థము నట్టె కాంచుచున్ 231

స్నానము చేయలేదు గుడి స్వామిని మ్రొక్కను లేదు పూజకై
యేనిక నంటి పంది నిపు డెట్లొ వధించితి దీని మాంసమున్
దేనియతో శివార్పణము తృప్తిగ చేసిన గాని నీరమున్
బానము చేయరాదు కడువట్టి తృషార్దితుఁ జేయుచుండెడిన్॥ 232

శివ శివ దీని నార్పి నిను చిత్తమయున్ గొలువంగ నిమ్ముజాం
తవమగు మేనురాలు నదె దానికినై శివపూజ తప్పి
మానవతకు ద్రోహ మొప్పుదునె నా యెద నుండువు నన్ను గండువే
వివశత నంద కీ తనువు వేగముగా గుడిఁ జేరుగావుతన్॥ 233

అనుచనె పంది నెత్తికొని యాతఁడు సాగదొడంగె దారిలో
ఘనమగు వాన హోరుమని కాయము నంతను ముంచి యెత్తెనే
మని యననౌను వాని నియమాతి జయంబును స్నానమైన దం
చును దలపోసి నీరు గొనపోలెన? మూతి బిగించెఁ గణ్ణఁడై॥ 234

సంధై నీరము లోనికిం దిగునో? నే సందీను, స్నానంబు చే
సెం దేహమ్మిట, దేవళంబున శివున్ సేవింప లేదే? భుజం
బందే యున్నది పంది, కాల్చి కరకుట్లందీయ లేదే? తృషా
స్పందం బద్దియె తగ్గు దైవకృప దీక్షన్ దప్ప నీ నంతియే॥ 235

అంతే వాఁ డటు నీరముం గొనక దేవాగార ముంజేరె వే
గంతన్ డించి నదిన్ మునింగి చని బిల్వాగంబు పత్రంబులన్
ప్రాంతం బందె చరించి తెచ్చి పరిపక్వంబైన మాంసంబులన్
దొంతుల్ పేర్చి వహించి రోజుబలె సద్యోజాతు నర్చించెఁబో॥ 236

బోయ కావచ్చు వాని సంపూర్ణ దీక్ష
యేరి కబ్బును? భగవంతుఁడే తనంత
వాన కురిసిన తృష్ణా నివారణమున
కుద్య మింపఁడె? సాధ్యమే యుండు టట్లు? 237

హృదయ మెవరికి శివదేవు గృహముగాగ
మారెనో వారి కీ దేహ మూరు బయలె
చూచు వారికి నున్నట్లు తోఁచు నంతె
త్రోచు వానికి నునికియే తోపకుండు॥ 238

అంత దృఢవ్రతుం డయిన యాతఁడు ముప్పది యేండ్ల బోయఁడై
పంతము వీడ కా శివుని బంధము నందిడి కొల్చుచుండఁ గా
సంతతి యూర్పుకైన నెడమందగనీని నిరంతరాశ్రయం
బింత సహింపలేని యటు లీశ్వరుఁ డెన్నో విధాల జంకినన్॥ 239

తన పట్టు తాను వదలఁడు
దినమున్ శివదేవుఁ డల్లె తిని తిని పందిన్
ఘన మోదమందుచుండియుఁ
దినగా విసువెత్తి వానిఁ ద్రిప్పగ నెంచెన్॥ 240

శివుఁడును పందిమాంసమును ఛీ యన కేల భుజించె? వెక్కసం
బవుట నసహ్యమందు దురవస్థకు వచ్చుట యేమి? స్వామి కా

ర్జవమున నెవ్వ రే మిడిన సర్వము కాదనరాని వౌను మా
నవుఁడె కదా ప్రభూత్తముని నామ గుణాన్వితుఁ జేయు నెప్పుడున్ ॥

జీవుఁడు యదన్నుఁ డగునో
దేవుఁడును తదన్నుఁ డగుటఁ దినకుండు నెటుల్
దైవము మానుష రూపుం
డై వర్తిల వలె నమూర్తి యయి యంతె కదా! 242

సత్యదయా శౌచ సద్గుణాకరు లౌచు
వేద వేదాంగాది విధులు తెలిసి
స్వామి గొల్చెడి ఋషుల్ పల్కరింపరు వీని
వాని మార్గము వాని దా నటంచు
వాఁడును నంతె దైవమ్ము నమ్మిన తాను
తనకుఁ దోఁచిన యట్లె తాను మసలు
వృత్తి సర్వస్వమ్ము కృత్తివాసుని దయఁ
గలుగుఁ దదను వృత్తి కలుష మగునె

గురువు లేకుండ దైవంబు దొరకఁ డందు
రది యసత్యము కాదు వీఁ డిది తెరువని
యే గురువు చెప్పఁ బూనెనో? యెవ్వఁ డుండు
సర్వ హృదయానువర్తి యా స్వామియె యగు॥ 243

అన్నియును బోవ మిగిలెడు నదియె శిష్ట
మదియు నుచ్ఛిష్టమగును సర్వాధికమయి
అపుడు శేషించుటే కాక యతిశయమయి
మిగులు టయ్యెను స్వామినిఁ మిగులు టెట్లు? 244

పైకి నుచ్ఛిష్ట మనఁగఁ గంపరము పుట్టు
తినఁగ మిగిలిన దను భావమున నె మసలి
మిగుల మిగిలిన దను భావ మగుట తెలిసి
చూడఁ జూడంగ మిగులు చొచ్చుకొను నెదల॥ 245

కణ్ణుని వర్తనంబు కని కానన వాసి ఋషీంద్ర సంఘముల్
తిన్నగ దూర మౌచును యథేచ్ఛగ వానిని వీడుచుండురా
తెన్నున సాగుచుండ శివదేవుఁ డొకానొక నాఁడు వారికిన్
గణ్ణుని భక్తిఁ జూచు నవకాశము కల్పనఁ జేసె వింతఁగన్॥ 246

అది చాల వేసవి యానాటి పగటెండ
చండ్ర నిప్పులు వెదజల్లుచుండె
చెట్ల నీడలు చాల కెళ్లెట్లొ గుడిలోనఁ
దల దాచుకొని యుండి రలఘు ఋషులు
నాఁ డింకనున్ గణ్ణ నాయకుం డుచ్ఛిష్ట
శివుఁ గొల్వఁగా గుడి చేర లేదు
ఎండకు జంకి వీ రెల్లరున్ గుడిలోన
నుండగా భిల్లుండు నూడి పడియె

వాని జూచియు నానాఁడు వర తపస్వి
గణము గుడి వీడిపోక రాక నె గణింప
నట్లు తమ తమ జపముల యందె యుండి
రంతలోఁ గణ్ణుఁ డభవుని యంతికమున॥ 247

నిలిచి తదేక దృష్టి శివునిం గని పొంగిన భక్తిఁ గాలితోఁ
దల పయి ప్రాత పూజ నెదఁ దన్మయుఁ డౌచును దీసివైచి బు
గ్గలు పెను బూరె లౌ నటులుగా ముఖమందు భరించి తెచ్చు నీ
ళ్ళల నభిషేక మార్చుచునె లోని వెలుంగును జూచు కన్నులై॥

పలలపు దొన్నియల్ శివుని ప్రక్కను బెట్టి నమశ్శివాయ యం
చలయక బిల్వ పత్రముల నర్చన తృప్తిగఁ జేసి స్వామికిం
బలలము లంది యీయ శిశు వత్సలతన్ గొనె స్వామి యన్నిటన్
గల దట లింగ మొక్కటియె కానరు మాంసము లేమి య్యెనో?

మునులకు గానరాకయె యపూర్వముగా శివుఁ డా కిరాతుఁ డి
చ్చిన పలలంబులన్ మెసవి చిన్మయుఁడై కనె లింగ భావమున్

దినము వరెక్ శివుండు తన తిండి గ్రహింపఁగ వాఁడు తృప్తుఁడై
యనితరసాధ్య హర్షమున హంసగ తేలెను స్వస్వరూపుఁడై॥

శివుఁడు కనరాక పోయిన చెంచు విడిన
పలల ఖండము లన్నియు భక్షిత మయి
కానరాక పోవుట కాంచి మాని గణము
మౌన సార్థక్యమంది నెమ్మనము లందు॥ 251

హర్ష మందిరి; దానికి నదియె వాని
యర్చనా విధాన మది యే మనెడి రోత
రోతయే దేని కదె యనుభూత మగుచు
నుండ నట్టులె యుండిరి యుండ లగుచు॥ 252

ఉన్నట్టు లుండి యెట్లుద్భవించెనో గాలి
ప్రబల ప్రభంజన ప్రభుత నెఱపె
నుఱుములు మెఱపులు నుల్కాలుక్ విరియగా
గగనాబ్ధి కల్లోల కలిత మయ్యె
చెట్లన్నియుక్ రేగి చిన్ని కోవెల ముంచి
వేయునో యనఁగఁ గంపింప సాగె
నాలయంబున నున్న యా ఋషు లెల్లరుక్
గుడి కూలిపోవు నన్కొనుచు లేచి
గుహలఁ బడి యుండఁగ వెదకు కొనుచుఁ బోయి
రాతఁ డొక్కఁడె మిగిలె దేవాలయమున
శివునితో పాటు వాఁడె యుచ్ఛిష్టుఁ డయ్యె
దానికిం దగ్గ యట్లె చిత్తమునఁ దలఁచె॥ 253

గాలి యిటుల్ ప్రచండముగఁ గంపిలఁ జేయుచు నుండెఁ గోవెలక్
గూలునొ యిద్ది కప్పెడలి కూలిన లింగము హానిఁజెందు స్వా
మీ! లయకారి! యే మిది యొకింత గణింపక స్వాంత కొంపనే
కూలుచు కొందువో స్వపరకోటి విభేదము నేర నందువో? 254

ఆత్మహత్య మహాపాప మందురే కద
ఇట్టి సంకల్ప మిపుడు నీ కేల కలిగె?
కష్టమే మబ్బె? సేవకుం డిష్ట సఖుఁడు
నీవు నే నొక్క టన్న న న్నేల కనవు? 255

నాతోఁ జెప్పిన నెట్టి కష్టమును నన్నా తీర్చియే యుందు కై
రాతంబా పెను మూర్ఖతన్ నెఱపు నార్ద్ర స్వాంతుఁ డెట్లా నటం
చీ తీర్మాన మొనర్చుటల్ తగునె నీ వెట్లైన చింతింపు మీ
నాతీర్మాన మెఱుంగఁ జెప్పెదను విన్మా నిన్ను పోనీ నహో! 256

నా మెయి నిన్ను గప్పి భవనం బిది కూలిన కూలుగాక నీ
కే మెయి హాని గల్గనటు లిట్లె కవుంగిటఁ బట్టి యుండెదన్
సామజ తుల్య శైలతతి చావగ ద్రొక్కిన నట్లె యుందు ని
న్నే మెయి నంట వవ్వి నను నెంచి వధించిన నష్ట ముండదున్॥

ఎంతగఁ గాపు గాచినను నీ మెయి నిల్చునె పుట్టి గిట్టుటల్
వింతలె వేల మార్లు గని వీనికి జంకి శరీర మెట్లు ర
క్షింత మటంచుఁ బర్విడెడు కీటక మాదునె మానవుండనై
చింతిల నీను నిన్ను నిను జెందిన దిందుల కే మహేశ్వరా! 258

అనుచునె వాఁడు లింగమున కంతకు నల్లని రగ్గు గప్పి న
ట్లెను పయి క్రమ్మి మబ్బునగ నెల్ల శరీరముతోడ రాళ్ళు రా
లినను శివుండు స్వస్థుఁడయి లింగము లింగముగాగ నుండు నిం
కనను వినిశ్చయంబు మది గాంచగ పీడక యుండె నచ్చటన్॥ 259

గాలియు నూచి యూచి యొక గంటకు పై ప్రబల ప్రయత్నమున్
జాల నొనర్చి కణ్ణుని యచంచల వృత్తికి మెచ్చి మాని న
ట్లాలయ మెప్పటట్లె కదలాడక యుండిన వాఁడు లేచి స్వా
మీ! లయ మంద వీవు కృతకృత్యుఁడ నైతి భవద్దయామతిన్॥ 260

రే పరుదెంచి ప్రత్యహము రీతి భజించెద క్షేమ మయ్యెడున్
నా పయి ప్రేమచే నయిన నాయన చల్లగ నుండు మంచు వాఁ

డా పయి కోవెలన్ విడిచి యగ్నులవోలె వెలుంగు కన్నులే
దీపములై వనీ పథము తెల్పగఁ బోవుటచూచి మానులున్॥ 261

గుహలను దాగికొన్న తమ కుత్సితమున్ మదినెంచి యెవ్వఁడీ
దహనుఁడు నిర్భయుండు తన దక్షతఁ గోవెలఁ గూలనీక సం
వహన మొనర్చి నిల్పినటు వచ్చు జయోత్సవ సూచి వక్త్రుఁడై
వహవ! ప్రశంసనీయుఁడగు పచ్చి కిరాతున కింతభక్తియే! 262

అని బహురీతులన్ దలఁచి యాతని మెచ్చిరి; యంతలోనె దీ
నిని తెలివంచు నెంచ నగునే యిది మొండి తనమ్మొయాను వ
ర్తనము గడించు దేహమును దాటి యెటుల్ చను బోయకావునన్
మన గలిగెన్ భయం బెఱుఁగు మానిసి కాఁడొక ఱాతిబొమ్మయా॥

అని తలపోసి నాటి కథ యంతయు విస్మృతి నంద వాఁడు వ
చ్చిన యపు డెప్పటట్లె తమ చేతల తామయి వాని జూడకే
దినములు పుచ్చుచుండిరి మతి స్థిరుఁ డాతఁడు హెచ్చు భక్తిమై
తను విది దేవ సేవ కని తత్పరుఁడై భజియించుచుండఁగన్॥ 264

అతనికి నేబదేండ్ల వయసాయెను కాయము నూత్న యౌవన
స్థిని నెటులుండు నట్లె వివశీకృత చిత్తులఁ జేయు నెల్లరన్
ప్రతిదిన మంతరంగము శివప్రభు సుస్థిర వాసమాట సు
వ్రతము విఘాతమున్ గనక వర్ధిల వాఁడె శివాలయంబుగాన్॥ 265

వెలుఁగు చుండెను; కానన వీథి యందు
వాఁడె సర్వాధికారి చూపట్టె నేని
మృగములున్ వానిఁజూచి మెల్లగనె పోవు
ప్రభువు దరి శాంత సంచార పరత మేలు! 266

ఆ సంవత్సర మంబుజాసనుఁడు మోహంబంది మున్నెన్నఁడో
యీ సామిన్ భజియించి పొందిన శుభంబెల్లన్ స్మృతిన్ బొంగి రాఁ
దా సంతోషముతో మహోత్సవము క్షేత్రంబందు చేయించు వాఁ
డై సౌరాగ్రణులున్ మునుల్ కలిసి తోడై యున్న యావేళలో॥

శివుఁడు కణ్ణుని భక్తి వైభవము సురల
కును దివిజ మునులకుఁ దెల్పఁగోరి సర్వ
లాలయము దగ్గఱన్ నడయాడు చుండ
స్వీయ నటనా ప్రవీణతఁ జెలఁగి చూపె॥ 268

దేవతలో మహా మునులో దివ్యులో భౌములో వేరు వచ్చి యీ
దేవుని గొట్టురో తెలియదే మన కణ్ణున కాతఁడెంత సే
పే విధి దేవుకోసమయి యెన్నిన పందిని గొట్టి తెచ్చెదన్
సేవకు జాల మయ్యెనని చింతిలు చుండునొ యన్య మెన్నఁడున్॥

మనుజులు చేయు నుత్సవమె మాటల కంద దనన్ దివౌకసుల్
వనజభవుండె స్వీయమగు భక్తియు వైభవమొప్పఁ జేయుచో
ననుగతి స్వేచ్ఛమై సలుపునట్టి మహోత్సవ మెట్టు లందు దా
నిని గను భాగ్య మున్నఁ గని నిర్భర మోదము నందగావలెన్॥

దివ్వెన వెల్గుటానుగద దేవతలందఱు వెల్గుచుందు రా
దివ్వెలె చాలు వారిడెడు దీపము లెంత వెలుంగు నిచ్చునో
యి వ్వనవాటి యంతయును నెంత వెలింగెనొ నాడు కొండపెన్
దివ్వియమై యఖండ బహుదీప్తుల వెల్గియయుండు దివ్యమై॥ 271

హరుఁడు ప్రదోష పూజయన హర్షము నందును దేవకోటికిన్
సరిగ నదే ప్రియంబగును చక్కని వెల్గుల పర్వఁ జేయుచున్
దిరుగగ వచ్చు నేలపయి డిగ్గి చరించిన రాత్రివేళ నా
పరువము హెచ్చి యెవ్వరికిఁ బట్టగ రానిదియౌ నిజంబుగన్॥ 272

ప్రతిచెట్టు ప్రతిగుట్ట ప్రజ్వలద్దీప ప్ర
భలతో వెలింగె నభంబు మించి
యంతరిక్షంబున నప్సరోగణముల
యాటలు పాటలు నతిశయించె

బ్రహ్మతో పాటు దివ్య మునుల్ పఠించు వే
ద స్వనంబున దెసల్ ధన్యమయ్యె
శ్రీ కాళహస్తియే సృష్టి కంతకుఁ గేంద్ర
మైనట్లు తత్కాల మందుఁ దోఁచె

నెంత గుడి స్వామి కప్పు డా యింత చోట
నన్నికోట్ల దేవత లెట్టు లమరికొనిరొ
య మరు లగుటనె యా విద్య యమరియుండు
స్వామి స్వామియు! సర్వ విశ్వమ్ము నతఁడె॥ 273

నాఁటి ప్రదోష వేళ భజనమ్మునకై గుడివైపు వచ్చు వ
న్యాటుని దేవతల్ కనిరి యచ్చట నిత్యమునుండు మానులున్
గీటున బుచ్చుచున్ గనిరి కేవల మాకృతి గొన్న భక్తియై
సూటిగ దేవళమ్మునకుఁ జొచ్చుక వచ్చుచు నుండె నాతఁడున్॥

దేవత లాతనిం గనుచు దిగ్భ్రమ నందిరి మాసవాంగ మి
న్నై వెలుఁగొందు చుండునె మహత్త్వ మఖండము గాగనుండె పై
పై విపరీత వర్తనము భ్రాంతులఁ జేసెడి నింత చిత్రమా
జీవి నెఱుంగ మెన్నఁడు నజేయుఁడె యాఁ దన దీక్షయందునన్॥

ఆ కనులాత్మ తేజము నహంకృతిమై వెలిగ్రక్కుచుండెఁ బూ
ర్ణా కృతిఁ జాల సుందరము లౌచు సమర్పణ బుద్ధి చాటు, నం
బూ కృతి నాచరించునొ ప్రపూర్ణ ముఖుండయి యుండెఁ, బాద ర
క్షా కలితుండు చేఁ బలల ఖండములున్ శివుకైన పత్రముల్॥ 276

మేన విభూతియున్ మెడను మేలి శివాక్ష సరంబు లొప్పు, శీ
ర్షాన ధరించె నీకలు, బుజాన వహించెను విల్లు నమ్ములన్
గానన వాసి బోయయయి కానగ వచ్చును, వ్యాధ వేషమున్
బూనిన ఫాలనేత్రుఁ డగుబో యరుదెంచెను స్వీయపూజకై॥ 277

అని బహువిధముల దేవత
లనుకొనుచును నంతరిక్ష మందుండి యటే

కనుగొనుచు నుండ నెప్పటి
మును లెల్లరు వాని జూచి మోము ముడుచుచున్॥ 278

మనకీ ప్రదోషమును ద
క్కని యటులే దిన మితఁడు పగలె వచ్చునుగా
నినుఁడేగ నిపుడు వచ్చెన్
గనుగొందు మెదో విశేష కారణ ముండున్॥ 279

మానక వీఁడొనర్చు కసుమాలము చూడగ లే మటంచు న
వ్వానికి దూర మయ్యె శివుపై కను లుంచియె చూచుచుండఁగా
దేవత లుండి రచ్చ టను ధీ యొక యింతయు లేని వాఁడు సం
భావనతో శివుం దరిసి మార్జనముం బొనరించెఁ గాలితో॥ 280

బత్తిని చెంగటన్ నిలిచి వార్చె ముఖాంబువు కుండ పోతగా
నొత్తి నమ శ్శివాయ యనుచూర్చుచుఁ బూజ యొనర్చె దీక్షమై
తెచ్చిన దొన్నియల్ తెఱచి దేవునిచేఁ దినిపింప నెంచుచున్
నచ్చిన ముక్కలెత్తి నయనమ్ములు విచ్చుచు స్వామిఁ జూడగాన్॥

భిన్న ప్రాసయుతంబు పద్యమటు కన్పించున్ విచిత్రమ్ముగా
నెన్నన్ వాని మనస్సు వెన్నయగు మేనేలో మహాక్రూరమై
యున్నన్ జట్టున నున్న తీర్థమయియే యుండెన్ శివస్వామికిన్
గణ్ణుం డెంతటి ప్రీతి పాత్రుఁడగునో కైకో దినం బట్లుగన్॥ 282

దినమును గూరుచుండి కడు తృప్తిగ కైకొను స్వామిఁ గాన కె
త్తిన తల యెంత యెత్తినను దిన్నఁగ జూచుట కందనట్టి ని
క్కిన పొడవైన లింగమె యకించను వానిని జూచునట్లుగా
గనఁబడె స్వామి లింగమయ కాయుఁడె నేఁడు సుదీర్ఘమయ్యెడున్॥

నైవేద్యమ్ము గ్రహింప వక్త్ర కలితుండై తోఁచు నవ్వానికై
యావిర్భూత దయన్ గిటీంద్ర పలలాహారంబు కైకొంచు నే
వైవిధ్యం బొకయింత లేని యటు పూర్వంబున్న యట్లే శిలా
భావం బందుచునుండు నేఁడు విడఁడ బ్భావంబు తప్పెన్నో! 284

ఆ దినమందు లేచు మొద లంతటి దాఁకను దా నొనర్చు కా
ర్యాదిక మంతయున్ దలఁచి యైనది జాగె మఱేమి లేదు దే
వా! దినమట్లు కైకొనవు, వత్సలతం గన, వేమి దోషమో?
యీ దినమేను నీ కొఱకు నీ గిరి చుట్టితి మూఁడు మార్లహో! 285

లేచి నమశ్శివాయ యని లింగమునుంగని పొంగి వెంబడిన్
దోచిన పంది వెంటఁబడి తూర్పును దక్షిణమంత పశ్చిమం
బై చెలరేగి యద్ది యెటులై చరియించిన నట్లెపోయి ని
న్నేచిన భక్తి నెంచుచు నె యీగిరి చుట్టితి మూఁడుమార్లహో! 285 ఎ.

మూఁడవ మాఱు చుట్టు నెడ మూఁడవ జామును దాటు వేళఁ గి
గ్గాడిని గొట్టితిన్ బలలఖండములన్ గొని తెచ్చితిన్ శివా!
వాడితి నీవు నాకలికి వక్త్రము చూపుము నీనిగొన్మ నా
పై డివిగా యటంచు దయవాలఁగ వేఁడికొనన్ రసార్ద్రుఁడై॥ 286

కృతయుగ వేళఁబైడి కలికిన్ శిలయయ్యెన్ వీఁడు త్రేతవాఁ
డితనికినై శిలాత్మ మది యిప్పుడె తాల్చిన యట్టులుండె వీఁ
డతి శయ భక్తి వేఁడికొన నయ్యె యొనర్చిన దద్భుతంబు కీ
రితి కలకాల ముండవలె శ్రేష్ఠుఁ డితండని చాట నెంచెనో? 287

అమలిన లింగ మాట యొక యాకృతి లేదని తెల్ప నెంచి లిం
గమునకుఁ గన్ను ముక్కు చెవి గల్గిన బోడిగ నుండుటేల? దే
హము గల వారి యట్లె కడు నందముగాఁ గనిపింపవచ్చు చి
హ్నమె యగు లింగ మెల్లెడల వ్యాపకుఁడౌ పరమాత్మ కెప్పుడున్॥

(శ్రీ) కాళేభము లాతని
కాకృతి సమకూర్చి పెట్టి నందున నయా
ప్రాకృత కాయ స్మృతి నిడు
సాకులు వహియించె నంతె సావయవుండే? 289

కాఁ, డయినన్ శివుండు కనగా నగు సర్వము సాక్షి యాచునా
పోడిమి తెల్ప నెంచెనొ? యపూర్వ మనోహర కణ్ణనేత్ర మా

టాడి గ్రహింపనో? యెడమ నద్భుతమా నొక కన్ను మొల్వగా
నేడువ సాగె స్వామి యదియేమి విచిత్రమొ యంత కణ్ణఁడున్॥

గుండియ లోఁతులన్ గదలి కోమల లింగతనూ! మహేశ్వరా!
యెండిన గుండె నాది యిదియే ద్రవియింపగ నేడ్చుచుంటి, పీ
యెండల కంత యాఁకలయి యెంతకుఁ దేఁడని వేచి వేచి రా
కుండుట నెంచి కోపమునఁ గుందెదొ నాయెడ దోషమాటకున్॥ 291

వేళను ద్రిప్ప నా వశమె వెఱ్ఱివి కాకుము జాల మాటయున్
వేళ యతిక్రమించుటయు విస్మరియింపుము పిచ్చిలంబులై
పాళముగాగ నున్న వివి పంతము వీడి కొనం దలంచు మీ
వేళ నభోజనం బయిన వేకి యగుంజుమి తెల్లవారుచో॥ 292

బాబువుగా యటంచుఁ బసివానిని ప్రేమను బుజ్జగించు న
ట్లే బలిమాలి యెంతకును నీశ్వరు కన్ను స్రవించుచుండగా
లే బర మంది కంటి నటులే కను చేమి యొనర్ప స్వాస్థ్యమా
నో బెడదయ్యె, మందెదియొ? యూరును లేదిట, నేమి చేయుదున్॥

అనుకొని వాఁడు తీవ్రముగ నారట మందుచు నుండ లింగ ము
చ్చిన కనుఁజెంది యేడ్చునని పించగ చూచెడి స్థాని కర్షు లీ
తని చెడు వర్తనంబునని దైవమునం దిటువంటి దోష మ
య్యెనని శివస్మృతిన్ విడక యేమగునోయని యట్టె చూడగన్॥

ఒకని మహత్త్వమున్ గనుచు నొప్పని లక్షణ మొక్కటుండెనేన్
చకిత మనస్కతన్ మఱల జూచుచు వానిని చప్పరించుటల్
త్రికరణ శుద్ధి లేనపుడు ధీనిధులందును దోఁచుచుండు పీ
రికి విదితంబె వాఁడు మును రెట్టపయిన్ గుడి నిల్పి వచ్చుటల్॥ 295

వచ్చిన చిక్కు విప్పికొన భక్తుఁడు దైవము నే స్మరించు వాఁ
డచ్చట తిన్నఁగన్ శివమహామను వియ్యాదె దిక్కటంచు ని
క్కచ్చిగ నుచ్చరించుచు నెగాదిగ స్వామిని జూచుచుండగా
విచ్చిన పూలునా విరిసె విస్మయకారి నవోహ లెన్నియో॥ 296

అదె యదె తోఁచెనంచు నొకశ్లై మఱి యొక్కటి గాఁగ నూదియున్
మృదునవ నందివర్ధన సమీకరణంబున మెల్ల నద్దియున్
పదె పదె చేయిరుద్ది పరువంబగు వేడిమిఁ గొంత కాచియుఁ
విదిత చికిత్సలన్ జలిపి వేనికి లొంగని స్వామి కంటికై॥ 297

పొగులుచు నుండియుండి యొక బుద్ధి జనించుటతోనె లేచి హా
యిగను శివా! యిఁకన్ భయమొ కింతయు లేదు చికిత్స చేసెదన్
తిగ కనువాఁడవై జగము తీఱు నెఱుంగని చిన్మయుండ వీ
జగమున దేనికైన నదె జాగొనరింపక కూర్పగా వలెన్॥ 298

నీదయ నాదు నేత్రములు స్నిగ్ధములై సుమనోహరంబులై
వాదున సర్వ నేత్రముల వాలి జయించునవై వశంబులై
కాదనకున్న వం దొకటి కందువతోఁ బెకలించి వెంటనే
నీదగు కంటికిం బదులు నిల్పెద శస్త్ర చికిత్స నేర్పుమై॥ 299

చూఁడు మటంచు దేవతలు చూడఁగ వాఁడొనరించె సల్లియె
వ్వాఁ డొనరించు నిట్టులని వారు సువిస్మయ మందుచుండ నా
వేడిమి స్వామి రెండవది విచ్చఁగఁ జేసియు కార్చె నెత్తురుల్
వీఁడు భయంబు లే దనుచుఁ బెల్చన రెండవ కన్నుఁ దీయగా॥ 300

రెండును బోయినన్ గనెడు రీతి మనంబున నోట స్వామి క
న్నుండిన చోటఁ గాలిడుచు "నోయి శివా! యిదె యిత్తు నీకు నా
రెండవ కన్ను మూఁడవది ప్రీలిన నేను వినేత్రుఁడౌట నా
కుండిన ప్రాణమే యిడెద నోడకు మంచని కన్నుఁదీయనై॥ 301

బాణముతోడి చేయి యక్షిపై కెగ నెత్తును స్వామి యంతలో
వాని కరంబు పట్టి కను పట్టెను లింగము నుండి పుట్టి వ
త్సా! నిను గంటిఁ గంటిని ముదంబును గంటిని గొంటి నింకనున్
దేనికి సాహసంబు విను దివ్యుఁడవై మనుమింక హాయిగన్॥ 302

కనొక్క టిచ్చి రెండవది కష్టముపై నొక యింత విచ్చి యా
కణ్ణుఁడు స్వామినిన్ గనియెఁ గాంచెను తల్లిని భిన్న నేత్రమున్

మున్నటులైన తల్లిదయ మున్గిన యట్లి ప్రఫుల్ల నేత్రుఁడై
మున్నను మిన్ను స్వామియును మాతృమయంబుగఁదోఁచి నంతటన్

అది యానందమొ దుఃఖమో తెలియ దాహా! కణ్ణభక్తుండు క
న్నుదలన్ గార్చిన నీరు చిందిన యెడన్ దోంచె ముక్తస్థితిన్
గదియం బారిన జీవ తేజములు వక్తవ్యంబు నున్నట్టులే
యెద యల్లాడిన దెంతకున్ బెగలదే యేమున్నదో యందునన్॥ 30

వాఁడన లేదు వాని కను వార్ధులె స్వామికిఁ జెప్పె నంతయున్
లేఁడట స్వామి యన్నటులు, లింగము లేదన, రెండు కన్నులున్
జూఁడగఁ జాల వన్నటులు, చొక్కి నెడందకుఁ గన్ను విచ్చుచో
గాడిన యట్టు లానగఁ గన్నులు మూసియ యుండె బొమ్మయై॥

“స్వామీ! చంద్రకళాధరా! తుదకు సాక్షాత్కార మీవచ్చి న
న్నే మన్నావు దయానిధీ! సురధునీ హేరాళ జూటాటవీ!
నీ మెప్పున్ గనకుంటి నేని నను నిందే యుండ నీ వయ్య నే
నా మన్వంతర మిట్టులే కొలుతు నయ్యా నీవు హర్షింపఁగన్॥ 306

భోగము దేది యైన నొక పోడిమి దే యగు దివ్యమైనచో
జాగగునంతె భ్రామ మిది చాలు నయా తెగదెంపు మింతలో
నాగతి నీవె నిన్ను గని నాఁడను జన్మము నందఁబోను చి
త్సాగర! నిన్ను జేరికొని జారక యుండగ నెంతు నెమ్మదిన్॥ 307

అది వినిపించెనో కరుణ నాతఁడె యోచెనో కణ్ణజీవ స
చ్ఛవి యభవచ్ఛవిన్ గలిసె స్వామియు లింగము నందె లీనమై
మివుల వెలుంగు లింగమె సమీకృత మాచును దోఁచెఁ, గన్నులున్
జెవులు సమస్తమా శివుని జెందఁగఁ జేసిన ధన్యు లిర్వురున్॥ 308

లింగ శివాత్మకంబు కడలిన్ జిఱు మీననఁ దోఁచు కంటినే
పొంగెడి భక్తిఁజూచు చలపున్ దలఁపున్ గనకుండి రెంతకున్
నింగివలెన్ మనస్సు లవి నిర్మలతం గన ముక్త జీవతా
భంగుర సంస్థితిన్ బరమ పావన మూర్తులు గాగ నిల్చుచో॥ 309

గణపతియుఁ విశాఖుఁడును గన్న కుమారులు కణ్ణుఁడన్ననో
కనులను గన్నవాఁడు తన కన్ను నొసంగిన వాఁడుగాన వా
రిని వెనుకన్ నిలుండనుచు ప్రీతి సరాసరి స్వామి చెంతకున్
జని మురిపెంపు ముద్దు గనఁజాలెడి వాఁడు మహాత్ముఁ డన్నిటన్॥

కన్నిచ్చిన యప్ప యగుట
కణ్ణుని గన్నప్ప యనిరి కన్ను నొసంగన్
వెన్నుఁడని యంద్రు జగములఁ
గన్నప్పను గూడి మనెడి ఘను లాదురుగా॥ 311

కన్నొక టేమి సర్వమగు కాయము స్వామి సమర్పితంబుగా
మన్న మహానుభావుఁ డనుమానము లేదొక యించుకేనియుఁ
వెన్నుఁడు గూడ వానిఁగని వీన్మిగి లెంగద యంచు మెచ్చుఁ గై
కొన్న సుదర్శనంబు తన గొప్పను చాట దటంచుఁ జెప్పుచున్॥ 312

ముందుగ సూనుఁ డోగిరము పొందవలెన్ శివుఁడందు మీఁదటన్
బొందును తల్లి తొట్టతుదఁ బూజ్యగురుల్ జగదాది దంపతుల్
మందిర మందు నిట్టి నియమంబును పెట్టిరి నేటి కట్టులే
యుందు నివేదనంబగు మహిష్ఠత గూర్చును తండ్రి వానికిన్॥ 313

తా దిగువన్ వసించి గురుతన్ గనుమంచును కొండ నిచ్చు మ
ర్యాదకు స్వామి నెంతయిన రమ్యగుణుండని మెచ్చవచ్చు నా
మీఁద వసింపలేఁడొ? తను మించెడి నట్లుగ స్వీయ భక్తులన్
ప్రోది యొనర్చు నంటకిది పోలు విశిష్టుఁడు స్వామి యెయ్యెడన్॥

గర్భగుడి నున్న స్వామికి నర్భకుండు
గుడిని పడమటి గోడ వెంబడి వసించు
నమర తతికెల్ల నధ్యక్షుఁడై వెలుంగు,
మిద్దెపై నుండె, వెలికొండ మీఁదఁ గలఁడు॥ 315

తేరు వీథిని మొదట నెందే నతండె
కాళహస్తీశ్వరుని బోలెఁ గలఁడు కలఁడు

కలఁడు కన్పప్ప యంతటన్ గలఁడు కలఁడు
కాంచ వచ్చును సర్వాల కనుల యందు॥ 31(

ఏల వృథా జనుస్సు లివి యెన్ని గతించిన వింతదాఁక హ్యా
లోల మనస్కు-తక్ మనుచు లోకువ యాదువు గాని వానికిన్
బోలి యెదేని యీ గలవె బొంది సమస్తము స్వామి యీయగా
నేల మదీయమంచు భ్రమియించుట సిద్ధము కమ్మొసంగఁగన్ ॥317

ఇచ్చినవాఁడె యిమ్మనఁగ నిచ్చుట ధర్మము వాని సొమ్మె నీ
విచ్చెద వంతె నీ దెదియు వీడగనే వల దట్లు కాక వాఁ
డిచ్చిన దాని నా దనుచు నీయక యుండఁ దలంచు టెంతయున్
బొచ్చె మగున్ నరుం డటులు బొంకినఁ బాపము పండుటయ్యెడిన్ ॥

కర్మ మొనర్చి యీ తనువు కంటిని గావున నాదె యందువో
మర్మ మెఱుంగు మెప్పుడును మానవ! కర్మ మొనర్తు వీవు త
త్కర్మ ఫలం బొసంగునది దైవమె యౌ గద కాన వానిదౌ
నిర్మమ తన్ ద్యజించుటకు నీ వయి సిద్ధము కావలెం జుమీ! 319

నా దని యన్న బంధనము నా దెది లేదయ యున్న దంతయున్
నీ దన ముక్తి స్వామి కరుణించును నిర్మముఁడైన వాని సం
పాదితమందు వయ్యదియు వాని దయం గద యద్ది లేక నీ
వేదియుఁ జేయలేవు గద యింకను మోహ మదేల చెప్పుమా! 320

ఎట మొదలు పెట్టినామొ యా యెడకుఁ దిరిగి
తప్పకయ వచ్చు టదియ ప్రదక్షిణమ్మ
స్వామి కడ నుండి కదలి యా స్వామి రూప
మైన కొండను చుట్టి రా నయ్యె నిట్లు!! 321

స్వామి దరిఁ జేరినట్లు కన్పడును నిజము
ఉదయమున బయల్దేరి నప్డున్న యట్లె
యుంటి మా స్వామికడ నిప్పు డున్న భేద
మప్పు డుత్సాహ మిప్పు డాయాస పడుట! 322

స్వామి కడ నుండి కన్నప్ప వచ్చి మరల
స్వామిఁ జేరిన యట్లు విశ్వాస మొప్పఁ
జేరగా వలె మానవ జీవితంబు
ధన్య మగునది యప్పుడే మాన్య చరిత! 323

స్వామి కంటెను దగ్గఱి వాఁ డెవండు?
అతని కంటెను దూరమౌ నతఁ డెవండు?
మేళనము లేదు దూర సమీపములను
నీవె వాఁడైన రెండునున్ లేవు నిజము! 324

అట్లుగానైన యపుడె యా యయ్య నుండి
వచ్చి తిరుగాడి మరల నా స్వామి చేరు
ధర్మ మీడేరు ముగియుఁ బ్రదక్షిణమ్ము
దానికై భక్తి యొకటె ప్రధాన మయ్య! 325

తూర్ణరజ దూషితం బయిన చర్మ మయంబగు పాదరక్ష కో
టీరము, నోటి బుంగఁగొని డించిన నీరమె గాంగవారి, నో
రూరగ వాచవిం గొనుచు నుంచిన చీకులె దివ్య భోజనం
బై రహియించె భక్తి మహిమాతిశయంబది బోయ దేవుఁడా॥

భక్తి భజింపగా వలయు స్వామిని భక్తుఁడనన్ స్వరూప సం
సక్తుఁడు తానె స్వామి యని స్వామిని తా నని యైక్య భావనా
రక్తి స్వదేహ మందున విరక్తిని దానిని లక్ష్య సిద్ధికై
యుక్తిని దాల్చియున్ దగుల మొందక స్వామిని గొల్చు వాఁడహో॥

## స్వామి యస్పృశ్యుఁడు

ఆకసము శబ్ద గుణ మాట నాలకించి
పట్టగా వచ్చు వాయువు స్పర్శగుణము
కలది కావునఁ దాకియుఁ దెలియ వచ్చు
వాయు లింగంబు గా నుండు స్వామి యిచట॥ 328

అయిన నతఁ డంటరాని వాఁ డయ్యె నిందు
స్వామి నెవ్వరు తాఁక రర్చకులు గూడ
తాఁక వెఱతురు, తుడువరు, తోఁకమీఁద
నిలుచు నైదు పడగల కుండలిని యనఁగ॥ 329

పార్శ్వమున నెత్తు పీఠమ్ము పైని నిలిచి
పోయుదురు సంకువులను గప్పురపు నీరు
ఏ యలంకృతి చేసిన నెదుట ౘ్రేలు
కవచమున కొను స్వామిఁ దాఁకను భయాన॥ 330

అంతగా నంటరాని వాఁ డవుట కొక్క
హేతువుఁ జెప్పి కొనుచుందు రిప్పటికిని
అప్పు డెప్పుడో యొకా నొక యర్చకుఁడు
మంత్ర దీక్షా పరుం డుండె మహితుఁ డతఁడు. 331

స్వామి కభిషేక మార్చి పుష్పములతోడ
నవ్యముగ నలంకార మొనర్చు వేళ
మూల లింగంబు తాఁకెను బొటన ౘ్రేలు
స్వర్ణమయ్యె నా భాగ మవ్వారి కపుడు॥ 332

చూచి విస్మయ మంది ౘ్రేల్ చూచువారు
హేతు వెఱుఁగంగఁ గోరి తా మెఱుక పఱుప
సాహసింతురో యని యది జరుగ కుంట
కై యెపుడు నెదొ చుట్టి నిక్కమును దాప॥ 333

తండ్రి యెన్నాళ్ళకును ౘ్రేలు దాచియుంచు
టే మని కొడుకే యత్నించి యెఱుఁగ రాక
నిదుర వేళను కట్టిల్లఁ జెదరి నపుడు
కాంచి స్వామి నంటుట నది కలిగె ననుచు॥ 334

తలఁచి మఱుగున స్వామి కోవెలకుఁ బోయి
మూల లింగంబు తాఁకి సమూలముగను
దగ్ధమై పోయె నంట యద్దాన నెవరు
తాఁకఁ గోరరు కోరినఁ దాఁకఁ గలరె? 335

అయిదు పడగలు విప్పి భయంకరముగ
నంతరం బింత లేక వెన్నంటి యున్న
కాల సర్పము నెట్లు తాఁకం గలారు?
ఎంత నిర్భయులైన సహించు టెట్లు? 336

అదియునుం గాక యెవ్వారలైన గాని
తమకు వేఱుఁగ నున్నచోఁ దాఁకఁ గలరు
తమకు భిన్నమ్ము కాని తత్త్వమ్మె యయిన
అవయవ విహీను స్వామి నెట్లంటగలరు? 337

అందుచేఁ గాళహస్తీశు స్వాత్మరూపు
నిగ నెఱిఁగి భక్తి భజియించి నిగమ శిఖలఁ
దెలియనగు తత్త్వ మనుభూతిఁ దెలియవలయు
నపుడె మనుజత చరితార్థ మగును నిజము! 338

## అపదాన మధ్యాక్షరాలు

శ్రీ కాళహస్తీశ్వరా! విశేషించి నీవు వెన్నంటి
నా కంటి ముందుండి యెడఁద నానాటికిని ప్రేమనిండి
యీ కావ్య మిట్లు వ్రాయించి యిప్పించుకొన్నావు సరియె
నాకు నీకును భేదమున్న న్యాయమా యింకైన చెపుమ॥ 339

శ్రీ నామకంబైన చెలఁది జిలుగు పోగుల గూడు లల్లి
నానా విధాగారములను నాయనా! కొనుమంచు నీయ

వాని నన్నిటిఁ గాల్చివైచి వహ్నిలోఁ బడఁబోవు దాని
లో నిల్పి కొన్న నీ కరుణలోఁ గొంచె మిట్లు రానిమ్ము॥ 340

నా పూజ నా పూజ యంచు నాగమ్ము నాగమ్ము పోరి
కై పెక్కు రొండొరుం జంపు కలహంబు నట్లు మన్నించి
వ్యాపాదితంబైన వాని వైరమ్ము స్నేహ మ్మొనర్చు
నైపుణ్యమందింత నీవు నా యందు చెందించు దేవ! 341

అవునయ్య తెలియక యడుగు నజ్ఞానమును సైచి తెలుపు
మవుర నక్కరుండు మంచి యాక్షేపముం దెల్పి నంత
ఋషుల కోపించి శాపాన మిగులును పూరించి తీవు
శివుఁడు తొందరపడె నన్నుఁ జెప్పెడి దేమైన కలదె? 342

అదె జల్లు పడెనుగా మీఁద హరహరా యన్నంత జువ్వి
మృదువైన తెల్లని వేళ్ళు మే నెల్ల బులకింపఁ జల్లె
మొదటంత పాపాత్ముఁ డయ్యు ముక్తుండు కాఁగల్గె నన్న
హృదయాన నీ వెంత మృదువో యెఱుఁగగా నగు పార్వతీశ! 343

అంతకున్ మూలంబు మనసు నద్దాని మృగముగాఁ బట్టి
చింత లన్నియు వీడి నీవు చిత్రమ్ముగా నాడి కొందు
రంతగా నారాట పడితి వాయమ్మ ని న్నంటి యుండె
నెంతైన నీ విశ్వ మంత మృగ్యమ్మె యానుగా స్వామి! 344

పెదనంది పిననంది పిలుపు వినిపించి నంత నీ కరుణ
వది తోఁచె నా కథ యెట్టు లనుభూత మయ్యె నీ కయ్య
అది కాదు గాని పుల్లావు నందున్న జీవుఁ డద్భుతుఁడు
ఎదకట్టి వైశాల్య మేది యెందు కీ మానవు బ్రదుకు? 345

చిరజీవి యయ్యె నీ దయను స్థిర బుద్ధి వహియింప లేక
పెర దైవముల గూర్చి పోవు వృద్ధు మార్కండేయు త్రిప్పి

రద్దైవ మీవని తేల్చి పట్టించె నీ పాదములను
రుణించి యయ్యగస్త్యుండు కాన మోహం బెంత సేయు! 346

ర్వించు దేవ సంఘముల గడ్డిపోచను శక్తి చూపి
ర్వాన పరమాత్మ వగుట పారమ్య మీవని తేల్చి
ర్వజ్ఞ! కాపాడి తీవు సాక్షి వే లింగాల కోన
సర్వీకరాభూషితాంగ! దయఁ జూడు మయ్య యీ దీను! 347

పాపమ్ము పైకొను వేళఁ బశువే నయం బనిపించు
తాపమ్మునన్ మయూరుండు దగ్ధుఁడై తుద కిందు చేరి
నీ పాదముల నాశ్రయించి నీ దయా పాత్రుండు కాఁడె
ఆ పురోహితుఁడు చంద్రకుఁడు నఘు మేచి వెనుదిర్గి పోయె॥ 348

చదువును శీలమ్ము నొకట సమకూడి యుండు టబ్బురము
చదివినాఁడా భీముఁ డెంతో సారమ్ము బొంకుతో సమసె
సదనునన్ మూకుండె యయ్యు నమ్మ మంత్రము దీక్ష నూని
కుదురండె మీ కూర్మి వలనఁ గుండలి నీ శక్తి యూప! 349

అందఱన్ మాయలో ముంచు నా యమ్మ నీ మాయ మునుఁగు
నిం దేమి వింత చూపట్టు నీవె యీ గడ్డపై ప్రేమ
ముందుగా వచ్చి కూర్చుండి పొందుగా ప్రియను రప్పించి
నంద నుండే దారి చూప నాటకం బాడుటే వింత! 350

నీలయా? నీలకంఠుండ? నీలాచల క్షేత్రమందు
నీలకే మొగ్గు చూపించు నిరుక్తైన రుజువులు కలవు
కాలకంఠా! నీలకంఠుఁ గరుణ సాకిన దెచ్చటైన
నేలేమొ కడు సుందరంబు నిను మోహమందగాఁ జేయు॥ 351

తొలుదొల్తన వ్యాశిష్ఠుండు దుఃఖమ్ముతోఁ గ్రుంగిపోయి
బలవన్మృతిం జెందగోరి పై నుండి పడి భూమి కావ

బలు తపం బొనరించి నిన్ను పవనరూపం బందఁ జేసె
నిల కెంత మేలు చేకూరె నీ నాఁడు మా కెంత మేలు!

నీ వెంతో తా నంత యౌచు నిర్జరాళిల పూజ్యుఁ డతఁడు
భావింప నటువంటి వారి భవనంబు నీ భవనంబె
ఆ వింధ్య గర్వంబు నణచి యబ్ధులన్ బుక్కిటఁ బట్టు
దైవంబు కుంభసంభవుఁడు తటినీ మణిం దెచ్చి కూర్చె॥

లో బావిలో భరద్వాజు లోగొన్న పుణ్య స్థలంబు
లో బుద్ధి కలిగి యొక్కింత లోలోన మనసు నిల్పంగ
నే బాము పారిపోకుండు నే బెంగ లుడిగి పోకుండు
నీ బంటు కావలె నంతె నీవె నీ దరికిఁ జేకొందు॥

నాల్గు మోముల బమ్మ నిన్ను నాల్గుమోములు నూర్ధ్వమందు
వెల్గు లింగంబైన బొమ్మ పెట్టి యర్చించి నాఁడిందు
నాల్గు దిక్కుల బ్రహ్మగుడిగ నల్వు రద్దానిఁ బిల్వంగ
కల్గెనే నలువకుఁ బూజ కలిగె నీ దయ గౌరవంబు!

చనిపోవు వారి కర్ణమున సన సన్నగా నీవు మణిని
వినిపింతువో మణికర్ణ! వినువెంట ముక్తిని బడసి
కనకుండు రీ జగమంట కల్యాణమయ క్రమ కాయ!
కననిమ్ము నీ దివ్య దీప్తి కనులలోఁ జలువలు విరియ॥

పడమటి గోపురమ్మునకుఁ బూర్వమ్ము లన్నిల్చి రవియు
నుడుపతి సేవించి నిన్ను నురు తీర్థములఁ బాదుకొల్పి
కడుకొని స్నాన పానముల కై సర్వ కాలమ్ము లందు
నెడపక యమృతమ్ము కూర్చు చిప్పుడున్ గొల్చుచున్నారు॥

మృత్యుంజయుం డెంతో మంచి మేదినీ విభుఁడైన నేమి?
వ్యత్యయంబై రైక్వ శాప హతుఁడయ్యె తిరిగి నీ కరుణ

సత్యంత భాగ్యంబు నంది యంతంబునన్ ముక్తి నందె
ప్రత్యయం బున్నచో నంతె పడయంగరానిది యున్నె! 358

సుభగా విజయు లెంత భక్తి సుందరమతులు సుశ్లోక
మాభయంబు నందఁ గాంక్షించి యత్యంత నిష్ఠ జీవితము
నిభచర్మధారి! నీ కరుణ నిచ్చోట గడపి నీ కెంత
యభిమాన పాత్రు లైనారో యాశ్చర్య మగు దేవ దేవ! 359

ఈ కాళహస్తి వేశ్యకయి యెంతో మోజుపడి సారంగుఁ
డా కోన సీమ బ్రాహ్మణుఁడు వ్యయపడె లక్షపై ధనము
చే కొన్న యాకాంత చెప్ప సిగ్గుతో మనసెల్ల మారి
నీ కొండ నెక్కి కూర్చుండె నీవేమి చేయగా లేవు॥ 360

వరగుణ పాండ్య భూపతిని వైకుంఠ పాళి యాడించి
యురగంబుచేఁ గరపించి యురుదయ నిచ్చిన నెక్కఁ
గరుణించి నీ చెంత కట్లు కడువడి రప్పించు కొంటివె
వరయంగ నీ యట్టిదైవ మన్యుఁ డెవ్వం డయ్య స్వామి! 361

ఒక వింత పూవుపై మోజు నుట్టూత లూచి యవ్వాని
పికలించి పెనుమట్టి వాన వెన్నంటె తరుమగా వాఁడు
చకితుఁడై వచ్చి నీ దరిని శరణంచు వాలి నాఁడంతె
ప్రకటంబుగా గాచి తీవు రాజేంద్రచోళ విఖ్యాతు॥ 362

ఆ చక్రధరుఁ డొక్కరోజె యత్యంత నిష్ఠ నీ జపము
నోచ నడ్డానికే నీవు నువ్వగింజగ నానిపోయి
రాచి కర్మం బెల్లఁ ద్రోచి రారమ్ము నాయనా యంచు
నే చింత కన నీక కాచి తీవెంత దయ పేరుకొంటి! 363

అవ్వాని కన్యలే వార లమృతలతా కాంతి మతులు
ఆ వ్వారి కలలలో నీవె యగుపించి శిష్యు నంపించి

యివ్వేటి కీవె తెప్పించి తే మంత మోజమ్యె నయ్యా?
గువ్వ లీ జీవులో దేవ! గూడు వీవే మమ్ము కావ! 364

అపదాన నక్షత్రమాల యయిన నీ మధ్యాక్కలును
నెప మొక్క యింతైన లేని నీ కృపా వారాశిలోని
విపుల వీచిక లిట్టు లెన్న వేయి యుగాల్ చాల వయ్యా!
యిపుడసల్ కన్నప్ప నెన్న నిందిట్టు లిరుకమ్యె స్వామి! 365

ఇది మైల యిది యెంగి లనుట యేకత్వ మెఱుఁగని మాట
యెది యైన బ్రహ్మమైనప్పు డెట్లొప్పు టా వింత నుడులు?
హృది నుండి మన్నించ వయ్యా యెఱుక వానిని గాచి నట్టు
లెదలో నభిన్న భావంబ యేర్పడ్డ వేర్పాటు లేదు॥ 366

స్వామి నీ దయ సాగి వచ్చి సాక నారంభించె నేని
ఏమున్న దెవ్వాఁడు గాని యినుము సూదంటు నంటు
కామమ్ముచేఁ గన్ను గనక కన్న తండ్రియె జ్యేష్ఠు నడచె
నీ ముంద రా తండ్రి యెంత నీ వమ్యె పద్మసేనుండు॥ 367

నీ యిల్లు చట్టు బండయ్య నీయాలు గట్టు రాచూలి
నీ యొడల్ కల్లానుగాక నీ గుండె యమృత నిర్ఝరణి
నా యందు దయజూడు మయ్య నమ్మితి కాళహస్తీశ!
శ్రీయిచ్చి చేకొను మింక స్థిరముగా నీ యందె నిలుతు! 368

విద్య సద్యోజాత స్వామిన్ నిత్యం
న్మాల : బుద్ధ్యాత్మిణోమా విష్ణున్
విద్యాసారున్ విద్యోతాత్మ
సద్య స్సాధ్యున్ సంభావింతున్ ॥ 369

భద్రకము : నీలకంఠ! శశి శేఖరా!
జాలమేల ననుగావవే

హేల నీకుఁ గరుణాకరా!
వాల నిమ్ము చిఱు చూపహో! 370

మణిరంగ : నానుడిన్ సదనం బాకఁడోహో
యేన సాక్షిగ నిట్లు జనించెన్
మేని కంటె నమేయము గాదే
దీన నిల్చిన దేవ తరింతున్ ॥ 371

ఇంద్రవజ్ర : శ్రీకాళహస్తీశ! శిరస్సు గంగా!
నీ కాలు మ్రొక్కెను నినుం దలంతున్
చేకొంటి వే మున్ను 'శివా!' యనంగన్
పోకార్ప వే యింకఁ బురత్రయంబున్ ॥ 372

ఉపేంద్రవజ్ర : తపంబు చేయంగఁ దరింతు నన్నన్
జపం బొనర్పంగఁ జలించు వాఁడన్
కపిత్వమో యిద్ది కవిత్వమౌనో
అపార కారుణ్యా! అనుగ్రహంబో! 373

ఉపజాతి : నీ వాక్కె నీ కిత్తు నిరస్తమాయా!
కవిత్వ మన్ పేరఁ గనీసమంచున్
భావంబునన్ నిల్చి భరింపు మయ్యా
వివాద మేలా సువిలాస మొప్పన్ ॥ 374

పాదపము : అంతరమా యెద యాకస మాటన్
వింతగ నాదము వెల్వడు టయ్యెన్
శాంతుఁడ పీవన సంహృత మాటీ
శ్రాంతుఁడ నైతి నొసంగుము శాంతిన్ ॥ 375

భుజంగప్రయాతము : యమాశానివాసా! యతాత్మ ప్రకాశా!
యమాజ్ఞా నిరాసా! యతీంద్రార్తినాశా!

యమాయార్ద్రచిత్తా! యఖండైక సత్తా!
యమోఘా! ధుతాఘా! యఘోరా! ఉదారా! 376

స్రగ్విణి : దక్షిణామూర్తివై తత్త్వముం దెల్పుచున్
కుక్షిలో నుండి యే కోశముల్ విప్పుచున్
రక్షగా నంతటన్ బ్రాకి వ్యాపించి యే
యక్షయంబై విభూ! యక్షికిం దోపవే! 377

ద్రుతవిలంబితము : కొనుము దీనిని గోరి రచింపఁ జే
సిన మనీషి! రసింపుము ప్రేమమై
నను దయంగొని నవ్వకు మయ్యరో
వినుము దీనిని వేడరు నేఁడహో! 378

తోటకము: కరుణా వరుణాలయ! కాంచు మయా
గిరిజా సహితంబుగఁ గేవల మీ
రరు దెంతురు చూతురు ప్రార్థనతో
గురులై యను నమ్మికఁ గొల్తునయా! 379

వసంతతిలకము: చేకొంటి వేని శ్రమ జెందు ఫలంబు దాపై
యా కొన్న నాకుఁ గడుపారట తీటి మందున్
నీకైన మేలె భువి నీకుఁ బ్రతిష్ఠ హెచ్చున్
గాకున్న మానె నను గాదని యందురంతే! 380

వనమయూరము : దూరమునఁ గొండ గని తోడనె కరంబుల్
చేరిచి శివా యనుచుఁ జేరి మది నెంచన్
ఘోర మగు నార్తి యుడుగున్ వరద నీవై
రార యని తెచ్చితివి రావు కరుణింపన్ ॥ 381

మాలిని : పవనమయ శరీరా! వాయుభుక్ పంచభోగా!
శివ శివ శివ యంచున్ జీరుచున్ నిన్నుఁ జేరన్

దవిలి నది యదెల్లన్ దానె జాఱున్ దనంతన్
మిపులు నది మహేశా! మీరెమై యుండు నంతే! 382

సుగంధి : స్వామి! స్వామి! జాల మయ్యెఁ జాలదా పరీక్ష నీ
కేమి యాట నన్ను వంటి యే మెఱుంగ నట్టి పో
రామితో నినున్ విడన్ మరాకు మిద్ది యెన్నఁడేన్
నా మొఱాలకించి నీవె నన్ను గావగా వలెన్ ॥ 383

పంచ చామరము : శివస్థలీ శశాంకగాంగ చిహ్నితాద్భు తాంబుదా!
పురారివై పురంబు లందె పూరుషుండ వయ్యెదే
నిరస్త మాయకుండ వయ్యు నిద్ర నందె దేలొకో!
హరా! హరా! హరింపు మయ్య యార్తి సర్వ మింకఁగన్ ॥

శిఖరిణి : యమాశా కైలాసక్షితి ధర మహో యార్తి హర మా
యుమాజ్ఞానాంబా యుక్తి నిట ప్రియమై యుందు వనగ
నమేయంబౌ సంసార భయముడుపన్ ప్రార్థితుఁడ వై
నమోయంచున్ మ్రొక్కన్ వినవు తగునో నాయనమహో

మందాక్రాంత : ఆశాపాశంబు విడుపయి దేవా! ననుంగావు మన్నన్
పాశచ్ఛేదంబు సలుప నుమాప్రాణనాథా! కృపాబ్ధీ!
లేశంబైనన్ దలంపవు సరే లింగమై యుందు వన్నా!
యాశా పూర్తిం గనగ నగునా! యిద్ది సాధ్యంబు గా?

మత్తకోకిల : హే దయానిధి! హేలగా నను నిట్టె చూడుము చూచిన
నీదు సొమ్మయి పోవునే విను నిర్దయుండవు కాకుమీ
నాదు కర్మ సమస్తమున్ గనినన్ హరించుక పోవునే
లేదయా దయ లేదయా యిటు లేకివై మనుటొప్పునే!

మత్తకోకిల : కాదయా యటు కాదయా యిటుకైతవ గ్గొనుట నీదర
కాదనన్ మఱి కైతతో నినుగాన నానొకో వేదమే

కాదనున్ గద చూట కందవుగా మనో విషయంబుగా
వేది మార్గము స్వస్వరూపతయే పరింపఁగ మేలగున్॥

ధ్రువ కోకిల : పలుకుటే పరమార్థ మైనను పల్కు లయ్యవి కైతవై
వెలువడన్ మురియం దగున్ శివ! వీనులంబడ వీవు ని
శ్చలుఁ డవున్ సడిలేని వాఁడవు శబ్ద ముండదు నీయెడన్
గలుగు నన్నియుఁ గామితార్థద! కాంక్షఁబూని చరించినన్।

ధ్రువ కోకిల : అయినవాఁడవు నున్నవాఁడవు నన్నియున్ గలవాఁడవై
బయలులోఁ బ్రభవించు శబ్దము వచ్చినన్ గడు మోహమై
పయనమై చను నన్ను వీఁడును భ్రాంతుఁడై యని యెంచెదో
బయలు శబ్దముబైలె యాగద పట్ట నిమ్ముఁక మూలమున్।

మేఘ విస్ఫూర్జితము :

ఉమా జానిన్ నిన్నున్ రజతగిరి సా
నూర్వరా వాసరమ్యున్
రమానాథ ప్రీతున్ త్రిపుర హరణ
ప్రౌఢ విఖ్యాతు శాంతున్
నిమేషార్థం బందున్ జగదఖిలమున్
నిల్పి పెంపంగ డింపన్
సమర్థున్ స్వాऽభిన్నున్ గొలిచెదనయా!
సాంబ సచ్చిత్స్వరూపా! 391

మాలిని :

శివ శివ శంకర! శిక్షిత కుంజర!
చేకొని కావుము చేరితి నీ
సవిధము నందెటూ సాకుచు నుంటివి
సత్కృతి చెప్పఁగఁ జాలు నటుల్

భవమును దిద్దితి బంధన మియ్యది
ప్రార్థన సేసెద స్వామివి నీ
వవమతి నెట్టక స్వేచ్ఛ కృపామతి
స్వాత్మగ నిల్పుము సాంబ శివా! 392

లయగ్రాహి :

అద్దమగు బుద్ధి జగ మద్దిన దనన్ మొదలి
యద్దివెలి నున్నటు లె యొద్దికగఁ దోఁపన్
నిద్దురను స్వప్నమునఁ గద్దనుచు దాని గను
మొద్దయిన దేహ మిది యెద్దియుఁ గనంగా
దద్దయు నశక్తమయి యుద్దిశవ మన్నటులె
ప్రొద్దెఱుఁగకుండు గద ప్రొద్దు పొడువంగా
నిద్దురను మేల్కనిన కద్దనిన దంతయును
నిద్దమగు బుద్ధి కృత మద్దియని తేలున్ ॥ 39

లయగ్రాహి :

అమ్మాయి కలం గనుట కిమ్మయిన బుద్ధియె జ
గమ్మును వెలింగని నిజమ్మనుచు నమ్మన్
నమ్మటయె కాకది సుఖమ్మునకు హేతువని
క్రమ్మకొను యత్నమున వమ్మయిన వెంటన్
చుమ్మలగు దుఃఖమున సొమ్మసిలి తేరుకొని
క్రమ్మఱను దాని కెటొ క్రమ్మకొనఁ బోవున్
దిమ్మ దిరుగంగఁ దుది లెమ్మనుచు సద్గురుఁడె
యిమ్మెఱుఁగఁ జెప్పినపు డమ్మాయి నెఱుంగున్ ॥ 2

లయగ్రాహి :

కల్లయగు స్వప్న జగ ముల్లమునఁ దోఁచినదె
యుల్లసిత మీ జగము కల్ల యగు నట్లే
మొల్ల మగు తెల్విగని యుల్లమున నుండవలె
నెల్లపుడు నే ననుచు నల్ల శివుఁ బోలెన్

దెల్లముగ మిథ్య యగు నెల్ల జగముం గనుచు
నుల్లమున నుందు నిఁక వెల్లిబడి పోవన్
జిల్లలనలో శివుఁడె చెల్లును జగంబనఁగఁ
దెల్లమయి పోయె నిది యెల్లయు శివుండా॥ 395

అని వివేకంబు నందిన యతఁడె శివుఁడు
శివుఁడె చూచును శివుఁడె తోఁచెడి జగత్తు
శివుఁడె చూపగు జీవుఁడై శివుఁడె చెలఁగు
శివుఁడె తా శివోఽహమ్మని మివుల వలయు॥ 396

అమృత స్రవంతి యగు నిది
యమరమ్మగు నాంధ్ర భాష నత్యద్భుతమై
యమృతేశ కృపను వెలువఁడె
నమ శ్శివాయ నమ ఓం మన శ్శివ! ఓ మోమ్॥ 397

శక్తియు శక్తమైన గిరి
జా గిరిజా పతు లిర్వు రేకమై
యుక్తి ననున్ నిమిత్తముగ
నొప్పి వచించిరి కాళయుక్తిలో
రక్తి పఠించి యెల్లరును
ప్రాజ్య మహోదయ మంది భక్తులై
భుక్తిని ముక్తి గాంచనగు
పూర్ణుని సత్కృప నిశ్చయమ్ముగన్॥ 398

అవివేకికి గురు సత్కృపం గొని వివే
కానంద నాథాఖ్య నా
శివుఁడే సర్వ మటంచు నమ్ముచు నతిన్
శ్రీకాళ హస్తీశ్వరున్

భవ మీఁడ్వాం దయఁ జూపు మంచు దినమున్
        ప్రార్థింపగా స్వామి సం
భవమై కావ్య మిటుల్ ప్రహృష్టమతి మొ
        ల్వాం జేసెఁ జిత్రమ్ముగన్ ॥ 399

అమలోదాత్త మనీషి మత్పిత విమ
        ర్శానంద నాథుండు బ్ర
హ్మమె రూపందె జగద్గురూత్తమత క
        ల్యాణాఖ్య సద్దేశిక
ప్రముఖుండై సరి నిర్వరున్ నను దయన్
        బాలింప నవ్వారి ని
త్యము ధ్యానించుచు నిల్తు నిచ్చట వివే
        కానంద నాథుండనై ॥ 400



